శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

ఆంధ్ర వచనము

బ్రహ్మశ్రీ కేతవరపు — వేంకటశాస్త్రిగారిచే
ప్రణీతము

శ్రీదేవరాజసుధీ పరిశోధితము

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీ
లోన్‌స్క్వేర్ మద్రాసు—1

 1972 [ 20—00

# ప్రకాశకుల విజ్ఞప్తి

భారతీయుల కెల్లరకును భారత భాగవత రామాయణములు ప్రధానోపాదేయములు సంస్కృతభాషలోనున్న యీ గ్రంథ త్రయమును మన ప్రాచీనకవులే పద్యకృతులుగా తెనిఁగించి యున్నారు ఆ యనువాదములను మే మిదివఱకే ప్రకటించి యున్నాము జనసామాన్యమునకు గద్యమర్థమగునంత సులభముగా పద్యమర్థముకాదు కావున అందఱికిని పయి మహాగ్రంథములు సులభముగా బోధపడునట్లు సరళమును సుబోధమునగు వచన గ్రంథములుగా ప్రకటించుటకుఁ బూనుకొని, సంస్కృత మూలము ననుసరించి విశేషార్థములతోఁగూడ ప్రకటించితిమి వాని ప్రతు లెన్నడో చెల్లిపోయినవి ఈ నడుమ కొన్ని కారణములవలన గ్రంథప్రకటనమున కవకాశము లేకపోయినది ఇప్పుడు పూర్వమువలెనే మా గ్రంథముల నన్నింటిని పునర్ముద్రణము చేయఁ బూనుకొంటిమి వానిలో వచనభాగవతములోని తొలి సంపుటమిది తక్కిన భాగములును శీఘ్రకాలములోనే వెలువడ గలవు ఆంధ్రభాషాభిమానులు వెనుకటిరీతినే మాయెడ ఆదరాభిమానములను చూపి, తగిన ప్రోత్సాహము నీయఁగలరని విశ్వసించుచున్నాము

మా గ్రంథముల కన్నింటికిని ప్రసాద్ అండ్ కంపెనీ' వారిని సోల్ డిస్ట్రిబ్యూటర్లుగా నియమించితిమని మనవిచేయుచున్నాము

ఇట్లు,

26-1-1972 ఆర్ వేంకటేశ్వర్ అండ్ కో.

శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః

# పీఠిక



శ్రీమన్నారాయణాపరావతారుఁడగు వ్యాసుండు బద్ధజీవుల నెల్ల నుజ్జీవింపఁజేయఁ దలఁచి వివిధము లగు వైదికరహస్యములను, వర్ణాశ్రమాచార ధర్మములను, బహుతత్త్వ విశేషములను భారతాది గ్రంథముల మూలమున సవిస్తరముగను సుగ్రహముగను సువ్యక్తముగను బ్రకాశింపఁ జేసినను, దన యంతరాత్మ ప్రసన్నము గాకుండుటం జూచి, భగవద్భక్తి రసైక ప్రధానంబును, భగవత్కల్యాణగుణలీలాభివర్ణనమయంబును నగు భాగవతమును బలుకమియే యందులకు మూలంబని నారదోపదేశంబున నెఱింగి యీ మహనీయపురాణమును రచించి కృతార్థుం డయ్యెఁ గదా! ఈయొక్క విషయమే తక్కిన పురాణాదులకంటె భాగవతమునకుఁ గల యతిశయమును ఘంటాపథమునఁ జాటుచున్నది. ఇది యిట్లుండఁ దక్కిన గ్రంథములందు మిక్కిలి విరివియైన కథావిశేషములును బ్రవృత్తిధర్మైక ప్రతిపాదకము లగు నాఖ్యానములును జాలభాగము నావరించి యుండు నట్లుగాక, యిది యందంద మాటిమాటికిఁ బరమపురుష దివ్యరూపగుణలీలా ద్యభివర్ణనంబులం జేసి, భాగవతధర్మంబై తాపత్రయోన్మూలనంబై పరమ నిశ్శ్రేయస సాధనంబై వెలయు భక్తియోగంబు నుద్దీపింపఁజేయు భగవ దవతారకథామృతములను భాగవత పవిత్ర చరిత్రములను నిబిడమై, భగవత్ప్రసాదము నతిత్వరితముగ నొడఁగూర్చుచున్నది ఇదియే.

శ్లో॥ 'ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవ మత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కింవా పరై రీశ్వర
స్సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభి శ్శుశ్రూషుభి స్తత్క్షణాత్'॥

అని యున్నదిగదా! మఱియు, శాంతరసైకజనకములగు కేవలతత్త్వవిశేషములనే యొడతెగక చెప్పుచు వచ్చినచో, నవి విషయమగ్నం బగు మనంబునకుఁ జప్పిడిగా నుండును గాన, శృంగారాది రసతరంగితంబులగు భగవల్లీలావిలసితంబులతోడను నవి యందంద సమ్మిళితంబులై చదువరుల

సానందరసాప్లుతులం గావించుచున్నవి. లోకికి లోకహారంబును భోగ్యతమంబును నగు తీయనిమందువలె, భవరోగికి భవభయోన్మూలనంబును, భక్తిరసభోగ్యతాభరితంబు నగు జీవాతువై యిది చూపట్టుచున్నది.

శ్లో॥ 'వాసుదేవే భగవతి భక్తియోగః ప్రయోజితః ।
జనయత్యాశు వైరాగ్యం జ్ఞానం చ యదహైతుకమ్ ॥
ధర్మః స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేనకథాసు యః ।
నోత్పాదయేద్యది రతిం శ్రమ ఏవ హి కేవలమ్ ॥
శ్రుతిమప్యౌపనిషదం దూరే హరికథామృతాత్ ।
యన్న సన్తి ద్రవచ్చిత్త ప్రేమాశ్రు పులకోద్గమాః' ॥

అన్నట్లు, భగవద్భక్తిరసకలితంబుగాని ధర్మకర్మాది కలాపంబేల ?

ఇట్లివి వేదవేదాంతసారం బయ్యుఁ జప్పిడిగాక, భక్తిరసమాధురీధురీణమై చవులుఁ గొలుపుచు నమృతప్రాయమై యుండుటంజేసి

'నిగమకల్పతరోర్గళితం ఫలం । శుకముఖా దమృతద్రవసంయుతమ్ ।
పిబత భాగవతం రసమాలయం । ముహురహో రసికా భువి భావుకాః' ॥

యన్నట్లు దీనిం బఠింపుఁ డనక, పానము సేయుం డనఁబడియె గాన, ఇది పామరులకుఁగూడఁ దేటయగు వేదాంతము. పరమ విషయమగ్నులకుఁగూడఁ దీయనగు శాంతరసము, పరమనిశ్శ్రేయసపదమునకు సులభాతిసులభం బగుమార్గము ఇట్లుండుటకన్న నతిశయ మేమి ? ఇట్టి యతిశయము గల గ్రంథ మిదిగాక మఱియొద్ది ?

భగవంతుం డప్రాకృతము అగు తన స్వరూప స్వభావగుణాదులను చేతనులు ప్రకృతిబద్ధులై సంకుచితజ్ఞాను లగుటంజేసి, తెలిసికొని యుజ్జీవింపఁ జాలరని తలంచి, యోగులకుఁగూడ వాఙ్మనసాగోచరం బగు తన పరత్వమును మాటుసేసికొని, సకలమనుజనయన విషయములై సౌలభ్యాతిశయ ప్రయుక్తములై యొప్పు రామకృష్ణాది లీలామానుష విగ్రహంబులు దాల్చి, నిరతిశయ సుందరములగు నిజదివ్యమంగళ విగ్రహములయు, నిరవధిక మనోజ్ఞములగు నిజకల్యాణ గుణచేష్టితంబులయు, దర్శన శ్రవణ పఠనాదులమాత్రమున నఖిలజీవుల నుజ్జీవింపఁ జేయువాఁ డయ్యెఁగదా ! అందు రామావతారపుఁ జరిత్రం బగు శ్రీరామాయణమును ప్రబోధమగు

సంస్కృతభాషనుండి తేటతెనుఁగున వచనరూపమునఁ జాలవఱకుఁ బ్రకటితమై యుండుట తెల్లమే. కృష్ణాద్యవతార చరిత్రం బగు శ్రీభాగవతంబును నట్లె సంస్కృతమునుండి తెనిఁగించుట యాంధ్రజనులకెల్ల నుపయుక్తంబును నిఖిలశ్రేయస్సాధకంబు నై యుండునని, శ్రీ బొబ్బిలి భూపాలాస్థాన విద్వచ్ఛిఖామణులును, సంస్కృతాంధ్రభాషా ప్రవీణులును నగు బ్రహ్మశ్రీ శేతవరపు - వేంకటశాస్త్రిగారిచే నిందు మొదటి రెండు స్కంధములును మృదుమధురశైలి నాంధ్రీకృతమై ప్రథమ సంపుటముగా నిట్లు ప్రకటితమైనది

ఇందుఁ గొంతవఱకు, నవఁగా నేతద్వచనారంభమున ముప్పది పుటలవఱకుఁ గల గ్రంథము ప్రకటనత్వరం బట్టి నేను దెనిఁగించినదియే యగును ఆ పుటలక్రింద విశిష్టాద్వైతమునకు సంబంధించిన కొన్ని సిద్ధాంత విశేషములఁ గూర్చియున్నాఁడను తక్కిన భాగము నాచేతఁ బరిశోధితము మాత్రమే యగును ఇందు నానార్థవిశేషములతోను ననేక రహస్య వివరణములతోనుం గూడిన వీరరాఘవీయాది వ్యాఖ్యానములం గొనియే తెనుఁగు చేయఁబడియున్నది మఱియు, నయ్యెయెడలఁ బెక్కు వ్యాఖ్యానములనుండి యవశ్యవేద్యంబు లగు విశేషములును, నతిముఖ్యము లగు కొన్ని శ్లోకములకు విరివియగు తాత్పర్యములును, నయ్యెపట్టుల నుపోద్బలకము లగు శ్రుతిస్మృతీతిహాస పురాణాది ప్రమాణములును విశేషాకారమునఁ గూర్పంబడియున్నవి మఱియు 'జన్మాద్యస్య' ఇత్యాదులయిన యిందలి మొదటి మూఁడు శ్లోకముల కొక్కొక్కటికిని మతత్రయానుసారము లగు మూఁడేసి వ్యాఖ్యానములను రచితములై యున్నవి వేయేల? దీని యతిశయము చదువరులకే సులభముగాఁ దెలియఁగలదు గాన, నింతకన్న నెక్కుడు దీనింగూర్చి వ్రాయుట యనావశ్యకము

శ్రీమద్భాగవత పురాణ రసాస్వాదప్రవణు లగు భాగవత శిఖామణులందఱు నీ గ్రంథమును గొని యానందాబ్ధి నోలలాడుదురు గాత!

ఇట్లు,

టి. దేవరాజసుధి,

ఆంధ్రవచన రామాయణ ప్రణేత

# విషయసూచిక

## ప్రథమస్కంధము

## ద్వితీయస్కంధము



శ్రీరస్తు

శ్రీ రామచన్ద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ప్రథమస్కంధము



శ్లో॥ జన్మాద్యస్య యతోఽన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞస్స్వరాట్
తేనే బ్రహ్మహృదా య ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః।
తేజో వారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గోఽమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥

భాగవతముయొక్క మొదటి మూఁడు శ్లోకములకును త్రిమతములవారు వారి వారి మతము ననుసరించునట్లు వ్యాఖ్యానము చేసియున్నారు. వానిలో నద్వైతమతావలంబ మగు వ్యాఖ్యాన మెట్లనఁగా "భగవంతుం డయిన వ్యాసమునీంద్రుండు నానా పురాణములను, నితిహాసములను రచించినను చిత్తశాంతిని బొందలేక, నారదోపదేశము ననుసరించి భగవద్గుణ వర్ణనమే ప్రధానముగాఁ గల భాగవతపురాణము రచింపఁ బూనికొని, దాని కంతరాయములు లేకుండ సమాప్తి పొందుటకుఁగాఁ బరబ్రహ్మస్మరణరూప మగు మంగళము "జన్మాది" యను శ్లోకముచేఁ జేయుచున్నాఁడు" శ్లోకార్థము - యతః = ఏ పరబ్రహ్మమువలన, అస్య = ఈ ప్రపం

చముయొక్క, జన్మాది=సృష్టిస్థితిలయములు, అన్వయాత్ = అన్వయమువలనను, ఇతరతః=వ్యతిరేకమువలనను, భవన్తి= (అధ్యాహారము) అగుచున్నవో, అట్టి సర్వేశ్వరుని ధ్యానింతుమని యన్వయము. (అనఁగా నన్వయ వ్యతిరేకములచే నీ విశ్వముయొక్క సృష్టిస్థితిలయము లే సర్వేశ్వరునివలనఁగలుగుచున్నవో, అట్టి పరమేశ్వరు నని తాత్పర్యము. అన్వయవ్యతిరేకము లనఁగా "యత్సత్త్వే యత్సత్త్వం, యదభావే యదభావః" అని పండితులందురు అనఁగా "ఏదియుండిన నేదియుండునో, ఏది లేనిచో నేది యుండదో" అని యర్థము. ఇట్టిని కార్యకారణములయందుఁ బ్రవర్తించును. ఎట్లనఁగా పటము కార్యము, తంతువులు కారణములు తంతువులుండిన వస్త్రము లుండును, తంతువు లేనిచో వస్త్రము ండదు. అట్లే పరబ్రహ్మవిషయమును చూచుకొనవలెను పరబ్రహ్మము కారణము, జగత్తు కార్యము. కారణరూపమయి బ్రహ్మమున్నది కనుకనే, కార్యరూపమయిన జగమ్ముండును. ఇట్లు అన్వయవ్యాప్తి సమన్వయించినది. వ్యతిరేకము పట్టునప్పుడు పరబ్రహ్మము లేకపోయినఁద కార్యరూపమయిన జగత్తుకూడనుండదు అని కదా చెప్పవలయును అట్లయిన, మహాప్రళయములయందుఁ గార్యము నశించినను గారణమగు బ్రహ్మపదార్థము వెలయుచున్నది కనుకను, బ్రహ్మము నిత్యమగుటచే "బ్రహ్మము లేనిచో" అని చెప్పుటకు వలనుపడదు కనుకను, వ్యతిరేక వ్యాప్తిని ఘటపటాదులయందు సమన్వయించినట్లు పరబ్రహ్మమందు సమన్వయించుటఁ దగదు కాని, యట్టిచోట్ల నకార్యము లయిన గగనారవిందాదులనుబట్టి

సమన్వయింపవలెను. ఎట్లనఁగా, అకార్యములయిన గగనారవిందము శశశృంగము మొదలగువానియందుఁ గారణరూపమయిన బ్రహ్మము లేముకనుకఁ దాదృశ గగనారవిందాదులు లేవని సమన్వయము చేయవలెను ఈ చెప్పినదానివలననే బ్రహ్మపదార్థమున్నదనియు స్పష్టమగుచున్నది. లేక, అన్వయశబ్దమునకు అనువృత్తి యనియు, ఇతరశబ్దమునకు వ్యావృత్తి యనియు నర్థము అట్లు చెప్పికొని, అన్వయాత్ = అనువృత్తివలనను (అనఁగా, మృత్తు కారణావస్థను స్వస్వరూప మగు మృత్తురూపమున అనువర్తించునట్లు పరబ్రహ్మము స్వస్వరూప మగు సద్రూపమున అనువర్తించుటవలనను) ఇతరతః = వ్యావృత్తివలనను (అనఁగా, మృత్తు స్వకార్యరూప మగు ఘటమున వ్యావృత్త మగునట్లు బ్రహ్మము స్వకార్య మగు ప్రపంచమున వ్యావృత్త మగుటను - బ్రహ్మము సద్రూపమున కారణమును జగద్రూపమున కార్యము నగుటచేతను అనుట), అస్య = ఈ ప్రపంచముయొక్క, జన్మాది = జన్మాదులు, యతః = ఏ సర్వేశ్వరునివలన, భవంతి = అగుచున్నవో, యని యర్థము - బంగారము స్వస్వరూపముతో నొకప్పుడును, కుండలాది కార్యరూపముగా నొకప్పుడు పరిణమించి తిరిగి స్వస్వరూపము నొందునట్లు, పరమాత్మ పృథివ్యాది కార్యరూపముగా నొకప్పుడు పరిణమించి మఱియొకప్పుడు కార్యరూపమును మాని స్వస్వరూపము నొందుచుండును. కావునఁ బరమాత్మ ప్రపంచముయొక్క సృష్ట్యాదులకుఁ గారణభూతుఁ డగుచున్నాఁడు. ఓయీ! భగవంతుఁ డొక్కఁడే కదా! ఇప్పుడు నీవు చెప్పిన యర్థమునుబట్టి

యోచింపఁ బ్రపంచమున కుపాదానకారణ మగు పరబ్రహ్మ మునకే నిమిత్తకారణత్వము సంభవించుచున్నది. ఇది మిగుల ననుభవవిరుద్ధముగా నున్నది ఏమనఁగా, ఘటమునకుఁ గులాలుఁడు నిమిత్తకారణము, మన్ను దానికి నుపాదానకారణము నగుట చూచుచున్నాము. అంతియకాని, యుపాదానకారణ మయిన మంటికి నిమిత్తకారణత్వ మెప్పుడును గలుగలేదు. మఱియు,ఘటమునకు నిమిత్తకారణ మయిన కులాలుఁ డెప్పుడు నుపాదానకారణము కాఁడు. ఇట్లు నిమిత్తోపాదానకారణము లొక్కవస్తువునకు లభించుట విరుద్ధమయి యుండఁగాఁ బరమాత్మకు నిమిత్తోపాదానకారణత్వము లెట్లు సిద్ధించును? అని యడిగితివేని చెప్పెదను వినుము పైని నీవు చెప్పిన దృష్టాంతముఁ బరబ్రహ్మవిషయమయి యుక్తమయినది కాదు. ఏమనఁగాఁ గులాలుఁడు సర్వశక్తుఁడు కాఁడు, కనుక నుపాదాన కారణము కానేరఁడు మన్ను అచేతనము కనుక, నది యెప్పుడు నిమిత్త కారణము కాదు. కాని, పరమాత్మ సర్వశక్తుఁడు కావున, నిమిత్తోపాదానకారణములు రెండు నయియుండ సమర్థుఁడు. మఱియుఁ బరమాత్మ కుభయవిధకారణత్వములు కలిగి యున్నట్లు వేదపురుషుఁడుగూడ చెప్పుచున్నాఁడు. శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ. అనఁగా—ఇదం సర్వం = ఈ విశ్వమంతయు, బ్రహ్మ ఖలు = పరబ్రహ్మస్వరూపమే కదా! అని యర్థము. శ్రు॥ ఐతదాత్మ్య మిదం సర్వం. ఇదం సర్వం= ఈ ప్రపంచ మంతయు, ఐతదాత్మ్యం = ఈ బ్రహ్మస్వరూపమే. ఈ శ్రుతుల వలనఁ బరమాత్మ ప్రపంచమున కుపాదానకారణ మయి నట్లు స్పష్టమగుచున్నది. శ్రు॥ యతో వా ఇమాని భూతాని

జాయంతే. అనఁగా, ఇమాని భూతాని = ఈ సమస్త భూత ములు, యతః = ఏ సర్వేశ్వరునివలన, జాయంతే = పుట్టు చున్నవో అని యర్థము స్మృతి॥ శ్లో॥ "యతస్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే। యస్మింశ్చ ప్రళయం యాన్తి పునరేవ యుగక్షయే॥" అనఁగా "ఆదియుగారంభము నందు సర్వభూతములు, ఏ సర్వేశ్వరునివలనఁ గలుగు చున్నవో, తిరిగి యుగాంతమునం దే సర్వేశ్వరునియందు అవి యెల్ల లయమును బొందుచున్నవో" అని యర్థము శ్రు॥ స ఈక్షతేమాన్ లోకాన్ లోకపాలా నసృజా ఇతి॥ అనఁగా, స = ఆ పరమాత్మ, ఇమాన్ లోకాన్ = ఈ లోకములను లోకపాలాన్ = లోకపాలురను, ఈక్షత = సృజించుటకు నిచ్ఛ గించెను అని యర్థము ఈ శ్రుతిస్మృతులచేతఁ బరమాత్మకు నిమిత్తకారణత్వము కలిగియున్నట్లు స్పష్ట మగుచున్నది ఓయీ! మాయ జగత్తునకుఁ గారణభూత మగుచున్న దే! కనుక మాయను ధ్యానించుచున్నా మనియు నర్థము కలుగుచున్నది. అది నీకిష్టమా! అని యందువేని, యట్లనుటకు వలనుపడ దను నభిప్రాయముతో "అభిజ్ఞః" అని చెప్పుచున్నాఁడు అనఁగా. యః = ఏ పరమాత్మ, అర్థేషు = ఆకాశాది కార్యములయందు, అభిజ్ఞః = సర్వజ్ఞుఁడయి – లేక జాగరూకుఁడయి, అస్తి = ఉన్నాఁడో తం = ఆ పరమాత్మను, ధీమహి = ధ్యానింతు మని యన్వయము 'అభిజ్ఞః' అని చెప్పుటచేఁ బ్రకృతి జడముకనుక, దానికి సర్వజ్ఞత్వాది గుణము లుండమిచే వెనుకఁ జూపింపఁ బడిన దోషము నివారణ మగుచున్నది మఱియు, యః = ఏ పరమాత్మ, స్వరాట్ = స్వయంప్రకాశుఁడో, లేక, స్వతస్సిద్ధ

మగు జ్ఞానముతో నొప్పుచున్నాఁడో, అటువంటి పరమాత్మను ధ్యానింతు మని యన్వయము ఓయీ! శ్రు॥ హిరణ్యగర్భ స్సమవ ర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్॥ అను శ్రుతి ప్రకారముగా పైని చెప్పిన గుణములన్నియుఁ జతుర్ముఖబ్రహ్మ కును గలవుగనుక, నతనిని ధ్యానించుచున్నా మని యేల చెప్పఁ గూడదు? పరమాత్మ, ననియే ఏల చెప్పవలెను? అను శంక నివారణ యగుటకై యిట్లు చెప్పుచున్నాఁడు 'తేన' ఇతి యః = ఏపరమాత్మ, యత్ = ఏ వేదమునుగూర్చి, సూరయః = పండి తులుగూడ, ముహ్యంతి = మోహమును జెందుచున్నారో, తత్ బ్రహ్మ = ఆ శబ్దబ్రహ్మమును, ఆదికవయే = చతుర్ముఖ బ్రహ్మకు, హృదా = మనస్సుచే, తేనే = విస్తరింపఁజేసెనో, అట్టి పరమాత్మను, అని చెప్పుటచేతను, చతుర్ముఖబ్రహ్మ ధ్యానింపఁదగినవాఁడు కాఁడని తెలియవచ్చుచున్నది. మఱియు నిందువిషయమయి శ్రుతిప్రమాణముకూడ నున్నది. శ్రు॥ యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహి ణోతి తస్మై॥ అనఁగా, ఏపరమాత్మ పూర్వమందు బ్రహ్మను సృజించెనో, ఎవఁడా బ్రహ్మకు వేదముల నుపదేశించెనో, అని యర్థము ఈ శ్రుతిప్రమాణముచేతఁగూడఁ బరమాత్మ బ్రహ్మ కు వేద ముపదేశించినట్లు తెలియుచున్నది, అందుచే వెనుకటి యర్థము నిరస్తమగుచున్నది. యత్ర = ఏపరబ్రహ్మమందు, త్రిసర్గః = మాయాగుణములయిన సత్త్వరజస్తమోగుణముల యొక్క భూతేంద్రియదేవతారూప మయిన సృష్టి, తేజోవారి మృదాం = తేజస్సు, వారి, మృత్తు, వీనియొక్క, వినిమయో యథా = ఒండొంటిమార్పువలెనే - ఒకటియందు మఱొకటి

తోఁచుటవలెనే అమృషా = అబద్ధముకాదో - అనఁగా సత్య
మో, అట్టి పరమాత్మ యని యన్వయము ఓయీ! నీవు చెప్పి
నది యసంగతముగానున్నది బ్రహ్మమందు సత్త్వరజస్తమో
గుణకృత్యమయిన సృష్టి భ్రాంతిగాని సత్యముకాదే! తేజో
రూపమయిన యెండమావులయందు జలబుద్ధి భ్రాంతికాని
సత్యమానా? అట్లే త్రిసర్గము భ్రాంతి యగుచుండఁగా, నది
సత్యమని చెప్పుట యెట్లు? అని యడిగినఁ జెప్పెద వినుము.
సిద్ధాంతివాఁడు నీవు చెప్పినట్లుగా బ్రహ్మమందుఁ ద్రిసర్గము
భ్రాంతి యగుట నిశ్చయమే కాని, వ్యావహారిక దశయందు సత్య
మయి యుండినట్లు ప్రతీయమాన మగుచున్నది పరబ్రహ్మము
సత్యము కనుక, నా బ్రహ్మమందు సృష్టికూడ సత్యమయినట్లు
తోఁచుచున్నది అట్లే కానిచో లోకములో సమస్తము నశిం
చునదే కనుక, నాయా వస్తువుల సంపాదించుటకయి మను
ష్యాదు లేల ప్రవర్తింపవలెను? కనుకనే, మన మన్నివస్తువు
లను సంపాదించుటకుఁ బ్రయత్నించుచున్నాము అందుచేత
సత్యమయి ప్రతీయమాన మగుచున్నదని చెప్పక తీరదు ఇట్ల
ర్థము చెప్ప నిష్టము లేనిచో, మూలములో మృషా యనియే
పదవిభాగము చేయవలెను అప్పు డర్థమెట్లనఁగా, యత్ర =
ఏపరమాత్మయందు, త్రిసర్గః = సత్త్వరజస్తమోగుణముల
యొక్క-సృష్టి, తేజోవారిమృదాం = తేజోవారిమృత్తులయొక్క,
వినిమయో యథా = వ్యత్యాసమువలెనే, మృషా = అసత్య
మగుచున్నదో (అనఁగా, ఎండమావులయందు జలబుద్ధియు,
జలమందు కాచాది బుద్ధియు, కాచాదులయందు జలబుద్ధియు
నెట్లు సత్యములు కావో, అట్లే పరమాత్మయందు గుణసృష్టి

భ్రాంతియే కాని సత్యము కాదని తాత్పర్యము. మఱియు, యః = ఏ పరమాత్మ, స్వేన = తన సంబంధమైన, ధామ్నా = తేజస్సుచేత, సదా = ఎల్లప్పుడు, నిరస్తకుహకం = మాయామయమయిన ప్రపంచమును నశింపఁజేయుచున్నాఁడో, తం = అట్టివానిని, సత్యం = సత్యస్వరూపుఁడయిన, పరం = పరమాత్మను, ధీమహి = ధ్యానము చేయుచుందుము. అని శ్లోకార్థము. ఓయీ! శ్లో॥ యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః। వృత్రాసురవధోపేతం తద్భాగవతమిష్యతే॥ అనఁగా, ఏగ్రంథమందు గాయత్రీ మంత్రార్థము వర్ణింపఁబడునో, ఎచ్చట ధర్మము విస్తారముగా వర్ణింపఁబడునో, దేనియందు వృత్రాసురవధ చెప్పఁబడునో, అట్టి గ్రంథమును భాగవతమని చెప్పుదురు. మఱియు, స్కాంధపురాణములో నుత్తరఖండమునందు, శ్లో॥ గ్రంథోష్టాదశసాహస్రో ద్వాదశస్కంధసమ్మితః। హయగ్రీవబ్రహ్మవిద్యా యత్ర వృత్రవధస్తథా, గాయత్ర్యాచ సమారంభస్తద్వై భాగవతం విదుః॥ అని చెప్పఁబడినది. అనఁగా పదునెనిమిదివేల శ్లోకముల పరిమితి గలిగినదియు, ద్వాదశస్కంధములతోఁ గూడినదియు, గాయత్రీమంత్రముచే నారంభింపఁబడినదియు నైన గ్రంథమును భాగవతమని చెప్పుదురు గదా! ఈ గ్రంథము పదునెనిమిదివేల శ్లోకములతోఁ గూడియున్నది ద్వాదశస్కంధములతోఁ గూడియున్నది. హయగ్రీవబ్రహ్మవిద్యతోను, వృత్రాసురవధతోను గూడియున్నది. కాని, గాయత్రీ మంత్రార్థముచే నారబ్ధము కాలేదే! కావున, దీనికి భాగవత మను నామ మెట్లు సరిపడునని శంక వారించు నిమిత్తము గ్రంథకర్తయగు వ్యాసమహాముని యే గాయత్రీ

మంత్రార్థమును జన్మాది అను శ్లోకముచేతఁ బ్రకాశింపఁజేసి యున్నాఁడు. గాయత్రీమంత్రమును, దానియర్థము ముందుగా దెలిసికొనుట యావశ్యకము కనుక, వివరించి చెప్పెదను గా, మం॥ తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి । ధియోయోనః ప్రచోదయాత్॥ అని గాయత్రీమంత్రము. యః = ఏపరమాత్మ, నః = మాయొక్క, ధియః = బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరణచేయుచున్నాఁడో, తస్య = అటువంటియు, దేవస్య = స్వయంప్రకాశకుఁడయినట్టియు, సవితుః = జగత్కారణభూతుఁడయిన పరమాత్మయొక్క, భర్గః = తేజస్సును, ధీమహి = ధ్యానము చేయుచున్నామని యర్థము ఈ మంత్రార్థము జన్మాది యను శ్లోకముచే నెట్లు సూచింపఁబడినదనఁగా, యతః, అను పదమువలన "తత్" అను పదార్థము సూచితమైనది "జన్మాది" అను వాక్యార్థముచేఁ బరమాత్మకు జగత్కారణత్వము సిద్ధించుచున్నదికాన, నావాక్యముచే సవితృపదార్థము సూచింపఁబడెను "పరం"అనుపదముచేత వరేణ్యపదార్థము, "ధామ్నా"అనుపదముచే భర్గశబ్దార్థమును సూచింపఁబడినవి. జన్మాది అనువాక్యముచేత పరమాత్మకు జగత్ప్రకాశకత్వము సంభవించుచున్నది కావున, నందువలననే దేవశబ్దార్థము సూచింపఁబడవచ్చు లేనిచో 'స్వరాట్' అనుపదముచే దేవశబ్దార్థము ప్రకటింపఁబడవచ్చును "ధీమహి"అనుపదార్థము, "ధీమహి" అనుపదముచేతనే వచింపఁబడెను "తేనే బ్రహ్మ" అనెడి వాక్యార్థముచే, "ధియోయోనః ప్రచోదయాత్" అనువాక్యార్థము సూచింపఁబడినది. ఇట్లు గాయత్రీ

మంత్రార్థముచే నారంభింపఁబడినది. కావున, నీగ్రంథమునకు భాగవత మనునామ ముచితమే యని స్థిరపఱుపవచ్చును.

తా ఆకాశాది కార్యములందు కారణమై సద్రూపమున వర్తించుచు అకార్యములగు నాకాశపుష్పాదులందు వర్తింప మినిబట్టి, ప్రపంచము సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడును సర్వజ్ఞుఁడును, స్వయంప్రకాశుఁడును యోగీశ్వరులకుఁ గూడ మోహమును గలిగించునట్టి వేదములను దయార్ద్రమయిన చిత్తముతో బ్రహ్మకు నుపదేశించినవాఁడును, తేజోవారిమృత్కృతమయిన వినిమయమువలెనే సత్యముగాని త్రిగుణసృష్టిసంబంధము లేనివాఁడును దన తేజోమండలముచే మాయామయమయిన ప్రపంచమును నిరసనచేయువాఁడును, సత్యస్వరూపుఁడు నగు పరబ్రహ్మమును ధ్యానించుచున్నాము.

శ్లో॥ ధర్మః ప్రోజ్ఝితకైతవో౽త్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కింవా పరైరీశ్వరః
సద్యో హృద్యవరుధ్యతే౽త్ర కృతిభిః శుశ్రూషుభిస్తత్క్షణాత్॥

ఇట్లు మంగళాచరణము కావించి యీగ్రంథమునం దందఱకుఁ ప్రవృత్తి గలుగుటకయి యీ భాగవతము కర్మకాండము, జ్ఞానకాండము, దేవకాండము, అను కాండత్రయమును దెలిపెడి శాస్త్రములన్నిటికంటె శ్రేష్ఠమయినదని యీ శ్లోకముచేఁ జెప్పుచున్నాఁడు "ధర్మః" అని, మహామునికృతే = మహాత్ముఁడయినవ్యాసమహర్షిచే రచింపఁబడిన, శ్రీమతి = సుందరమయిన (ముముక్షువులకు మనోహరమయిన) అత్ర భాగవతే = ఈ భాగవతగ్రంథమందు, ప్రోజ్ఝితకైతవః—ప్రోజ్ఝిత = లెస్సగా విడిచి

పెట్టఁబడిన, కైతవం = కపటము గలట్టియు, నిర్మత్సరాణాం = పర
గుణోత్కర్షమును సహించెడి, సతాం = సత్పురుషులకు, పరమం =
ఉత్కృష్టమయినట్టియు ధర్మ = సర్వేశ్వరారాధనరూపమగు
ధర్మము మాత్రమే, నిరూప్యతే = (అధ్యాహారము) చెప్పఁబ
డును. ఈ చెప్పుటచే భాగవతము కర్మకాండవిషయములయిన
శాస్త్రములకంటె గరీయమని చెప్పఁబడినది మఱియు, శివ
దం = పరమసుఖమును నిచ్చునట్టియు, తాపత్రయోన్మూలనం =
ఆధ్యాత్మికాదితాపత్రయములను దొలఁగించునదియును, వాస్త
వం = పరమార్థభూతమగునట్టి, వస్తు = వస్తువయిన పరబ్రహ్మము,
లేక వాస్తవ మనఁగా వస్తువునంశమగు జీవుఁడు వస్తుశక్తి
యగుమాయ వస్తుకార్యమగు జగత్తు-ఇవన్నియు వస్తువేయని,
వేద్యం = సుఖముగా నిందు తెలియఁబడును. ఈ చెప్పుటచే జ్ఞాన
కాండవిషయములయిన శాస్త్రములకంటె శ్రేష్ఠమయినదని
చెప్పఁబడినది అపరైః = ఇతర దేవతాప్రతిపాదకములయిన
శాస్త్రములచేత, కిం = ఏమి ప్రయోజనము? అనఁగా, సమస్త
మీ గ్రంథము వలననే కలుగుచుండఁగా నితర శాస్త్రములన్ని
యు నభ్యసింపనక్కఱలేదని తాత్పర్యము ఈ చెప్పుటచే నీ
గ్రంథము దేవతాకాండవిషయమయిన శాస్త్రములకంటె
నుత్కృష్టమయినదని తెలియుచున్నది అత్ర = ఈ భాగవత
గ్రంథమందు, శుశ్రూషుభిః = విననిష్టముగల, కృతిభిః = పుణ్యా
త్ములచేత, హృది = తమయొక్క హృదయములయందు, సద్యః =
ఆకాలమందే, తత్క్షణాత్ = ఆక్షణమందే, ఈశ్వర = భగవం
తుఁడు, అవరుధ్యతే = స్థిరముగా నిలుపుకొనఁబడుచున్నాఁడు
ఈ గ్రంథము సర్వశాస్త్రములకంటె శ్రేష్ఠమయినదనియు,

ఈగ్రంథమందు వినికిగలవారు సకలశాస్త్రఫలములను బొం దఁగలరనియు, తత్కాలమందే యీశ్వరుని దమ హృదయ ములయందు నిలుపుకొందురనియుఁ దాత్పర్యము.

తా. వ్యాసమహాముని రచితమయిన భాగవతమునందు నిష్కపటమయిన ధర్మము నిరూపింపఁబడును అధ్యాత్మికాది తాపత్రయము నున్మూలనముచేసి పరమసుఖ మిచ్చుచున్న దియు, నిత్యమైనదియు, సత్పురుషులకుఁ దెలియఁదగినదియు నగు పరమాత్మస్వరూపము సుఖముగాఁ దెలియును ఈభాగ వతగ్రంథ మభ్యసించినవారికిఁ దక్కినవానితోఁ బ్రయో జనములేదు అట్టివారలు తత్కాలమందే భగవంతుని దమ మనములయందు నిలుపుకొనఁగలరు.

శ్లో॥ నిగమకల్పతరోర్గళితం ఫలమ్
శుకముఖాదమృతద్రవసంయుతమ్ ।
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికా భువి భావుకాః॥ 3

మఱియు, నీగ్రంథము నందఱుజనులు మిక్కిలి యాదర ముతో సేవింపవలయునని చెప్పుచున్నాఁడు — నిగమకల్ప తరోః-నిగమ-వేదమనెడి, కల్పతరోః = కల్పవృక్షముయొక్క, ఫలం = పండు, శుకముఖాత్ = శుకమహామునియనెడి చిలుక యొక్క ముఖమునుండి, గళితం = భూమికి జాఱినది. (అనఁగా సకలవేదరూపమయిన యీ భాగవత మనెడి ఫలమును నార దుండు వైకుంఠమునుండి తీసికొనివచ్చి నా కొసఁగెను. దాని నేను నాకుమారుఁడయిన శుకమహామునికి నొసంగితిని. ఆఫల మతని ముఖమువలననుండి భూమికి పదిలముగా జాఱినదిగాని

మీఁదనుండి పడలేదు కనుక, నా ఫలము చితికిపోలేదని తాత్పర్యము ) మఱియు, ఫలం = ఆ భాగవత ఫలము అమృతద్రవసంయుతం-అమృతద్రవ = శుక మహాముని యనెడి చిలుకయొక్క ముఖముచేత సంక్రమించిన పరమానంద మనెడి మాధుర్యరసముచే, సంయుతం = కూడికొనినది (అనఁగా లోకములోఁ జిలుక చేఁగొట్టబడిన ఫలము మిగుల మధురముగా నుండి, యందఱిచేత సత్యాదరముతో సేవింపఁబడుచుండుట ప్రసిద్ధము. కావున నట్లె యీ భాగవతము శుక మహామునిచే లోకమందు విస్తరింపఁ జేయఁబడియుండుటచే నతనివదనమునుండి సంక్రమించిన పరమానందరసముచేఁ గూడుకొని యున్నదనియు, దానిని విన్నను బఠించినను బరమానందము కలుగునని తాత్పర్యము ) అతః = ఈ హేతువువలన, హే రసికా = ఓ రసజ్ఞులారా! భావుకాః = రసవిశేషమునందు నిపుణత గలయట్టి మహానుభావులారా! భువి = భూమియందు, ముహుః = మాటిమాటికి, ఆలయం = మోక్షమందువఱకు, భాగవతం = భాగవతమనెడు పేరుగల, రసం = రసరూపమయిన ఫలమును, పిబత = త్రావుదురుగాత ఇందు ఫలమును ద్రావవలెనని చెప్పుట యసంగతముగాఁ గనఁబడుచున్నను, అట్టి సందియము తొలఁగునిమిత్తము రస మనుపదము ప్రయోగించెను ఎట్లన, నా ఫలము రసరూపమే కనుక, రసమును బానముచేసినట్లె పానముచేయ వచ్చును. గళితమయిన రసము త్రావ వలనుపడదు గనుక, ఫలమను పదము ప్రయోగించె. ఫలరూపముగా నుండుటచేఁ ద్రావ సులభముగా నుండునని అభిప్రాయము (అనఁగా త్వక్కు మొదలయిన హేయపదార్థము లేదు కనుక, నిరాటంకముగాఁ

ఖ్యానము చేయవచ్చు ననియు, గ్రంథపక్షమందు దోషయుతము లయిన భాగము లించేమియు లేవు కనుక, నిస్సందేహముగా విని యానందింప వచ్చుననియుఁ దాత్పర్యము).

తా॥ ఓ రసికులారా! వేదమనెడి కల్పవృక్షమునకు ఫలరూపమయినదియు, శుకమహాముని ముఖసంపర్కముచే రెట్టించిన మాధుర్యరసము కలదియునై, రసస్వరూపమయిన భాగవత మనెడి ఫలము ననుభవించి సుఖము నొందుఁడీ!

ఇట్లు గ్రంథకర్తయగు వ్యాసమహాముని యిష్టదేవతానమస్కార రూపమయిన మంగళమును మొదటిశ్లోకము చేతను, రెండవశ్లోకముచే గ్రంథములోనున్న విషయములను, మూఁడవశ్లోకముచేతఁ బ్రయోజనమును జెప్పి, వినువారి కందఱికి నీగ్రంథమం దభిరుచి కలిగించి గ్రంథము నారంభించుచున్నాఁడు.

మూఁడుశ్లోకములకు విశిష్టాద్వైత మతానుసారముగా వ్యాఖ్యానము —

శ్లో॥ జన్మాద్యస్య యతోఽన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞస్స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే ముహ్యన్తి యత్సూరయః
తేజోవారిమృదాం యథావినిమయో యత్ర త్రిసర్గో మృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥

భగవంతుఁడయిన వ్యాసమహాముని లోకోపకారార్థమై యీ భాగవతపురాణమును రచింపఁ బూనుకొని దాని కంతరాయము లేకుండ నుండుటకయి మంగళాచరణము చేయఁ బూనుకొని 'యతో వా ఇమాని భూతాని' అనెడి శ్రుత్యర్థమును మనంబున నుంచికొని "జన్మాది" యను శ్లోకమును

రచించుచున్నాఁడు. అస్య = ఈప్రపంచముయొక్క, జన్మాది = జన్మస్థితిలయములు, యతః = ఏ నారాయణునివలన, అన్వయాత్ = అన్వయముచేతను, ఇతరతః = వ్యతిరేకముచేతను భవంతి = అగుచున్నవో, 'యతో వా ఇమాని' అను శ్రుతినిబట్టి యన్వయముసిద్ధమగుచున్నది 'కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశే ఆనందో నస్యాత్' అను శ్రుతివలన వ్యతిరేకము సిద్ధమగుచున్నది. ఈప్రకారముగా జగత్కారణము సిద్ధించుచున్నది. అయినను, ఈ జగత్కారణత్వము, అచేతనమగు మృత్తుఘటమునకుగునట్లు ఉపాదానకారణమాత్రమయినదిగాదు, చేతనముగు బ్రహ్మము దుండుటచే నిమిత్తకారణరూపము నైనదని సాధించి, పరబ్రహ్మము నిర్గుణము అను సందియమును వారించి, జగత్తులను సృజించుట కుపయుక్తములయిన జ్ఞానాదికల్యాణగుణము లున్నవని తెలియఁజేయుచున్నాఁడు. అర్థేష్వభిజ్ఞ అని. యః = ఏపరబ్రహ్మము, అర్థేషు = సర్వపదార్థములయందును, అభిజ్ఞః = సాక్షియయి విలసిల్లుచున్నాఁడో, యః = ఏ నారాయణుఁడు, స్వరాట్ = స్వయముగాఁ బ్రకాశించుచున్నాఁడో, యః = ఏ నారాయణుఁడు, ఆదికవయే = చతుర్ముఖబ్రహ్మకు, హృదా = ప్రేమసహితమయిన మనస్సుతో, బ్రహ్మ = వేదమును, తేనే = ఉపదేశించెనో, ఓయీ! జ్ఞానాతిశయము చతుర్ముఖుని కున్నది కనుక, స్వయముగానే వేదమును దెలిసికొనఁగవచ్చును. ఇంతమాత్రమునకయి యుపదేశింపవలెనా, అనుశంక వారించుటకయి చెప్పుచున్నాఁడు. యత్ = ఏ వేదమునుగూర్చి, సూరయ = అకుంఠితమయిన జ్ఞానముగల యోగీశ్వరు లయినను,

ముహ్యంతి = మోహమును బొందుచున్నారో (అనఁగా వేదము లనంతములు కనుక, వాని యర్థములు దురవబోధములు గనుకను, దానిని దెలిసికొనలేక మోహమును పొందుచున్నారు. కావున, బ్రహ్మకు నుపదేశ మావశ్యకమని తాత్పర్యము. ఇట శ్రు॥ యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై॥ అనునట్టి శ్రుత్యర్థము సిద్ధము మఱియొకవిధముగా నర్థము చెప్పవచ్చును మూలమందున్న "ముహ్యంతి యత్సూరయః" అను నెడ నపుంసకలింగమై యున్న "యత్" అను పదమును, పుల్లింగముగా మార్చినచో "యం" అని సిద్ధమయినది. యం = ఏ నారాయణమూర్తినిగూర్చి, సూరయః = 'తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః' అని శ్రుతిసిద్ధులైన నిత్యసూరులు సైతము, ముహ్యంతి = ఆతని దివ్యసుందరవిగ్రహమును దర్శించుటవలనఁ గలిగిన యానందాతిశయముచే సంభ్రమచిత్తులై యున్నారో ఆ నారాయణమూర్తి బ్రహ్మకు వేదము నుపదేశించె నని యన్వయము. ఓయీ! ఆ వేదమును బ్రహ్మకుపదేశించుటవలనఁగలిగెడి లాభ మేమి, అని యందువేని, దానికి లాభము చెప్పెదను వినుము. యః = ఏ నారాయణుఁడు, తేజోవారిమృదాం – తేజః = తేజస్సుయొక్కయు, వారి = జలముయొక్కయు, మృదాం = భూమియొక్కయు, వినిమయః = *త్రివృత్కరణజనితమయిన పరస్పరసమ్మేళనము, యథా = ఏప్రకారము, భవతి = యగునో,

* త్రివృత్కరణ మనఁగా—పృథివి అప్పు తేజస్సు అను మూఁడును ఒండొంటితోఁ గూడుట

తథా=అట్లు - త్రివృత్కరణపూర్వకముగా సృష్టిసేయుటకై, బ్రహ్మ=వేదమును, తేనే=ఉపదేశించెను అని యన్వయము. అనఁగా సర్వేశ్వరుఁడు తాను బ్రహ్మాండమును నిర్మించుటకుఁ బూర్వము త్రివృత్కరణ మనెడి విధమును పదార్థసృష్టి కుపయుక్తముగా తానే రచించి, బ్రహ్మచే ఆ త్రివృత్కరణపద్ధతిని దేవతిర్యఙ్మనుష్య స్థావరాది భేదభిన్నమైన సృష్టిని జేయించువాఁడై ఆ పద్ధతి నతని కుపదేశింపఁ గోరి త్రివృత్కరణమును, తత్పూర్వకమైన సృష్టి మొదలగు పదార్థములను దెలుపునట్టి వేదమును ఉపదేశించె నని తాత్పర్యము అందుచే వేదోపదేశ మవసరమయినదియె ఓయీ! శ్రు॥ "హంతాహ మిమాస్తిస్రో దేవతా। అనేన జీవే నాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అయారే! వీరు మువ్వురు దేవతలు, నేనీ జీవాత్మను శరీరముగాఁ జేసికొని సమస్తమందుఁ బ్రవేశించి నామములను రూపములను జేయుచున్నాను, అనెడి శ్రుత్యర్థప్రకారము భగవంతునికిఁ ద్రివృత్కరణపూర్వకమయిన యనుప్రవేశ మున్నట్లు తెలియవచ్చుచున్నది. కావున, నా భగవంతుఁడు సృష్టికి లోఁబడి యుండుటఁబట్టి, యతని కనిత్యత్వాది దోషములు కలుగునే! యనునట్టి సందియముఁ బాపుటకయి చెప్పుచున్నాఁడు "యత్రేతి" యత్ర = ఏ భగవంతునియందు, త్రిసర్గ = పృథివ్యప్తేజములయొక్క సృష్టి, మృషా = మిథ్యాభూత మగుచున్నదో, అనఁగాఁ ద్రివృత్కరణపూర్వక మయిన సృష్టి యా భగవంతుని స్పృశింపదని తాత్పర్యము కావున, భగవంతుఁడు సృష్టికి లోఁబడి యుండలేదు గనుక, వెనుకటి దోషము నిరస్తమగుచున్నది.

మరియు, యం = ఏ నారాయణుఁడు, స్వేన = తనసంబంధమయిన, ధామ్నా = తేజస్సుచేత, నిరస్తకుహకం—నిరస్త = నశింపఁజేయఁబడిన, కుహకం = సమస్తదోషములు గలవాఁడో, అనఁగా నిజతేజోమహిమచే సమస్తదోష తిమిరమును దొలఁగించుచున్నాఁడని తాత్పర్యము, తం = అట్టి మహామహిమ గలట్టియు, సత్యం = నిత్యుఁడయినట్టియు, పరం = బ్రహ్మరుద్రాదులకంటె నుత్కృష్టుఁడయినట్టి శ్రీమన్నారాయణుని, ధీమహి = ధ్యానము చేయుచున్నాము ఈ భాగవతపురాణము గాయత్రీమంత్రముతో సమానమయినదని తెలుపుటకయి గాయత్రీమంత్రమందున్న "ధీమహి" అనునట్టి క్రియాపదమును లౌకికప్రయోగములయం దుండఁగూడని దయినను, నట్టిదానిని ముని ప్రయోగించెనని తెలిసికొనవలయును.

తా ఏ నారాయణుఁడు జగత్కారణుఁడయి యొప్పుచున్నాఁడో, ఎవఁడు సర్వభూతములయందును సాక్షియై యొప్పుచున్నాఁడో, ఎవఁడు స్వప్రకాశకుఁడో, ఎవని దివ్యమంగళవిగ్రహమును జూచి నిత్యసూరులు సయితమానందాతిశయముచే సంభ్రమచిత్తులై వఱలుచున్నారో, ఎవఁడు బ్రహ్మకు సృష్టిక్రమము దెలిపెడి వేదమును దెలియఁజేసినాఁడో, ఎవని విషయమయి త్రివృత్కరణపూర్వకమయిన సృష్టి మిథ్యాభూత మగుచున్నదో, ఎవఁడు తన తేజస్సుచే సమస్తదోష తిమిరముల నడఁగించుచున్నాఁడో, ఎవఁడు సత్యస్వరూపుఁడో, అట్టి నిరతిశయానందకల్యాణగుణములు గల నారాయణుని ధ్యానింతుము.

శ్లో॥ ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కింవా పరై రీశ్వర
స్సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభి శ్శుశ్రూషుభిస్తత్క్షణాత్॥

ఇట్లు గ్రంథకర్త ప్రథమశ్లోకముచే భగవద్ధ్యానానురూపమయిన మంగళమును జేసి, ద్వితీయ తృతీయ శ్లోకములచే గ్రంథముయొక్క ప్రభావమును జెప్పుచున్నాఁడు. వేదము కర్మకాండము, జ్ఞానకాండము అను రెండు భాగములు గలది. వానిలోఁ బూర్వభాగమయిన కర్మకాండము వలన ధర్మార్థకామము లను త్రివర్గమును, దానిని సాధింపఁ దగిన సాధనములును జెప్పఁబడుచున్నవి. రెండవదియగు జ్ఞానకాండమువలన మోక్షము తత్సాధనములు చెప్పఁబడుచున్నవి. మొదటిదయిన కర్మకాండమందు ధర్మార్థకామరూపమగు ఫలమును సాధించుటకు జ్యోతిష్టోమాది యాగములను, అట్టి యాగములచే నారాధింపఁబడు నింద్రాది దేవతలను గుఱించిమాత్రమే చెప్పఁబడును. అట్టి యింద్రాదులుగూడ పరిమిత మగు ఫలము నిచ్చువారలుగాని, యపరిమితఫలము నిచ్చువారలు కారు. కావునఁ ద్రివర్గరూపమయిన పరిమిత ఫలము నిచ్చునట్టి ఇంద్రాది దేవతలయొక్క యారాధనను మాత్రమే తెలియఁజేసెడి కర్మకాండమునకంటె నీ భాగవత గ్రంథము సర్వోత్కృష్టమయిన విషయప్రయోజనములు గలదని నిరూపించుచుఁ దాదృశోత్కర్షను జెప్పుచున్నాఁడు.

"ధర్మఇతి" * మహామునికృతే = పరీక్షిన్నరేంద్రునిగూర్చి శ్రీశుకులవారు చెప్పిన భగవత్కథ నవలంబించి వ్యాసమహామునిచే రచింపఁబడినట్టియు, అత్ర = బుద్ధిగ్రృతమయినట్టియు, శ్రీమద్భాగవతే-శ్రీమత్ = పరమపురుషార్థమును సాధించునట్టి భక్తిని దెలిపెడు శ్రీకారముతోఁ గూడినట్టియు, భాగవతే = భాగవత మనెడుపేరు గల యీ గ్రంథమందు, నిర్మత్సరాణాం = మాత్సర్యరహితు లయిన, సతాం = బ్రహ్మనిష్ఠులకు, ప్రోజ్ఝితకైతవ = నిష్కపటమయినట్టియు (అనఁగాఁ గపటమయిన శ్యేనయాగా ద్యాభిచారిక ధర్మమువంటిది కాదని తాత్పర్యము), పరమ = మోక్షసాధనమగుటవలన నుత్కృష్టమయినట్టియు (అనఁగా జ్యోతిష్టోమాదియాగములవలె నాధా

---

* "మహామునికృతే = పరిక్షిత్తునుగూర్చి శ్రీశుకులవారు చెప్పిన భగవత్కథను నవలంబించి వ్యాసమహామునిచే రచియింపఁబడిన" అని వ్రాయుట యుచితముకాదని తోఁచుచున్నది ఈ వ్రాఁత "ఇదిదం గ్రాహయామాస సుతమాత్మవతాంవరమ్" "ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మ సమ్మితం। అధీతవాన్ ద్వాపరాదౌ పితుర్ద్వైపాయనాదహమ్" అని చెప్పఁబోయెడి గ్రంథముతో విరోధించుచున్నది. మఱియుఁ జింతించుచున్న వ్యాసునియొద్దకు నారదుండువచ్చి రహస్యమయిన యీ భాగవతకథ నారాయణుండు బ్రహ్మకుఁ జెప్పెననియు, దానిని నేను మాతండ్రివలన గ్రహించితిననియు, మఱి యితరులెవ్వరు నెఱుఁగ రనియుఁ జెప్పి తత్కథ వినుపింపఁగా, నా వ్యాసులు భాగవతమును రచించి శుకునిచేఁ జదివించినట్లు చెప్పఁబడుచుండఁగా, శుకమహామునిచేఁ జెప్పఁబడిన కథ నవలంబించి వ్యాసుఁడు భాగవతగ్రంథమును వ్రాసినాఁ డనుట యంత యుక్తముగాఁ దోఁపదు.

రణ కామ్యఫలముల నిచ్చునది కాదని తాత్పర్యము), ధర్మః = భక్తిరూపమయిన ధర్మము, ప్రతిపాద్యతే = (అధ్యాహారము) నిరూపింపఁబడుచున్నది. ఇట్లు గ్రంథకర్త సకలధర్మముల కంటె విలక్షణమయిన భక్తిరూపమయిన ధర్మమును ప్రతిపాదించి, అట్టి భక్తిరూపమయిన ధర్మముచేఁ బ్రసన్నుఁడయిన భగవంతుఁడు కర్మకాండమందుఁ జెప్పఁబడిన యజ్ఞేంద్రాదులకంటె విలక్షణుఁడనియు నమితఫలదాయి యనియుఁ జెప్పుచున్నాఁడు 'వేద్యమితి'' అత్ర = ఈ భాగవతమందు, వాస్తవం = నిత్యమైనట్టియు (అనఁగాఁ గర్మకాండమందుఁ జెప్పఁబడిన యజ్ఞేంద్రాదులు నిత్యులు కారు కాని, ఈ భాగవతగ్రంథమందుఁ జెప్పఁబోయెడి వస్తువు నిత్యమనియు, ఆ వస్తు విచ్చునట్టి ఫలముగూడ నిత్యమనియుఁ దాత్పర్యము), శివదం - స్వర్గాదిఫలములకంటె శ్రేయస్కరమయినదియు, తాపత్రయోన్మూలనం = ఆధ్యాత్మికాది తాపముల నివారించి మోక్షఫలమునిచ్చునదియు, వేద్యం = తెలియఁదగినదియు, నగు వస్తు = పరబ్రహ్మము, ప్రతిపాద్యతే = నిరూపింపఁబడును, పరైః = గ్రంథమున కతిశయమును సంపాదించునట్టి యితర ధర్మములతో, కిం - ఏమి ప్రయోజనము? ఏమియు ఫలము లేదని యర్థము. సుకృతిభిః = అనేకజన్మములయందు సంపాదింపఁబడి పుణ్యాతిరేకము కలట్టి, శుశ్రూషుభిః = ఈ భాగవతగ్రంథమును వినుటకు నిచ్ఛగించుచున్న జనులచే, ఈశ్వర = నిఖిలజగంబులకుఁ గారణభూతుఁడైన నారాయణుఁడు, తత్క్షణాత్ = భగవద్ధ్యానముచే జనించిన యానందరూపోత్సవమువలన, సద్యః = తత్కాలమందు, అవరుధ్యతే = నిరోధింపఁబడుచున్నాఁడు.

(అవరుధ్యతే యని చెప్పుటచే భగవంతుఁడితర స్థలములయందు సంచరించుటమాని, కేవలము భక్తులయొక్క హృదయముల యందు నియమముగా నివసించునని ఫలితార్థము). ఈ గ్రంథాభ్యాసమువలన భగవంతుని వశీకరణము చేసికొనుటకుఁ దగిన సామర్థ్య మలవడినట్లు తక్కిన గ్రంథములవలన నల వడదు కావున, నీగ్రంథమన్నింటికిని నుత్కృష్టతమ మని చెప్పవచ్చును

తా. ఈ భాగవతగ్రంథమందు శ్యేనయాగా ద్యాభిచారక ములవ టిది కాని, యీశ్వరారాధనరూపమయిన ధర్మ ముప దేశింపఁబడును మఱియుఁ గర్మకాండమందుఁ జెప్పఁబడిన యగ్నీంద్రాది దేవతలవలె ననిత్యము కానిదియు, నమితఫల దాయియు నగు వస్తు వుపదేశింపఁబడును. ఇతరములయిన ధర్మములతో నేమిప్రయోజనము? ఏమియు లేదు. ఈ భాగ వతగ్రంథము వినువారు తత్కాలమందే నారాయణుని దమ హృదయములయందు నిలుపుకొనఁ గలరు.

శ్లో॥ నిగమకల్పతరోర్గళితం ఫలం
శుకముఖా దమృతద్రవసంయుతమ్ ।
పిబత భాగవతం రస మాలయమ్
ముహు రహో రసికా భువి భావుకాః॥

ఇట్లు గ్రంథకర్త భాగవతము కర్మకాండముకంటె నుత్కృష్టమయినదని చెప్పి, యిప్పుడు బ్రహ్మకాండముకంటె నుత్కృష్టమయినదని చెప్పుచున్నాఁడు. "నిగమేతి" హే భావు కాః = ఓ కుశలులారా! భువి = భూమియందున్న, రసికాః = పూర్వపుణ్యావశమువలన జన్మించిన రసజ్ఞులారా! నిగమ

రూపమయిన రసమును, పిబత = (రసరూపముగా నున్నది కనుకఁ) ద్రావుఁడు, మఱియు నా రసపానము నెడ తెగకుండఁ జేయవచ్చునని చెప్పుచున్నాఁడు "ఆలయమితి" ఆలయం = లయమువఱకును, అనఁగా యావజ్జీవము, ముహుః = మాటి మాటికి, పిబత = త్రావుఁడీ! భాగవతగ్రంథము నిగమకల్ప వృక్ష ఫలమువంటిదని చెప్పుటచే జ్ఞానకాండముకంటె నుత్కృష్టమయినదని చెప్పఁబడుచున్నది.

తా॥ ఓ సజ్జనులారా! ఓ రసవిశేషజ్ఞులారా! వేదముల నెడి కల్పవృక్షమునుండి బాగుగఁ బండి శుకముఖసంపర్కముచే రసాతిశయముగలిగి క్రిందికి జాఱినదియు రసరూపమయి నదియునగు నీభాగవతఫలమును మోక్షమందు సంగాత మనుభవించి సుఖ మనుభవించుఁడు

శ్లో॥ జన్మాద్యస్యయతోఽన్వయాది తరతశ్చార్థేష్వభిజ్ఞస్స్వరాట్
తేనే బ్రహ్మహృదాయఆదికవయే ముహ్యంతియత్సూరయః।
తేజోవారిమృదాంయథావినిమయో యత్రత్రిసర్గోమృషా
ధామ్నాస్వేనసదానిరస్తకుహకం సత్యం పరం ధీమహిః॥

ఆ మూఁడు శ్లోకములకు ద్వైతమతానుసారముగా వ్యాఖ్యానమెట్లనఁగా — కలిమలమును హరించుకొఱకు బ్రహ్మాది సురలచేఁ బ్రార్థింపఁబడినవాఁడయి దుర్మార్గులయిన రాక్షసుల వలనఁ గలిగెడిభారముచేత మిక్కిలి ఖేదమును బొందుచున్న భూతలమునందు మహాతపశ్శాలినియగు సత్యవతీదేవియందుఁ బరాశరమునివలన నారాయణుండు వ్యాసుండయి యవతరించి, యల్పమతులయం దాదరము గలవాఁడగుటచే వేదమును శాఖోపశాఖలుగా విభజించి యాయా వేదములయొక్క యర్థ

మును నిర్ణయింపఁ దలంపుగొని బ్రహ్మసూత్రముల రచించి, బ్రహ్మసూత్రములం దధికారము లేని స్త్రీశూద్రాదులు మోక్షమందుటకుఁ బురాణములను రచించి వేదాంతార్థములను వెల్లడిచేసెడిదియు పండ్రెండుస్కంధములతోఁ గూడి కొన్నదియు, పదునెనిమిదివేల శ్లోకములు గలదియు నగు భాగవతపురాణమును రచింపఁబూనికొని, దాని కంతరాయములు కలుగకుండుటకును, శిష్యశిక్షకొఱకును, మంగళాచరణము మొదలగు ననేక ప్రయోజనములు గలుగుటకొఱకును, సమస్తదేవతారూప మయిన నారాయణనామమును స్మరించుచున్నాఁడు "జన్మాద్యస్యయతఇతి" పరం = సర్వోత్కృష్టుఁడయిన నారాయణుని, ధీమహి = ధ్యానముచేయుచున్నాము. ఓయీ! నారాయణుఁడు పరుఁడని చెప్పుటకుఁ బ్రమాణమున్నదా? యని సంశయింప నవసరములేదు అందులకు శ్రుతిస్మృతులం బ్రమాణము లున్నవి. శ్రు॥ తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయోన్యస్మాత్ సర్వస్మాత్ యదంతరం యదయమాత్మా॥ అనఁగా, ఏకారణమువలన నీపరమాత్మ యేజీవుని కవకాశమయి యొప్పుచున్నాఁడో ఆ కారణమువలన నాయీయాత్మ పుత్రునికంటెఁ బ్రియమయినది, తక్కినవస్తువు లన్నింటికంటెను బ్రియమయినదని యర్థము. మఱియు, శ్లో॥ తదేతత్పరమంబ్రహ్మ వేదవాదేషుపర్యతే। సదేవఃపుండరీకాక్షస్స్వయంనారాయణః పరః ॥ అని చెప్పుటచేతను, పైని చెప్పిన శ్రుతిచేతను, నారాయణుఁ డందఱికంటెఁ బరుఁడని నిర్ణయింపవచ్చును ఓయీ! ప్రత్యక్షముగాఁ గంటికిఁ గనఁబడని భగవంతుఁ డున్నట్లు తెలిసికొనుట యెట్లన్న శంక వారించుట

కయి లక్షణము చెప్పుచున్నాఁడు. అస్య = ఈ ప్రత్యక్షమయిన ప్రపంచముయొక్క, జన్మాది=సృష్టి, స్థితి, లయము, నియమము, జ్ఞానము, అజ్ఞానము, బంధము, మోక్షము, ఈ చెప్పిన వన్నియు, యతః = ఏనారాయణునివలన, భవంతి = అవుచున్నవో, అట్టి నారాయణుఁడని యన్వయము. (అనఁగా, నొక చోట గోవులు, గేదెలు, మేఁకలు మొదలయినవి మేయుచున్నప్పుడు, గోవులనఁగా నెఱుఁగనివానితో నా మేయుచున్న వానిలో గంగడోలు గలవన్నియు గోవులు, వానిఁ దోలుకొనిరమ్మని చెప్పఁగా, వాఁ డచ్చటకిఁ బోయి యా లక్షణమును బరిశీలించి తక్కిన మహిషాదుల నన్నిటిని విడిచి గోవులను దోలికొని వచ్చును. అట్లే, భగవంతుఁడు ప్రపంచముయొక్క సృష్ట్యాదులకుఁ గారణుఁడని చెప్పునప్పుడు. అట్టి లక్షణము పరబ్రహ్మమందుమాత్రమే యున్నది. కనుక, సులభముగాఁ దెలిసికొనవచ్చును) పరుఁడయిన నారాయణునకు జగత్కారణత్వ మెట్లు సిద్ధించుననినఁ జెప్పుచున్నాఁడు. అన్వయాత్ = అన్వయానుమానమువలనను, ఇతరతః = వ్యతిరేకానుమానము వలననూ (అనఁగా వెనుకఁజెప్పఁబడిన శ్రుతిసిద్ధమయిన యన్వయవ్యతిరేకములవలన నారాయణునకు జగత్కారణత్వము సిద్ధించుచున్న దని తాత్పర్యము.) ఓయీ! రుద్రాదులకుఁ గూడ జగత్కారణత్వ ముండఁగా, నొక్క నారాయణునికే యెట్లు నిర్ణయింపఁగల మని సందేహింప నవసరము లేదు. వేదములయందు రుద్రాదులకుఁ గూడ కారణత్వ మున్నట్లు లచ్చటచ్చటఁ జెప్పఁబడినను బెక్కుస్థలములయందు నారాయణునికే జగత్కారణత్వము నవి స్థిరపఱుచుచున్నవి. ఓయీ!

రుద్రాదులకు జగత్కారణత్వము లేకపోవుంగాక! పరమాణు పుంజమునకు జగత్కారణత్వము చెప్పవచ్చు. ఇట్లుండ, నీవు చెప్పిన దెట్లు సరిపడును? అనినచోఁ జెప్పెద వినుము. పరమాణువులు జడములు గనుక, జడములకు జగత్కారణత్వము తగదు. లోకములో చేతనములు మాత్రమే కార్యమునకుఁ గారణములగుచున్నవి కాని, జడములు కారణములయిన ట్లనుభవము లేదు ఒకవేళ నా పరమాణువులకుఁ జైతన్య మొప్ప జగత్కారణత్వమును స్థిరపఱుపంగూడదా యనినను, వలను పడదు. పరమాణువులకుఁ జైతన్య మొప్పినచోఁ బ్రళయమే లేకపోవలసివచ్చును. కావున, నది యుక్తము కాదు. ఆ పరమాణువులలో చేతనములు, నచేతనములు నున్నవని యంగీకరించి జగత్కారణత్వ మంగీకరించినను వలనుపడదు వాని సమకూర్చుట కేదయిన నొక కారణముండక తీఱదు. ఆ కారణమును మేము పరబ్రహ్మ మందుము. మఱియు, నీ యంశమునుగూర్చి చర్చించి వ్యాసభగవానులవారు బ్రహ్మసూత్రములలో "సముదాయోభయ హేతుకేపి తదప్రాప్తిః" అనఁగాఁ జేతనాచేతన పరమాణుసముదాయమునకు హేతుత్వ మొప్పినను జగత్కారణత్వము సిద్ధింపదని యర్థముగల యీ సూత్రముచేతఁ బరమాణువాదమును దిరస్కరించి యున్నారు ఓయీ! పాలు ఘృతము మొదలయిన వచేతనములయినను, దమంతఁ దామే స్రవించుచున్నట్లు కనఁబడుచున్నవి. అట్టి నిదర్శనముంబట్టి, ప్రకృతికి జగత్కారణత్వ మేల యంగీకరింపఁగూడదన్న సందియము నివారించుచుఁ జెప్పుచున్నాఁడు. యః = ఏ నారాయణుఁడు, అశేషం = ఘటపటాది కార్యములన్నిటి

యందు, అభిజ్ఞః=విశేషాకారమయిన జ్ఞానము కలవాఁడో, అనఁగా సర్వజ్ఞుఁడని తాత్పర్యము. ఈ చెప్పుటంబట్టి, జడమయినమాయకు సర్వజ్ఞత్వ ముండుట యసంభవము కావున, వెనుకటిదోషము వారించుచున్నది. మఱియు, శ్రు॥ యస్సర్వజ్ఞస్సర్వవిత్॥ (అనఁగాఁ బరమాత్మ సర్వజ్ఞుఁడని యర్థము) శ్లో॥ "తాన్యహం వేదసర్వాణి నత్వం వేత్థ పరంతప" అనఁగాఁ గృష్ణభగవానులవా రర్జునునికి గీతాశాస్త్ర ముపదేశించునప్పుడు, ఇట్లు చెప్పియున్నాఁడు. "ఓ యర్జునా! నీకును నాకును లెక్కలేనన్ని జన్మములు గతించినవి. కాని, వానిని నీ వెఱుంగవు. నే నెఱుంగుదును" అనెడి యర్థములు గల శ్రుతిగీతలవలన నారాయణుఁడు సర్వజ్ఞుఁ డయినట్లు తెలియఁబడుచున్నది. ఓయీ! తాదృశసర్వజ్ఞత్వము రుద్రాదులకుఁ గూడ నుండునేమో యన్న సందియము పాపుటకయి చెప్పుచున్నాఁడు. "స్వరా డితి" యః = ఏపరమాత్మ, స్వరాట్=స్వయముగాఁ బ్రకాశించుచున్నాఁడో (అనఁగాఁ దనకుఁ దానే రాజుగాని మఱియొకఁడు లేఁ డని తాత్పర్యము) ఇందులకుఁ బ్రమాణము "శ్రు॥ యంకామయేతంతముగ్రం కృణోమి" (అనఁగా నే నెవ్వరిని గోరుచున్నానో యాతని నీశ్వరునిగాఁ జేయుచున్నానని యర్థము.) ఈ శ్రుతినిబట్టి యాలోచింప, రుద్రాదులకుఁగూడ నారాయణానుగ్రహము వలననే జ్ఞానాదిగుణములు కలుగుచున్నట్లు చెప్పఁబడియున్నది. ఓయీ! వేదము లనంతములు. వానిలోఁ గొన్ని శ్రుతులు హరి సర్వాధిపతియని చెప్పుచున్నంతమాత్రమున, నెట్లు నిర్ణయింపఁగలము? అన్న సందియమును వారించు

చున్నాఁడు. "తేన ఇతి" యః = ఏ నారాయణుఁడు, ఆదికవయే = చతుర్ముఖబ్రహ్మకు, బ్రహ్మ = వేదమును, హృదా = స్నేహముచే, తేనే = వివరించి యుపదేశించినాఁడో (అనఁగా సర్వవేదములను నారాయణుఁడే యుపదేశించినాఁడని యర్థము.) ఓయీ! బ్రహ్మ కుపదేశముచేసె నన్నంతమాత్రమున నారాయణునికి సర్వాధిపత్య మెట్లు సిద్ధించును? అని యడిగిన చెప్పెద వినుము "శ్రు॥ ప్రజాపతేనత్వదేతాన్యన్యోవిశ్వాజాతాని పరితాబభూవ॥" అనఁగా, ఓబ్రహ్మ! నీవలన సమస్తభూతములు పుట్టి చుట్టు నావరించియున్నవి. నీకంటె మఱియొకఁడు లేఁడు. అను నర్థము గల శ్రుతియందు బ్రహ్మ నిరతిశయప్రభావము గలవాఁడని చెప్పఁబడియున్నది. అట్టి బ్రహ్మకు వేదోపదేశము చేసిన నారాయణుఁడు సర్వాధిపతి యని చెప్పుటకు సందియమేమున్నది? ఓయీ! బ్రహ్మ వేదమును పదేశము లేకుండఁగనే గ్రహింపలేఁడా? అన్న సందేహమును దొలఁగించుచున్నాఁడు "ముహ్యంతీతి"-సూరయః = బ్రహ్మాదులుగూడ, యత్ = ఏ వేదమునుగూర్చి, ముహ్యంతి = మోహమును బొందుచున్నారో (అనఁగాఁ గొంద ఱావేదార్థమును తెలిసికొనలేరు, మఱికొందఱు మఱియొకరీతిగాఁ దెలిసికొనుచున్నారు, కాని యథార్థము తెలిసికొనలేరు కావున, వేదోపదేశము లేకుండ బ్రహ్మ గ్రహింపలేఁడని తాత్పర్యము) "ఓయీ! సృష్ట్యాదియందున్న భగవంతుఁడు ప్రయోజన మపేక్షించి ప్రపంచము సృజించినాఁడా? లేక ఫల మపేక్షింపకయే సృజించినాఁడా? ఫలము నపేక్షించియే యని చెప్పినచో, నా సృష్టికిఁ బూర్వమందుఁ దాదృశఫలప్రాప్తి

లేదు కనుక, భగవంతుఁ డపూర్ణుఁ డౌటంబట్టి సృజింపఁదగిన సామర్థ్యము లేనివాఁ డగుచున్నాఁడు. కావున, నట్లు చెప్ప వలనుపడదు ఫల మపేక్షింపకయే సృజించుచున్నాఁడనినచోఁ బ్రయోజనము లేకుండఁ గార్యమందుఁ బ్రవృత్తి గలుగుట యెచ్చటను జూచియుండలేదు.'' అన్న సందేహమును దొలఁగించుచున్నాఁడు. ''తేజోవారితి'' తేజోవారి మృదాం= పృథివ్యప్తేజస్సులయొక్క, వినిమయః=వ్యత్యాసము, యథా= ఏ ప్రకారమో, తథా = ఆప్రకారముగా, యత్ర = ఏ నారాయణుని విషయమయి, త్రిసర్గః = మాయాగుణముల యొక్క సృష్టి, మృషా = అసత్యమగుచున్నదో (అనఁగాఁ బూర్వమం దప్రాప్తమగు ప్రయోజనము కలిగించునది కాదని తాత్పర్యము), అట్లయిననిష్ప్రయోజనముగాఁ బ్రవృత్తి యెట్లు సంభవించు నన్న పూర్వపక్షమును నిరసనము చేయు చున్నాఁడు శ్లో॥ దేవస్యైష స్వభావోయ మాప్తకామస్య కాస్పృహా - అనఁగా, భగవంతుని కీప్రపంచసృష్టి చేయుట స్వభావము. అంతియె కాని, సర్వకామ పరిపూర్ణుఁ డయిన యతనికి వేఱుకోరిక యిఁక నేది కలదు? బ్రసూ లోకవత్తు లీలాకైవల్యం = భగవంతుని కీ లోకము లీలాకైవల్యమని తాత్పర్యము. ఇట్టి శ్రుతిసూత్రబలముచే సమస్త ప్రయోజనములఁ బొందిన నారాయణునకు లీలచేతనే ప్రవృత్తి కలుగుచున్నదని చెప్పవచ్చును మఱియొకవిధముగా నర్థము చెప్పవచ్చును. మూలములో అమృషా యని పదముల విభజింపవలెను యథా=ఏప్రకారముగా, తేజోవారిమృదాం= పృథివ్యప్తేజస్సులయొక్క, వినిమయః = కార్యము, అగునో

(అనఁగా సదసద్విలక్షణము కాదో), తథా = ఆ ప్రకార ముగా, యత్ర = ఏ యీశ్వరునియందు* త్రిసర్గ = జీవేశ్వర జడములయొక్క సృష్టి, అమృషా = మిథ్యాభూతము కాదో అని యన్వయము (అనఁగాఁ దేజోవారిమృత్తులయొక్క కార్య మెట్లు సదసద్విలక్షణము కాదో, అట్లే యీశ్వరు నాధా రముగాఁ జేసికొనిన త్రిసర్గ మీశ్వరునియందు మిథ్య కాదని తాత్పర్యము) ఓయీ! తేజోవారిమృత్తులయొక్క కార్యము లయిన విస్ఫులింగ ఫేనాదులు మిథ్యయయినట్లు భగవంతుని యందుఁ ద్రిసర్గము మిథ్యాభూత మగుచున్నదని యర్థము వచ్చు చున్నదే యన్నశంకను వారించుచున్నాఁడు "ధామ్నేతి" యః = ఏవాఁడు, స్వేన ధామ్నా = స్వస్వరూపజ్ఞానముచేత, సదా = ఎల్లప్పుడు, నిరస్తకుహకం — నిరస్త = తిరస్కరింపఁ బడిన, కుహకం = ఇంద్రజాలాదిమాయ కలవాఁడును

---

* జీవేశ్వర సృష్టుల వివరణము ఎట్లన — ఒక్కటైన తేజస్సు పార్థివాది పదార్థములయందుఁ బెక్కురీతులుగా లోపల ప్రవేశించియుండి, మథించినప్పుడా తేజస్సు పయికివచ్చుచున్నది అట్లే యీశ్వరుఁడు జగము సృజించి నానారూపములఁ బొంది జగదంతర్యామియై ప్రవేశించి భక్తాను కంపచే వాసుదేవాద్యవతారములఁ దాల్చి వెలుపలనుగూడఁ బ్రకాశించు చున్నాఁడు ఇదియె యీశ్వరసృష్టి సూర్యుఁడు ప్రకాశించునప్పుడు సమస్తమయిన జలోపాధులయందు సూర్యుని ప్రతిబింబములు గలుగునట్లు సూత్మ్యరూపోపాధులయందుఁ బ్రతిబింబభూతములయిన జీవులు పర బ్రహ్మమువలనఁ గలుగుచున్నవి ఇదియే జీవసృష్టి కుమ్మరవాఁడు మన్ను గ్రహించి ఘటాదులను సృజించునట్లు ఈశ్వరుఁడు జడప్రకృతిని దీసికొని యహంకారాది జడములను సృజించుచున్నాఁడు ఇదియె జడసృష్టి

(అనఁగా, నారాయణుఁ డింద్రజాలకృతమయిన మాయామయ మయిన సృష్టిని జేయఁడు). పరికింప సత్యమయిన సృష్టినే చేయుచున్నాఁడు. మఱియు, సృష్టి చేయుటకు నసమర్థుఁ డయిన వాఁడు మాయామయమయిన ఇంద్రజాలాదికమును సృజించు చున్నాఁడు కాని, నిత్యశక్తిపరిపూర్ణుఁడును, సమర్థుఁడు నయిన నారాయణుండు చేతఁగానివానివలె నింద్రజాలాదికమువంటి మాయామయమయిన సృష్టి నేల చేయును? అనఁగాఁ జేయఁడు అని తాత్పర్యము. తం = అటువంటివాఁడును, సత్యం = నిరతిశయానందానుభవరూపుఁ డయిన, పరం = పరమాత్మస్వరూపుఁ డయిన నారాయణుని, ధ్యానము చేయుచున్నామని యన్వయము. భగవంతుఁడు జగముయొక్క సృష్ట్యాదులకుఁ గారణభూతుఁ డగుటచేతను, సర్వజ్ఞుఁ డగుటచేతను, సర్వాధిపతి యగుటచేతను, చతుర్ముఖునకు జ్ఞానోపదేశము చేయఁ దగినంతశక్తి గలవాఁ డగుటచేతను, తనదయను సంపాదింప లేనివారికిఁ దెలియ శక్యము గానివాఁ డగుటచేతను, తాను ప్రయోజనము నుద్దేశింపకయే లీలకయి లోకముల సృజింపఁ బ్రవృత్తి గలవాఁ డగుటచేతను, నిత్యమహిమకలవాఁ డగుటచేతను, నిర్దుఃఖమయిన నిరతిశయానందానుభవమే స్వరూపముగాఁ గలవాఁ డగుటచేతను, సర్వగుణపరిపూర్ణుఁ డగుటచేతను, ఎల్లవారు నావిష్ణువునే ధ్యానింపవలయునని తాత్పర్యము. మఱియు, గాయత్రీ మంత్రార్థము లేనిచో, నీ గ్రంథమునకు భాగవతత్వసిద్ధి లేదని యెంచి గ్రంథకర్త ఛాందసమయినను "ధీమహి" యని గాయత్రీ మంత్రమం దున్న క్రియను బ్రయోగించియున్నాఁడు. అందు

వలన గ్రంథమునకు భాగవతత్వసిద్ధి యగును ఇందులకు నిదర్శనములు ఇదివఱకే వ్రాయఁబడియుండుటచేఁ దిరిగి వ్రాయలేదు

తా॥ ఎవనివలనఁ బ్రపంచముయొక్క సృష్టిస్థితిలయజ్ఞానాజ్ఞానాదు లగుచున్నవో, ఎవఁడు విశేషజ్ఞానముకలవాఁడో, ఎవఁడు స్వప్రకాశకుఁడో, ఎవఁడు వ్యామోహకరములయిన వేదములను బ్రహ్మకుపదేశించెనో, ఎవనియందు జీవేశ్వర జడ సృష్టి మిథ్యకాదో, ఎవఁడు తనతేజస్సుచే నింద్రజాలాది మాయను దళిమివేయునో, అట్టి నారాయణుని ధ్యానింతుము.

శ్లో॥ ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతామ్
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వా పరైరీశ్వరః
సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభిశ్శుశ్రూషుభిస్తత్క్షణాత్॥

వ్యాసభగవానులవారిట్లు మొదటిశ్లోకముచే నారాయణ స్మరణానురూపమయిన మంగళ మాచరించి రెండవశ్లోకముచే గ్రంథమందలి విషయమును, తత్సాధనములను, ఈ గ్రంథము నభ్యసింపఁదగినయధికారులను, ప్రయోజనమును జెప్పుచున్నాఁడు "ధర్మఇతి" అత్ర = ఈ, శ్రీమద్భాగవతే = రమణీయార్థములు గల భాగవతమునందు (అనఁగా, భాగవతము రమణీయమయిన యర్థములు గలదగుటచేఁ దక్కిన వానికంటె మిగుల నుత్కృష్టమయినదని తాత్పర్యము,) భాగవత ముత్కృష్టమయిన దనుటకుఁ బ్రమాణము "శ్లో॥ రాజంతే తావదన్యాని పురాణాని సతాంగణే । యావన్నదృశ్యతే సాక్షాచ్ఛ్రీమద్భాగవతం పరమ్" అనఁగా, నుత్కృష్టమయిన

భాగవతము ప్రత్యక్షముగాఁ జూడఁబడనంతకాలము మాత్ర మే తక్కినపురాణమును సత్పురుషులు చేకొందురుకాని,యీ భాగవతగ్రంథము లభించినచోఁ దక్కిన పురాణాదుల విడిచి పెట్టుదురని తాత్పర్యము. ఈ చెప్పుటచే భాగవత మన్నిటి కంటె నుత్తమమయినదని తెలియవచ్చుచున్నది. అట్టి యీ భాగవతమునందు, ప్రోజ్ఝితకైతవః-ప్రోజ్ఝిత=విడువంబడిన, కైతవః= కాపట్యముగలయట్టియు (అనఁగా, ఫలాపేక్ష లేకుండ నాచరింపఁబడుచున్న ధర్మమని చెప్పుటచే నిష్కపటమయిన దని తాత్పర్యము), పరమః=భగవంతున కర్పింపఁబడిన దగుటచే నుత్తమమయిన, ధర్మః=ధర్మము, నిరూప్యతే=చెప్పఁబడును అనఁగాఁ దక్కిన గ్రంథములయందుఁ జెప్పఁబడిన ధర్మమువలె కాక, యిందు చెప్పఁబడెడు ధర్మము మిగుల గొప్పదని తాత్పర్యము. ఇందలి ధర్మము మిగుల గొప్పదని చెప్పుటకుఁ బ్రమాణ మేమనిన చెప్పెదను వినుము. శ్రీకృష్ణ భగవానులవారు పాండవేయునితో నిట్లనిరి. శ్లో॥యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్। యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం॥ (అనఁగా, నీవు దేనిని జేయుచున్నావో, నీవు దేనిని దినుచున్నావో, దేనిని హోమము చేయుచున్నావో, దేని నిచ్చుచున్నావో, నీవు చేసిన తపస్సేదికలదో యాసర్వము నాయధీనము చేయుము అని తాత్పర్యము ) అని చెప్పినట్టు లిందు భగవదర్పణబుద్ధిచేతనే ధర్మాదులఁ జేయవలసినదని చెప్పుటచే, నాధర్మము పరమమయిన దని చెప్పవచ్చును. మఱియు ధర్మరాజు భీష్మునిఁజూచి, తాతా! సర్వధర్మములలోను గొప్పధర్మమేది? అని యడిగిన

నతఁడు చెప్పినాఁడు శ్లో॥ ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధిక తమోమతః ।యద్భక్త్యాపుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా॥ అనఁగా, ఓయీ ధర్మరాజా! భక్తిచేతఁ బుండరీకాక్షుని స్తోత్రముచేసి యతని పూజించుట యేదికలదో, యదియే సర్వధర్మములలో వరిష్ఠమయినదని తాత్పర్యము మఱియు, శ్లో॥ ఏతావానేవ లోకేస్మిన్ పుంసాం ధర్మః పరస్మృత ।భక్తి యోగో భగవతి తన్నామగ్రహణాదిభి ॥ అనఁగా, ఈ లోక మందున్న యందఱికి భగవంతుని నామముల నుచ్చరించుచు నతనియందుఁ జూపుచున్న భక్తియోగ మేదికలదో, అదియే పరమధర్మమని చెప్పఁబడినది ఈ చెప్పినప్రకారము భాగ వతములో భక్తిరూప (భగవదారాధనరూప)ధర్మము చెప్పఁ బడుటచే, నిందలిధర్మము శ్రేష్ఠమయినదనియు, నట్టి ధర్మ ముపదేశించుటచే గ్రంథముకూడఁ దక్కినవానికంటె శ్రేష్ఠ మయినదనియుఁ దెలియవచ్చుచున్నది ఈ భాగవతము నభ్యసింపఁ దగినవారిని జెప్పుచున్నాఁడు. "నిర్మత్సరాణా మితి" నిర్మత్సరాణాం = మచ్చరములేని, సతాం=సత్పురు షులకు, వేద్యం = తెలియఁదగినదియు (సజ్జనులలోఁగూడ నచ్చటచ్చట మచ్చరము గలవా రుండుటచే నట్టివారికిఁగాక, కేవలము సత్పురుషులకే యిది యభ్యసింపఁదగినదని తాత్ప ర్యము), వాస్తవం=నిత్యము పవిత్రమగు గుణములచే నిండి యున్నట్టియు, శివదం = పరమానందము నిచ్చునట్టిదియు, తాపత్రయోన్మూలనం = ఆధ్యాత్మికాది తాపత్రయములను వారించునట్టిదియు, వస్తు = కాలత్రయమందు నబాధ్య మయిన - అనఁగాఁ బరమాత్మరూపమయిన వస్తువు ప్రతి

పాద్యతే = చెప్పఁబడుచున్నది. మఱియు "మహామునికృతే = నారాయణాంశ సంభూతుఁడయిన వ్యాసునిచే రచింపఁబడిన, భాగవతే = భాగవతమందు" అని చెప్పుటచే గ్రంథము మిగులఁ బ్రమాణమయిన దని తెలియుచున్నది. వ్యాసుఁడు నారాయణుఁ డయినట్లు ప్రమాణ మేమనఁగా శ్లో॥ కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్॥ అని చెప్పుటచే వ్యాసుఁడు నారాయణావతారమనియుఁ, దద్విరచిత మాటచేఁ దప్పక ప్రమాణముగా స్వీకరింపవలయు ననియుఁ దెలియవచ్చుచున్నది. పరైః = ఇతరమయిన ధర్మాదికథనములతో, కిం = ఏమి ప్రయోజనము? అనఁగా, నేమియు ప్రయోజనము లేదని యర్థము. (అనఁగా, భక్తిరూపధర్మము హరివిషయకమయిన యపరోక్షజ్ఞానము గలిగించి తత్ప్రసాదాంతరంగసాధనమై ముక్తిలక్షణరూపమయిన నిత్యసుఖము కలిగించుచుండఁగా, నట్టి భక్తిధర్మము విడిచి భగవంతుని సుఖప్రీతిని మాత్రము కలిగించి నశ్వరములయిన స్వర్గాది ఫలముల సమకూర్చుచుఁ దిరిగి సంసారబంధనములకుఁ గారణములగు ధర్మములతో నేమిప్రయోజనమని తాత్పర్యము ) ఓయీ! దృష్టఫలము కొంత యుండినం గదా, దానిని బురస్కరించుకొని యదృష్టమయిన (కనఁబడని) ఫలమునందుఁ బ్రవర్తించుట సంభవించుచున్నది? అట్టి దృష్టఫల మిచ్చుట నేది కలదు? అనెడి సందియమును వారించుచున్నాఁడు. అత్ర = ఈ భాగవతము, అభ్యస్యమానే = అభ్యసింపఁబడినచో, కృతిభిః = శిక్షితబుద్ధులైనట్టియు, శుశ్రూషుభిః = మనోవాక్కాయ కర్మములచేఁ బరమపురుషులకుఁ బరిచర్యలు

చేయుటయందు నేర్పుగల జనులచే, ఈశ్వరః = పరమాత్మ, హృది=హృదయకమలమందు,సద్యః = శీఘ్రముగా, తత్క్షణాత్ = కాలవ్యవధానము లేకుండఁగనే, అవరుధ్యతే=నిలుపుకొనఁ బడుచున్నాఁడు (అనఁగా, సాధనసామగ్రిగలవానిచే భాగవత గ్రంథమును విన్న క్షణమందే భగవంతుఁడు చూడఁబడు చున్నాఁడని తాత్పర్యము.)ఇందు ధర్మమని చెప్పుటచేఁ గర్మ కాండార్థము, దేవజ్ఞులు మాత్సర్యరహితులై సత్వగుణులై యుత్తమాధికారులై యుందురుకాన, నిర్మత్సరాణా మను టచే దేవకాండార్థము వేద్యమనుటచే బ్రహ్మకాండార్థము తెలుపఁబడుటచేతను, సర్వజ్ఞతముఁడు నాప్తతముఁడునగు వ్యాసునిచే రచితమగుటచేతను, నీభాగవతము ముముక్షువు లందఱును దప్పక యభ్యసింపవలయునని సిద్ధమయినది.

తా. ఈ భాగవతగ్రంథమందు భక్తిరూపమయిన ధర్మము మాత్రమే తెలుపఁబడును. నిర్మత్సరు లయిన సజ్జనులకుఁ దెలియఁదగినదియు, నాధ్యాత్మికాది తాపత్రయమును దొల గించునదియు బరమానందసుఖము నిచ్చునట్టి పరబ్రహ్మ రూపమయిన వస్తువు తెలుపఁబడును. ఈ గ్రంథమువలననే సమస్తము లభించుచుండఁగాఁ దక్కినవానిచే నేమియుఁ బ్రయోజనములేదు మఱియు, నీగ్రంథము నభ్యసించుకాల మందే భగవంతునిఁ దమ హృదయములయందు బంధించు కొనఁగలరు ౨

శ్లో॥ నిగమకల్పతరో ర్గళితం ఫలమ్
శుకముఖా దమృతద్రవసంయుతమ్ ।

పిబత భాగవతం రసమాలయమ్
ముహు రహో రసికా భువి భావుకాః ॥ 3

ఇట్లు గ్రంథకర్త ప్రయోజనవిషయాదులను రెండవ శ్లోకముచే వెలువరించి భాగవతముయొక్క యుత్కర్షమును జెప్పి దప్పక వినవలయునని విధించినయెడల, నం దందఱికిఁ బ్రవృత్తి కలుగక మానదని నిశ్చయించి చెప్పుచున్నాఁడు "నిగమ ఇతి" భువి = భూలోకమునందు, భావుకాః = పుట్టుటయే స్వభావముగాఁ గల, రసికాః = రసజ్ఞులారా! యూయం = మీరు, నిగమకల్పతరోః = వేదమనెడి కల్పవృక్షమునుండి, గళితం = వ్యాసుఁడను పేరుగల నాచేతఁ బడగొట్టఁబడినదియు, లేక జార్చఁబడినదియు, శుకముఖాత్ = శంకరావతారుఁడని చెప్పఁదగిన శుకుఁడు పరీక్షిన్నరేంద్రునిఁ జెప్పుటచే, అమృత ద్రవసంయుతం – అమృతద్రవ = అతనిముఖామృతరసముచే, సంయుతం = కూడికొనియున్నదియు (మొదట ద్రవరూపముగా నుండి తరువాత శుకాచార్యులవారి ముఖసంపర్కముచే మఱింత ద్రవీకృతమయినదని తాత్పర్యము). శుకులవారు పరీక్షిత్తునకు భాగవత ముపదేశించినా రనుటకుఁ బ్రమాణ మేమయిన నున్నదా? యని సంశయపడ నవసరము లేదు. అందులకుఁ బ్రమాణ మున్నదని పద్మపురాణము చెప్పుచున్నది. శ్లో॥ అంబరీష! శుకప్రోక్తం శ్రుణు భాగవతం సదా। పఠస్వ స్వముఖేనాపి యదీచ్ఛసి భవక్షయం॥ అనఁగా నో యంబరీషమహారాజా! నీవు సంసారక్షయము చేసికోవలెనని యోజించితివేని, శుకులవారు పరీక్షిన్నరేంద్రున కుపదేశించిన

భాగవతమును వినుము లేనిచో, నీయంతట నీవు చదువుము అని చెప్పుటచే శుకుండు పరీక్షిత్తున కుపదేశించినట్లు స్పష్టమగుచున్నది. భాగవతం=భాగవత మను నామముగల, ఫలం=పండొకటి, పక్వం=(అధ్యాహారము) పండియున్నది. రసం = ఆ పరిపక్వమయిన భాగవతఫలముయొక్క మధుర రసమును, ఆలయం = లింగశరీర మోక్ష మగునంతవఱకు, ముహుః = మాటిమాటికి, పిబత=కర్ణపుటము లనెడి దోసిళ్లచేఁ బానముచేయుఁడు. అహో = ఏమియాశ్చర్యము! అహో యని చెప్పుటచే, నా రసమంత మధురమయిన పదార్థము మఱియొకటి లేదు కావున, నాదరముతోఁ బానము చేయుఁడనియు, పానప్రారంభసమయమందే యీరసమత్యంత మధురమయినదనియుఁ దెలియవచ్చుచున్నది. ఇట్లుకాక, మఱియొకరీతిగా నర్థము చెప్పవచ్చును. నిగమకల్పతరోః - అను పదమును "శుకముఖాత్" అను పదమునకు విశేషణముగాఁ జేయవలెను. నిగమకల్పతరోః - నిగమ = వేద మనెడి, కల్ప=కల్పవృక్షమును, తరుః = ప్రకాశింపఁజేసెడి, శుకముఖాత్ =శుకమహాముని యాననమువలన, గళితం= పరీక్షన్నరేంద్రునకుఁ జెప్పఁబడినదియు, అమృతద్రవ సంయుతం–అమృత = మోక్షముయొక్క, ద్రవ = గతిచేతను, సంయుతం = కూడియున్నదియు (అనఁగా మోక్షము కలిగించెడిదని తాత్పర్యము), రసం = రసమునకు నిలయభూతమయినదియు, భాగవతం = భాగవత మనుపేరుగల, ఫలం= పండును, ఆలయం = బ్రదికియున్నంతకాలము, భావుకాః = ఓ మహానుభావులారా! భువి = భూమియందున్న, రసికాః =

రసజ్ఞులారా! పిబత = ఈ భాగవతఫలమును భక్షింపుఁడు. ఇచట "పిబత" అను క్రియాపదమునకుఁ బానార్థమే ప్రసిద్ధమయినను, ధాతువుల కనేకార్థములు చెప్పవచ్చును కనుక, భక్షణార్థమందుఁ బ్రయోగింపఁబడినది. ఈ చెప్పిన యర్థమాచార్యులవారిచేఁ జెప్పఁబడలేదు. కాన, నుపేక్షింపఁదగినదని చెప్పఁగూడదు. బ్రహ్మాదులబుద్ధికి గోచరమైన పరిమితిలేని భాగవతధర్మములను లోకమునకు వెల్లడిచేయుచున్నట్టి ప్రతిభాశాలులయిన యాచార్యుల బుద్ధియనెడి సముద్రమందుత్పన్నమయిన తరంగవిశేషమని నిశ్చయించి యుపేక్షింపక తప్పక యీ యర్థము స్వీకరింపుఁడు. ఇట్లు గ్రంథకర్త మంగళాచరణాదులఁ గావించి గ్రంథారంభంబును జేయుచున్నాఁడు.

---



శ్రీ రస్తు

శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భాగవతము

## వచనము

## ప్రథమస్కంధము

శ్లో॥ జన్మాద్యస్యయతోన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞస్స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే ముహ్యన్తియత్సూరయః।
తేజోవారిమృదాంయథా వినిమయో యత్రత్రిసర్గోమృషా
ధామ్నాస్వేన సదానిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥

శ్లో॥ ధర్మః ప్రోజ్ఝితకైతవోత్రపరమో నిర్మత్సరాణాంసతామ్
వేద్యం వాస్తవమత్రవస్తుశివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కింవాపరైరీశ్వరః ।
సద్యోహృద్యవరుధ్యతేత్రకృతిభిశ్శుశ్రూషుభిస్తత్‌క్షణాత్ ॥

శ్లో॥ నిగమకల్పతరోర్గలితం ఫలం
శుకముఖా దమృతద్రవసంయుతమ్
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికా భువి భావుకాః ॥

కారణమగు బ్రహ్మమునుండి జగత్తు మొదలయిన కార్యములు కలుగును బ్రహ్మము లేనిది మఱొక్కటియుఁ గలుగదు. ఇట్లన్వయమునను వ్యతిరేకమునను పరబ్రహ్మమగు నారాయ

ణునివలననే యీ జగత్తునకు సృష్టిస్థితిలయములు గలుగు చున్నవి. ఇట్లతఁడు జగత్తునకుఁ గారణమయ్యు, నచేతన మగు మన్ను కుండకుఁ గారణ మగునట్లు, కేవల ముపాదానకారణముగాఁడు. అతఁడు సర్వపదార్థములకు ద్రష్టయైన చేతనుఁడు గావున జగమునకు నిమిత్తకారణము నగును. అతఁడు స్వయం ప్రకాశుఁడు. ఆ పరమాత్మ సృష్టి కుపయుక్తమగునట్లు తేజస్సు జలము పృథివి యనుమూఁటి నొండొంటితోఁ గలిపెడి త్రివృత్కరణ మను పద్ధతిని మొట్టమొదటఁ గావించి, చతుర్ముఖునిచే నట్టి యీమూఁటిని గలిపి సృష్టిచేయించువాఁడై యీ పద్ధతి నతనికిఁ దెలుపుకొఱకు దానిని బ్రతిపాదించునవై యకుంఠితజ్ఞాను లగుయోగులకును దెలియ రాకుండునట్టి వేదముల నతనికి మంచిహృదయముతో నుపదేశించెను. పృథివి యప్పు తేజస్సు ననెడి మూఁటిని ద్రివృత్కరణపూర్వకముగాఁ బరమాత్మ సృజియించి యందుఁ దాను బ్రవేశించినవాఁడైనను, వానిదోషము లతనియందుఁ బొల్లగునుగాని పొందవు. ఏలన, అతఁడు తన తేజమున సమస్తదోషముల నిరసించినవాఁడు నిత్యుఁడు. సర్వోత్కృష్టుఁడు. ఇట్టి పరబ్రహ్మ మగు నారాయణుని ధ్యానించెదము. శ్రీవ్యాసమహాముని ప్రణీతమయిన యీ శ్రీమద్భాగవతమునందు భక్తియనెడు ధర్మము మాత్సర్యదూరు లగు బ్రహ్మనిష్ఠులకు నిరూపింపఁబడుచున్నది. ఆ భక్తియో, యొక వ్యాజమునుబట్టి కలుగునది గాదు. కనుక నిష్కపటమైనది. మఱి, పరిమిత ఫలము లగు స్వర్గాదులకు సాధనముగాక, యక్షయమగు మోక్షమునకు సాధన మగుటచే సర్వోత్కృష్టమైనది. ఇట్టి

మహాధర్మమును నిరూపించునది గావున, నీ గ్రంథ మాభిచారికాది వ్యాజములును, గేవల స్వర్గసాధనము లగు జ్యోతిష్టోమాదులను బ్రతిపాదించు వేద కర్మకాండమున కంటె శ్రేష్ఠమైనది మఱి, యిందుఁ దెలియందగిన పరబ్రహ్మ వస్తువు నిత్యమైనది. కాన, నా కర్మకాండమునందలి యగ్నీంద్రాది దేవతలవలె ననిత్యముగాదు మఱి, యా యగ్ని మొదలైన దేవతలయం దంతర్యామియై స్వర్గాది త్రివర్గ ఫలములను గూడఁ దానే యిచ్చునది గావున శ్రేయస్కరమైనది ఈ యనిత్యఫలములే కావు, ఆధ్యాత్మిక మాధిభౌతిక మాధిదైవిక మనెడి తాపత్రయమును దొలఁగించి, తన్మూలమున మోక్షఫలము నొసఁగునది గ్రంథమున కతిశయముఁ దెచ్చు ధర్మములు మఱి పెక్కులుగలవు. కాని, వానివలనఁ బ్రయోజన మేమి? ఈ గ్రంథమునందో, దీనిని వినఁగోరు సుకృతాత్ములు భగవంతుని స్మరింపఁగాఁ గలిగెడి యానందోత్సవమువలన విన నిచ్ఛగించినంత మాత్రనే, తోడనే వారి హృదయములందు సర్వేశ్వరుఁడు చిక్కువడుచున్నాఁడే! భక్తి పుట్టించి భగవంతుని వశీకరించుకొనునట్టి యతిశయ మిందే గలదు గావున, నిదియ సర్వోత్కృష్టమైనది. మఱియు, ఓరసజ్ఞులారా! సుజనులారా! వేదమనెడి కల్పవృక్షమునుండి పండి తనంతఁ బడిన ఫలమై, శుకుఁ డను చిలుకముఖమునుండి యమృతసమానముగాఁ దొరఁగిన భక్తిద్రవముతోఁగూడి, సుఖముగాఁ ద్రావఁదగినరసమై యొప్పు భాగవతమనెడి యత్యంత మధురరసమును యావజ్జీవము ద్రావుఁడీ! పూర్వము నైమిశారణ్యమున శౌనకాది మహామునులు పరమానంద

మును గలిగించు పరమపదము నొందుటకుఁ గోర్కె కలవా
రయి వేయేండ్లు చేయవలసిన దగు సత్రయాగమును జేయు
చుండిరి. అంతట, నొకనాఁడు శౌనకాదిమహాము నులందఱుం
వేకువనే లేచి, తానములాడి, సూర్యోపస్థానము సలిపి అర్ఘ్యము నొసంగి
యగ్నిహోత్రముల వేల్చి, తమచే సత్కృతుండై యాసీనుఁ
డైయున్న సూతునిజూచి యాదరంబుతో నిట్లనిరి. పాప
రహితుఁడవగు నో సూత! నీవు పురాణేతిహాసములను, ధర్మ
శాస్త్రాదులను లెస్సగా నేర్చి, వానిని బరులకు బోధపఱుచు
చున్నావు గదా! మఱియు, వేదవిదులలో నుత్తముఁడును
భగవంతుఁడు నగు వ్యాసమహర్షి చేసినట్టియుఁ, బరమాత్మ
తత్త్వమును, బ్రకృతిపురుషుల తత్త్వమును దెలిసిన మఱి
కొందఱు మునులు రచించినట్టియుఁ బురాణము లేమి, శాస్త్రము
లేమి, నీకుఁ దెలిసినట్లు మఱియొకరికిఁ దెలియవుగదా? ఇది
యునుం గాక, గురువులు ప్రేమాస్పదులయిన శిష్యులకు రహ
స్యములను దాపక చెప్పుదురు కావున, నాయా పురాణాదుల
రచించిన మహాత్ములవలననే యొక్కొక్కచోట నిముడ్పఁబడి
యున్న రహస్యార్థములఁగూడ బాగుగ నేర్చియున్నావు కదా!
కావున, నా యా గ్రంథాదులందుఁ జదివియుండుటవలనఁగాని,
లేక నీ బుద్ధివలన నూహింపఁబడినది కాని పురుషులకు నియ
మముగా శ్రేయస్సుగలిగించు నుపాయం బేదేని యున్న యెడల,
మాకుఁ దెలియఁ జేయుము. ఓ సజ్జనోత్తమా! ఇక్కలి
యుగమం దిఁక మీఁదఁ బుట్టెడు జనులందఱు తఱచుగ నల్పా
యువు గలవారును, కావుననే, కృతయుగాదులందువలె యథేష్ట
ముగా భోగముల ననుభవించి పిమ్మట మోక్షము నకై

ప్రయత్నింపఁదగిన యవకాశము లేనివారునై యుందురు. మిక్కిలి మందబుద్ధులు. కావునఁ దా మారంభించిన శ్రేయస్సాధనంబుల ముగింపనయిన సామర్థ్యము లేనివారై యుందురు. సర్వదా తాపత్రయపీడితులు. కావున, నొకప్పుడు శ్రేయస్సాధనాయత్తులై యున్నను, ననేకవిఘ్నంబులకు లోనయి విడుతురు ఈ హేతువులఁబట్టి యోజింపఁ గలియుగ మానవులు దౌర్భాగ్యవంతులని చెప్పుటకు సందియము లేదు మఱియు, వారు స్వస్వాపేక్షిత ధర్మాముల సాధించు సాధనభేదముల చే వినవలసినవియు, నాయాసబహుళములయినవియుఁ గర్మములం పెక్కులు కలవు. అందువలన, నో సూతా! అనంతములయిన వానియందున్న సారము నంతనుదీసి సంగ్రహించి, సులభముగాఁ బరమపదము నందఁదగిన మంచి యుపాయ మేదైన నను గ్రహించి చెప్పుము. మఱియు, నా యుపాయము విన్నంత మాత్రముననే మనస్సు పాపకార్యములవలననుండి మరలి నిర్మలమై యుండవలయునుసుమీ! ఓ సూత! నీకు మంగళ మగుఁగాక! భగవంతుఁడు భక్తులను రక్షింపుచుండఁ బాటు పడుచుండును. ఆ మహాత్ముఁడు పెక్కుకార్యముల నాచరింపఁ బుడమిలో దేవకీవసుదేవులకుఁ జన్నికుమారుఁడయి యవతరించినాఁడు. ఆ భగవంతుని నామమే సమస్తమగు సంసార దుఃఖములను నశింపఁజేయ సమర్థమగుచున్నది. ఆ మ్మహాత్ముని యవతారము లోకములకు క్షేమమును, బెంపును నొసంగుచున్నది అతనియొక్క పాదపద్మముల నాశ్రయించినమాత్రముననే సకలభయములును నశించుచున్నవి. ఆ భగవంతుని పాదపద్మముల సర్వదా ధ్యానించుచుఁ దపీయ

సంపర్కముచేఁ బవిత్రులైై శమదమాది గుణసంపన్నులైన మునులు తమ్ముఁ దాకినవారిని బవిత్రులుగాఁ జేయుచున్నారు. మఱియు, నా భగవంతుని పాదములయందుఁ బొడమిన గంగా నదీజలము స్నానపానాదులచేఁ దన్ను సేవించువారిని బవిత్రులగాఁ జేయుచున్నది. అతివిపులములైన యా భగవల్లీలలు నారదుఁడు మొదలగు పుణ్యాత్ము లందఱిచే నుతింపఁబడుచున్నవి. అట్టి భగవంతునియొక్క కథలు కలిమలము దొలఁగించుటయందు సమర్థములై యుండఁగా, నట్టివాని శుద్ధి కాముఁడయినవాఁడు వినకమానునా? ఆ మహాత్ముని లీలలయం దట్టి యభిరుచియున్నది కనుక నే,యవి నారదాది మహర్షులచే నెల్లప్పుడు గానముచేయఁబడుచుండును. తన మాయచే యథేచ్ఛగా సృష్ట్యాది చేష్టలు చేయుచున్న భగవంతుని శుభప్రదంబులయిన యవతారకథలను దెలియఁజేయుము మాటిమాటికి విన్న హరియవతారకథలనే యడిగెదవేమని యందువేని, మనవిచేసెద వినుము వినుచున్నవారికిఁ బ్రతిపదమందు మాధుర్యరసమును వెల్లిగొలుపుచున్న భగవచ్చరిత్రముల నెన్నిపర్యాయంబులు విన్నను దృప్తి పొందలేము. పూర్వము కపటమానుషవేషధారియైన కృష్ణుఁడు, బలరామ సమేతుఁడయి యమానుషకృత్యముల నొనరించెఁగదా! మఱియు, మానవు లొనరించిన కర్మములే యాశ్చర్యముఁ గొలుపుచు మాటిమాటికి వినఁదలఁపును బుట్టించుచుండును. అట్లుండ, భగవంతుఁ డొనర్చిన యమానుషకృత్యముల సంగతి వేర చెప్పవలయునా? మనోహరములును, ముక్తిదాయకములు నగు కృష్ణునికథలు వట్టిమాధులకు నిష్టము కాకపోయినఁ

బోవచ్చును గాని, జ్ఞానవంతులకు రుచికరములై యుండవే? ఉండకమానవు కావున, నో మహానుభావా! నీ వా కృష్ణుని యవతారకథలనే తప్పక చెప్పవలసినది. వానినే మేము తప్పక వినవలసినది ఇదియునుంగాక, మేము తపోవిఘ్నకరమైన కలి కాలము వచ్చినసంగతిని దెలిసికొని, యుపాయాంతరముచేఁ గలిని జయింప నిశ్చయించి, తన్నివర్తకమగు హరికథల విన సావకాశులమయి యీ నైమిశారణ్యమున నీ దీర్ఘసత్ర యాగమును విష్ణుప్రీతికొఱకు చేయుచున్నారము. కనుకఁ దక్కిన కాలములయందుఁ గూడ విష్ణు కథాశ్రవణమే మిగుల నుత్తమము. మా పూర్వపుణ్యమువలననే నీవు సమయమునకు విచ్చేసినావు. లేక, పురుషుల తపంబుల హరించునదియు, నుపాయాంతరంబులచే దుస్తరమైనదియు నగు కలిని దాఁటఁ దలంపుగొనియున్న మాయం దనుగ్రహించి, సాగరమును దాఁటు నున్నవారికిఁ దరివాహకుని బంపినట్లు, నిన్నా భగవంతుఁడే పంపినఁ బంపియుండవచ్చును ఓ సూత! కావున, నిక్కలియనెడు సముద్రమును దరింపఁజేయుటకు నీవొక జాలరివయి హరికథను నొక పడవనుగాఁ జేసి మమ్ములఁ దరింపఁజేయుము. భక్తియోగారాధ్యుండయిన శ్రీకృష్ణుండు బ్రహ్మకులసాధువై ధర్మపరిపాలకుఁడై ప్రవర్తించి వైకుంఠ మున కేగెను. మఱియొక ధర్మపాలకుండు లేని యీ లోక మందు ధర్మ మసహాయమై వర్తించుచుఁ గలిని జయింప సమర్థముకాకున్నది భగవచ్చరిత్రములఁ జెప్పుకొనుచుండినచోఁ

గలి తప్పక నశింపఁగలదు. కావున, నట్టి కథలనే తెలియఁ జేయుము.

## ఇది మొదటి యధ్యాయము

### సూతుఁడు భగవంతుని కథలను జెప్పుట

ఇట్లు ప్రార్థించుచున్న శౌనకాదుల వాక్యములు విని సూతుండు మిగుల సంతసించి, వారల వాక్యమందు గౌరవముంచి శౌనకాదులకోర్కె నెఱవేర్పఁ దలంచి తన గురువగు శుకమహామునిని దనలో నిట్లు స్మరించుకొనెను. శుకుండు యోగీశ్వరులలో నుత్తముఁడు. అతఁడు బ్రహ్మోపాసనసిద్ధి గలవాఁడు. కావుననే,యతఁడు కృతకృత్యుఁడై దేహానుబంధంబులఁ ద్రుంచివేసి యున్నవాఁడు. ఇట్టిజ్ఞాని యగుటచే, నతఁడొకనాఁడు పిత్రాదులనువిడిచి సన్న్యాసియై యొంటిగాఁబోవుచుండెను. అది చూచి వ్యాసుండు పుత్త్రవిరహము నోర్వఁజాలక యాతని వెంబడించి పోవుచు "పుత్త్రా! పుత్త్రా!" యని పిలువఁజొచ్చెను. ఆ సమయమున శుకుండు ధర్మభూతంబగు జ్ఞానంబుమూలమున సమస్తవృక్షములందు నధిష్ఠాతయై యుండుటంబట్టి వృక్షములన్నియు "మేమే శుకస్వరూపులము, మేమే శుకస్వరూపులము" అని ప్రతిధ్వను లిచ్చినవి. అందుచే శుకుండు సమస్తభూతంబుల హృదయంబులందును జ్ఞానవ్యాప్తిచేఁ బ్రకాశించెడివాఁడని చెప్పవచ్చును అతఁడు స్వాత్మపరమాత్మలయాథాత్మ్యమునుమననముచేయువాఁడు. నేనట్టి శుకునకు నమస్కరించెద. భాగవతము, వేదపూర్వభాగమందుఁ జెప్పఁబడిన కర్మకలాపమును భగవదారాధనరూప

మునుగాఁ బ్రతిపాదించుటచే సమస్తవేదములసార మని నుడువ
వచ్చు. కావున నీపురాణము పురాణంబులలో నుత్కృష్ట
మైనది ఇది స్వాత్మపరమాత్మల యాథాత్మ్యమును బ్రకా
శింపఁజేయుటలో దీపతుల్యమైనది ఇది సంసారమును దరింపఁ
గోరుచున్న సంసారుల యజ్ఞానమును దొలఁగించుచున్నది. ఇట్టి
యుత్కృష్టమగు భాగవత మా శుకునిచే మున్ముందుగ ననుభ
వింపఁబడినది. శుకుం డట్టివాఁడు కావున నే, పురాణగతములగు
రహస్యార్థముల నెల్ల దయగలవాఁడై ప్రకటించియున్నాఁడు
ఆమ్మహానుభావుఁడు వేదవిభాగముగావించిన ద్వైపాయనునికి
ముద్దుకుమారుఁడు. అతఁడు మునీశ్వరు లందఱికి గురువయిన
వాఁడు నేనట్టి శుకయోగిని శరణుచొచ్చుచున్నాను. *నర
నారాయణులకు మ్రొక్కి వాక్కులకు నిలయభూతయగు నర

---

* నారాయణం నమస్కృత్య, నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

ఈ శ్లోకార్థమును బాగుగ యోజింప నరనారాయణులును, సరస్వతీ
దేవియు, వ్యాసుండును, వీరుమాత్రమే నమస్కరింపఁదగినవారు కారు.
మఱి నారదుండు చతుర్ముఖుఁడు ననిరుద్ధుండుకూడ నమస్కరింపఁదగిన
గురువు లన్న ట్లర్థసిద్ధ మగుచున్నది ఎట్లనఁగా, మూలమున దేవీశబ్దము
ప్రయోగింపఁబడినది దేవస్య = చతుర్ముఖస్య, భార్యా = దేవీ, అని యర్థము
చెప్పి చతుర్ముఖునకుఁ బ్రాణేశ్వరియగు సరస్వతికి నమస్కారమనుటచేత,
జతుర్ముఖుండును నమస్కరింపఁ దగినవాఁడని స్పష్టమగుచున్నది ఆ చతు
ర్ముఖుండు భగవంతుని సాన్నిధ్యవ్యూహమగు ననిరుద్ధుని నాభికమలమందు
జనించి తపంబొనర్చి యతని సంతసింపఁజేసి యతనివలన భాగవతచతుః
శ్లోకి నుపదేశంబు నొందె ఆ చతుర్ముఖునివలన నారదుం డుపదేశంబు

స్వాతికి వ్యాసమహామునికిని నమస్కరించి, పిమ్మట సమస్త దురితములను జయించినది గాన, జయం బనఁదగు నీ పురాణమును వచింపవలసియున్నదని పలికి, యిట్లు గురువందనమును దేవతానుతిని గావించి, భాగవతగ్రంథమును జెప్పఁదొడంగి శౌనకాదుల కిట్లనియె. 'ఓ మునీశ్వరులారా! మీరు లోకముల హితమును గూర్చి యడిగితిరి. కనుక, చేసిన ప్రశ్నము మిగుల నాదరింపఁ దగియున్నది ఆ ప్రశ్నము, ఎవనినామమును స్మరించినంతమాత్రముననే మనస్సు నిర్మల మగుచున్నదో, యట్టి కృష్ణునివిషయ మయి యున్నది కనుక, నిది లోకహితమయినది. మఱియు. ఫలోపాధిరహితమై విఘ్నములు లేనిదై జనుల చిత్తంబును నిర్మలంబుగాఁ జేయునదై జనన జరామరణాది రూపానర్థములు నివర్తించి బ్రహ్మానందానుభవాత్మకమగు

---

గాంచె ఈ చెప్పుటచే నారదానిరుద్ధులుగూడ నమస్కరింపఁదగినవారనుట స్పష్టము. నారదుని యుపదేశంబువలన వ్యాసుం డీపురాణంబును రచించెనుగాన, వ్యాసుండు నమస్కరింపఁదగినవాఁడు భగవదవతారభూతులగుటం జేసి నరనారాయణులును, మునుల కెల్లరకు గురువగుటచే శుకుండును నమస్కార్యులు. ఇచ్చట గురుపరంపర యెట్లనఁగా, శుకుండు తనకు భాగవత ముపదేశించినవాఁడు కాన శుకుండును, అతనికి భాగవత ముపదేశించినవాఁడు కావున వ్యాసుండును, వ్యాసునకు భాగవతచతుఃశ్లోకి నుపదేశించెనుగాన నారదుండును, నారదునకు భాగవతచతుఃశ్లోకి నుపదేశించెనుగాన చతుర్ముఖుండును, చతుర్ముఖునకు మొదట భాగవత ముపదేశించెనుగాన ననిరుద్ధుండును, అనిరుద్ధునకుఁ గారణభూతుఁడగు విష్ణువు నవతారంబులే కాన నరనారాయణులును గురుపరంపరలోఁ జేరినవారు. కావున, నమస్కారయోగ్యులని తెలియవచ్చుచున్నది.

మోక్షఫలమును గలిగించునదై వఱలు హరిభక్తి యెందువలన నుదయించునో, యదియే పురుషులకుఁ బరమధర్మము. వాసుదేవునియందుఁ బ్రయుక్తమైన భక్తియోగము విషయములయందు విరక్తిగలిగించి తనచేతనేగాక, మఱియొక కారణమునఁ గలుగని భగవత్సాక్షాత్కారరూప జ్ఞానమును గలిగించు ఇంతియకాక, వర్ణాశ్రమధర్మము మిక్కిలి చక్కఁగా ననుష్ఠింపఁబడినను, నది భగవంతునికథలయందు రుచిరూపమైనభక్తినే ముఖ్యఫలముగాఁ బుట్టించునది గాక, యితర ఫలాపేక్షతోఁ గూడి యుండునేని, భక్తిరహితమయి యితర ఫలసంగముతోఁ గూడిన యీ ధర్మము, పురుషులకుఁ గేవలము శ్రమమే యగును జుమీ! * మఱియు ధర్మార్థకామము లను పురుషార్థములు కేవలము ముక్తిసాధనములు కాకపోయినను, ముక్తిసాధన మగు భక్తికిఁ గారణములగుచున్నవి. కొందఱు ధర్మమున కర్థమే ఫలమనియు నర్థమునకుఁ గామమే ఫలమనియుఁ, గామమున కింద్రియతృప్తి

* వేదాంతశ్రవణంబువలననే మంచిజ్ఞానము కలుగుచుండ భక్తితో నేమి ప్రయోజనము? అని యనుటకు వీలులేదు విష్ణుకథలు వినినంతనే హృదయము కరఁగును ఆనందబాష్పములు కన్నులనుండి వెలువడును. దేహంబునిండఁ బులకాంకురంబు లుత్పన్నంబులగును కాని, వేదాంతశ్రవణంబువలన నట్టివి కలుగనేరవు జనులకు హరికథలయం దాసక్తియున్నట్లు వేదాంతమం దుండదు కాని, హరికథలు జ్ఞానోదయము కలిగించునట్లు వేదాంతశ్రవణము కలిగింపనేరదు అను తాత్పర్యముగల శ్లో॥ శ్రుతమప్యౌపనిషదం దూరే హరికథామృతాత్। యన్నసన్తి ద్రవచ్చిత్తప్రేమాశ్రుపులకోద్గమాః॥ అను శ్లోకము కొన్ని ప్రతులయందు మాత్రమే కలదు.

యే ఫలమనియు, నింద్రియతృప్తికి జీవనమే ఫలమనియు, జీవనమునకుఁ దిరిగి ధర్మమే ఫలమనియుఁ జెప్పుచున్నారు కాని, యది యాలోచింపనిమాట. నిష్కామనచేఁ జేయఁబడిన ధర్మము, భక్తిని గలిగించి తన్మూలకముగా నిరతిశయ మోక్షమునకు సాధన మగుచున్నది. అట్టి నిరతిశయమోక్షసాధనమయిన ధర్మమునకు ధన మెంతమాత్రము ఫలముకాదు. ఇట్లుండ, ధర్మమున కర్థమే ఫలమని చెప్పుట యెట్లు సరిపడును? మఱియు, నిష్కామనగాఁ జేయు ధర్మమే ప్రయోజనముగాఁ గల యర్థమునకుఁ గామము ఫలముకాదు. అట్లుండ, నర్థమునకు నన్నపానాదిరూప మగు కామ మెట్లు ఫలమగును? మఱియు, నన్నపానాది రూపమయిన కామము తన జీవధారణకుఁ దగినంత మాత్రమే యనుభవింపవలయు. జీవధారణకుఁ దగినంత మాత్రమే యనుభవింపఁదగిన యన్నాదిరూప కామమునకు నింద్రియతృప్తి ఫల మెట్లగును? ఇట్లు కామమునకు జీవధారణమే ఫలమగుచుండ నింద్రియతృప్తి ఫలమనుట తప్పు కాదా? మఱియు, నట్టి జీవమునకుఁ దత్త్వజిజ్ఞాసయె ఫలముకాని ధర్మము ఫలముకాదు. ఇందువలనఁ దెలియఁదగిన యంశ మేమనఁగాఁ, దనకు విత్తముండినచో, ఫలాభిసంధిరహితమయిన ధర్మమును సంపాదించి, యా ధర్మముచే నపవర్గసాధనభూతమయిన భక్తియోగంబును సంపాదింపవలయును గాని, కామము నిమిత్త మా ధనమును వ్యయింపఁగూడదు అన్నపానాదిరూపమయిన కామమున్నచో, దానిచే దేహధారణ గావించుకొనుచు, నా దేహముచే భజింపఁదగిన తత్త్వజిజ్ఞాస చేయవలయును. అంతేకాని, కామము నింద్రియప్రీతికై

యుపయోగింపఁగూడదు తత్త్వ మనఁగా ధర్మమే కదా? కానఁ దత్త్వజిజ్ఞాస యన ధర్మజిజ్ఞాస యనియె యర్థమగుచున్నది. ఇట్లుండ 'జీవనమునకు ధర్మమే ఫలమని చెప్పిన దోషమేమి ?' యని యందురా? అట్లన వీలులేదు. ఇక్కడఁ దత్త్వపదమునకు జ్ఞానస్వరూపమై సమాభ్యధికరహితమై భగవంతుఁడనియుఁ బరమాత్మయనియుఁ బరబ్రహ్మమనియుఁ జెప్పఁబడుచున్న వస్తువని యర్థముకాని, ధర్మమని కాదు. కావున, మునులు శ్రద్ధధానులై యజ్ఞాదిరూపమైన కర్మయోగముచే ననుగృహీతమును, ఆత్మస్వరూపజ్ఞానముతోను వైరాగ్యముతోను గూడినదియు నగు భక్తిచేత జీవాత్మయందు నంతరాత్మఁ డయియున్న బ్రహ్మాదిశబ్దవాచ్యుని భగవంతునిఁ జూచుచున్నారు. వర్ణాశ్రమములకు విహితము లయిన ధర్మములను జక్కఁగా నాచరించినయెడల, నది భక్తియోగోత్పత్తికిఁ గలుగు ప్రతిబంధకములను నిరసించి హరితోషణమూలకమైన భక్తిని గలిగించును. ఇట్లు ధర్మమును జక్కఁగా ననుష్ఠించుట మాత్రమే కాదు, శ్రవణాదులును భక్తియోగము నుత్పత్తికిఁ దోడుపడును. కావున, మనము నిశ్చలమైన మనసుతో నిత్యమును భగవంతుని కథలను వినవలయును. అతనిని గీర్తింపవలయును. అతనినే యెప్పుడును స్మరించుచుండవలయును. అతనినే సదా పూజించుచుండవలయును. మఱియుఁ బూర్వము పండితులగు మును లందఱును, ఎవ్వనివలని భక్తియనెడి కత్తిని జేతఁబూని కర్మబంధనముల నన్నింటిని నవలీలఁ ద్రెంచివైచిరో, యట్టిభక్తి గలిగించు భగవంతుని కథలను వినుటయందుఁ బ్రీతిలేనివాఁ డెవ్వఁడైన

నుండునా ? మఱియు, ధర్మమును జక్కఁగా ననుష్ఠించినను, అది సత్సఙ్గము మొదలైనవి లేక తనంతటనే హరికథలందు రుచి పుట్టింపఁజాలదు. కావున, తమతమ వర్ణాశ్రమధర్మముల ననుష్ఠించి, శుశ్రూషకుం గల ప్రతిబంధకముల నన్నిఁటిని బోఁగొట్టుకొని, శ్రద్ధాళులై యున్నవారికిఁ బుణ్యతీర్థముల సేవించుటవలనను, మహాత్ముల సేవ సేయుటవలనను, వాసుదేవ కథలయందు రక్తి లభించును శ్రవణాదులు భక్తికలుగుట కుపకరించువిధము వినుము. ఎవని కథలను వినుటయును గీర్తించుటయును బుణ్యావహములో, యట్టి శ్రీకృష్ణుఁడు తన కథలను వినువారి హృదయములం దున్నవాఁడై, సుహృదుఁడు గావున భక్తి యుత్పత్తికిఁ బ్రతిబంధకములయిన దురితముల నెల్లఁ బాఱఁజిమ్మును. ఇట్లు నిత్యము భాగవతసేవాపూర్వకముగా భగవద్గుణశ్రవణము చేయుచుండుటవలన భక్తియోగ ప్రతిబంధకములైన యమంగలము * లించుమించుగా నశింపగానే యుత్తమశ్లోకుఁ డగు భగవంతునియందు దృఢభక్తి కలుగును. అమంగలములు నశించినను భక్తికలుగుట యెట్లన్నచో, నవి యట్లు నశింపఁగానే తన్మూలకములును చిత్తవిక్షేపావరణహేతువు లగు రజస్తమస్సుల కార్యములునైన కామ లోభ క్రోధ మోహాదులన్నియును నశించుచున్నవి. ఇవి

* ఇచట 'ఇంచుమించుగా' ననుటచే పూర్ణముగా నశింపవనిసూచితమైనది. అనఁగా, ఉపాయమగు భక్తియోగమునకు ప్రతిబంధకములై నశించును గాని, యుపేయమైన భగవత్ప్రాప్తికి ప్రతిబంధకములై ఉత్తరపూర్వాఘరూపములయినవి నశింపక మిగిలియుండు నని భావము. భక్తియోగమువలననే యీ యుత్తరపూర్వాఘములు నశించునని తెలియునది.

నశింపఁగానే మనస్సు వీనిచేత విమోహమునకానిదై శుద్ధ సత్త్వగుణమునందు స్థిరముగా నెలకొని ప్రసన్నమగును. ఈ విధమున మనస్సు ప్రసన్నముకాఁగా, సంగమును వదలి విరక్తుఁడయిన పురుషునికి దృఢమైన భక్తి యుద్భవించు చున్నది ఆ భక్తియోగమువలన భగవంతుని స్వరూపగుణా దులు కలరూపున సాక్షాత్కరించును. ఇట్లాభక్తియోగము వలన పరమాత్ముఁడగు భగవంతుఁడు సాక్షాత్కరించినంతమాత్రముననే, దర్శించిన పురుషునికి భగవత్ప్రాప్తికి ప్రతిబంధక ములై యుత్తరపూర్వాఘరూపములై యున్న సమస్తకర్మ ములును నశించుచున్నవి ఇవి నశింపఁగాఁ, దన్మూలకము లయిన సకల సంశయములును అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానా జ్ఞానములును ద్రుంపఁబడుచున్నవి. అవి నశింపఁగాఁ, దన్మూల కమై హృదయమునందు ముడివడ్డట్లు విడిచిపుచ్చరాకుండు 'నేను నాది' యనెడి యభిమానము వీడిపోవుచున్నది. అనఁగా, సంసారము సమూలముగా నివర్తించుచున్నది. అది నివర్తిం పఁగా, బ్రహ్మప్రాప్తియుఁ దదనుభవమును బ్రయత్నము లేకయే తనంతట సిద్ధించుచున్నది ఇట్లు మోక్షమే పరమపురుషార్థ ముగాను, దానికి భక్తియే సాధనముగాను నుండుటవలన, నిట్టి నిరతిశయ శ్రేయస్సాధనము నెఱింగిన యభిజ్ఞు లత్యంతసంతో షమున భగవంతుఁడగు వాసుదేవునియందు * మనస్సును

---

* ఇందులకు 'ఆత్మప్రసాదనీం భక్తిమ్' అని మూలము మనస్సు ప్రసన్నము గావించు భక్తియనుటచే, భక్తియోగము నారంభించినవారికి మనస్సు కొంచెము కొంచెముగా ఆ భక్తియోగమువలననే ప్రసన్నమగు నను సూచితము.

ప్రసన్నముగావించు భక్తిని గావింతురు * 'సృష్ట్యాదికారణములైన బ్రహ్మారుద్రాదులుండఁగా, వాసుదేవునియందలి

* చిత్తు అచిత్తు ఈశ్వరుఁడు అని తత్త్వములు మూఁడు. చిత్తనఁగా చేతన సముదాయము అచిత్తనఁగా అచేతనమై ఘటపట దేహాదిరూపముగా పరిణమించు ప్రకృతి ఈ మూఁడును నిత్యములు మూఁడును స్వతస్సిద్ధములు. అందు, శరీరమునందాత్మవలె ఈశ్వరుఁడు చిదచిత్తులందంతర్యామియగు పరమాత్మయై వ్యాపించును కావుననే, వానికి ధారకుఁడును పోషకుఁడునునై నియమనము సేయుచుండును చిదచిత్తులా యీశ్వరునకు శరీరమై, కావుననే యతనికే ధార్యమై, పోష్యమై, యతని నియమనమునకు లోనువయై యుండును కనుక, ఈశ్వరుఁడును చిదచిత్తులును, ఆత్మయును శరీరమునై యుందురు భగవచ్ఛరీరమైన చిదచిత్తులు రెండును సృష్టికిఁ బూర్వము వేఱువేఱు నామములుగాని రూపములుగాని లేక, కావుననే వేఱువేఱు విభజింప నర్హముగాక యుండును. ఇది సూక్ష్మావస్థ ఉప్పును చక్కెరయును పాలలో కరఁగి లీనముకాఁగా, వాస్తవమున కవి మూఁడు వస్తువు లయ్యును నన్నియు నొక్కటిగాఁ జేరి పయిచూపునకుఁ బాలొక్కటిగానే కనఁబడునట్లు, నామరూపవిభాగమున కర్హముగానంత సూక్ష్మములై చిదచిత్తు లీశ్వరునకు శరీరమైయుండఁగా, నిజమున కవియెల్ల మూఁడయ్యును నొక్కటిగాఁ జేరి, శరీరమైన యీశ్వరుఁ డొక్కఁడే కనఁబడుచున్నాఁడు. కావున 'సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్' అని సృష్టికిఁ బూర్వము రెండవది లేని యొకసత్తేయున్న దను శ్రుతి కిదియే యర్థమగును పిమ్మట ఈశ్వరుఁడు 'తదైక్షత బహుస్స్యాం ప్రజాయేయ' అని తాను పెక్కులగునట్లు సంకల్పించుకొన్నవాఁడై, చిదచిత్తులను వేఱువేఱు నామరూపవిభాగములు గలిగి విభజింపఁగూడునట్లు స్థూలములుగావించెను. ఇదియే వాని స్థూలావస్థ, ఇట్లు స్థూలములుగాఁ

భక్తియే మోక్షమున కుపాయమగుటయెట్లనఁగా *సత్త్వము

---

చేయుటయే సృష్టియనఁబడును నామరూపవిభాగార్హములైన స్థూల చిదచిత్తుల సమూదాయమే యీ జగత్తు అనఁగా, జగత్తన స్థూలచిదచిత్తు అను శరీరముగాఁ గల యీశ్వరునిరూపమే ఇట్లు చిత్తును అచిత్తును సూక్ష్మావస్థయందుఁగాని స్థూలావస్థయందుఁగాని యీశ్వరునికి శరీరమై యతనికి అవినాభూత మయ్యును, ఈశ్వరుఁడు వాని కాత్మయయ్యును నుండుటంబట్టి, శరీర వాచకము అగు రాముఁడు సోముఁడు అను నామములు శరీరియగు నాత్మపర్యంతము చెల్లునట్లు, భగవచ్ఛరీరభూతులై యెల్లజీవులకును వాచకములైన శబ్దములు వాని కంతర్యామియగు పరమాత్మపర్యంతము చెల్లుచున్నవి; అనఁగా, పరమాత్మునకుఁగూడ వాచకములగుచున్నవి కనుక, భగవంతుఁడు బ్రహ్మరుద్రులై సృష్టియును సంహారమును జేయుచున్నాఁడనఁగా, విష్ణువును బ్రహ్మరుద్రులును ఏకవస్తువే యని గ్రహింపరాదు. జీవులగు బ్రహ్మరుద్రులు విష్ణుశరీరమగుటచే, శరీరభూతులైన వారి నామములు శరీరియగు విష్ణువునకుఁ జెల్లుచున్నవనియు, ఇట్లు శరీరాత్మభావమును బట్టి విష్ణువే బ్రహ్మరుద్రు లని చెప్పఁబడినది కాని, స్వరూపమునం దైక్యమును బట్టి కాదనియు తెలియునది మఱియు, పరమపురుషుఁడు శరీరాత్మభావమున బ్రహ్మరుద్రు లయినాఁడనియు, తానే తన సంకల్పమున నవతరించి వారినడుమ చెప్పఁబడు విష్ణుఁడై నాఁడనియు నెఱుఁగునది. కాన, త్రిమూర్తులలో విష్ణుఁడా పరమపురుషుఁడే కాని, వేఱుకాదు తక్కిన బ్రహ్మరుద్రులు ఆ పరమపురుషుని శరీరభూతులైన యితరజీవులే కాని, యాపరమపురుషుఁడు కాఁడని తెలియునది

* ఇందులకు 'సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్గుణాస్తైర్యుక్తః పరః పురుష ఏక ఇహాస్య ధత్తే। స్థిత్యాదయే హరివిరించిహరేతిసంజ్ఞాః శ్రేయాంసి తత్ర ఖలు సత్త్వతనోర్నృణాం స్యుః' అని మూలము ఇందు

రజస్సు తమస్సు అను మూఁడుగుణములు ప్రకృతికే కలవు. అవి జీవునికిని నీశ్వరునికిని లేవు. సత్త్వాదిగుణములను శరీరము

---

'పరః పురుష ఏకో హరివిరిఞ్చిసంజ్ఞా ధత్తే' అని పరమపురుషుఁ డొకఁడే హరిహరాది నామములు దాల్చుచున్నాఁ డనుటంబట్టి, బ్రహ్మ విష్ణు రుద్రులకు పరస్పరము సంజ్ఞయందు భేదమే కాని, వస్తుభేదము లేదని తెలియుచున్నది ఇందుల కనుగుణముగా, బ్రహ్మ నారాయణః శివశ్చ నారాయణః, అని శ్రుతియు 'బ్రహ్మనారాయణాఖ్యోఽసౌ కల్పాదౌ భగవాన్యథా తతః సభగవాన్ విష్ణూ రుద్రరూపధరోఽవ్యయః। సర్గస్థిత్యన్తకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్। సంజ్ఞాం సంయాతి భగవానేక ఏవ జనార్దనః' అని స్మృతియు త్రిమూర్తుల నేకవస్తువేయని చెప్పుచున్నది కాబట్టి, విష్ణువే సర్వస్మాత్పరుఁ డనుట పొసఁగదు. ఒకఁడే హర్యాది సంజ్ఞలు దాల్చుచున్నాఁ డనుటచే, హర్యాదులకంటె వేఱైన పరతత్త్వమొకటి యున్నదని యేర్పడుచున్నది మఱియు 'యస్మిన్ బ్రహ్మ విష్ణు రుద్రేన్ద్రాస్తే సర్వే సంప్రసూయన్తే తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ తతో యదుత్తరతరం తదరూపమనామయమ్, య ఏతద్విదురమృతాస్తే భవన్తి' అను శ్రుతి 'పురుషేణ' అని పురుషశబ్దనిర్దిష్టమైన పరతత్త్వమునకు నారాయణ (విష్ణు) ప్రభృతులు విభూతులనియు, 'సంప్రసూయన్తే' అని వారా తత్త్వమునుండి యుత్పన్నులైరనియు, 'తతో యదుత్తరతరం' అని త్రిమూర్తులకంటెను ఆతత్త్వము పరమై వేఱైనదనియు, 'అమృతాస్తే భవన్తి' అని ఆతత్త్వమే మోక్షహేతువనియుఁ దెలుపుచున్నది మఱియు 'అమృతస్యైష సేతుః' ఆ యమృతమునకు విష్ణుఁడు సేతువవలెఁ బ్రాపకుఁ డనుటచే త్రిమూర్తులకంటె వేఱైన తత్త్వమే సర్వజగత్కారణమనియు, 'కారణం తు ధ్యేయః' అని అట్టి కారణమునే ధ్యానింపవలయుననియు నుండుటచే, నారాయణునికిఁ బరత్వముగాని యతనిని భజించుటవలన ముక్తి

గాఁగూడి పరమపురుషుఁడు (సృష్టికిఁ బూర్వము నామరూప ములచే వేఱువేఱ నేర్పఱుప నర్హ్హము కానట్టి సూక్ష్మావస్థ

---

గాని కలుగదని సిద్ధించుచున్నది' అని యాక్షేపణము దీనికి సమాధాన మెట్లనఁగా — పరమపురుషుఁడొకఁడే త్రిమూర్తులైనాఁడన్నంతమాత్రమ వనే త్రిమూర్తులకు ఐక్యము అనఁగా ఏకవస్తుత్వము కలుగదు. 'నారాయణాద్బ్రహ్మా జాయతే నారాయణాద్రుద్రో జాయతే నారాయణాద్ద్వాదశాదిత్యాః సముత్పద్యన్తే। ఏకో హ వై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానః॥ ఏకో హ వై నారాయణ ఆసీన్న బ్రహ్మా న చ శంకరః' అని యాదియందు నారాయణుఁ డొక్కఁడుతప్ప బ్రహ్మరుద్రులు లేరనియు, పిదప 'సమాని ధ్యాత్వా సమచిన్తయత్' అని నారాయణుని సంకల్పమున 'తత ఏతే వ్యజాయన్త విశ్వే హిరణ్యగర్భోఽగ్నిర్యమ వరుణ రుద్రేన్ద్రాః, యస్మాన్నాభి పద్మాదభవత్స మహాత్మా ప్రజాపతిః, తత్ర బ్రహ్మా చతుర్ముఖోఽజాయత సోఽగ్రే భూతానాం మృత్యుమసృజత్ త్ర్యక్షం త్రిశిరస్కం త్రిపాదం ఖణ్డపరశుం॥ ఆద్యో నారాయణో దేవస్తస్మాద్బ్రహ్మా తతో భవః॥ క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్। ఆవాం తవాఙ్గసంభూతౌ తస్మాత్కేశవనామభాక్॥ అని నారాయణునివలన బ్రహ్మయు వతనివలన రుద్రుఁడును బుట్టుటయు 'బ్రహ్మదక్షాదయః కాలస్తథైవాఖిలజన్తవః। విభూతయో హరేరేతా జగతః సృష్టిహేతవః' అని బ్రహ్మాదులు నారాయణునకు విభూతులనియు 'ఏతౌ ద్వౌ విబుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధజౌ స్మృతౌ। తదాదర్శిత పన్థానౌ సృష్టిసంహారకారకౌ॥ సృష్టిం తతః కరిష్యామి త్వామావిశ్య ప్రజాపతే' 'హరోఽహంతి తద్వశః' అని బ్రహ్మరుద్రుల ప్రవృత్తులు నారాయణాధీనము లనియు 'తవాన్తరాత్మా మమ చ యే చాన్యే దేహిసంజ్ఞితాః। సర్వేషాం సాక్షిభూతోఽసౌ న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్' అని నారాయణునకును బ్రహ్మరుద్రాదులకును శరీరాత్మభావ

యందుఁ జిదచిత్తు లుండుటచే శరీరభూతములైన యవి యన్నియుఁ జేరి శరీరియగు) తా నొక్కఁడే యగుచు (పిదప నవి

---

రూపమైన సంబంధము కలదనియుఁ దెలియుచున్నది. ఇట్టు బహుశ్రుతిస్మృతులవలన బ్రహ్మరుద్రులు నారాయణునకు సృజ్యులైన విభూతులై యున్నవారలై తదాయత్తప్రవృత్తులై తచ్ఛరీరభూతులై యుండుటంబట్టి, యతఁడును వారు నేకవస్తువు కానేరరని తెలియుచున్నది. కాఁబట్టి 'బ్రహ్మా నారాయణః శివశ్చ నారాయణః' ఇత్యాది వాక్యములకు 'సృష్టింతతః కరిష్యామి త్వామావిశ్య ప్రజాపతే' 'బ్రహ్మ! నిన్నావేశించి యంత సృష్టిని జేయుదును' 'హరో హరతి తద్వశః' 'విష్ణువునకు వశుఁడై శివుఁడు సంహారము నేయుచున్నాఁడు' ఇత్యాది ప్రమాణములకు ననుగుణముగా నర్థము సేయఁగా, నారాయణుఁడు బ్రహ్మరుద్రులలో నంతరాత్మయై వారిని నడపుచున్నాఁడనియు, నతనికి వారు శరీరభూతులనియుఁ దెలియుటచే, శరీరములకు వాచకములైన శబ్దములు శరీరిపర్యంతము చెల్లునట్లు బ్రహ్మరుద్రులకు వాచకములైన శబ్దములును నారాయణునికిఁగూడ దేహాత్మభావమున చెల్లుచున్నవనియు, స్వరూపైక్యమునుబట్టి కాదనియు నెఱుంగునది. 'తతో యదుత్తరతరమ్' అనుటంబట్టి, నారాయణునకంటెఁ బరమైన తత్త్వము కలదనరాదు 'నతత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే' 'దేవానాం విష్ణుః పరమః' 'మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ' 'ఆభూత సంప్లవే ప్రాప్తే ప్రలీనే ప్రకృతౌ మహాన్ ఏకస్తిష్ఠతి విశ్వాత్మా స తు నారాయణః స్మృతః' 'నపరః పుండరీకాక్షాద్దృశ్యతే పురుషర్షభ। పరం హి పుండరీకాక్షాన్నభూతో న భవిష్యతి। నవిష్ణోః పరమో దేవో విద్యతే నృపసత్తమ। నవాసుదేవా త్పరమస్తి దైవతమ్। నదేవః కేశవాత్పరః' ఇత్యాది బహుప్రమాణములచే విష్ణుఁడే సర్వాధికుఁ డని తెలియుచున్నది 'బ్రహ్మా విష్ణుశ్చ రుద్రేంద్రా స్తే సర్వే సంప్రసూయన్తే' అని త్రిమూర్తులకును ఉత్పత్తి చెప్పఁ

రెండును నామరూపవిభాగమున కర్హ మగు స్థూలావస్థ నొంది
యైనట్టి) ఈజగత్తునకు సృష్టిస్థితిలయములకొఱకు విష్ణుబ్రహ్మ

---

బడుచున్నగే, అందు విష్ణునకుఁ బరత్వ మెట్లు? అన్నచో, బ్రహ్మరుద్రులు కర్మవశమునఁ బుట్టినవా రనియు, విష్ణుఁడు 'అజాయమానో బహుధా విజాయతే' అన్నట్లు జన్మకర్మరహితుఁడు గావున, స్వసంకల్పమూలమున త్రిమూర్తుల నడుమ స్థితికరుఁడై, యట్లవతరించినాఁ డనియుఁ దెలియునది 'తతో యదుత్తరతరమ్' అనుటంబట్టి, నారాయణునకన్నఁ బరతత్త్వము కలదనుట యొప్పదు ఈ శ్రుతికిఁ బూర్వమందు నారాయణునకు మహాపురుషత్వమును జెప్పి, ఉత్తరమందు అతనికే సహస్రశీర్షత్వాది ధర్మములను జెప్పినప్పుడు, నడుమనున్న యిదియు నా నారాయణునికిఁ బరత్వమే చెప్పవలసినదిగాని, మఱొక పురుషునిఁ జెప్పినచో పూర్వోత్తర వ్యాఘాతము కలుగును. కనుక (తతః) అనఁగా కాఁబట్టి ఉక్తహేతువులంబట్టి (యత్) పురుషశబ్దవాచ్య మగు తత్త్వమేదియో అదియే (ఉత్తరతరం) ఉత్తరతరమైన తత్త్వమని యర్థము గ్రాహ్యము. కాన (తత్) అనుటకు ఆ త్రిమూర్తులకంటె ఉత్తరతరమైన తత్త్వ మొకటి యున్నదని యర్థము చెల్లదు. 'అమృతస్యైష సేతుః' అనుటంబట్టి, విష్ణువు మఱియొక తత్త్వమునకుఁ బ్రాపకుఁడని గ్రహింపరాదు విష్ణుఁడు తనకే తాను బ్రాపకుఁడని అనఁగా, తానే ప్రాప్యమును ప్రాపకమునని దాని కర్థము నారాయణుఁడు బ్రహ్మరుద్రులం దాత్మయై యున్నాఁడు గావున వారియందలి భక్తియు నా నారాయణునియందలి భక్తియే కానేరదా యన్నచో, శరీరగతములైన ధర్మములు శరీరికిఁ గలుగఁగలవు మఱియు, జీవునికే కర్తృత్వభోక్తృత్వాదులు గాని పరమాత్మునికి లేవు కనుక భగవంతునికి శరీరమై జీవులై యుండు బ్రహ్మరుద్రుల కర్తృత్వాదులు తదాత్మయైన పరమపురుషు నంటవు కాన, వారిని భజించువారికి 'యోయో యాంయాం తనుం భక్తః'

రుద్రులరూపములను, వారి నామములను దాల్చుచున్నాఁడు. అందు విష్ణువు జ్ఞానప్రదమైన సత్త్వగుణమునకుఁ బ్రవర్తకుఁడుగావున, నా దేవునివలన జ్ఞాననివృత్తి సంసారనివృత్తి పరప్రాప్తియనెడి శ్రేయములు గలుగును. అనఁగా, విష్ణువు సర్వకారణుఁడును, సర్వోత్కృష్టుఁడును, జ్ఞానప్రవర్తకమగు సత్త్వమును బ్రవర్తింపఁజేయువాఁడు నగుటచే, నతనియందలి భక్తియే మోక్షప్రదమైనది.

'రజస్తమస్సుల వలెనే సత్త్వమును బ్రకృతిగుణమైయుండఁగా, నదిమాత్రము మోక్షహేతు వగుటయుఁ దక్కిన రెండును నట్లు కాకపోవుటయుఁ జెల్లునా ? కావున, నా మూఁడును మోక్షహేతువులగునా కావా' యన్నచో, పృథివీవికారమైన కట్టెనుండి మొదట ధూమమును, దానికిఁబిదప నగ్నియును బుట్టుచున్నవి ఈరెండును పృథ్వీవికారమైన కాష్ఠము నుండియే కలిగియు, నందు పొగ యప్రకాశమై స్వర్గాదులకు ననుపయుక్తమైయున్నది. అగ్నియో, ప్రకాశకుఁడై త్రయీప్రతిపాద్యుఁడు గావున, స్వర్గప్రదుఁడై యున్నాఁడు. ఇట్లే సుషుప్తుఁడైనవానికిఁ దమస్సు కలుగును దానికిఁ బిదప రజస్సును దాని కనంతరము మనస్సును కలఁకదేర్చు సత్వమును గలుగుచున్నది. అన్నియుఁ బ్రకృతినుండియేపుట్టినను, సత్త్వము

---

అన్నట్లు వారితోడిలోకమే కలుగును భగవంతుని భజించువారికే మోక్షము అని తెలియునది.

మాత్రమే బ్రహ్మదర్శనమునకు సాధనమైయున్నది ఇట్లు సత్త్వమే బ్రహ్మదర్శనమునకు సాధనముగాను, నాసత్త్వమును బ్రవర్తింపఁజేయు విష్ణువే శ్రేయముల నిచ్చువాఁడుగాను నుండుటవలనఁ, బూర్వకాలమున మునులు రజస్తమస్సులచేఁగొట్టఁబడనిదై విశుద్ధమైయున్న సత్త్వమును బ్రవర్తింపఁజేయునట్టి భగవంతుని నధోక్షజుని నుపాసించినవారైరి. ఇవ్విధమున నీ లోకమునందు వారిచెప్పిన సత్త్వతనుఁ డగు భగవంతుని నుపాసించువారు శ్రేయముల నొందుదురు. రజస్తమః ప్రధానులగు బ్రహ్మరుద్రులను భజించువారో, యట్టి శ్రేయములను బడయక యంతవంతము లగు ఫలములనే బడయుదురు ఆట్లేని, యందఱును విష్ణువునే భజింప రేమి? కొందఱు బ్రహ్మరుద్రుల నుపాసించువారు నున్నారే' యన్నయెడల, ముముక్షువులు సత్త్వగుణప్రధానులు కావున, తమఃప్రధానులును గావుననే భయంకరరూపులునయిన రుద్రాదులను వదలి శుద్ధసత్త్వప్రకృతులైన నారాయణుని యవతారములను గొలుతురు. అట్లు కొలుచునపుడు వారికి * దేవతాంతరములందుఁగాని తదుపాసకులందుఁగాని యసూయ లేక యే యుండును రజస్తమఃస్వభావులైనవారు † మోక్షమును

---

* దీనింబట్టి దేవతాంతరభక్తులకు విష్ణునియందును, విష్ణూపాసకుల యందును అసూయయుండు నని సూచితము

† దీనింబట్టి విష్ణుభక్తులు అనన్యప్రయోజనులై అనంతస్థిరఫల ప్రాప్తిని గోరుదురనియు, తక్కినవారు అంతవంతములైన ఫలములను ప్రాపింతురనియు సూచితము

గోరక సంపదలను, ఆధిపత్యమును, సంతానమును బొందఁ గోరువారై, తమవలెనే రజస్తమస్స్వభావులయిన పితృదేవతలను, రుద్రాదులను, బ్రహ్మ సరస్వతి మొదలగువారిని భజింతురు. ఇంతేల! వేదములెల్లను వాసుదేవపరములు. యజ్ఞము లన్నియును అగ్న్యాదులం దంతరాత్మయై యున్న వాసుదేవు నారాధించుటలే గనుక, * వాసుదేవపరములు. వేదాంతవిహితంబులగు యోగశాస్త్రములును † వాసుదేవపరములు సర్వక్రియలును వాసుదేవపరములు జ్ఞానశాస్త్రమును వాసుదేవ పరమైనది. జ్ఞానమును వాసుదేవపరము. దానవ్రతాదిరూప ధర్మశాస్త్రములును వాసుదేవపరములు స్వర్గాది

---

* అగ్న్యాదులగు దేవతల నుద్దేశించి యాగహోమాదులను జేయవలయునని ప్రతిపాదించు వేదపూర్వభాగము వాసుదేవపరమగుట యెట్లని శంకింప నవసరములేదు. ఒకచో నభిమానముచే నగ్న్యాది దేవతాపరముగానే యాగాదుల నొనరించుచున్నను, నా యాగకర్తలచేఁ దెలియఁబడకుండ నగ్న్యాదులం దంతరాత్మయై యున్న వాసుదేవుఁడే యారాధింపఁబడి, వానికిఁ దగునట్టు లంతవత్ఫలంబు నిచ్చుచున్నాఁడని తెలియఁదగినది శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ। నతు మా మభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే॥ యనెడి యీ శ్లోకంబును వెనుకటి యర్థమునే తెలుపుచున్నది.

† యోగములలోఁ బెక్కులు వాసుదేవపరములై యున్నవికాని, యచ్చటచ్చట రుద్రాది విషయకములయినట్లు తెలియవచ్చుచున్నవి అయినను, రుద్రాదుల కసంభవంబు లయినవియు, తత్తత్ప్రకరణగతములయిన లక్షణములచే వాసుదేవవిషయకములైనట్టే నిశ్చయింపఁబడుచున్నవని తెలియఁదగినది

ఫలమును, తదానందమునందంశమే కావున, వాసుదేవపరమే. సర్వశాస్త్రముల తాత్పర్యములును వాసుదేవునియందే వర్తించుచు సర్వమునకు ముఖ్యవిషయము వాసుదేవుఁడే. * ఇది యెట్లనఁగా, సృష్టికిఁబూర్వము (చిదచిత్తులీశ్వరుని శరీరమై యుండియు సూక్ష్మములై యేర్పడకుండుటచే లేనట్లయ్యెం గావున, నవి యన్నియును జేరి మొత్తమునకు శరీరియగు) † వాసుదేవుం డొక్కఁడేయుండెను. ఆభగవంతుఁడు తనకు శరీ

---

* ఇట వేదాదులన్నియును వాసుదేవపరము లెట్లని శంక రాఁగా, భగవంతుఁడు అచిత్తునందును చిత్తునందును అంతర్యామియు ఆత్మయునై చొచ్చి, దేహరూపముతో నున్న యాత్మవలె, ఆ యచిత్తురూపముతోను చిత్తురూపముతోను నున్నాఁడు కావున, సమస్తమును వాసుదేవాత్మకములే యగుటం జేసి యన్నియును వాసుదేవపరము లనుట సిద్ధము

† శంకలకు 'స ఏవ' అని మూలము సృష్టికిఁ బూర్వము వాసుదేవుఁడే యుండెననుటచే, చిత్తుగాని యచిత్తుగాని యప్పుడు లేవని సిద్ధించుచున్నది అయితే 'ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి' అని చిదచిత్తు లనాదులు గావున, సృష్టికిఁబూర్వ ముండియే తీఱవలయునని యేర్పడుటచే భగవంతుఁ డొక్కఁడే యుండెననుట యొప్పదు కనుక, ఈ యసంగతికి సమాధాన మెట్లన — సృష్టికిఁ బూర్వము చిదచిత్తు లుండినను అవి సూక్ష్మములైనట్లే చూపట్టెను మఱియు నవి ఈశ్వరునికి శరీరము ఇట్లు నామరూపవిభాగానర్హములై అసత్ప్రాయములై చిదచిత్తు లుండుటచే వానిని వేఱుగాఁ జెప్పక, శరీరభూతములైన యా రెంటిని శరీరిలో నంతర్భవించి మొత్తమునకు శరీరియగు నీశ్వరుఁడే యున్నాఁడని శ్రుతి చెప్పినట్లు గ్రహింపఁదగును శరీరమును శరీరిని ఇద్దఱినిఁ జేర్చి శరీరి నొక్కరిగానే వ్యవహరించుట గలదుగదా అనఁగా 'సఏవ' అని ఈశ్వరుఁడే

రమై సత్త్వాదిగుణమయమై యున్న మాయయందు, నది మహా
త్తు మొదలుకొని పృథివీపర్యంతము కార్యకారణ రూపముగాఁ
బరిణమించుచున్న దైనను అంతరాత్మయై వ్యాపించి, దానిగుణ
ములం దగులువడక వానిచే నీ జగమును సృజించెను. (ఇట్లు
భగవంతుఁడు సమష్టిదశనున్న యచిత్తునందు దానిసృష్టిరూప
ములైన మహదాదులొక్కొక్కటియందును నంతర్యామియై
కారణమై యుండుటవలనఁ దానాయచిత్తురూపముననున్న వాఁ
డగుచున్నాఁడు ) *మఱియు, భగవంతుఁడు అచిత్తు కోడిసంస

---

*(జీవపరముగా అర్థాంతరము) మాయచేత రచితములై
గుణకార్యములైన యీ దేవాదిశరీరములం దుఁజొచ్చిన †జీవుఁ
డు తనకు ధర్మభూతమైన జ్ఞానముచేత దేహమే యాత్మయను

---

యున్నాఁ డనఁగా, కేవలుఁడై ఒక్కఁడేయైన ఈశ్వరుఁడే యున్నాఁ
డని కాదు శరీరియై ఒక్కఁడేయైన యీశ్వరుఁడే యున్నాఁడని యర్థము
శరీరిని, శరీరము ఆత్మ అని యిద్దఱిగా గ్రహింపక యొక్కనిగానే
గ్రహించుటచే నేకత్వము చెప్పు శ్రుతి ఉపపన్నమగుచున్నది. శరీరిని
జెప్పఁగా శరీరమును జెప్పఁబడినట్లే యగును గావున, శరీరభూతములైన
చిదచిత్తులును చెప్పఁబడినవగుటచే, చిదచిత్తు అనాదులను స్మృతియు
నుపపన్న మగుచున్న దని తెలియునది.

† జీవుఁడు అని యేకవచన మిచట జాతివాచకముగాన, జీవుఁ
డొక్కఁడే యున్నాఁడని గాని, అంతటను గల జీవులందఱు నొక్కఁడే
యనిగాని గ్రహింపరాదు వడ్లగింజలన్నియు సమానాకారములుగా నుండు
టచే, నొకవడ్లగింజను చెప్పుట తక్కిన గింజలకట్లుపలక్షణమో, యట్లే
జీవులందఱును జ్ఞానైకాకారులుగా నుండుటచే, నొక్క జీవునిఁ జెప్పుట
తక్కినవారికిని బ్రదర్శకమని తెలియునది

ర్గముగల జీవుని శరీరముగాఁ జేసికొని, మాయచే రచితములై తదీయగుణకార్యములై కనఁబడుచున్న యీ దేవాది నానావిధదేహములందును నా జీవునిమూలముననే ప్రవేశించి యా దేహములయు, నా దేహములు గలిగియున్న జీవు యు, ధర్మములనెల్లఁ దానే గలిగియున్నవానివలెఁ దోఁచుచున్నాఁడు. (ఇట్లు జీవశరీరుఁడై తదంతరాత్మయై యుండుటవలన, జీవుని రూపమునను నన్నవాఁడగుచున్నాఁడు. ఇట్లు చిదచిత్తులరూపములతో వాసుదేవుఁడే యుండుటవలన, వాసుదేవాత్మకము

---

నభిమానముగలవాఁడై* దేవుఁడను, మనుష్యుఁడను, కృశుఁడను, స్థూలుఁడను నని దేవత్వకృశత్వాది దేహధర్మములు తానేగల వానివలె నొప్పుచుండును కాన, వాస్తవమున కా ధర్మములు వానివిగావు అంతట నొక్కరూపుఁడై యుండు నగ్ని, తాను దోఁచెడి దారువులు మొదలగుపట్టుల గడ్డినిప్పు ఆకునిప్పు అని

---

* "దృష్టాంతమందు అంతటను గల వహ్ని యొక్కటిగాఁ జెప్పఁబడినదేకాని, వ్యక్తిభేదముగలదిగా గుర్తింపఁబడినదిగాదు అట్లే యంతటఁ గల జీవు లొక్కటిగానే గ్రహింపఁదగును ఒక్కొక దేహమందు వేఱు వేఱు జీవులున్నయెడల, నప్పుడు వానికి నేకకాలముననే దేవుఁడను, మనుష్యుఁడను అని నానావిధములు తోఁచుట యొప్పదు కాన, జీవుఁ డొక్కఁడే" యన్నచో, దృష్టాంతమందు గడ్డినిప్పును ఆకునిప్పుగా గ్రహించుట లేదుగాన, వ్యక్తిభేద మూహ్యమే మఱి, ఒక్కొక్క జీవుఁడు వరుసగా దేవాదిదేహముల నెత్తుచు, నేను దేవుఁడను మనుష్యుఁడనని వరుసగాఁ దలఁచుచున్నాఁ డని యభిప్రాయమే కాని, ఏకకాలమునందే యట్లు తలఁచునని గాదు కాన, జీవులు పెక్కండ్రేయని తెలియునది

గానిది యొక్కటియుఁ గలుగనేరదుగావున, వేదాదులన్నియు ను వాసుదేవపరములే యగుచున్నవి.) దారువులకంటె వేఱై విశ్వాత్ముఁడై యుండు నగ్నియంతటను దానేకరూపముగా నుండువాఁడయ్యును, దానుదోఁచునట్టి స్థలములగు దారువులు మొదలగువానియందు గడ్డినిప్పు, ఆకునిప్పు, కొమ్మనిప్పు అని నానావిధములుగా వెలుఁగునట్లు, జీవుఁడును అంతటను ఏక రూపముగా జ్ఞానానందరూపుఁడై యుండినను, దానుదోఁచు పట్టులై ప్రకృతిపరిణామరూపములైన దేహములందుఁ దేవుఁడను మనుష్యుఁడను అని దేవాది నానాభేదములు గలవానివలె నుండును సర్వేశ్వరుఁడు నట్లె తా నొక్కఁడే యయ్యును, జీవుఁడు *శరీరముగాఁగలవాఁడై తన్మూలమున నా దేహములందుఁ జొచ్చి దేవాది నానాభేదములు గలవానివలె నొప్పుచుండును. (ఇట్లు చిదచిత్తులమూలమున నానావిధరూపములు గలిగియుండుట మాత్రమే కాదు) ఈ విశ్వాత్ముఁడు పృథివ్యాది

నానావిధములు గలవానివలె నొప్పునట్లు, అచేతనజాతమున కాత్మభూతుఁడగు జీవుఁడు, దేవాదిశరీరములందు దేవుఁడను మనుష్యుఁడనని నానావిధములైనవానివలె నొప్పును. ఈ జీవుఁడు గుణమయములగు పృథివ్యాది భూతములు గంధాది సూక్ష్మములు, ఇంద్రియములు, అంత కరణము అను వీనిచే నిజకర్మానుగుణముగా నిర్మింపఁబడ్డ దేవాది శరీరములందుఁ

* భగవంతుఁడు అచిత్సంసర్గము గల జీవుని శరీరముగాఁ జేసికొని యా జీవశరీరమూలముననే అచిద్వస్తువులందెల్లఁ బ్రవేశించుచున్నాఁడని తెలియునది

భూతములు గంధాదిసూక్ష్మములు జ్ఞానకర్మేంద్రియములు నంతఃకరణములనెడి పదార్థములను గొని, తానే నిర్మించినట్టి దేవాదిదేహములందు జీవశరీరుఁడై ప్రవేశించి, యా జీవుని మూలముగానే యా పృథివ్యాదిభూతముల గుణములగు గంధాదివిషయముల ననుభవించుచున్నాఁడు ఆజీవునిమూలముననే పుణ్యాపాపముల నాచరించుచున్నాఁడు (ఇట్లు సర్వేశ్వరుఁడు తానొక్కఁడయ్యును, చిదచిత్తులను శరీరముగాఁ గలిగి యుండుటంబట్టి, వాని నానారూపభేదములను దా నొప్పుచుండునట్లు, జీవుని పుణ్యాపాపకర్తృత్వమును, సుఖదుఃఖాది భోక్తృత్వమునుగూడఁదాను గలిగియున్నాఁడుకాని,* వాస్తవమునకా నానారూపములు చిదచిత్తులవియే ఆకర్తృత్వాదులు జీవునివే, కాని. యీశ్వరునివిగావు లోకముల సృజించునీ సర్వేశ్వరుఁడు సాధువులం దనురక్తుఁడై శుద్ధసత్త్వమున

---

జొచ్చి పుణ్యాపుణ్యకర్మములాచరించుచు శబ్దాదివిషయములనుభవించుచుండును

---

* అగ్నికిఁ గల హ్రస్వత్వ స్థూలత్వ వక్రత్వములు అది తోఁచునట్టి దారువులను సంబంధించినవేకాని, దానిని సంబంధించినవిగావు. అట్లె విశ్వాత్మునియందు కనఁబడు దేవత్వాజ్ఞత్వ దుఃఖిత్వాదులు దేవాదిశరీరములందలి జీవుని సంబంధించినవేకాని, విశ్వాత్ముని సంబంధించినవి గావు. మఱియు అగ్ని, దారువులందు తనంతట తానే యభివ్యక్తమై నానావిధంబు లగుచుండును భగవంతుఁ డట్లు కాక, జీవమూలమున దేవాదిరూపములచే నానావిధముల ప్రకాశించు నని అగ్నికని భగవంతునికిని భేదము తెలియునది.

దేవతిర్యఙ్మనుష్యాది రూపములైన యవతారముల లీలతో నెత్తి లోకముల రక్షించుచుండును.

ఇది ద్వితీయాధ్యాయము

---

సూతుఁడు భగవంతుని యిరువదియొక్క
* యవతారములను జెప్పుట

ఓ శౌనకాది మహామునులారా! పరమాత్మ, లీలకై బ్రహ్మాండమును దదంతర్వర్తియైన కార్యజాతమును సృజింపఁదలంచికొని, మొట్టమొదట క్షేత్రజ్ఞమిశ్రమై, పదునొకండింద్రియములు పంచభూతములు నాఁబడు పదునాఱుకళలతో నొప్పుచు, నండకారణమగు మహదాది సమష్టితత్త్వసమూహమయి యున్న † రూపమును బొందెను ఆ భగవంతుఁడు జలమందు శయనించి యోగనిద్రను బొందుచుండఁగా, నతని నాభిహ్రదయకమలమునుండి మరీచ్యాది ప్రజాపతులకుఁ బతియగు బ్రహ్మ పుట్టెను ఆ యాదిపురుషుని శరీర

---

* భగవంతుని యవతారములు అనుప్రవేశావతారములనియు, స్వరూపావతారములనియు రెండువిధములు దేవాదిదేహములందు ప్రవేశించి యవతరించుట అనుప్రవేశావతారము నిజరూపముతో నవతరించుట స్వరూపావతారము రెండును కర్మహేతుకములు కావుగాన, యవతారము లనఁబడును.

† భగవంతునికి రూపము ద్వివిధము చేతనమిశ్రమైన ప్రకృతియు ప్రకృతివికారములైన మహదాది తత్త్వసమూహమును ఒకరూపము, శుద్ధసత్త్వమయమైనది మఱియొకరూపము. ఈ రెండు నిట క్రమముగాఁ జెప్పఁబడుచున్నవి.

మైన ప్రకృతికింగల యేకదేశ పరిణామములచేతనే సమస్త లోకములును గల్పింపఁబడినవి ఇట్లు బ్రహ్మకును, సమస్త లోకములకును గారణమయిన భగవంతుని రూపము కేవలము సత్త్వమయమైనది ఆ రెండవరూపము మిగుల సూత్కృష్టమయినది దానినే యనిరుద్ధరూపమందురు. అట్టి రూపమును సూక్ష్మదర్శులగు పండితులు సమధికజ్ఞానముగల మనస్సుచేఁ జూచుచున్నారు అనిరుద్ధాఖ్యమైన యీ రూపము వేయిపాదములచేతను వేయిభుజములచేతను, వేయితొడలచేతను, వేయిముఖములచేతను ప్రకాశించుచు మిక్కిలి యాశ్చర్యమును గొలుపుచున్నది మఱియు, నది వేయిశిరస్సులును, వేయి చెవులును, వేయినేత్రములు, వేయినాసికలు, వేయికిరీటములు, వేయికుండలములును గలదై తనర్చుచున్నది. ఈ యనిరుద్ధస్వరూపమే సకలావతారంబులకుఁ గారణభూతమైనది ఇది నిఖిలప్రపంచంబును సృజించిన బ్రహ్మకుఁ గారణభూతమై, తన్మూలముననసమస్తజగత్తునకు బీజభూతమని తెలియఁదగినది దీనికి నపక్షయాది వికారంబులు లేవు. కావుననే యిది యప్రాకృతమయినది ఈయనిరుద్ధునికి శరీరాంశమయిన చిదచిత్తత్త్వములయొకభాగముచే దేవమనుష్యపశుపక్ష్యాదులుద్భవించినవి అద్దేవుఁడే ముందుగ * చతుర్ముఖశరీరుండై

* ఇటఁ జతుర్ముఖుండుకూడ సనకాదులవలెనే భగవంతుని ప్రవేశావతారమనియే తెలియఁదగినది చతుర్ముఖుండుకూడ విష్ణువలె యోగిబృందంబునకు వందనీయుఁడై యున్నాఁడే! అతఁడే భగవంతుండనినఁ దప్పేమి? అన వీలులేదు సృష్ట్యాదియందు నారాయణాత్మకుండయిన బ్రహ్మయే ధ్యానింపఁబడుచున్నాఁడు కాని, కేవల చతుర్ముఖుండు కాఁడు

సనత్కుమారాది రూపముగా నవతరించి నిర్విఘ్నంబుగ *బ్రహ్మచర్యంబు సలిపె. ఇదియే మొదటి యవతారము. యజ్ఞేశుఁడయిన †యా భగవంతుఁడు లోకాభివృద్ధికై పూను

---

మఱియు "శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యంతా జగదంతర్వ్యవస్థితాః। ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః। యతస్తతో న తే ధ్యానే ధ్యానినా ముపకారకాః। అవిద్యాంతర్గతాస్సర్వే తేహి సంసారగోచరాః। పశ్చాదుద్భూత బోధాస్తే ధ్యానే నైవోపకారకాః। నైసర్గికో నవై బోధస్తేషామప్యన్యతో యతః॥" అనఁగా చతుర్ముఖ సనకాదులందఱు జగదంతర్వర్తులై యవిద్యావృతులై సంసారబద్ధులై యుందురు మొదట బద్ధులైయుండియే పిమ్మట యోగోద్భూత మయిన జ్ఞానముకలవారయి ముక్తిఁ జెందుచున్నారు కాని "వారికి నైసర్గికమగు జ్ఞానము లేదు" అని చెప్పుటచేఁ జతుర్ముఖుండు స్వతస్సిద్ధుండు కాఁడు. కావున, యోగీశ్వరాదులకు ధ్యేయుండు కాఁడు మఱియు "శ్లో॥ సృష్టింతతః కరిష్యామి త్వామావిశ్య ప్రజాపతే" అని చెప్పుటంబట్టియుఁ జతుర్ముఖుం డనుప్రవేశావతారమె కాన, ధ్యేయుండుకాఁడని తెల్లమగుచున్నది ఈ చెప్పుటచేఁ జతుర్ముఖ సనకాదులు భగవదనుప్రవేశావతార మనియుఁ బ్రథమావతారమనియుఁ దెలియుచున్నది

* బ్రహ్మచర్యంబు సలిపెననుటచే, నవతారప్రయోజనంబు తెలుపఁబడియె

† ఇంద యాగారాధ్యుఁడనియు, యాగఫలప్రదుండనియు యాగస్వరూపుఁడనియు దెలుపునట్టి యజ్ఞేశపదముయొక్క ప్రయోగముచేతను, వరాహదేహమును ధరించెననుటచేఁ దాదృశశరీరంబు మాత్రమే పరిగ్రహించెనని తెలియవచ్చుచుండుటచేతను, లోకాభివృద్ధికనుటచేఁ గేవలము సాధుపరిత్రాణార్థంబని సూచింపఁబడుటచేతను, వరాహావతారము స్వరూపావతారంబనియు తెలియఁదగినది

కొని క్రిందికిఁ గ్రుంగిపోయియున్న భూమిని బై కెత్తుటకయి వరాహదేహమును ధరించెను. ఇది రెండవ యవతారము. భగవంతుని మూడవ యవతారము ఋషిజన్మము అందు నారదరూపమును బొంది, నివృత్తి ధర్మవతులగు వారికి నివృత్తి ధర్మములమాలి ప్రవృత్తి ధర్మంబుల నాచరింపఁ గూడమని దెలుపునట్టి పంచరాత్ర శాస్త్రమును బ్రవర్తింపఁ జేసెను దేహజన్మరూపంబగు నాల్గవ యవతారమందు ధర్ముని భార్యయగు మూర్తియందు నరనారాయణులయి జన్మించి, శమదమాదిగుణములతోఁ గూడినదై యనన్యసాధ్యమగు తపమొనర్చె ఆవలఁ గపిలావతారమెత్తి, ఆత్మ యాథాత్మ్యము ననుసంధించుటచే స్వస్వరూపము నొందిన సిద్ధుల కధిపతియై, యాసురియను సిద్ధశ్రేష్ఠునకు, ప్రవర్తకులు లేని కాలముచేఁ దిరోహితమై, ప్రకృతియు మహదాదులునగు తత్త్వముల యాథాత్మ్యమును నిర్ణయించునట్టిదగు సాంఖ్యము నుపదేశించెను ఇది భగవంతుని యైదవ యవతారము తరువాత నత్రిమహాముని కనసూయయందు దత్తాత్రేయుఁ డను నామముతో జన్మించి యలర్కనకును, బ్రహ్లాదాదులకు నధ్యాత్మవిద్య నుపదేశించెను ఇది యాఱవ యవతారము. పిమ్మట నతఁడు రుచిమహామునికి నాకూతియను భార్యయందు యజ్ఞుఁడను పేరితో వెలసి యామాదులైన దేవతాగణములతోఁ గూడ స్వాయంభువ మన్వంతరకాలమెల్లఁ బరిపాలించెను ఇది భగవంతుని యేడవ యవతారము. తరువాత నామహానుభావుఁ డాగ్నీధ్రుని పుత్త్రుఁడగు నాభి యనువానికి మేరుదేవియందు, ఋష

భుండను పేరితో యోగీశ్వరుల కనుష్ఠింపఁదగినదియు, సకలా శ్రమములవారిచేఁ బూజితమును నగు ధర్మమార్గముం జూప నుదయించెను ఇది భగవంతుని యెనిమిదవ యవతారము విప్రులారా! అనంతర మా భగవంతుఁడు హుంకారంబులచే వేనునిఁజంపిన సకల మునీంద్రులచేతను లోకపరిపాలనార్థము గోరఁబడి పృథుచక్రవర్తియై జన్మించి, గోరూపధారిణియగు భూమివలన నోషధుల నన్నింటిని బితికెను. కావుననే యతఁడందఱికిని ప్రియతముండై యొప్పె ఇది భగవంతుని తొమ్మిదవ యవతారము. తరువాత నతఁడు చాక్షుషమన్వంతర కాలమునఁ బ్రవర్తిల్లిన ప్రళయమందు మత్స్యావతారమును దాలిచి భూరూపమయిన నౌకపై వైవస్వతమనువై యవతరింపఁబోవు సత్యవ్రతుని నెక్కించి కాపాడెను ఇది భగవంతుని పదవ యవతారము. పిమ్మట నతఁడు దేవదానవులమృతము నిమిత్తము మందరపర్వతమును గవ్వముగాను, పాలసంద్రమును భాండముగాను జేసి తరుచునప్పు డా పర్వతము సముద్రములో మునుఁగుచుండఁగాఁ, గూర్మావతారమును బొంది యాకొండను దనవీఁపుతో మోచెను, ఇది భగవంతుని పదునొకండవ యవతారము. పిమ్మట భగవంతుఁడు ధన్వంతరియై యవతరించెను. ఇది పండ్రెండవ యవతారము తరువాత భగవంతుఁడు మోహినీదేవిరూపము దాల్చి రాక్షసుల మోహింపఁజేయుచు దేవతలచే నమృతమును ద్రావించెను ఇది భగవంతుని పదుమూఁడవ యవతారము. తరువాత నతఁడు నరసింహరూపమునుబొంది మిగుల బలవంతుఁడగు హిరణ్యకశిపుని, జాపలల్లువాఁడు తుంగనుజీల్చునట్లు తన

గోళ్లచేఁ జీల్చి చంపెను ఇది భగవంతుని పదునాల్గవ యవ
తారము పిమ్మట భగవంతుఁడు బలిచక్రవర్తిచే నపహృత
మైన లోకత్రయమును తిరిగిపుచ్చుకొని దేవేంద్రున కీవలెనని
తలంపున నదితికశ్యపులకు వామనమూర్తియయి జన్మించి,
బలియజ్ఞవాటికకుఁ బోయి మూఁడడుగుల పరిమితిగల నేలను
యాచించి, యతనిఁ బాతాళమునకు నడఁగద్రొక్కెను, ఇది
భగవంతుని పదునైదవ యవతారము తరువాత భగవం
తుఁడు పరశురాముఁ డనియందుఁ దనకళలనుంచిన, నతఁడు బ్రహ్మ
కుల ద్రోహకులగు రాజుల నిరువదియొక్కమారు సంహరించి
భూమండలమును క్షత్రబీజరహితమునుగా నొనర్చె ఇది భగ
వంతుని పదునాఱవ యవతారము పిమ్మట నతఁడు పరాశర
మహర్షివలన సత్యవతియందు జనించి, బాదరాయణుఁడను
పేరితో నొప్పి, మనుష్యు లల్పమతు లగుటఁజూచి వారికిఁ
గూడఁ దెలియునట్లు వేదవృక్షమును ఋగ్యజుస్సామాథర్వ
భేదములచేతను, దదవాంతర భేదములచేతను శాఖా శాఖ
లుగా విభజించె ఇది పదునేడవ యవతారము తరువాత
భగవంతుఁడు దేవతల కార్యము నెఱవేర్ప దశరథునకుఁ
గుమారుఁడయి యవతరించి శ్రీరాముఁడన నొప్పి సముద్ర
బంధనము మొదలగు మహాకార్యంబులఁ జేసెను ఇది భగ
వంతుని పదునెనిమిదవ యవతారము పిమ్మట నతఁడు యదు
వంశమున జన్మించి బలరామకృష్ణులను నామములతో నొప్పి
భూభారమును దీర్చినవాఁడయ్యెను ఇవి భగవంతుని పందొ
మ్మిదవ యవతారము నిరువదవ యవతారము నైయున్నవి
తరువాత నతఁడు కలియుగమందుఁ గ్రమక్రమముగా వచ్చు

చున్న దుర్మార్గులను మోహింపఁజేయుటకయి కీకటదేశమందు (మధ్యగయాప్రదేశమునందు) జినునకుఁ గుమారుండై బుద్ధుండను పేరితోఁ బ్రసిద్ధికెక్కును. ఇది యిరువదియొకటవ యవతారము తరువాత భగవంతుండు కలికృతయుగంబుల సంధియందు రాజులందఱు చోరప్రాయులై కేవలమధర్మముల నాచరింప వారలఁ జెండాడుటకై విష్ణుయశుఁడను పేరుగల బ్రాహ్మణునకుఁ గల్కిమూర్తియై జన్మించి యాకాలపు దుష్టుల నందఱిని సంహరింపఁగలఁడు ఓ శౌనకాదులారా! ఎండిపోవని యొక సరస్సునుండి వేలకొలఁది కాలువలు బయలువెడలునట్లు శుద్ధసత్త్వమూర్తియు, భగవంతుఁడునగు ననిరుద్ధునినుండి కలిగిన యవతారము లెన్నియో కలవు. మఱియు, మంత్రద్రష్టలైన వసిష్ఠాది ఋషీశ్వరులును దేవలాత్మపరమాత్మ యాథాత్మ్యమును దెలిసియున్న శుకాదిమునిచంద్రులును, నింద్రాది దేవతలును, బ్రియవ్రతాది మనుపుత్రులును, మహాప్రభావవంతులైన దక్షాదిప్రజాపతులును, వీరందఱు భగవంతుని యంశములవలనవే సంభవించిరి అనిరుద్ధదేవుని *కంశాంశసంభూతులైన యీఋషి ప్రభృతులును,

* పూర్ణావతారములనియు, నంశావతారములనియు భగవంతుని యవతారంబులు రెండువిధంబులు అందుఁ బూర్ణావతారమనఁగా షాడ్గుణ్యపూర్ణుఁడై స్వరూపముతో తానై యవతరించుట. అంశాంశసంభూతములగు నవతారములనఁగా తత్తజ్జీవాంతరాత్మయై షడ్గుణపరిపూర్ణుఁడై యున్న భగవంతుఁడు జీవాత్మ మూలకముగా నిజవీర్యాదిగుణలేశమును వెలిపుచ్చుచు నావిర్భవించుట భగవంతుఁడు నిరంశుఁడు గాన నతనియంశము కలుగదు. కనుక విట అంశమనఁగా నతనికి అపృథక్సిద్ధ విశేష

ఆ భగవంతుని పూర్ణావతారమైన శ్రీకృష్ణుఁడును, దేవేంద్రునకు శత్రువులగు రాక్షసాదులచే నాకులపడుచుండు లోకమును ప్రతియుగమందును బాధలుడిపి సంతోషపెట్టుచుండును. ఓ మునులారా! భగవంతుని * యీ యవతార రహస్యమును నెవఁడేని సమాహితచిత్తుఁడై భక్తితోఁ బ్రాతఃకాలమందును సాయంసమయమందును గీర్తించునేని, సకలదుఃఖములనుండి విడివడి ముక్తుఁడగుచున్నాఁడు మఱియు † రామకృష్ణాద్యవ

---

ణములైన గుణములందలి యంశమే గ్రాహ్యము. పైని చెప్పఁబడినవానిలో వరాహ నారాయణ మత్స్య కూర్మ మోహినీ నృసింహ వామన రామకృష్ణావతారంబులు పూర్ణంబులైనట్టు లాయా పురాణంబులవలనఁ గ్రహింపవలయును తక్కినవన్నియు నంశావతారంబులే

* ఇందులకు మూలమున "జన్మగుహ్యమ్" అని యున్నది ఈ చెప్పుటచే భగవంతుని జన్మములు జీవుని జన్మములవలెఁ గర్మాయత్తములు కాక స్వసంకల్పమూల ననుసరించి యుండునని తెలియఁదగినది

† 30 మొదలు 37 వ శ్లోకమువఱకు నద్వైతార్థము.

ఓయీ! జీవునికి దేహాద్యయ సంబంధ మెట్లు కలుగుచున్నది? ఆ సంబంధ మెట్లు విడివడును? అని యందువేని చెప్పెదను వినుము ఆ దేహాద్యయ సంబంధము భగవంతుని మాయవలనఁ గలిగిన యవిద్యకు సంబంధించినది ఎట్లన చిదేకరసుఁడైన జీవునికి స్థూలశరీరము పరమాత్మ మాయాగుణ పరిణామములయిన మహదాదులచే నాత్మస్థానమునఁ గల్పింపఁబడినది అట్లయినను స్వరూపావరణ మూలమున నా శరీరము జీవుని రూపమని తలఁపించును మఱియు మేఘములనుబట్టి యాకాశమునకును, భూమి సంబంధమైన పరాగమునుబట్టి వాయువునకును రూప మున్నట్లు భ్రమ చెందుచున్నట్టుగానే, తెలివిలేని మానవు లారూపమే జీవుని స్వ

తారములు మాత్రమే భగవద్రూపములని చెప్పనవసరము

మనుకొనుచున్నారు కాని యతఁడు రూపరహితుఁడని యూహింప లేకున్నారు ఓ మునులారా! ఆ స్థూలరూపముకంటెఁ బరమైనదియుఁ, కరచరణాద్యవయవములు లేక పోవుటచే నస్పష్టమైనదియు, నందుచేతనే కనులకుఁ గనఁబడనిదియునగు నొక పదార్థము కలదు అదియే లింగ శరీరము నాఁబడు ఇదియు నవిద్యామూలకమైనదియే ప్రత్యక్షము గాని వస్తువు ఉన్నదని చెప్పుటకుఁ బ్రమాణమేమి యని యడుగుదురేమో, అట్లయినఁ జెప్పెదవినుఁడు ఆ లింగశరీరమే జీవమున కుపాధిభూతమయి పరఁగుచున్నట్లు తెలియుచున్నది ఆ జీవోపాధి స్థూలరూపమే యనఁ గూడదా? అంతకంటెఁ బరమైనట్టి యగోచరపదార్థ మున్నదని యేల నిశ్చయించుకొనవలెను? అన వీలులేదు ఆ పరవస్తువు జీవాత్మలయొక్క సుఖదుఃఖానుభవంబులకును బునర్జన్మాదులకు నవశ్యమైనది. స్థూలశరీరమే యని చెప్పినచో నా స్థూలశరీర మిక్కడనే దహింపఁబడుచుండ, నది పునర్జన్మాదుల కెట్లు కారణమగును? అది లేనిచో వలనుపడదు కావునఁ గంటికిఁ గనుపడని పరవస్తు వొక్కటి యున్నదని యంగీకరింపక తీఱదు ఇప్పుడు జీవునికి దేహద్వయసంబంధ మెట్లువచ్చినదో యెఱిఁగితిమి ఇఁకఁ దద్ద్వయముక్తి యెట్లుకలుగునో చెప్పెదవినుఁడు ఎప్పుడు మానవుఁడు కార్య కారణములయిన స్థూలసూక్ష్మశరీరముల నవిద్యచే నాత్మయందుఁ గల్పింపఁ బడినవని తెలిసికొనుచున్నాఁడో, అప్పుడు జ్ఞానైకస్వరూపమగు పరమాత్మ దర్శనము కలుగును మాయ, అవిద్యారూపమై యావరణ విక్షేపములను జేయుచున్నంతకాలము నది విరతిచెందదు అదియే విద్యారూప మగుచు న్నప్పుడు సదసద్రూపమగు జీవోపాధిని దహించి కట్టెలు లేనప్పుడు తనంతట తానె యుపరమించుచున్న యగ్నిహోత్రునివలె స్వయముగా నే శాంతించును. అప్పుడే జీవుఁడు బ్రహ్మములోఁ గలియుచున్నాఁడు. పిమ్మట నా బ్రహ్మమందు నానందముతోఁ బూజింపఁబడుచున్నాఁడు ఇట్లు మాయ జీవునియొక్క జన్మాదులకుఁ గారణమగుచున్నది అట్లే

లేదు. జ్ఞానస్వరూపుఁడు, నవ్యక్త స్వరూపుఁడు నగు భగవంతుని మాయాగుణ పరిణామము లయిన మహదాదులచే, నాధారభూతమయిన * యాత్మయందు రచితమై కనఁబడు

---

మాయ జన్మరహితుఁడును ఉదాసీనుఁడు నగు నీశ్వరునికి జన్మములు, కర్మములు నున్నట్లు తోఁపింపఁజేయుచున్నది కాని నిజముగా నతని కట్టివి లేవు ఇట్లా భగవంతుఁడమోఘమైన లీలతో సమస్తమగు ప్రపంచమును సృజించుచున్నాఁడు, రక్షించుచున్నాఁడు, లయమును బొందించుచున్నాఁడు ఇట్లు సర్వదా మాయాసంబంధముగలిగి సృష్ట్యాదికర్మములు చేయుచున్నను దత్సంబంధ మతని కించేనియు లేదు ఆ భగవంతుఁడు సమస్తభూతముల హృదయములయం దున్నవాఁడయి స్వతంత్రుఁడై షడింద్రియ నియంతయై యా యింద్రియములనుండి కలిగెడి సుఖమును దూరమునుండి యనుభవించుచున్నాఁడు అట్టి భగవంతునికి సృష్టి మొదలగు కర్మములతోను, నింద్రియసుఖములతోను ఏమి ప్రయోజనమా? అందురా? అట్లయినఁ జెప్పెద వినుఁడు అతని కట్టి కోర్కెలేదు. వానితో నేమియుఁ బ్రయోజనమును లేదు ఇవి యన్నియు భగవంతుని లీలలుగాని మఱియేమియుఁగావు మఱియు నటుఁడు పెక్కు నామరూపములతో వచ్చినప్పు డవివేకు లందలి యాథార్థ్యమును దెలిసికోలేక పెక్కండ్రని భావించుకొనుచున్నట్లే, భగవంతుని యాథార్థ్యమును దెలిసికోలేక యబుద్ధు లతనికే పెక్కు నామరూపములు, విషయాది సౌఖ్యములు నున్నవని యనుకొనుచుందురుగాని సత్యమును గనిపెట్టలేరు

* ఇట భగవంతునికి "ఆత్మ" అనియు జగత్తునకు "రూపము" అనియు చెప్పఁబడినది ఆత్మకు రూపము, అనఁగా శరీరము - ఎప్పుడును ధార్యమై యుండును కాఁబట్టి పరమాత్మయగు భగవంతునికిఁ, గనఁబడుచున్న యీ జగము రూపము-అనఁగా శరీరము-అని తెలియవచ్చుచున్నది

చున్న యీ ప్రపంచమంతయు నా భగవద్రూపమే. * ఇట్లు ప్రపంచాంతర్గతములై వర్తించు దేవమనుష్యాది శరీరము లన్నియు భగవంతుని రూపములై యుండ, నది తెలిసికొనక జీవులు 'నేనే దేవుఁడను' ''నేనే మనుష్యుఁడను'' అని యీ దేహములు తాముగాను, తమవిగాను భ్రమించుచున్నారు ఆకాశము యాథాత్మ్య మెఱుఁగని వారు మేఘములనుబట్టి యాకాశమునకును, వాయుతత్త్వ మెఱుంగనివారు భూమి సంబంధియయిన పరాగమునుబట్టి వాయువునకును, రూప మున్నదని భ్రమ చెందునట్లు, ప్రత్యగాత్మ తత్త్వము నెఱుఁగని వారు భ్రాంతిచే ద్రష్టయయిన జీవునియందు దృశ్యత్వమగు

---

* శరీరజాత మెప్పుడును జీవాత్మచేఁ ధరింపఁదగియుండును కావున దేవాదిశరీరములు తమయం దభిమానముగల జీవాత్మలచే ధార్యము లగుట నిశ్చయము ఇట్లు ధరించుచున్న జీవాత్మకు ధార్యములైన యీ శరీరములు రూపములగుట సిద్ధమైయుండఁగా, నది యారోపిత మగుట యెట్లు పొసఁగు? నఁగా శ్రు "య ఆత్మని తిష్ఠన్" 'ఏ పరమాత్మ జీవునియం దంతరాత్మయై నివసించుచున్నాఁడో' శ్రు. "యస్యాత్మా శరీరమ్" "ఏ భగవంతునికి నాత్మ శరీరభూతమగుచున్నదో" అను నిట్టి శ్రుతిప్రమాణముల వలన జీవాత్మయుఁ బరమపురుషునిచే శరీరముగా ధరింపఁబడుచున్నందున జీవునికిని జీవధార్యమైన శరీరజాతమునకు ముఖ్యధారకుఁడు పరమపురుషుఁడే యగును కావున దేవాది శరీరజాతము భగవంతునికే ముఖ్యముగా రూపమగును, కాని జీవాత్మకుఁగాదు కావున వెనుకటిశంక నిరసింపఁబడినది ఇందుఁ దెలియఁదగిన ముఖ్యాంశమేమనఁగా, 'దేహాత్మలు రెండు పరమపురుషునిచే శరీరముగా ధరింపఁబడుచున్నవి' అన్న జ్ఞానమెప్పుడు భ్రాంతివిషయము కాదు కాని ప్రకృతిపురుషులు బ్రహ్మస్వరూపము కావనెడి జ్ఞానము, ప్రకృతిమయములగు దేహాదులందు నాత్మజ్ఞానము, నేను స్వతంత్రుఁడ ననెడి జ్ఞానము, దేహాదికమగు ప్రకృతి ప్రత్యగాత్మకు ధార్యమగుచున్నదనుటయు, భ్రాంతిమూలక మని యెఱుంగఁదగినది

దేహాది శరీరములను వాని రూపముగా నారోపించుచున్నారు కాని దృశ్యమగు నీ దేహాదిశరీరజాతము జీవస్వరూపము కాదని యెఱుఁగరు 'దృశ్యత్వమును జీవునియందు భ్రాంతిచే నారోపితమే కాని యది జీవస్వరూపము కాదన్నచో, నిఁక జీవస్వరూపమెట్టిది?' అని యడుగవచ్చును. అది యచిదాత్మకమయిన దృశ్యప్రపంచముకంటె విలక్షణమైనది, * మఱి ప్రకృతివలె కారణదశయందు స్థూలముగాకుండి కార్యదశయందు తనగుణములు బహువిధముల విభక్తములగుటచే స్థూలత్వము నొందునది కాదు † కావుననే కార్యావస్థయందు స్థూలమై ప్రకృతివలె దృష్టమగునది కాదు కారణావస్థయందు ప్రకృతి యెట్లు శ్రుతమగుచున్నదో యట్లు తానును శ్రుతమగునదిగాదు ఇట్లు దృష్టమును శ్రుతమును గామిచే నది బాహ్యేంద్రియములకు గోచరమైనదియుఁగాదు ఇట్టి వస్తువే జీవుఁడనఁబడును. ఆ జీవుఁడు ప్రకృతిసంబంధముచే మాటిమాటికి జన్మించుచుఁ జచ్చుచుఁ, దిరిగి జన్మించుచు వర్తించుచుండును జీవునికిఁ బునర్జన్మంబును గలిగించు

---

* ఈ చెప్పుటచే నచిత్తు కారణావస్థయందు సూక్ష్మావస్థ నొంది యున్నను కార్యావస్థయందు సత్త్వాదిగుణములతోఁగూడి స్థూలమగుచున్నది కాన, అచిత్తు జీవస్వరూపము కాదని తెల్లమగుచున్నది

† అనఁగా నచిత్తు, కార్యావస్థయందుఁ జూడఁబడుచుండును కారణావస్థయందు "అచేతనాపరార్థాచ నిత్యా సతతవిక్రియా" అనెడి శాస్త్రముచే శ్రుతమగుచున్నది జీవస్వరూపమిట్లు కాదు కనుక 'దృష్టము కాదు, శ్రుతముకాదు' అని తెలియఁదగినది జీవుఁడవ్యక్తుఁడన్నందుకు 'అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే' అనెడి భగవద్గీతాశాస్త్రము ప్రమాణము

మాయాసంబంధ మెట్లు నశించును? మాయా సంబంధము
గల పునర్జన్మాదికమును విడిచిన జీవస్వరూప మెట్టిది?
అన్నచో, అచిత్తును సంబంధించిన యుత్పత్తి వినాశము
లాత్మయం దజ్ఞానముచే నారోపింపఁబడును. స్వశరీరకుఁడైన
పరమాత్మను గూర్చి సమ్యగ్జ్ఞానము కలిగెనేని యప్పుడా
యాత్మను నాయుత్పత్తి వినాశములు నివర్తించును కాన పున
ర్జన్మనివృత్తియుఁ గలుగును ఇట్లా జ్ఞానముచే నుత్పత్తి
వినాశములు దూలి, దానం జేసి ప్రకృతిసంగముచు వీడినట్టి
కేవల శుద్ధాత్మస్వరూపజ్ఞానమే ముక్తజీవస్వరూపము
మఱియు మహదాది కార్యములచే విపులమయిన మాయయు,
మాయామూలకమయి దేహాత్మాభిమానరూపమైన మతియు*
నివర్తించిన కాలమందే జీవుండు సత్యసంకల్పాద్యష్టగుణంబులు
గలవాఁడై బ్రహ్మానందసుఖము ననుభవించుచుఁ బరమబద
వాసులచే గౌరవింపఁబడుచుండును (మీరిప్పుడు జీవస్వరూ
పము నెఱింగితిరి ఇంక భగవజ్జన్మములకును జీవుఁ డవలంబించు
చున్న జన్మములకును భేదముకలదు. ఆ భేదమును దెలియం
జెప్పెదను వినుఁడు) జీవుఁడు కర్మాధీనుఁడయి జన్మముల నెత్తు
చుండును. మఱియుఁ బుణ్యపాపకార్యముల నాచరించు
చుండును. భగవంతుఁడట్లు కాక, సంకల్పమాత్రముచే లీలకై
జన్మముల నవలంబించుచుండును భగవంతుఁడు జీవునివలెఁ

* ఇట మాయ నివర్తించుట యనఁగా, నది నశించుట యనరాదు
ఏమన "నిత్యాసతతవిక్రియా" అని మాయ నిత్యయగునట్లు స్పష్టమగు
చున్నది కాన నివర్తించుట యనఁగా - సంబంధము వీడుట యని
గ్రాహ్యము

గర్మాధీనుఁడయి యుండఁడు అతనికి జీవునివలెఁ బుణ్యపాపాది కర్మములు లేవు మఱియు నతఁడు సర్వహృదయాంతర్యామి భగవంతుని జన్మములును కర్మములును ఇట్టివి గావున, జ్ఞానాధికులైనవారు వానిని వేదరహస్యములుగా వర్ణింతురు. అనఁగా నవి జీవుని * జన్మకర్మములతోఁ బోల్చి యిట్టి వట్టి

---

* 'ఇంమలఙ ఏవం జన్మాని కర్మాణి హ్యకర్తు రజనస్యచ। వర్ణయన్తిస్మ కవయో వేదగుహ్యాని హృత్పతేః' అని మూలము ఇచట భగవంతుని 'అజనస్య' అని జన్మరహితునిఁగాను, 'అకర్తుః' అని కర్మరహితునిఁగాను జెప్పి, మరల ఆతని జన్మములగు కర్మలను కవులు వర్ణింతురనుట విరుద్ధముగానున్నది అయినను దీనిని కవులు వేదగుహ్యములుగా వర్ణింతురని యున్నది అనఁగా వేదమునందు 'అజాయమానో బహుధా విజాయతే' అనుచో 'అజాయమానః' అని పుట్టనివాఁడుగాఁ జెప్పి 'బహుధావిజాయతే' అని పెక్కువిధములఁ బుట్టునట్లు చెప్పఁబడియున్నది ఇది యెట్లనఁగా "నహింస్యాత్సర్వభూతాని" అని నిషేధమును 'పశుమాలభేత" యని విధియు నున్నవి ఈ రెంటికి విరోధమున్నను వీనికి విషయములు వేఱువేఱగుటచే నా విరోధము గలుగదు కాన నిట, వానివాని విషయభేదములను నిరూపించి నిషేధమునకు యాగవ్యతిరిక్తస్థలములందుఁ బశుహింసకూడదనియు, విధికి యాగములందది కూడుననియు గ్రాహ్యము అట్లె యిచ్చట "అజాయమానః" అనఁగా జన్మము లేనివాఁడని చెప్పినను పిదప "బహుధావిజాయతే" అనఁగా నానావిధములఁ దా నవతరించుచున్నాఁడని వ్యక్తముగా చెప్పఁబడుటచే, మొదటిదానికిఁ గర్మాయత్తము అయిన జన్మాదిములు లేవనియు, రెండవదానికి సంకల్పమూలముగా జన్మములు గలవనియు చెప్పఁకొనవలెను కావున వెనుకటి విరోధము నిరస్తమగుచున్నది ఇట్లే 'అకర్తు' 'అజనస్య' అనువానికి విరుద్ధముగా 'జన్మాని' 'కర్మాణి' అని యుండుటను, వేదమునందు వానివానికిఁగల విషయభేదములను గుఱుతెఱిఁగి విరోధము లేనట్లు గ్రహింపవలయును అనఁగా మొదటి వానికి కర్మాధీనముగా జన్మకర్మములు లేనివాఁడనియు, రెండవవానికి సంకల్ప

ఱని తెలిసికొనరానివి గావున, వేదములయందలి వాని తాత్పర్య భేదములను గుఱుతెఱిఁగి యిట్టివని యా వేదములచేతనే తెలియఁదగినవిగా వర్ణింతురు. భగవంతుఁ * డమోఘములయిన లీలలుకలవాఁడై పరిదృశ్యమానమగు చిదచిదాత్మకమయిన

---

జాలముగా జన్మకర్మములు గలవాఁడనియు వేదములచే తెలిసికొనవలయునని భావము. కావున కవులా జన్మాదులను వేదరహస్యములుగా వర్ణింతురని చెప్పఁబడినది మఱియు నిటుఁ గవులు వర్ణించుచున్నారనుటచే, భగవంతుని జన్మంబులయుఁ గర్మంబులయుఁ దత్త్వము జక్కఁగ నెఱిఁగియుందురు కాన వారే వర్ణింపఁగలరు, కాని కుబుద్ధులు వర్ణింపలేరరని స్పష్టమగుచున్నది. ఈ యర్థము "తస్యధీరాః పరిజానంతియోనిమ్" అనఁగా పండితులు భగవంతుఁ డధిష్ఠింపఁదగిన శరీరమును దెలిసికొనుచున్నారు" అనెడి శ్రుతివలన సంగ్రహింపఁబడినది మఱియు "నమోహ్యాచ్ఛింతయన్కవిః" అనునట్లు కవులు జ్ఞానాతిశయము కలవారగుటచే నొక విషయ మాలోచించునపుడు మోహమును బొందరు కనుక భగవంతుఁడు కర్మాధీనుఁడయి యుండక పోవుటను, స్వసంకల్పము చేతనే జన్మముల నెత్తుచుండుటను, అట్లు జన్మించునప్పుడు తన స్వభావమును విడిచిపెట్టక యుండుటను జక్కఁగాఁ దెలిసికొని వర్ణించుచున్నారనియు గ్రహింపఁదగినది ఇంతియకాక అకర్తయగు భగవంతునికి వేదరహస్యములగు కర్మము లున్నవనుటచే, భగవంతుఁ డొనర్చుచున్న జగద్వ్యాపారాదులకును, జీవుఁ డొనర్చుచున్న కర్మములకు' మిక్కిలి భేదము గలదనియు తెలియవచ్చుచున్నది

* ఇందు లీలాపదమువలన జగద్వ్యాపారాదికము మిగుల నచింత్యమయి దుస్సాధ్యంబై యున్నను, లీలవలె సుకరముగా నెఱవేర్చుచున్నట్లు తెలియుచున్నది. మఱియు జగద్వ్యాపారాదికము లీలామాత్రమే కాని కర్మ సంబంధమయినది కాదనుటచే, ప్రాచీన కర్మవాసనలవఁ దగున

టు

ప్రపంచమును * సృజించుచున్నాఁడు, పాలించుచున్నాఁడు, నశింపఁజేయుచున్నాఁడు. జీవుఁడట్లు కాక యల్పములయిన కర్మములొనర్చుచు నడుమ విఘ్నములకు లోఁబడి వాని నైనఁ గొనసాగింపనేరఁడు మఱియు నా భగవంతుఁడు చిద చిదాత్మకములయిన సమస్తభూతములయందు నంతరాత్మ రూపము నొందియున్నవాఁడయ్యు, జీవుఁ డనుమాపకలక్షణ ములచేఁ దెలియఁబడునట్లుగాక, సర్వభూతములకుఁ దెలియ రాకుండును, జీవునివలె కాలకర్మాదులకుఁ బరతంత్రుఁడు గాఁడు, స్వతంత్రుఁడు మఱి యాజీవునివలె జ్ఞానాదులకు విప రీతములయిన గుణముల కాశ్రయుఁడుగాక, జ్ఞానశక్త్యాది షడ్గుణముల కాటపట్టగువాఁడు ఇంతేకాక జీవునివలె సుఖ మును దుఃఖమును మోహమును బొందక, షడింద్రియ వేద్యములైన శబ్దాదులచే లీలారసము ననుభవించుచుండును

ప్రవర్తిల్లుబుద్ధి కనుగుణము లయిన సుఖదుఃఖములకుఁ గారణములగు జీవుని కర్మములకు, భగవంతుని కర్మములకు భేదమున్నట్లు తెలియుచున్నది "అమోఘు" అనుటచే జీవుని కర్మకలాపము విఘ్నములకు లోనయి చెడును గాని, భగవవంతుని కర్మకలాప మట్లుకాదు. కనుక భగవజ్జీవచేష్టితంబులకు భేదము స్పష్టమగుచున్నది ఇట్లు కర్మభేదమును బట్టియే జీవబ్రహ్మములకు భేద మున్నట్లు తెలియవచ్చుచున్నది

* ఇట సమస్త ప్రపంచముయొక్క సర్గాదికర్మములఁ జేయు చున్నాఁడనుటచే, భగవంతుఁడొనర్చు కార్యము లనల్పములైయుండుటచే నత్యల్పములయిన జీవుని కర్మములకును, వానికిని మహాభేదమున్నట్లు తెలియుచున్నది

మఱియు నా భగవంతుఁడు తన సంకల్పముచేత దేవాదిరూపములను వేషమయములైన తన వాక్కులచేత దేవాదినామములను నటచర్యవలెఁ గావించుచున్నాఁడు అట్లు కావించు నా యీశ్వరుని ప్రకారములను, శబ్దాదివిషయాసక్తమైన కుత్సితబుద్ధి గలిగి, 'నేను నాయది' యను నభిమానములచే స్వాత్మపరమాత్మ స్వరూపములను దెలియకున్న ప్రాణి యెంత నైపుణ్యముచేతఁగాని తెలిసికోన లేఁడు. కాన శబ్దాదులందు విరక్తులై స్వాత్మపరమాత్మల యాథాత్మ్యమును మననము చేయుట్టి బుద్ధిమంతు లెఱుఁగుదురు మఱియు నటుఁడు విచిత్రములయిన వేషములను ధరించునట్లు భగవంతుఁడు మత్స్యకూర్మాద్యవతారములను దాల్చుచున్నాఁడు నటుఁడా యా వేషములను దాల్చునప్పుడు స్వస్వభావమును విడువక యాయా వేషములకుఁ దగు చేష్టలను, చర్యల నెట్లు నటించునో, యట్లే భగవంతుఁడా యా యవతారములను దాల్చునప్పుడు స్వస్వభావమును విడువక యందుల కనుకూలములు లయిన చేష్టలను చర్యలను లీలలుగా నవలంబించుచుండును ఎవఁడు మాయాగుణములగు కామాదులు విడిచి భగవంతుని పాదపద్మముల సేవించుచున్నాఁడో, వాఁడు తప్పక భగవంతునిలీలల నెఱిఁగినవాఁడై, యపారవీర్యుఁడును జక్రహస్తుఁడు నగు పరమపురుషుని విష్ణుని * కవిచ్ఛిన్నముగు సేవ చేయునో

* ఇట్లే 'భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప' అని అనన్యమైన భక్తిచేత నే

వాఁడా చక్రపాణిపదవి నెఱుఁగును. మునులారా! పూజ్యుల రగు మీ రింద ఖిలలోకనాథుఁడగు వాసుదేవునియెడల సర్వ విధములఁ ద్రికరణములచేతను మీ యాత్మలచే భక్తియోగము నిట్లు గావించుచున్నారు, గావునఁ గృతార్థులరు 'భక్తి యోగ మాత్రమును జేసినంతనే కృతార్థుం డెట్లనవలదు ఆ భక్తియోగము కేవలమైనది కాదు అది కలుగఁగా, గర్భ జన్మ జరామరణాదిదుఃఖమూలం బగుటం జేసి భయంకరమగు సంసార పరిభ్రమణము మరలఁ గలుగదు భాగవత మనెడి యీ పురాణము ఉత్తమశ్లోకుండగు భగవంతుని చరితములం బ్రతిపాదించునది గాన వేదతుల్యమైనది దీనిని సకలనిగమ దర్శియగు భగవంతుఁడు వ్యాసుఁడు రచించెను. మఱియు నిది సమ్యగ్జ్ఞానము కలిగించి కృతార్థులను జేయునది, మిక్కి-లియు మంగళాస్పదమైనది కాన దీనిని విని జనులు ముక్తి నొందుటకై, వ్యాసుఁడు రచించి జ్ఞానులకెల్లఁ దలమిన్నయగు తన సుతుఁడునగు శుకునిచే నధ్యయనము చేయించెను సమస్తవేదములనుండియు నితిహాసములనుండియు సారమెత్తి యీ పురాణముగా రచింపఁబడినది. దీని నధ్యయనము చేసిన యాశుకుఁడు, గంగయందుఁ బ్రాయోపవిష్టుండై మహా ఋషులు తన్నుఁ బరివేష్టింప నొప్పుచున్న పరీక్షిన్మహారాజునకు

---

పరమపురుషునిఁ గఱుగాఁపునఁ దెలియ శక్యమగు నని గీతయందుఁ జెప్పఁబడియున్నది

వినిపించెను. విప్రులారా! ఆరాజుసన్నిధిని మహాతేజుండగు నా బ్రహ్మర్షి శుకుడు వినిపించుచుండఁగా, నేను నందుఁ జొచ్చియుండి యా ముని యనుగ్రహమువలన నా పురాణమును నధిగమించిన వాఁడనైతిని. కాన నేను దానిని నధిగమించిన ప్రకారమున, నా బుద్ధికొలఁదిని, మీకు వినిపించెదను. భగవంతుఁడగు కృష్ణుఁడు ధర్మజ్ఞానాదులతోఁగూడ నిజలోకమునకు వేంచేసిన పిదపఁ గలి ప్రవర్తించుచుండఁగా, రాత్రియందు దృష్టి నశించున ట్లిందుఁ బ్రజ్ఞ నశించినది. మరల సూర్యుఁ డుదయింపఁగాఁ బోయినదృష్టి కలుగునట్లు, జనులకుఁ బ్రజ్ఞ ప్రవర్తించుటకై యీ పురాణ మిపు డుదయించినదయ్యె. ఇది మూఁడవ యధ్యాయము

---

వ్యాసుఁడు వ్యాకులచిత్తుఁడై చింతించుట, నారదుఁడు వచ్చుట

సూతుఁ డిట్లు చెప్పుచుండఁగా బ్రహ్మసత్రదీక్షితులగు నమ్మునిజనుల కధిపతియు వృద్ధుఁడును ఋగ్వేదియునగు శౌనకుఁ డతనిం గొనియాడి యిట్లనియె. 'సూతా! నీవు నిఖిల తత్త్వజ్ఞానమును బడసిన భాగ్యవంతుఁడవు. మఱి మాటాడు వారలలో మేటివి. కాన భగవంతుఁడగు శుకుఁడు పరీక్షిత్తునకుఁ జెప్పినదియుఁ బవిత్రమునగు భాగవతపురాణకథను మాకుఁ జెప్పుము ఈ భాగవత మేయుగమునం దెచ్చోట నే కారణమునఁ బ్రవర్తిల్లినది? కృష్ణద్వైపాయనముని యే

హేతువుంబట్టి యెవరు సంబోధింపఁగా నీ భాగవతసంహితను రచించెను? అమ్మహర్షి పుత్రుఁడు శుకుఁడు కేవలుఁడుగాఁడు, యోగిశ్రేష్ఠుఁడు, * సమదర్శి. దేవమనుష్యత్వాది భేదము లాత్మయం దారోపింపఁడు గాన, నిర్వికల్పకుఁడు అతని మతి భగవంతునియందే నిశ్చలమై యుండును. మఱియు, నతఁడు † జాగరూకుఁడు తన మహత్త్వమును వెలిపుచ్చు స్వభావము లేక గూఢుఁడై యుండువాఁడు. చూచువారి కతఁడు మూఢునివలెఁ జూపట్టుచుండును, ఒకప్పుడు శుకుఁడు ముందు పోవుచుండఁగా, నాపుత్రుని వెనుకొని వచ్చుచున్న వ్యాసునిఁజూచి దిగంబరలై జలములం గ్రీడించుచున్న దేవతా

---

* ఇట సమదర్శి యనఁగా సమానమైన దర్శనము గలవాఁడు – సమముగాఁ జూచువాఁడనుట ఎట్లనఁ? ప్రకృతి, జీవులు, ఈశ్వరుఁడు అని తత్త్వములు మూఁడు ప్రకృతియందు – అనఁగా ప్రకృతి వికారములైన దేవమనుష్యాది శరీరము లన్నిటియందును, అవియెల్ల ప్రకృతి పరిణామరూపము లనియు, జీవులందు అందఱును జ్ఞానైకాకారు లనియు, భగవంతునియందు అంతటను అవిచ్ఛిన్నుఁడైయున్న యా పరమాత్ముఁ డన్నిటను సత్యజ్ఞానాది కల్యాణగుణాకరుఁడనియు, ఆ యా తత్త్వము లందు నా యా విధమున సమముగా కనుఁగొనుటయే సమదృష్టి ఇదియే 'విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శునిచైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శినః' అని గీతయందుఁ జెప్పఁబడినది

† జాగరూకుఁడనఁగా 'యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ' అని సర్వభూతములకు రాత్రివలె అప్రకాశమైన అధ్యాత్మ విషయమందు ముని మేలుకొనియున్నాఁడు అనఁగా, నది మునికి ప్రకాశముగా తెలిసియుండు నన్నట్లు, అధ్యాత్మ విషయజ్ఞానము గలవాఁడని భావము

స్త్రీలు, అతఁడు దిగంబరుఁడు కాకున్నను, సిగ్గుపడి తాము వలువలు గట్టుకొనిరి, అతనికొడుకు దిగంబరుఁడై యుండియు, నతనింజూచి వలువలు గట్టుకొనరైరి. ఈ విచిత్రమును వ్యాసుఁడు చూచి, వారిని 'శుకునిం జూచియు వలువ లేల కట్టరైతి' రని యడుగఁగా, వా రతనితో 'నీకు స్త్రీయనియుఁ, బురుషుఁడనియు భేదమున్నది నీ పుత్రునకో, ప్రకృతిపురుష విలక్షణుఁడైన పరమాత్మునియందే దృష్టిగనుక, నదితప్ప మఱొక్క భేదము తెలియదు కాన, నతనినిజూచియు మాకు లజ్జ పుట్టదయ్యె' ననిరి అట్టి మహాముని యగు శుకుం డున్మత్తునివలె, జడుని చందంబునను, మూఢుని విధంబునను, నెప్పుడుఁ గురు జాంగల దేశంబులఁ దిరుగుచుండి హస్తినాపురంబున కెట్లుపోయె? హస్తిపుర వాస్తవ్యుల కెట్లు తెలియఁబడె? నాయనా! పాండవ వంశాలంకారుఁడును రాజర్షి యు నయిన పరీక్షిత్తునకును శుక మహాయోగితో నెట్లు సంవాదము ప్రవర్తిల్లె? ఆ సంవాదమందు పరమాత్మ ప్రతిపాదకమై శ్రుతి తుల్యమగు భాగవతసంహిత యెట్లు ప్రవర్తిల్లినది? మఱియు, మహాభాగుఁ డమ్మహాయోగి గృహమేధుల గృహంబులను బవిత్రీకరించుకొఱకు, గోవును బాలు పితుకునంత కాలమువఱకు నిరీక్షించుచు, వారి యిండ్లయొద్ద నుండును, కాని, యంత కంటె నధిక కాల ముండఁడు! అట్లుండఁ, బరీక్షిత్తునకు భాగవతసంహిత యుపదేశించునంత కాలము శుకుఁ డచ్చట నివసింప నెట్లు లిష్టపడె? సూతా! అభిమన్యుకుమారుఁ డయిన పరీక్షిత్తును భాగవతోత్తమునిగాఁ జెప్పుచుందురు. ఆ పరీక్షిన్మహారాజు పుట్టుకయు, నతఁడు చేసిన కార్యములు నత్యద్భు

తము లంద్రు, కావున, వానిని మాకు వినిపింపుము మఱియు నతఁడు, పాండవవంశ సంభవుల కెల్ల గౌరవమును బెంచు వాఁడు, సార్వభౌముండు. అట్టిరాజు తన సామ్రాజ్యసంపదను విడిచిపెట్టి గంగాతీరమందుఁ బ్రాయోపవిష్టుండై యుండు టకుఁ గారణమేమి? ఇంతేకాక, శత్రురాజు లమితములగు ధనములను దెచ్చి తమ యోగక్షేమముకొఱకుఁ గానుకగా నర్పించి, యతని పాదపీఠమునకు నమస్కరించుచుందురే! అట్టి యల్ప వయస్కుఁడగు పరీక్షిత్తు విడువరాని సామ్రాజ్యలక్ష్మిని బ్రాణంబులతోఁగూడ, ఔరా! యెట్లు విడువఁదలంచె? భగ వంతుండే పరమప్రాప్యమును బ్రాపకమునుగాఁ గల భాగవ తోత్తములు తమకొఱకు జీవింపరు! కాని, లోకమునకు మంగళమును, సంపదను, నాసంపత్తి కుత్తరోత్తరాభ్యుదయ మును గలిగించు నిమిత్తమే జీవించియుందురు ఈ రాజు నట్టి లోకోపకారవర్తనుఁడు. ఇట్లుండ, నితఁడు లోకమున కుప కారకమగు తన కళేబరమును హేయముగాఁ దలంచి యేల విడిచిపెట్టెను? కావున, మాయడిగిన యీ యుదంతమంతయు మాకు స్పష్టముగాఁ దెలియఁజేయుము. ఇంకను తెలియమిచే మేము కొన్నివిషయంబుల నడుగకమానిన మానియుండ వచ్చు, వానినిగూడ వివరించి చెప్పుము. వేదవాక్యంబులం దక్కఁ దక్కిన యితిహాసపురాణములయందు నీవు పారంగ తుఁడ వని యెన్నుచున్నాను. అట్టివాఁడ వగు నీవే చెప్పని యెడల, మాకుఁ జెప్పెడిమహాత్ము లింకెవ్వరు గలరు?' అని పలుకుచున్న శౌనకమహాముని వాక్యములు విని సూతుండు మిక్కిలి సంతసించి యిట్లనియె. 'ఓ శౌనకా! చెప్పుచున్నాను

వినుము. మూఁడవయుగమైన ద్వాపరమునందుఁ గడపటి భాగమున సత్యవతీదేవియందు నారాయణమూర్తి యంశము వలన వ్యాసమహర్షి జన్మించెను. అతఁ డొకానొకనాఁటి ప్రాతఃకాలమున సరస్వతీ నదీతీరమందుండి, సూర్యున కర్ఘ్య మొసఁగి విజనప్రదేశమున నసహాయుండై కూర్చుండి యుండెను. ఇట్లు కూర్చుండి సకల నిగమవిదుండును, ప్రకృతి పురుషాది పరావరతత్త్వస్వరూపదర్శియునగు వ్యాసుండు దుర్నిరీక్ష్యవేగంబు గల కాలంబుచే, భూలోకంబునఁ బ్రతి యుగమునందును దత్తద్యుగానుసారంబుగా ధర్మమునకు వృద్ధిక్షయాది వ్యత్యాసంబులు ప్రాప్తించుననియు, నట్టి ధర్మవ్యత్యాసము గగనాదిభూత పరిణామ రూపంబులగు దేవాది శరీరంబులయుఁ దత్సంసృష్టులగు జీవాత్మలయు శక్తిని మిగులఁ దగ్గించుననియు, నా సమయమున మానవులు తమతమ వర్ణంబుల కాశ్రమంబులకు ననుగుణంబులగు ధర్మంబుల నాచరింప శ్రద్ధలేనివారును, ఒకచో శ్రద్ధాళువులైనను నాయాధర్మంబుల నాచరింపఁ దగినంత బలములేనివారును, ఒకచోఁ దాదృశబలం బున్నను ధర్మంబుల నాచరింపక దుష్టబుద్ధులై యుండువారును, ఒకవేళ మంచిబుద్ధిగల వారయినను వాని నాచరింపఁదగినంత యాయుర్దాయంబు లేనివారును, గావుననే మందభాగ్యులునై యుందురనియుఁ గనుఁగొని, అట్టివారలకు నేరీతిగా హితము కలుగునోయని యోగపరిశుద్ధమైన చిత్తముచేఁ జక్కఁగ నాలోచించెను. అట్లు యోజించి, యమోఘసంకల్పుఁడుగాన, మూఁడువర్ణంబులవారికి శ్రేయస్సాధనంబగునది, వేదపూర్వ భాగమునం బ్రతిపాదితమయి చాలు

స్తోత్ర మంత్రములచేఁ బ్రకాశనీయంబై యున్న యాగాది రూపకర్మంబెయని నిశ్చయించి, తాదృశకర్మ బోధకంబగు పూర్వ మేకరూపకముగా నున్న వేదమును, యాగకలాపవిష యములను దెలుపు నిమిత్తము, నాలుగువిధములుగా విభ జించెను అట్లు విభజించుటచే ఋగ్యజుస్సామాథర్వంబులను నాలుగు వేదము లేర్పడెను. ఇతిహాసమును మఱికొన్ని పురాణ ములను నేర్పడెను. వానిని బంచమవేద మండ్రు ఆ వేదము లలో ఋగ్వేదమును బైలమహాముని యధ్యయనపూర్వక ముగా ధరించెను. సామవేదమును విద్వాంసుఁడగు జైమిని మహాముని గ్రహించెను యజుర్వేదమున వైశంపాయనుఁ డొక్కఁడు పారంగతుఁడు. అథర్వణవేదమున సుమంతువను మహర్షియు, నితిహాసములను బురాణములను మాతండ్రియగు రోమహర్షణమునియు పారంగతులు వారందఱు నాశాఖ లను శ్రద్ధతోఁ బఠించిరి. ఆ నాలుగు వేదములు వారిచేతను, వారిశిష్యులచేతను, బ్రశిష్యులచేతను, బెక్కుశాఖలుగా వ్యాపించియున్నవి. దీనవత్సలుండైన యీ మహాముని సామాన్యులగు జడమతులుగూడ నేర్చునంత సులభముగా వేదముల విభజించి (వ్యాసుఁడని ప్రసిద్ధిచెంది జనులయొక్క నుతికిఁ బాత్రుఁడై) యున్నాఁడు పిమ్మట నా మహాముని 'శూద్రులు, స్త్రీలు, బ్రహ్మహత్యచేసినవారు వేదముల విన రాదు. కాన వైదిక కర్మములవలన సిద్ధించు శ్రేయము వీరి కెంతమాత్రము దెలియదు. అయిన, వీరి కొకవిధమున శ్రేయస్సు కలదు ఈ విధముననే యది గలుగు'నని యాలో చించి మిగుల దయతో భారతాఖ్యానమును రచించి లోకుల

కొసంగెను ఓ మునులారా! ఈరీతిగా లోకములో నెల్ల వారికి వేదవ్యాసమహర్షి సర్వవిధముల నెప్పుడును శ్రేయస్సు గలిగించుటయందే ప్రవర్తించుచుండినను, నాతనిహృదయము సంతోషము నొందలేదు. అట్లపుడు మనస్సు మిక్కిలి ప్రసన్నము కాకుండఁగా, నా వ్యాసమహర్షి పరిశుద్ధమగు నా సరస్వతీనదీతీరమున నొక రహస్యస్థలమునఁ గూర్చుండి, తనలోఁ దా నిట్లనుకొనెను. "నేను వ్రతమునూని గురువులను, నగ్నిహోత్రములను నిష్కపటభావంబున బాగుగ గారవించితిని. వేదముల విభజించితిని. భారత మను మాఱుపేరితో వేదార్థముగూడఁ దెలిపితిని అందు స్త్రీ శూద్రాదులుగూడ తమ తమ కనురూపములైన ధర్మములఁ దెలియుచున్నారు. అట్లయినను, అక్కటా! దేహస్థమైన నా యాత్మయు, నంతఃకరణమును, స్వయముగా బ్రహ్మవర్చసముచే మిగులఁ బవిత్రమై యుండునదయినను, గొఱఁతగలిగి యున్నట్లు కానఁబడుచున్నది. కారణమేమో? ఒక కారణమై యుండవచ్చును. సర్వాంతరాత్మయగు భగవంతుఁడు సంతసించినంగదా తన్నియామ్యమయిన మానంబున కానందము సంప్రాప్తమగును! ఆ భగవంతుఁడు తనభక్తులు సంతసించినచోఁగదా సంతసించును! అతని భక్తులకు సంతోషము గలిగించు భాగవతధర్మంబుల నుపదేశించినచో, వారు సంతసించియుందురు. అందువలన భగవంతుడుకు సంతసించి యుండు అక్కతమున నామనంబు సంతోషము చెంది యుండును. నే నట్టి భగవద్భక్తుల కుపయోగించునట్టి భాగవత ధర్మములు భారతమున కొంత కొంత రూపించితినిగాని,

విశేషముగా నిరూపించి యుండలేదు. అందుచేత, నా మనస్సు విచారము నొందుచున్నదేమో? అని యనుకొనెను. ఇట్లతఁడు తన్నుఁ గళంకితునిగాఁ దలఁచుకొని దుఃఖించుచుండఁగా, నా సమయమున నారదమహర్షి పూర్వోక్తమైన యాశ్రమమున వ్యాసుని సమీపమునకు వచ్చెను అట్లు వచ్చిన దేవపూజితుని నారదునిఁ జూచి, వ్యాసుఁడు తొందరతో లేచి యెదురుకొని తెచ్చి యథావిధిగాఁ బూజించెను

ఇది నాల్గవయధ్యాయము

నారదుఁడు వ్యాసునికడకు వచ్చుట

ఇట్లు వ్యాసుండు చేసిన పూజల నందుకొని మహాకీర్తిమంతుఁడు నారదుఁడు సుఖాసీనుఁడై చిఱునవ్వు నవ్వుచు, తన యానతిచొప్పున నుపవిష్టుండైన వ్యాసున కిట్లనియె. ఓ వ్యాసమునీంద్రా! నీలోపలి క్షేత్రజ్ఞుఁడును, మనస్సును బరమానందము నొందుచుండవలయును. అట్లానందము నొందుచున్నదా? లేదా? ఓ మహానుభావా! తెలియఁదగిన ధర్మములనెల్లఁ దెలిసికొనియున్నావేకద! మఱియు, సర్వార్థముల విస్తరించికూర్చి మిక్కిలి యద్భుతమైయున్న భారతమును రచించితివి మఱియు, నాద్యంతశూన్యమయి యవిచ్ఛిన్నమగు సంప్రదాయంబులు గలవైయున్న వేదములను జదివితివి. ఆ వేదంబుల యర్థమును విచారించితివి ఓ ప్రభూ! అయినను, నీవు కృతకృత్యుఁడు గానట్లు ఏల యిట్లు దుఃఖించుచున్నావు? అని పల్కిన నారదునకు వ్యాసుం డిట్లనియె "ఓ నారదా! నీవు చెప్పినదంతయు నాకుఁ గలదు. నే నట్లు

గొప్పకార్యములు చేసినను, నాయాత్మ సంతోషము చెందకున్నది. ఇందులకుఁ గారణమేమియో నాకుఁ దెలియదు. ఓ మునీంద్రా! నీవు మంచి దివ్యజ్ఞానము గలవాఁడవు. సమస్తలోకములను బుట్టించిన బ్రహ్మయంశభాగమువలన జన్మించినవాఁడవు. మఱియు సమస్తముఁ దెలిసినవాఁడవు. కనుక నిన్ను నడుగుచున్నాను. నామనస్సెందుచేత నానందము చెందకున్నదియో కారణ మాలోచించి చెప్పుము! నీకుఁ దెలియ దనరాదు. ఉత్తములైన బ్రహ్మాదులకు నుత్కృష్టుఁడై సర్వనియామకుఁడైన భగవంతుఁడు సత్త్వాదిగుణములందుఁ దగులువడుటచేఁగాక, సంకల్పమాత్రముచే లోకములనెల్లఁ బుట్టించుచుఁ, బెంచుచు, ద్రుంచుచు నుండును. కాన నతనికి సర్వప్రాణుల యంతర్గతవిషయములు దెలిసియుండు. అట్టి పురాణపురుషు నీ వుపాసించితివి. కాన, నీవు దేహుల కంతర్గతములైన సమస్తరహస్యముల నెఱుఁగుదువు! మఱియు నీవు సూర్యునివలె మూఁడులోకములయందు సంచరించుచు, బహిర్భాగమందున్న వస్తుసంచయమును గనుఁగొనుచున్నావు వాయువువలెనే జ్ఞానవ్యాప్తిచే నెల్లప్రాణులలోను జరించుచు, నిట్లు హృద్గతార్థములఁ గనుఁగొనుచు నుందువు. మఱియు, నీ వెఱుఁగనిది లోకమందు లేదుగదా? బ్రహ్మముంగూర్చి నివృత్తిధర్మములును, వేదముంగూర్చి వ్రతములు నాచరించి సమాప్తధర్మవ్రతుండనై యున్న నా మానస మసంతుష్టి చెందుటకు నాయందేమిలోపము కలదో వివరించి చెప్పుము" అని యడిగిన వ్యాసునకు నారదుం డిట్లనియె. ఓ మునీంద్రా! విన్నను జదివినను పాపంబు హరింపంజాలు భగవంతుని

నిర్మలకీర్తిని నీ*వించుమించుగాఁ జెప్పితివిగాని, పూర్తిగాఁ జెప్పలేదు మఱియు, భగవంతుని స్వరూపగుణాదులను గల రూపునఁ బ్రధానముగా వర్ణింపక కొంతఁ గావించితివి. ఇదియే నీ యాత్మ సంతసింపకుండుటకుఁ గారణము. మునివర్యా! నీవు భారతమునందు ధర్మార్థకామాది పురుషార్థములను వర్ణించినట్లు భగవంతుని మహిమను వర్ణింపలేదు. కావ్యము యమకానుప్రాసాదులతోఁ గూడియున్నను, జగత్పవిత్రమైన భగవంతుని యశస్సుతో నిండి యుండనియెడల, నా కావ్యము వాయసతీర్థమువంటిదని చెప్పుదురు ఆ తీర్థము సర్వజాయపవిత్రమై కేవలము కాకులు మాత్రమే నివసింపఁదగియుండును అంతియకాని, నిర్మలమయిన మానససరోవరము నిలయంబుగాఁ గల హంసలు వసింపఁదగియుండదు అట్లే భగవద్యశోవిహీనమయిన కావ్యము కేవలము కాకసమానులయిన కాముకజనులకే ప్రీతిదాయకమగునుగాని, నిరతిశయప్రియమయిన పరబ్రహ్మమే యాధారంబుగాఁ గలవారై, బ్రహ్మానందానుభవులై నిర్మలాంతఃకరణులైయున్న పరమహంసలకుఁ బ్రీతిదాయకంబు కాదు. యమకము, అనుప్రాసము మొదలగునవి లేకపోయినను, గావ్యము భగవంతుని మహిమతోఁ గూడియుండినచో, బ్రహ్మమందెల్లప్పుడు క్రీడించుచున్న యతీశ్వరులందఱా కావ్యమును, హంసలు మానససరస్సును జూచునట్లు, మిక్కిలి ప్రీతితోఁ

* ఇట నించుమించుగా నని చెప్పుటచే భారతమందుఁ బ్రసంగవశంబున భగవత్కీర్తి కొంచెము చెప్పఁబడినది కాని, తత్కీర్తివర్ణనమే ప్రధానముగాఁ జేసికొని ప్రబంధము రచింపలేదని సూచిత మగుచున్నది

జూచుచుందురు. కావ్యమునందున్న ప్రతిపద్యము నపశబ్దములతోఁ గూడియున్నను, నందుఁ గీర్తిమంతములైన యనంతుఁడైన భగవంతుని గుణములను గుర్తించు నారాయణ వాసుదేవ కృష్ణాదినామములు కనుపట్టినచో, నా ప్రబంధము జనసమూహముల పాపముల నెల్లఁ దూలించును. కాన, సాధువులగు భాగవతులు వానిని వినుపించువారున్నచో విందురు. వినువారున్నచోఁ జెప్పుదురు. ఎవరు లేనిచోఁ దామే గానముచేసికొనుచుందురు. రాగద్వేషాది వికారశూన్యమై కర్మ బహిర్భూతమయియున్న జ్ఞానయోగమైనను, భగవద్భావశూన్యమైనచో, నది యెంతమాత్రము ప్రకాశింపదు. మఱి నిష్కామమైన కర్మయోగము ప్రకాశింపదు ఇఁక భగవంతునియం దర్పితముగాక, కామాది ఫలోద్దేశపూర్వకమై, కావున ననుష్ఠించునపుడును ననుభవించునపుడును నెల్లప్పుడును దుఃఖప్రదమై యుండు కామ్యకర్మము శోభింపదని చెప్పవలయునా? కావున, నో మునివర్యా! భగవన్మహిమ లేకుండ నింతకుముందు నీచే రచింపఁబడినవన్నియు వ్యర్థప్రాయము లనియే చెప్పవచ్చును. అందుచే, నిఁకమీఁదనైన భగవన్మహిమము వర్ణింపఁబూనుము. ఓ వ్యాసమునీంద్రా! నీవు భగవదంశసంభూతుండవు. భూతహితాచరణమున బద్ధదీక్షుఁడవు. లోకహితార్థ మవతరించినాఁడవు. నిర్మలమగు కీర్తితో నొప్పుచున్నవాఁడవు. ఇట్టి మహాత్ముండవగు నీకు, కేవల మనర్థగర్భమై ధర్మార్థకామరూపమగు త్రివర్గంబును, దత్సాధనములను వర్ణించుట యుచితంబు కాదు. కావున, మనుజుల సమస్తబంధములను

తెగఁగోయుట కయి భగవంతుని లీలల నన్నిటిని మనసునఁ జక్కఁగా నాలోచించి ప్రబంధము గావింపుము. అట్లు నీవొనరించినంగాని, నీ మానసంబు సంతుష్టిని జెందదు. అట్లు సేయక, విపరీతముగా భగవంతుని నామరూపములతో సంబంధము లేని యితరవిషయంబులు వర్ణించుచున్నచో నీ బుద్ధి సర్వదా వ్యాకులత్వమును జెందుచు, గొప్పగాలిచేఁ దరుమఁబడు పడవవలెనే యెప్పుడుగాని యెచ్చటనేని యించుకయు స్థిరముగా నుండఁజాలదు. మఱి, భగవంతుని నామరూపములందు వర్తించిననే, దానికిఁ గుదురుపాటు గలుగును. కావున, నీవు భగవంతుని లీలలనే వర్ణింపుము. ఏ వస్తువయినను, భగవదాత్మకము గానఁ దద్విభూతిగా వర్ణింపుము. నీవు భూతములకు హితము సేయఁబూని, తుదకు వాని కహితమే చేసినవాఁడవైతివి. ఎట్లన, జనులు స్వభావముచేతనే యర్థకామములందు రక్తిగలవారై, తన్మూలమునఁ దాపత్రయము పడుచుందురు. అట్టివార లర్థకామములందే ప్రవర్తించునట్లు, దత్సాధనములైన ధర్మములకుఁగా భారతము నిర్మించి తన్మూలమున వానినే యనుష్ఠింపుఁడని బోధించితివి. ఇది మిక్కిలియు గొప్పపొరపాటు, కాఁబట్టి నిందితమగును. నీ వట్లు బోధించినప్పటికిని, లోకులు తమ రుచిచొప్పున మోక్షసాధనమందే ప్రవర్తింతురుగాక, మఱి భారతమునందు నొక్కొక్కచో నర్థకామములు హేయముగాఁ జెప్పఁబడియున్నవిగాన దోషములే దందువా? ఇది సరికాదు. నీవు సమస్తముఁ దెలిసినవాఁడవు నీవలె సమస్తమును దెలియని యితరజనులు, నీవు భారతమున ధర్మార్థకామము

లనే విస్తరించి ప్రతిపాదించి యున్నాఁడవు గనుక, నీ వాక్యమునుబట్టి యర్థకామములే నిరతిశయపురుషార్థములనియుఁ, దత్సాధనమే నిరతిశయధర్మమనియు నిశ్చయము చేసికొని యుందురుగాని, యా త్రివర్గమును నివారించుట నీ యభిప్రాయమని తెలియరు. అన్నియు నెఱుఁగనివారికి నా యభిప్రాయము తెలియకపోయినఁ బోవుఁగాక, సమస్తము తెలిసినవారికిని దెలియకపోవునా? అని అందువా? భగవంతుఁడు గావించిన యపారములైన చేష్టితములను, నిపుణబుద్ధియైన వాఁడు నివృత్తిధర్మనిష్ఠవలన సుఖముగాఁ దెలిసికొన నర్హుఁడగును కాని, యట్టివాఁడు దొరకుట యరిది. గుణమూలములైన రాగాదులతోఁగూడి వర్తించుచు నాత్మస్వరూపజ్ఞానము లేకుండునట్టి జనునికి నావిభుని చేష్టితాదులు సులభముగాఁ దెలియనేరవు తెలిసినవారికి అర్థకామములు హేయములగుట, నీవు కొండొకచోఁ జెప్పినను జెప్పకున్నను తెలియును. తెలియనివారికో, నీ యభిప్రాయ మెఱుఁగమిచే, నవి హేయములయిన వని చెప్పినను దెలియదు. కాన, తెలియనివారికిఁ దేటపడునట్లు, అర్థకామములు హేయములనియు, భగవంతుని చేష్టితముల నెఱుఁగుట నిరతిశయపుమార్థసాధనమనియు, నొక విపులప్రబంధము మూలముగా వారికిఁ దెలుపుము. ఒకఁడు తాను గోరిన ఫలమునకు సాధనమగు ధర్మమును విడిచి, హరిచరణాంబుజములను భజింప నుద్యుక్తుఁడై, తనరాగాదులు పరిపక్వము కాకమునుపే మరణించు

సేని, వానికి నెందుఁగాని * యశుభ మేమియుఁ గలుగదు
హరిచరణాంబుజములను భజింపక స్వధర్మములనే యనుష్ఠించు
వానికి ఫలమేమి ప్రాప్తించును? ఏమియుఁ బ్రాప్తింపదు.
మీఁద బ్రహ్మలోకాదులందును, గ్రిందఁ బాతాళాదులందును
భ్రమించుచుండు జీవులకుఁ బరబ్రహ్మానందరూపమగు మోక్ష
సుఖము భగవద్భక్తిఁదప్ప, మఱే యుపాయాంతరము
చేతను లభింపదు. కాఁబట్టి, నిపుణబుద్ధియైనవాఁడు వారి
కట్టి సుఖమును సాధించు నుపాయమును (అనఁగా భక్తిని)
దెలుపుకొఱకే ప్రయత్నింపవలయును. ఇదియే భూతహిత
మాచరించుటగాని వేఱొకటిగాదు. విషయసుఖ మన్ననో
యట్టిదిగాదు. అది యుపాయాంతరములచేతనే లభించును.
దుఃఖ మెట్లు కోరకున్నను దనంతట బూర్వకర్మములవలనఁ
గలుగునో యట్లే విషయసుఖమును బూర్వకర్మముచేఁ
బుట్టుచు గిట్టుచును, గ్రిందను మీఁద నుండు సకలజీవులకును
దుర్లక్ష్యవేగమైన కాలము, పూర్వకర్మము మొదలైన
యుపాయాంతరములవలననే ప్రయత్న మక్కఱలేకయే
కలుగును. ఇదియొక కష్టముగాదు గాన, నిందులకై నిపుణ
బుద్ధియగువాఁడు ప్రయత్నింపవలసినది లేదు. వేదవ్యాసా!

* ఇందులకుఁ బ్రమాణము శ్లో॥ నహి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి। పుణ్యాపాపకృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః॥ శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే।అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్॥

* ముకుందభక్తి పరిపక్వమైన జనుఁడు కామ్యకర్మనివలె నొకప్పుడును నేవిధమునను సంసారము నొందఁడు, మఱి, దానినుండి తప్పక విడివడును. ఏలన, వాఁడు పూర్వ జన్మమందు ముకుందపాదారవిందములయందుఁ గావించిన ప్రపత్తిని దలఁచుకొనును. కావున, దానిని మరల విడువ నొల్లఁడు. ఏలనఁగా, ముకుందుని భజించువాఁడు నిరతిశయా నందరసరూపమగు పరమాత్మను గ్రహించియుండునుగాన, తక్కినవి వానికి రుచింపవు ఎవ్వనివలన నీ జగమునకు సృష్టి స్థితిసంహారములు ప్రవర్తించునో, యా భగవంతుఁ డీజగమే తా నగును ఇట్లయ్యును, నతఁడు జగమునకు వేఱే యగును. ఇట్లుండుటఁబట్టి,యతని యనంతగుణములు తెలియనయ్యెడిని. ఈ గుణములను బూజ్యుఁడవగు నీవు నీ యంతటనే యనంతము లని యెఱుంగుదువు. 'అయినను, నన్నడుగుటంబట్టి యందు దిఙ్మాత్రము దెలిపితిని. నా కాగుణములు తెలియ వనకు. నీ వన్నింటిని గలరూపునఁ గనుఁగొను నమోఘదర్శనుఁడవు. మఱి, పరమపురుషుని యంశమవై కర్మాయత్తమగు పుట్టుక లేక, జగముహితముకొఱకు స్వేచ్ఛచే జనించినవానినిగా నిన్ను నీ యంతటఁ దెలియుము. ఇట్టివాఁడవు గావున, నీవు మహానుభావుఁడగు భగవంతుని జన్మమును, మఱి కర్మగుణా దులను, ప్రబంధరూపమునఁ జెప్పుము. ఇట్లు సేయుదువేని, కృతకృత్యుఁడవగుదువు. నీ యాత్మయందుఁగల యసం

* ఇందులకుఁ బ్రమాణము. శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం । యతతేచ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ॥ అని భగవద్గీత.

తుష్టియుఁ బూర్ణముగా నివర్తించును. ఇది యెట్లందువా? పురుషుఁడు కృతార్థుడు కాఁగోరి కావించెడి యనశనాది తపములును, అధ్యయనమును, యాగాదులును, వాపీకూపాదులు త్రవ్వించుటయు, జ్ఞానమును, దానమును, మొదలగు వానికెల్ల నెంతమాత్రమును జెఱుపులేనట్టి ప్రయోజనము, ఉత్తమశ్లోకుఁడైన భగవంతుని గుణానువర్ణనశ్రవణమే యని నిరతిశయప్రయోజనవిదులగు పెద్దలు నిరూపించి యున్నారు. తపస్సు మొదలైనవి భగవద్గుణానువర్ణన శ్రవణములందలి రుచి కలిగిననే కృతార్థములగునుగాని, లేకున్నఁ గావు కాన, తక్కిన వెన్ని కలిగియుండియును భగవద్గుణానువర్ణనమున నీవు కృతకృత్యుఁడవగుదువు ఇందులకు దృష్టాంతముగా నా పూర్వవృత్తాంతమును జెప్పెద.

### నారదుఁడు తన పూర్వవృత్తాంతము వ్యాసునికిఁ జెప్పుట

మునీంద్రా! నేను బూర్వకల్పమున నా తొంటిజన్మమందు నొకానొక వేదవాదులయింటి దాసికిఁ గుమారుండనై పుట్టితిని. వర్షాకాలము రాఁగా, సన్న్యాసులు కొందఱు చాతుర్మాస్య దీక్షగయికొని, నాలుగు నెలలును వేదవాదుల గృహములందు వసింపఁదలంచిరి. అప్పుడు నేను కేవలము బాలుఁడఁగా నుంటిని. వేదవాదులు నన్నా సన్న్యాసులకు శుశ్రూష సేయ నియమించిరి. ఆ యోగు లన్నిటియందు సమదృష్టిగలిగి యుందురుగాని, యెక్కువలు పాటింపరు నేను మిక్కిలి పసివాఁడనైనను, సమస్త చాపలములను విడిచి జితేంద్రియుండనై, బొమ్మలు మొదలైనవి గొని యాటలాడుటకుఁ బోక,

యనుకూలుఁడనై వారానతిచ్చినట్లు విని సేవలుసేయుచు మితభాషిగా నుంటిని కాన, నట్టి సమదర్శులైన వారికిఁ గూడ నాయం దనుగ్రహము కలిగినది. ఇట్లా బ్రాహ్మణులు నాయెడల ననుమోదము గలిగి తాము భుజింపఁగా మిగిలిన యుచ్ఛిష్టములను నొసంగఁగా, నేనొకతూరి భుజించితిని ఆ భోజనమువలన నాకు భాగవతధర్మమందు రుచిగలుగుటకుఁ బ్రతిబంధకములైన పాపములు నశింపఁగా, భాగవత శుశ్రూషణము సేయుచుంటిని ఇట్లు ప్రవర్తించుచుండఁగా, భాగవత ధర్మమందలి రుచికిఁ బ్రతిబంధకము లన్నియుఁ బోయి, నా మనస్సు పరిశుద్ధమైనది గాన, నా యంతఃకరణమున నా ధర్మమునందే రుచిగలిగెను ఇట్లుండ, నాయోగులు ప్రతిదినమును భగవంతుఁడగు కృష్ణుని కథలు గానము సేయుచుండఁగా, నేను వారి యనుగ్రహమువలన నతిమనోహరములైన యా కృష్ణకథలను నాలకించుచుంటిని ఓయీ! ఇట్లా కథలను శ్రద్ధతో వినుచుండఁగా, భగవంతుని కీర్తి వీనులకు విందైనది. కావున, నద్దేవునియందు నాకు ననురాగ ముదయించెను మహర్షీ! అప్పుడు వీనులకింపయిన కీర్తిగల యా భగవంతునియందు రుచిగలిగియున్న నాకు నతనియందు బుద్ధియు స్థిరముగా నెలకొన్నదయ్యె. * ఆ బుద్ధివలనఁ బర

---

* ఇందుకు 'యయాహ మేతత్సదసత్ స్వమాయయా పశ్యే మయి బ్రహ్మణి కల్పితం పరే' అని మూలము (పరేబ్రహ్మణి) పరబ్రహ్మాధారుఁడైన, (మయి) నాయందు వర్తించుచున్న, (సదసత్) కార్యకారణాత్మకమైన యీ జగత్తు, (స్వమాయయా) ననుసంబంధించిన ప్రకృతిచేత - స్వతస్సిద్ధముగాఁ గాదనుట, (కల్పితం) నిష్పాదితమైనదిగా, (పశ్యే)

బ్రహ్మము నీకు జీవుండనగు నేను ధార్యుండననియు, నిట్టి నాకుఁ గార్యకారణాత్మకమైన యీ జగము ధార్యముగా నొడఁగూర్పఁబడిన దనియు నిట్లు నేను జగమును దాల్చుట స్వతస్సిద్ధముగాక, నన్ను సంబంధించిన ప్రకృతిచేతఁ గలిగిన దనియుఁ గనుఁగొన్నవాఁడ నయితిని ఇట్లు శరదృతువునను వర్షర్తువునందును బ్రతిదినము నేను మహాత్ములైన యా మును లెంతయుఁ గీర్తించుచుండు హరి విమలయశమును నాలకించుచుండఁగా, నా యాత్మయందలి రజస్తమస్సులను దూలించునట్టిదగు భక్తి కలిగినదయ్యె ఇట్లు భక్తి యుప్పతిల్లి యనురాగముగలుగి, బాలుఁడనైనను వినీతుఁడనై పాపములుదొలఁగి శ్రద్ధాయుక్తుఁడనై, జితేంద్రియుండనై యనువర్తించుచున్న నాకు, నా యోగులు దీనవత్సలులు గావునఁ, దాము వెడలిపోవువారై, భగవంతుఁడు స్వయముగా నుపదేశించినట్టిదియు, నతిరహస్యమైన జ్ఞానమును గృపతో నుపదేశించిరి నేనా జ్ఞానముచేత విశ్వవిధాతయగు భగవం

---

కనుఁగొన్నవాఁడనైతిని - ఇటఁ బరబ్రహ్మమునకు నేను ధార్యుఁడ ననఁగాఁ బరబ్రహ్మము - నేను మొదలుగాఁగల జీవులలో నంతరాత్మయై చొచ్చి ధరించుచున్నాఁడని యర్థము నాకు నీ జగత్తు ధార్యము అనఁగా, నేను మొదలైన జీవులసమష్టిచే నీ జగత్తు దేహాదిరూపముగా ధరింపఁబడుచున్న దని యర్థము ఇట జగత్తు దేహాదులకుఁ బ్రదర్శకము 'నా ప్రకృతిచే ననుటవలన, ఇట్లు జీవుఁడు దేహాదుల నొందుట యనాదికర్మమూలప్రకృతి సంబంధమువలననే కాని, స్వాభావికముగాఁ గాదని యాశయము ఇందులకు 'రథస్య రేషు నేమి రర్పితా నాభౌ వరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రా స్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేర్పితాః' కడకమ్మి చక్రముయొక్క యాకులందును, ఆకులు నడిమిరూపమునందు

తనికిం గల త్రిగుణాత్మకమైన ప్రకృతిమహిమను దెలిసికొంటిని, మఱియు, జ్ఞాను లా జ్ఞానముచేతనే యా *వాసుదేవుని స్థానమును బొందుదురు ఓ మునీంద్రా! నాకిట్టి భక్తి గలుగుటకుఁ గారణము వాసుదేవ గుణశ్రవణము, మహాత్ముల సేవయు నని యెఱుఁగుము. కావున, భగవద్గుణశ్రవణాదుల వలన భగవద్భక్తి లభించుననుటలో నింతయు సందియము లేదు భగవద్భక్తివలని లాభము నీకిప్పుడు తెలిసినదికదా! మఱియు, నీశ్వరునియం దర్పితమగు కర్మకలాపము భక్తి యోగ నిష్పాదన మూలముగాఁ దాపత్రయమును నివర్తించుటకుఁ గారణమనియు, ధర్మార్థ కామములనిమిత్తము చేసిన కర్మకలాపము తాపత్రయమునకే హేతువై సంసారం బొడ

---

నుంపఁబడినట్లును, భూతములు (అచేతనములు) ప్రజ్ఞామాత్రలయందును (జీవులందును) ప్రజ్ఞామాత్రలు ప్రాణమందును (పరమాత్మయందును) ఉంపఁబడినవి 'జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతేజగత్' అని గీత. 'మహాబాహూ! జీవభూతమైన యీ నా ప్రకృతిచేత నీ జగత్తు ధరింపఁబడుచున్నది' అను ప్రమాణ్యాదులచేఁ బ్రకృతి చేతనధార్యమనియు, చేతనము పరమాత్మధార్యమనియు నెఱిఁగి, దేహాత్మల కుండు భేదమును జీవాత్మ పరమాత్మల కుండు సంబంధమును జక్కఁగ దెలిసికొంటినని భావము.

* ముముక్షువునకు విరోధియైనది ప్రకృతి. ప్రాప్యమును ప్రాపకము నగువాఁడు వాసుదేవుఁడు. ఇట విరోధిస్వరూపముయొక్క జ్ఞానమును, 'వాసుదేవుని పదమునొందుదు' రనుటచే, ప్రాప్యప్రాపక విషయ జ్ఞానమును జెప్పఁబడుటచే, ఉపదేశింపఁబడిన జ్ఞానమును, ఈ రెండు జ్ఞానములును గలిసి అర్థపంచకజ్ఞాన మని తెలియునది.

గూర్చుననియు నిదివఱకే నీకుఁ దెలిసియున్నదిక దా! మఱియు నీశ్వరుండును బ్రహ్మమును నగు భగవంతునియం దర్పితమైన కర్మము తాపత్రయమును మఱలించుననియే † శ్రుతిస్మృత్యాదులచే సూచితమైనది. ఇందుల కొక దృష్టాంతము చెప్పెద వినుము. లోకమున మానవుల కపథ్యములగు వస్తువుల భక్షించుటవలన రోగములు సంభవించుచుండును. అట్టి రోగంబులకుఁ గారణభూతములయిన వస్తువులనే యథావిధంబుగ సేవించినచో, నా రోగంబులు శాంతించునా? శాంతింపవు. అపథ్యములయిన యన్నాదు లామయంబులకుఁ గారణంబులయినట్లే, మానవుల కర్మయోగములు ఫలాభిసంహితములయినచో, నవి సంసారహేతువులు కాకమానవు. మఱియు, నవి భగవత్కల్పితములు కానిచో, వాత్మవినాశమునకు సమర్థము లగుచున్నవి మఱియు, రోగహేతువులగు ద్రవ్యములే కొన్నివస్తువుల సంబంధముచే నవి యథావిధతుల్యములై రోగముల నివర్తింప సమర్థము లగుచున్నట్లు, సంసారమునకు హేతువులయిన త్రైవర్గికకర్మములు భగవదర్పితములైనచో, తాపత్రయయుక్తమగు సంసారము నివర్తించుటకుఁ దగియున్నవి ఓయీ! భగవదర్పితములయిన క్రియాయోగములు స్వతంత్రముగానే మోక్షప్రదములు

---

† అట్టి సూచకములయిన శ్రుతిస్మృతు లెవన 'ధర్మేణ పాప మపనుదతి' 'అవిద్యయా మృత్యుం తీర్త్వా' ఇత్యాదులు, 'యజ్ఞదానతపః కర్మ పావనాని మనీషిణామ్' ఇత్యాది స్మృతులు అనఁగా, ఫలాపేక్షలేక చేసిన ధర్మముచేఁ పాపము నివర్తించిపోఁగా, నది భక్తియోగమును గలిగించి, తన్మూలకముగాఁ దాపత్రయము నివర్తించునని తెలియఁదగినది

కాఁగూడదా? భక్తినిష్పాదనమూలకముగానే యేల కావలెను? యని యడిగినఁ జెప్పెద వినుము మన శరీరపాతమగునంతకాలము భగవంతునికి సంతోషము గలిగించు కర్మముల నాచరింపవలయును. అట్లయిన, భగవంతునికి సంతోషము కలుగును. ఆ సంతోషము భక్తియోగప్రతిబంధకముల నిరసించుటకు సమర్థమై యుండును. అట్లు భక్తియోగప్రతిబంధములు నశించినతోడనే దర్శనసమానాకారమైన భక్తియోగము సంప్రాప్తించును. ఇట్లు భగవత్తోషకములయిన కర్మములచే భక్తియోగము నిష్పన్నమగును. *ఇట్లు భక్తియోగము సహకారియై యుండనిచో, మోక్షము కలుగనేరదు. ఇట్టి భక్తియోగమునకు సాధనములయినవి భగవత్సంతుష్టికి ననుకూలములయిన కర్మములే కావు, మఱియు, భక్తినిష్పత్తిని గోరువారిట్లు భక్తిసాధనముగా † భగవదుక్తప్రకారము మాటిమాటికి వర్ణాశ్రమముల కనుకూలములయిన కర్మముల నాచరించుటయే కాక, భగవంతుని గుణముల స్మరించుచుఁ గల్యాణగుణములఁ బ్రకటనచేసెడి నామముల నుచ్చరించుచు నుందురు.

---

* ఇందులఁ 'భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన' అనుచో 'ద్రష్టుం' అనుటచే భక్తి దర్శనాత్మకమగుటఁ దెలియునది.

† అనఁగా 'యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ । యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్' అని భగవచ్ఛ్రుతి తెలియఁదగినది.

‡ ఓ యోంకారస్వరూపా! ఓ భగవంతా! ఓ వాసుదేవా! ఓ ప్రద్యుమ్నా! ఓ యనిరుద్ధా! ఓ సంకర్షణా! నిన్ను ధ్యానించుచున్నాను నీకు వందనము లాచరించుచున్నానని పలుకుచుఁ, గర్మాధీనమయిన ప్రాకృతమూర్తి కాక మంత్రశరీరకుఁడును, యాగారాధ్యుఁడు నయిన పరమపురుషుని ధ్యానించుచుఁ, దదీయనామముల నోటఁబల్కుచు నతనిఁ బూజించువాఁడే యుత్తమాధికారి యనఁబడును * ఈ పురుషుఁడే సమ్యగ్దర్శనుఁ

---

‡ ఇందు వాసుదేవాది నామములు క్రమముగాఁ జెప్పుటచే వ్యూహముల రూపములను బొందియున్న భగవంతునికి నమస్కారమని తెలియఁదగినది మఱియు 'ఓమ్' 'ధీమహి' అని చెప్పుటచే 'ఓమాదిశబ్దములచే స్పష్టములగుచున్న కల్యాణగుణములుగల పరమాత్మను ధ్యానించుచున్నామని స్పష్టమగుచున్నది ఈ చెప్పుటచే గుణస్మరణము సూచింపఁబడెను 'అవ - రక్షణాదిషు' అను ధాతువువలన నిష్పన్నమగు 'ఓమ్' శబ్దమని వివక్షించుటచే, సర్వరక్షకత్వము సూచిత మగుచున్నది 'అ, ఉమ్' అను వర్ణములకలిసి 'ఓమ్' శబ్దమయినదని చెప్పుటచే సర్వకారణత్వము, సర్వశరీరత్వాదికములు సూచిత మగుచున్నవి ఇట్లు రెండువిధములుగ నుత్పన్నమయిన 'ఓమ్' శబ్దముచేఁ దెలియఁబడుచున్న భగవంతుఁడు స్వరూపమువలనను, గుణములవలనను, ననంత కల్యాణగుణములు గలవాఁడగుటను దెలియఁదగినది మఱియు, నిట వాసుదేవపదముచే సర్వాధారుఁడై యుండుటను, సకలమునందంతరాత్మయై యుండుటను, ప్రద్యుమ్నపదముచే 'నతత్ర సూర్యో భాతి' యనెడి శ్రుతియందుఁ జెప్పఁబడినట్లు నిరతిశయమగు దీప్తిచే సంయుతుఁడౌటను, అనిరుద్ధపదముచే సర్వవ్యాపకుఁడౌటను, సంకర్షణపదముచే నింద్రియముల నతిక్రమించిన పదార్థములే విషయములుగాఁ గల జ్ఞానము నాపాదించువాఁడౌటను గ్రహింపఁదగినది

* ఇతఁడే 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' యనెడి భగవద్గీతయందుఁ జెప్పఁబడిన యధికారియని తెలియఁదగినది

డనఁబడు ఇట్లు చేసినచో, భక్తియోగము చిరకాలములోనే లభ్యమగును నే నిట్లు తన యనుశాసనము ననుష్ఠించుటను జక్కఁగ గ్రహించి, వాసుదేవుఁడు నాయం దనుగ్రహము కలవాఁడై భక్తియోగమును, భక్తియోగసాధ్యమై దర్శనాత్మకము నగు జ్ఞానమును, దేవర్షిత్వమునకుఁ దగిన సామర్థ్యమును నా కొసంగెను. మహాకీర్తివిలాసా! ఓ వ్యాసా! నీవు భగవంతుని నిర్మలకీర్తిని జక్కని ప్రబంధముగా నొనర్పుము. ఆ ప్రబంధము బోద్ధలకుఁ దెలియఁదగిన సమస్తాంశములను దెలుపవలయును. దానిని విన్నవానికిఁ దెలిసికోఁదగిన విషయమేదియు మిగిలియుండఁగూడదు. మఱియు, నది యుపాయాంతరములచేఁ దొలంగని యాధ్యాత్మికాది తాపత్రయము నవలీల నివారించి సంతోషము నొసంగవలయును. నీగ్రంథము నందఱు నాదరించుచుండవలయు. కావున, నీ వట్టి ప్రబంధమును రచింపుము.

ఇది యైదవ యధ్యాయము

---

నారదుఁడు వనమున కేగుట, భగవంతుఁడు నారదునకు దర్శనమిచ్చుట. నారదుండు వ్యాసుని వీడ్కొనిపోవుట

అని నారదుండు తన పూర్వవృత్తాంతమును, బూర్వజన్మమందుఁ దా నొనర్చిన కర్మములను జెప్పఁగా, భగవంతుండగు వ్యాసుండు విని తిరిగి యతని కిట్లనియె 'ఓ నారద మునీంద్రా! నీకు జ్ఞానోపదేశము చేసి సన్న్యాసులందఱు దేశాంతరముగూర్చి పోవునప్పటికి నీ వింకను జిన్నతనమునందే

యుంటివిగదా! అప్పుడు నీ వేమిచేసితివి? ఆ సన్న్యాసులు వెళ్లినది మొదలు నీప్రాయ మేవృత్తిచేఁ గడపితివి? అవసాన కాలము సంప్రాప్తించినప్పుడు నీశరీర మెట్లు పరిత్యజించితివి? పూర్వకల్పమందుఁ బ్రవర్తిల్లిన జ్ఞానోపదేశవృత్తాంతము నీకు మఱపునకు రాలేదేమి? మఱియుఁ గాలము సర్వమును నశింపఁజేయుచుండునుగదా! అట్టికాలము నీస్మృతిని నశింపఁ జేసి మఱపునకు వచ్చునట్లు చేయలేదా?' అని యడిగిన వ్యాసునకు నారదుం డిట్లనియె "ఓ మునీంద్రా! నాకు విజ్ఞాన ముపదేశించిన సన్న్యాసులు గమనించిన పిమ్మటఁ జిన్నతనము నందున్న నే నొనరించిన కార్యముల వివరించెద నాలింపుము. నా తల్లికి నే నొక్కఁడనే కుమారుఁడను స్త్రీస్వభావమును బట్టి, నా తల్లి మిగుల మూఢురాలు. మఱియు నొకరియింట సేవకురాలై యుండుటంబట్టి, పరాధీనురాలనుటకు సందియము లేదు ఆమె తనకంటె వేఱుదిక్కులేని నాయందు మిగులఁ బ్రేమగలదై వర్తించుచుండెడిది అందువలనఁ దాను నా యోగక్షేమముల మిగులఁ గోరుచున్నదైనను, దాను దన యధిపతికి నధీనురాలయి కొయ్యబొమ్మవలె స్వాతంత్ర్యము లేనిదై యుండుటంబట్టి, నన్ను జక్కఁగఁ బోషింప సమర్థురాలు కాకుండెను అప్పుడు నే నయిదువత్సరంబుల ప్రాయము గల వాఁడనై యుంటిని అంత చిన్నవాఁడ నగుటచే దిగ్దేశ కాలంబుల స్వభావంబునైనఁ జక్కఁగా నెఱుఁగునంత జ్ఞానము లేని వాఁడను అందువలనను, నన్నుఁ బ్రేమించిన తల్లిని విడుచుట యుక్తము కాదని తోఁచుటచేతను, మఱియొక స్థలమునకుఁ బోనొల్లక, నాతల్లి దేహావసానము నిమిత్తము ప్రతీక్షించుచు,

నా బ్రాహ్మణుల యింటనే వసించియుంటిని. ఇట్లుండ, నొక నాటిరాత్రి నా తల్లి గోవులను పాలుపితుకుటకై పోవుచుండ, నామెచేఁ ద్రొక్కఁబడినదియొక్క సర్పము కాలశరీరుఁడయిన దైవముచేఁ బ్రేరితమై యామెకా లొడిసి కఱచెను. ఆ కాటున కోర్వఁజాలక నా తల్లి ప్రాణములఁ బరిత్యజించెను. అందులకు నే నెంతమాత్రము విచారింపక, మాతృమరణమున, భక్తుల సౌఖ్యమును గోరుచున్న భగవంతుని యను గ్రహంబుగా నెంచికొని, యటనుండి కదలి యుత్తరాభిముఖుండనై పోఁజొచ్చితిని. అట్లు పోవుచు, మార్గమధ్యంబున సస్యసమృద్ధంబులగు దేశంబులను, సుందరంబులగు పురంబులను, గ్రామంబులను, గొల్లపల్లెలను, రత్నాదిఖనులను, కృషీవలులకు నివాసభూతంబులగు పల్లెలను, భిల్లవాటికలను, జువ్వివాటికలను, మనోహరంబులగు నరణ్యంబులను, బూవుల తోఁటలను, గైరికాది ధాతుమయంబులై కరిభగ్నంబులైన తరుబృందంబుగలవై యొప్పుచున్న పర్వతంబులను, నిర్మల జలంబుచేఁ బూరితంబులై పద్మాదిశోభితంబులై దేవతలకుఁ గ్రీడాస్థానంబులయి విలసిల్లు పద్మాకరంబులను, సరోవరంబులను దాఁటితిని పిమ్మట, విచిత్రధ్వనులు గల విహంగంబులకును, నల్లడలఁ బరిభ్రమించుచున్న తుమ్మెదలకును, నలాది తృణవిశేషంబులకును, వెదురుపొదలకును, దర్భాదులకును, బొంగువెదుళ్లకును నివాసభూతమై, మిగుల భయంకరమై, చొరఁదరముకానిదై, క్రూరంబులగు మదగజములకును, సర్పవిశేషంబులకును, గుడ్లగూబలకును, జంబుకములకును, గ్రీడాస్థానమై, పోవుచున్నవారికి భయముగలిగించుచున్న యొక

మహారణ్యమును బొడఁగాంచితిని. దానిఁ బ్రవేశించి కొంత దూరము పోవునప్పటికి మార్గాయాసముచే మిగుల బడలితిని ఇంద్రియములు పరవశంబు లాయె ఆఁకలియు దప్పియు మిగుల బాధింపఁ జొచ్చెను అందువలన, నేను బయిమార్గమునకుఁ బోవనశక్తుండనై యొకనదియందు దానమాడి, శ్రమము గొంత తొలఁగించికొని, యుదకమును గడుపారఁ గ్రోలి క్షుత్పిపాసల బాధను గొంత తఱిగించితి పిమ్మట, నిర్మనుష్యమైన మహారణ్యమందు నొక యశ్వత్థవృక్షము మూలమును జేరి, జీవాత్మయందంతరాత్మయై యున్న పరమాత్మను సన్న్యాసు లుపదేశించినట్లుగా మనస్సుచే ధ్యానించితిని ఇట్లు నే నభ్యాసమున వశీకృతమైన మానసముచే భగవంతుని చరణకమలములను ధ్యానము చేయుచున్నవాఁడనై, ప్రేమపురస్సరంబుగా ధ్యానించుటంబట్టి పొడముచున్న యానందబాష్పంబులు కనుఁదమ్ములఁ గడలుకొనుచుండఁగా, నా హృదయమున నారాయణుఁడు మెల్లమెల్లగా సాక్షాత్కరించెను. అంత, నేను ప్రేమాతిశయముచేఁ బులకితమగు శరీరముకలవాఁడనై యానందరసప్రవాహంబున మునింగి మిక్కిలి సుఖించితిని ఓ మునీంద్రా! ఆ సమయంబున దేహంబునుగాని, యాత్మను గాని యెఱుంగను అంతఁ దిరిగి నేను నింతకుఁబూర్వము నా హృదయమునకు గోచరమై, మిగుల మనోహరముగా నుండి సమస్తదుఃఖంబులను దొలంగించినట్టి భగవంతుని రూపమును బ్రయత్నించి చూచియుఁ గానలేక, భగవద్దర్శనము తిరిగి లభింపక పోవుటచేఁ జిత్తము దుఃఖింప, సవేగముగ లేచి నిలువఁబడితిని. అట్లు చేసి, భగవంతుని మనోహర

రూపమును మఱొక్కమాఱు వీక్షింపఁ గుతూహలపడుచు, నేను నా మనస్సును హృదయకమలమున స్థిరముగా నుంచి ధ్యానించితిని. కాని, నా కాతనిరూపము కానరాలేదు. అందువలన విషయాతురునివలెఁ దనివి చెందకుంటిని. ఇట్లు నిర్మానుష్యమైన యరణ్యమునందు భగవంతుని దర్శింప మాటిమాటికిఁ బ్రయత్నించుచున్న నన్నుఁ జూచి * వేదవాక్కులకైన నందరాని భగవంతుఁడు గగనపథమునుండి గంభీరములగు వచనములచే దుఃఖముఁ దొలఁగించుచున్నట్లుగా నాకిట్లనియె 'అకటా! నీ వీ జన్మంబున నన్నుఁ జూచుట కర్హుండవు కావు నా దర్శనమునకుఁ బ్రతిబంధకములయిన పుణ్యపాపకర్మములు గల కుత్సితయోగులకు నే దర్శన మొసంగను. నీవు నట్టివాఁడవే! కావున, దర్శనంబునకుఁ దగవు అట్టివాఁడవైనను, మొదట నీకు దర్శన మొసంగుటకుఁ గారణము వినుము నా దర్శన మొకపర్యాయ మొసంగినచో, నరుఁడు నా రూపమును మఱవఁజాలక, సర్వదా చూడ నపేక్షించుచుండును నా దర్శనము నపేక్షించువాఁడు సత్ప్రవర్తనము గలవాఁడై, మెల్ల మెల్లగాఁ దన హృదయమం దున్న రాగద్వేషాదుల నన్నింటిని దొలఁగించుకొనఁ గలఁడు. నీవు స్వల్పకాలము మహాత్ముల సేవ చేసితివి అందువలన, నీకు నాయందు స్థిరమైనబుద్ధి జనించినది. కావున, నీవు నీచమయిన యీ శూద్రదేహమును విడిచి కల్పాంతమందు నాకు భృత్యుండవగుదువు. నా యనుగ్రహంబుకతంబున నాయందు స్థిర

* అనుటచేఁ "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" యనెడి శ్రుతి స్మరింపఁబడుచున్నది.

ముగా నున్న నీ బుద్ధి యొకానొకప్పుడైన సంచలింపదు. మఱియుఁ, బ్రళయమందయినను మద్విషయకమయిన స్మృతి నశింపనేరదు.' అని యిట్లు కర్మకృత మగు దేహము లేని వాఁడై, * యాకాశశరీరుండై, సర్వనియామకుండై, సర్వవ్యాపియయి, తన కధీనమయిన సత్త్వాదులు కలిగి వెలుఁగు భగవంతుండు పలికి విరమించెను. అంత, భగవదనుగ్రహంబు నకుఁ బాత్రుఁడనైన నేను దేజశ్శాలులలో మహాతేజశ్శాలి యైన భగవంతునకు శిరస్సుచే నభివందనంబులు కావించితిని. పిమ్మట నేను లజ్జాహీనుండనయి, యనంతుఁ డయిన భగవంతుని నామములను బఠించుచు, లోకములకు మంగళావహము లయి, వేదగుహ్యములయి యున్న భగవంతుని యవతారంబులను, జేష్టితంబులను సంస్మరింపుచు, భూమండలమునందు భ్రమించుచుంటిని మఱియు నేను సంతోషితస్వాంతుండనయి విషయాదులయందు స్పృహవిడిచి మచ్చరంబును బాఱఁదోలి, దేహాపారవశ్యరూపమయిన మదము నడంచి, దేహావసాన కాలముకై ప్రతీక్షించుచుఁ గల్పావసానపర్యంతము జీవించి యుంటిని ఓ మునీంద్రా! ఇట్లు భగవంతుఁడయిన కృష్ణుని యందు బుద్ధి నిలిపితి కావుననే నిర్మలమయిన చిత్తముగలిగి శబ్దాదివిషయములయందాసక్తివిడిచియున్న నాకు దేహారంభకమయిన ప్రారబ్ధ మవసానము నొందఁగానే, మెఱపువలెనే మృత్యుకాలము సంప్రాప్తమయినది అంతట, నేను సమస్త

* ఇందులకుఁ బ్రమాణము 'ఆకాశశరీరం బ్రహ్మ' అనెడి శ్రుతి - ఆకాశమువలెనే భగవంతుఁడు సర్వవ్యాపియై యగోచరుఁడైయున్నాఁడు. కావున, గగనసమానత్వ మెఱుంగునది

జీవలయములకు నాధారభూతమయిన యప్రాకృతమైన యని రుద్ధాఖ్యశరీరమును గూర్చి ప్రయత్నించుచుండగాఁ, ప్రారబ్ధకర్మమే యవసానముగాఁగల నా ప్రాకృత దేహము నశించినది. అంత భగవంతుఁడు, గల్పాంతమం దీజగంబును దనయందు లీనము గావించుకొని ప్రళయకాలసముద్రము జలమునందు శయనించెను ఆ సమయమున బ్రహ్మ యా భగవంతుని నాభికమలమున శయనింపఁ దలంచి యుండఁగా, నే నతని ప్రాణమునఁ బ్రవేశించితిని ఇట్లుండ, సహస్రయుగంబులు గతించినవి. అనంతరము బ్రహ్మనాభికమలమునుండి లేచి, వ్యష్ట్యాత్మకమయిన యీ జగంబును సృజింప నూహించుచుండెను. అప్పు డా చతుర్ముఖుని ప్రాణంబులనుండి నేమను, మరీచివసిష్ఠాదులయిన ఋషీశ్వరులును బ్రభవించితిమి. పిమ్మట నేను భగవంతుఁ డగు విష్ణుని యనుగ్రహంబు వలస నంతటను ననర్గళమయిన గమనముగలిగి యఖండమయిన బ్రహ్మచర్యవ్రతమును సలుపుచు, ముల్లోకంబుల యంతర్బహిర్భాగంబుల సంచరించుచున్నాను. మఱియుఁ బూర్వము బ్రహ్మ నా కొక వీణె నొసంగెను ఆ వీణె నిషాదాదిసప్తస్వరముల నెడిబ్రహ్మముచే నలంకృతమయి యున్నది. ఆ విపంచికను సర్వదా హస్తమునఁదాలిచి వాయించుచు, హరికథలను గానముచేయుచునే సంచరించుచున్నాను భక్తులకుఁ బ్రీతి దాయకమయిన కీర్తిగలిగి, పవిత్రము లయిన పాదపద్మములతో నొప్పుచున్న భగవంతుఁడు పిలువఁబడినట్లు, వేగముగా వచ్చి సర్వదా యతనికీర్తులను గానముచేయుచున్న నా చిత్తమందుఁ గానవచ్చుచుండును. శబ్దాదివిషయంబుల మాటి

మాటికి ననుభవింపవలెనన్న పేరాస చిత్తంబులఁ బీడించు చుండ వర్తిల్లుమానవులు సంసారసాగరజలంబును శోషింపఁ జేసికొనుట హరిగుణవర్ణన శ్రవణాదికములవలననే! మఱియుఁ గామలోభంబులచే మాటిమాటికిఁ దిరస్కృతమయిన చిత్తంబు ముకుందసేవచేఁ దాదృశ కామాదులను బాసినట్లు, యమాది యోగమార్గంబులచేఁ బాయనేరదు ఓ వ్యాసా! నీ వడిగినట్లు నాజన్మకర్మంబుల రహస్యంబు సర్వంబును నీ మనంబు సంతసించునట్లు వక్కాణించితిని" అని యిట్లు పలికి స్వేచ్ఛాసంచారియు, భగవంతుఁడు నగు నారదుండు వ్యాసు నామంత్రణంబుచేసి వీణె వాయించుకొనుచు నరిగెను ఓ శౌనకా! ఆ నారదుండు సర్వదా భగవంతుని కీర్తిగానము చేయుచు, వీణానినాదజనితమయిన యానందరసంబున మునుంగుచుఁ, దాపత్రయాతురమయిన జగంబునుగూడ సుఖింపఁ జేయుచున్నాఁడు. అయారె! ఆమ్మహాత్ముండు ధన్యుండుకదా!

ఇది ఆఱవ యధ్యాయము

---

## వ్యాసుఁడు భాగవతము రచించి శుకున కుపదేశించుట

అదివిని శౌనకుండు సూతుంజూచి "ఓ సూతా! నారదుం డేగినపిమ్మట శాస్త్రసంపన్నుండును భగవంతుండు నగు వ్యాసమునీంద్రుం డేమిచేసె?" అని యడుగ సూతుం డిట్లనియె. 'మునీంద్రా! నారదుం డరిగినపిమ్మట వ్యాసుండు సరస్వతీ నదికిఁ బశ్చిమతీరంబున శమ్యాప్రాసమని ప్రసిద్ధిచెందిన తన యాశ్రమంబునకుఁ బోయెను ఆ యాశ్రమము బదరీవృక్ష

ములచే నిండి మనోహరముగ నుండె అదియె ఋషీశ్వరులు సత్రయాగము లొనరింపఁదగిన తావు. వ్యాసుం డట్టి యాశ్రమంబునఁ జొచ్చి యొకచోఁ గూర్చుండి యాచమనంబు గావించి, మనస్సు విషయాంతరములనుండి మఱలించి యాత్మస్థమగునట్లు చేసెను. పిమ్మట నతఁడు భక్తియోగముచే నిర్మలమయిన మనస్సు సమాహిత మగుచుండఁగా, ముందుగాఁ బరమపురుషునిఁ బొడఁగాంచెను. తరువాత, నా పరమపురుషునికి శరీరభూతమయిన మాయను గనుఁగొనెను. అట్లు కనుఁగొని మాయకంటె విలక్షణుఁడైనను, జీవుం డామాయచే మోహితుండయి, తన్ను గుణత్రయపరిణామాత్మకమయిన శరీరముగాఁ దలంచుచు, దేహాత్మభ్రమజనితమయిన తాపత్రయమును జెందుచున్నట్టును, దాదృశతాపత్రయమును వారించెడి యుపాయ మెఱుంగని లోకులకు భగవద్భక్తియే యనర్థోపశమయిన యుపాయముగాని మఱియొకటి లేదనియును నిశ్చయించెను. అట్లు నిశ్చయించి, లోకహితమునకై భాగవతసంహితను రచించెను ఆ భాగవతసంహిత వినిన మానవులకు శోకమును, * మోహమును, భయమును హరించునట్టి భగవంతునియందు భక్తి యుద్భవించును అట్టి భాగవతమును వ్యాసుఁడు వివక్షితార్థములను క్రమముగాఁ గూర్చి తనకుమారుఁడును, సాంసారికధర్మములకు విముఖుఁడును, మనస్థైర్యంబుకలవాఁడును, బరబ్రహ్మతత్వమును

* అనఁగా "అనాత్మన్యాత్మబుద్ధిర్యా అస్వేస్వ మితి యామతిః" అనునది. అనఁగా, ఆత్మకాని వస్తువునం దాత్మబుద్ధియును, తనదికాని వస్తువునందుఁ దనదనెడి బుద్ధియునని తెలియఁదగినది.

మననముచేయువాఁడు నగు శుకుని కుపదేశించెను' అని పలికిన సూతునిఁజూచి శౌనకుం డిట్లనియె 'ఓ మహాత్మా! ఆ శుకమహర్షి నివృత్తిమార్గనిరతుండు. కావుననే శ్రోతవ్యములు, నధ్యేతవ్యంబులు నగు విషయంబులం దాదరంబు లేనివాఁడు కేవలము పరబ్రహ్మమం దాసక్తి కలవాఁడు. ఇట్టి మహాత్ముండు భగవద్ధ్యానవిరోధినియగు నీ భాగవతసంహిత నేల యభ్యసించెను' నావుఁడు సూతుఁ డిట్లనియె. ఓ మునీంద్రా! ఈ భాగవతసంహిత భగవంతుని గుణరూపంబుల వర్ణనంజే కావున, భగవద్ధ్యానవిరోధిని కాదు. నీవన్నట్లు పరమాత్మనిష్ఠులైన మునులు లౌకికార్థప్రబంధంబు గోరనివారై, నిరపేక్షులై యుందురు. అట్లయినను, వారలు భగవంతునియం దనన్యప్రయోజనంబగు భక్తికలవారై యుందురు. మఱియు, భక్తికి విషయభూతుండు అనంతకల్యాణగుణములు గల హరియె కావునఁ, దదీయగుణవివరణరూపమయిన గ్రంథములు వినుటయం దాసక్తి గలిగియుందురు. కావున, నాత్మారాముఁ డయినను శుకయోగి *హరి యనంత

---

* ఇందుఁ గల మూలము "హరేర్గుణాక్షిప్తమతిః" "విష్ణుజనప్రియః" ఈ రెండు విశేషణములవలన భావమేమనఁగా—తెలుచుగా భగవద్గుణములు వేదాంతములవలననే తెలియఁబడుచున్నను "స్వాధ్యాయాద్యోగమాసీత యోగాత్స్వాధ్యాయవాన్భవేత్" అని చెప్పినట్లు, భగవంతుని గుణములను బ్రతిపాదించునట్టి స్వభావముగల ప్రబంధములయం దాసక్తి కలుగుటవలనను, నీ భాగవతగ్రంథ మంతయు భగవద్గుణవర్ణనమే యగుటవలనను, మఱియు నిందు, భగవదవతారంబులను భగవంతుని విభూతులను, భక్తులను, వారి గుణములను, వర్ణించియుండుటవలనను, భగవంతుని యవతా

కల్యాణగుణముల కధీనమయిన బుద్ధికలవాఁ డగుటచేతను, విష్ణుభక్తులయం దత్యంతప్రేమకలవాఁ డగుటచేతను, భగవద్గుణవివరణరూపమయిన భాగవతసంహితను బఠించెను. ఆ శుకుండు భాగవతోత్తముఁడయిన పరీక్షిత్తునకు భాగవతసంహిత నుపదేశించెను. మునులారా! మీరు పరీక్షిత్తుజన్మకర్మాదు లడిగినారు ఇంక నక్కథ వక్కాణించెద. మఱియుఁ, బరీక్షిన్మహారాజు చరిత్రమున కుపోద్ఘాతరూపమై, కృష్ణకథామిశ్రమై యున్న పాండవుల చరిత్రమును జెప్పెదను. సావధానులరగుచు నాలకింపుఁడు. పాండవులకును గౌరవులకును బ్రవర్తిల్లిన యుద్ధంబున నుభయపక్షములలోని వీరులును వీరస్వర్గంబు బొందిరి మఱియు, నాయుద్ధంబున ధృతరాష్ట్రకుమారుండగు దుర్యోధనుండు భీముని గదాఘాతంబులచేఁ దొడలు భగ్నంబులుగా నేలఁబడియుండె. అప్పు డశ్వ

అర్జునుఁ డుపపాండవులఁ జంపిన యశ్వత్థామను బరాభవించుట

త్థామ తన ప్రభువయిన ధృతరాష్ట్రునికిఁ బ్రియము కాక పోయినను బ్రియమని తలంచుచు, బ్రాహ్మణుం డయిన తనకు నింద్యంబని యోజింపక, నిద్రించుచున్న యుపపాండవుల తలలను నఱికి గొనిపోయెను. ఇప్పటికి నశ్వత్థామ చేసిన కుత్సితకర్మమును నిందించుచున్నారు. అంత ద్రౌపది

---

రములు, నా యవతారములు గుణములు, భక్తులు, భక్తులగుణములు మొదలయిన వేదాంతములు చెప్పని యనేకాంశంబు లిందుండుటవలనను, శుకుండు హరిగుణంబులందును, హరిభక్తులందు నత్యంత ప్రేమగలవాఁడగుటచేతను; భాగవతసంహిత నభ్యసించెనని తెలియఁదగినది. ఈ చెప్పుటచే భాగవతము వేదాంతములకన్నఁ బ్రశస్తమయినట్లు స్పష్టమగుచున్నది.

చచ్చిన తన కుమారులఁజూచి మిగులఁ బరితపించుచుఁ గన్నీరు కాలువలుగట్ట నేడ్చుచుండె. అది యర్జునుఁడు చూచి, యామెయొద్దకుఁ బోయి యోదార్చుచు నిట్లు పలికెను "ఓ సుందరి! నీవు విచారింపకుము. బ్రాహ్మణాధముఁడై, *యాతతాయియైన యశ్వత్థామశిరంబును మదీయ గాండీవమువలన వెలువడుచున్న బాణపరంపరచేఁ ద్రుంచి కొనివచ్చెదను, ఆ శిరంబును నీవు పాదముచేఁ ద్రొక్కి స్నానము చేయుదువు ఇట్లు నీ దుఃఖమును బోఁగొట్టెదను" అని యిట్లు సుందరవిచిత్రవాక్యంబులచే ద్రౌపది నోదార్చి, కృష్ణుని సారథిగాఁ జేసికొని కవచముదొడిగి భయంకరమైన గాండీవమును ధరించి కపిధ్వజమెత్తించి రథము నెక్కి గురుపుత్రుఁడయిన యశ్వత్థామను వెంబడించె. అంత, నశ్వత్థామ తన్నుఁ జంప వచ్చుచున్న యర్జునుని దూరంబునుండి పొడగాంచి, కుమారులఁ జంపినవాఁడగుటచేఁ జిత్తము భయపడుచుండినను, ప్రాణంబుల నెట్లయిన రక్షించుకొనఁ దలంపుతో రథము నెక్కి భూమిమీద నెంతదూరము పోవఁ దరమగునో యంతదూరము, రుద్రునికి భయపడి పర్విడు దక్షప్రజాపతి వలెఁ బఱవఁజొచ్చెను కాని, యశ్వత్థామ హయంబు లలసి ముందడుగు పెట్టలేకుండెను అంత, నతఁడు తన హయంబు

* అనఁగా "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః। క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః"॥ అనఁగా, అగ్నిచే గ్రామంబులఁ గాల్చువాఁడు, విషమునిచ్చి చంపువాఁడు, అస్త్రమును ధరించి నిరపరాధులను జంపువాఁడు, ధనము నపహరించినవాఁడు, భూములను భార్యను హరించినవాఁడును, వీరాఱుగురును" ఆతతాయులని చెప్పఁబడుదురు.

లలసిపోయి ముందు కరుగ లేకపోవుటయు, నర్జునుండు వెను వెంట వచ్చుచుండుటయుఁ గాంచి, యశ్వత్థామ తన్ను రక్షించుకొనుటకు బ్రహ్మశిరోనామక మగు నస్త్రంబుదక్క వేఱుసాధనంబు లేదని నిశ్చయించి, యాచమనంబుచేసి నిశ్చలచిత్తుండై యది ప్రాణాపాయసమయమగుటచే దాని యుపసంహారమంత్ర మెఱుంగకపోయినను నర్జునునిపైకిఁ బ్రయోగించె. అంత, నా యస్త్రము సకలదిశలను నిజతేజో మయంబుగఁ జేసి వచ్చుచుండె. దానిఁ గనుంగొని యర్జునుఁడు తనకుఁ బ్రాణాపాయకర మగునని యెంచి కృష్ణున కిట్లనియె. ఓయీ! *కృష్ణా! కృష్ణా! ఓ మహాబాహూ! నీవు భక్తుల కభయము నిచ్చువాఁడవు సంసారమనెడి యగ్నిచే దహింపఁ బడువారి బాధలను దొలఁగించి మోక్ష మిచ్చువాఁడవు. దేవా! †నీవు నిక్కముగా నీశ్వరుండవు సకలజగంబునకుఁ

---

* ఇటఁ గృష్ణపదసారస్య మేమన "కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః" అను నిరుక్తిని బట్టిచూడఁ, గృష్ణుండు సర్వలోకసుఖావహుండని తెలియవచ్చుచున్నది కావున, నర్జునుండు వచ్చుచున్న తేజస్సు లోకోపద్రవకరముగా నెంచి "ఓయీ! నీవు లోకసుఖావహామయిన కృష్ణ యను నామమును ధరించినవాఁడవే! కావున, నా తేజస్సును హరించి లోకంబులఁ గావ నీ వవశ్యము పాటుపడవలసియున్న దను నభిప్రాయము సూచించుచుఁ గృష్ణయనుపదముచే సంబోధించె మఱియు, శ్రు॥ బాహూ రాజన్యః కృతః" యనెడి శ్రుతిప్రకారము రాజులకుఁ గారణములయిన బాహువులు కలవాఁడవు. కనుక, భక్తుల కభయమునొసంగ సమర్థుండవని తెలియఁజేయుచు, మహాబాహూ! అని సంబోధించెను

† ఇందులకు మూలము "త్వమాద్యః పురుషస్సాక్షా దీశ్వరః ప్రకృతేః పరః। మాయాం వ్యుదస్య చిచ్ఛక్త్యా కైవల్యే స్థిత ఆత్మని" ఇందు సాక్షాదీ

గారణభూతుండవై యున్నవాఁడవు. సర్వంబున కంతరాత్మవై

---

శ్వరుండవనుటచే నేదో యొక యాశితవ్యమగు వస్తువు నపేక్షించి చూచి నచో నందఱు నీశ్వరులే యగుదురు అట్లుకాక, భగవంతుఁ డన్యులకు లభింపని ధర్మములు గలవాఁడు, కావున, నతఁడే యీశ్వరుం డనఁదగును గాని, తక్కినవారికిఁ జెల్లదు "ఆద్యః" అనుటచే భగవంతుఁడు సర్వజగత్కారణుఁడై యున్నట్లు తెలియుచున్నది "పురుషః అని చెప్పుటచే "పూస్సంజ్ఞే వై శరీరేఽస్మిన్ శయనాత్పురుషో హరిః" యనెడి నిరుక్తి ప్రకారము సర్వమందు నంతరాత్మయై యున్నాఁడనియు, సమస్తము శాసించుచున్నాఁడనియు, సర్వమునకు నాధారుఁడనియుఁ దెలియఁదగినది "ప్రకృతేః పరః" అని చెప్పుటచే "భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ। అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం। జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" అని చెప్పఁబడిన యచేతనాత్మకము, చేతనాత్మకము నగు ప్రకృతికంటె విలక్షణుండని తెలియవచ్చుచున్నది "చిచ్ఛక్త్యా మాయాం వ్యుదస్య" చిచ్ఛక్త్యా = నిత్యావిర్భావముకలిగి యపరిచ్ఛిన్నమగు ధర్మభూతజ్ఞానశక్తిచే, మాయాం = మాయాధర్మములను_అనఁగాఁ జేతనాచేతనాత్మ మగు మాయాధర్మములను, వ్యుదస్య = నశింపఁజేసి___ఈ చెప్పుటచే భగవంతుండు జ్ఞానశక్తిచే మాయాధర్మములు తొలగించుకొనుచున్నాఁడనియు, జీవుఁడు కర్మములచే సంకుచితమగు జ్ఞానముకలవాఁడు కనుక, మాయాసంబంధులయిన దేహాత్మభ్రమాదికమును దనయం దారోపించుకొనుచున్నాఁ డనియుఁ దెలియఁదగినది "కైవల్యే ఆత్మని స్థితః" అనుటచే భగవంతుండు "స్వే మహిమ్ని ప్రతిష్ఠితః" ఇత్యాది శ్రుతిప్రకారముగా మఱియొక యాధార మపేక్షింపకయే యున్నట్లు తెలియఁదగినది. అనఁగా, సమస్తమందు నంతరాత్మవై యున్నను, మాయాధర్మములఁ బొందకుండ సమస్తమును శాసించుచుఁ బరాపరాప్రకృతులకంటె విలక్షణుఁడవయిన భగవంతుఁడవు నీవే కావున, నావచ్చుచున్న తేజమేదియో, దాని ఉపశమ మెట్లో తెలియునని భావము

సర్వమును నియమించుచు, హృదయాంతరములందు వర్తించుచుఁ బురుషుండవని చెప్పఁబడుచున్నావు. ప్రకృతిద్వయంబుకంటెఁ బరుండవు. మఱియు, జ్ఞానశక్తిచే మాయాధర్మములను బాఱఁజిమ్మి తత్సంబంధము లేకుండఁ జేసికొనుచున్నావు. నీవు మఱియొకయాధారము నపేక్షింపకుండ వర్తిల్లుచున్నవాఁడవు. అట్టి ఈశ్వరుండవయిన నీవు దేహాత్మభ్రమరూపమయిన మాయాకార్యముచే మోహితచిత్తులైన జీవులకు ధర్మార్థకామమోక్షరూపమగు శ్రేయస్సు, దానికి విపరీతముగు నశ్రేయస్సును, వాని వాని కర్మముల కనుగుణముగా నిజమగు మాహాత్మ్యముచే నొసంగుచున్నవాఁడవు. ఇట్లంతరాత్మవై యుండియే లోకులకు శ్రేయంబు నిచ్చుచుండ లేదు. మఱియు, భూభారమును గలిగించుచున్న దుర్మార్గులను సంహరించునిమిత్తము, మఱియొక ప్రయోజనము లేని భక్తియోగమందు నిపుణులగు భక్తులు మాటిమాటికి ధ్యానించుచుండు నిమిత్తము, నీ వవతారముల నెత్తుచు లోకంబునకు శ్రేయంబు నిచ్చుచున్నవాఁడవు. బ్రహ్మాదిదేవతలకు దేవుఁడవగు కృష్ణా! యీ తేజం బెమిటి? అది యెచ్చటనుండి వచ్చుచున్నదో, యెట్లు శమించునో తెలియదు. భయంకరమగు తేజమొకటి యన్నిదిక్కులం గప్పుచు వచ్చుచున్నట్లుమాత్ర మెఱుఁగుదును. దాని వృత్తాంతము తెలియఁజెప్పుమని యడుగుచున్న యర్జునునకుఁ గృష్ణుం డిట్లనియె "ఓ యర్జునా! ఆ వచ్చుచున్న తేజంబు ద్రోణపుత్త్రుండు ప్రయోగించిన బ్రహ్మాస్త్రసంబంధమయిన దని తెలిసికొనుము. వాఁడు తనకు సంప్రాప్తమయిన

ప్రాణాపాయమును దప్పించుకొనుటకై యుపసంహారమంత్ర మెఱుంగకపోయినను, నా యస్త్రమును ప్రయోగించి నాఁడు ఆ యస్త్రంబును వారించుటకు మఱియొక బ్రహ్మాస్త్రము తప్ప వేఱు సాధనంబులు లేవు. నీవు బ్రహ్మాస్త్రము యొక్క ప్రయోగోపసంహారంబులు తెలిసినవాఁడవు. కావున, నీవు బ్రహ్మాస్త్రమును బ్రయోగించి, యధికమయిన బ్రహ్మాస్త్ర తేజము నడంపుము'' అని యిట్లు భగవంతుండు పలికిన వాక్యంబులను శత్రుహంతయగు నర్జునుండు విని, యాచమనము చేసి కృష్ణునికిఁ బ్రదక్షిణ నమస్కారంబులు గావించి, యా బ్రహ్మాస్త్రముపయికి మఱియొక బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను అంత నా రెండస్త్రంబుల తేజంబులును బరస్పరము కలిసికొని భూమ్యాకాశంబులఁ గప్పి, సూర్యాగ్నులవలెఁ బ్రకాశించి వృద్ధిచెందుచుండెను. ఇట్లు వృద్ధిపొందుచు ముల్లోకంబుల దహించుచున్న యా యస్త్రముల తేజంబును జూచినవారందఱు బ్రళయాగ్నియని భావింపఁ జొచ్చిరి. ఆ సమయంబున నర్జునుండు లోకములకుఁ, బ్రజలకు బాధకలిగించుచుండుటనుగాంచి, కృష్ణునిమతమును గ్రహించి, యయ్యస్త్రద్వయంబు నుపసంహరించెను అనంతరము పాండవమధ్యముండు కోపారుణితలోచనుండై యా యశ్వత్థామను సమీపించి పట్టుకొని, యూపమున యాగపశువును బంధించునట్లు, తన రథమునకు రజ్జువులచే బంధించి శిబిరమునకుఁ గొనివచ్చుచుండె ఆ సమయంబున భగవంతుఁడతనిని గోపించుచు నిట్లనియె 'ఓయీ! ఈ బ్రాహ్మణాధముని రక్షింపఁదగదు కావున, వెంటనే ఖండింపుము. ఈ

దుర్మార్గుఁడు రాత్రియందు నిద్రించియున్న బాలురను జంపెను. ధర్మవిదులగువారు, మద్యము త్రావి మదించిన వానిని, ప్రమాదము పొందినవానిని, చైత్త్యాదులచే మైమఱచినవానిని, నిద్రించినవానిని, బాలుని, స్త్రీని, జడుని, శరణుచొందినవానిని, యుద్ధమందు విరథుండైనవానిని, భయమందిన శత్రువును జంపరు. అది వీఁ డాలోచింపక నిద్రించుచున్న బాలురను ఖండించెను. నిర్దయుండయిన దురాత్ముండు పరుల ప్రాణంబులు దీసి ప్రాణంబులఁ గాచికొనుచుండఁగా, రాజట్టివానిని సంహరించినచో, నది వాని కెంతయు శ్రేయస్కరంబు. * అట్లు రాజదండన మందకపోయినచోఁ, బురుషుఁడు తనదోషమునకుఁ బ్రాయశ్చిత్తము చేసికొనలేక, నరకకూపంబునఁ బడుచున్నాఁడు అశ్వత్థామను నీవు చంపుట వానికెంతయు శ్రేయస్కరంబు. కావున వెంటనే చంపుము. మఱియు, నేను వినుచుండఁగాఁ బాంచాలియెదుట నీ పుత్రులం జంపిన వాని శిరంబు గొనివచ్చెద నని ప్రతిన పట్టియుంటివి. మఱియు, నీ పాపాత్ముఁడు నీ కుమారులఁ జంపినాఁడు. వీఁ డాతతాయి యనఁబడుచున్నాఁడు. తన యధిపతియగు ధృతరాష్ట్రునకు విప్రియమయిన యీ దుష్కార్య మాచరించినాఁడు. ఈ హేతువులంబట్టి వీఁడు వధ్యుఁడు. కావున వెంటనే చంపుము.' అని యిట్లు కృష్ణుం డర్జునుని ధర్మనిరతిని జూడవలయునని పలువిధంబుల బోధించినను, నర్జునుండు గురు

* రాజదండన పొందినవానికి నరకముండ దనుటకుఁ బ్రమాణము
"రాజభిర్ధృతదండాస్తు కృత్వా పాపాని మానవాః। నిర్ధూతకల్మషా యాంతి స్వర్గం సుకృతినో యథా॥

వానర్చిన పరోపకార మెఱింగినవాఁ డగుటచేఁ, దనకుమా రుల జంపినవాఁడయినను, గురుపుత్త్రుఁ డన్న హేతువుచే నతని ఖండింప నిష్టపడ కుండెను

అర్జునుఁ డశ్వత్థామను బంధించి తెచ్చి ద్రౌపది కర్పించుట

అనంతర మర్జునుం డతనిఁ గొనివచ్చి కుమారు లకయి విలపించుచున్న ద్రౌపది కర్పించెను. అంత, ద్రౌపది మెల్లమెల్లగా వచ్చి పశువులవలె బంధింపఁ బడి, పాపకార్య మాచరించినవాఁ డగుటచే సిగ్గునఁ దల వంచికొనియున్న గురుపుత్త్రునిఁగాంచి, వాఁ డపరాధియైనను దా సుస్వభావముగల దగుటచే, నతని నిందింపక యభినం దించెను అట్లు నమస్కరించి యర్జునునిఁగాంచి యిట్లనియె. 'నాథా! యీతని బంధించి గొనివచ్చుటను జూచి సహింప లేకున్నాను. ఇతండు బ్రాహ్మణుండు. మఱియు గురువు. కావున, నితని బంధనమునుండి విడిపింపుము. ప్రయోగోప సంహారముతోఁ గూడిన యస్త్రసమూహమును, రహస్య సంయుతమయిన ధనుర్వేదమును ద్రోణాచార్యునివలన నేర్చు కొంటివి ఈ యశ్వత్థామ, పుత్త్రరూపముతో నున్న యీ ద్రోణాచార్యుండే యని గ్రహింపుము మఱియు, ద్రోణున కర్ధశరీరమై, వీరపుత్త్రవతియై యున్న కృపి, భర్తననుగ మింపక జీవించియున్నది. కావున, వీని కపకారము చేసితివేని గురువునకును, గురుపత్నికి నపకారము చేసినవాఁడ వగు చున్నావు. ఓ ధర్మజ్ఞా! అర్జునా! మీకుఁ బూజనీయమై, వందనీయమై యుండిన గురుకులమును దుఃఖవంతముగాఁ జేయుట యర్హంబుకాదు. ఇంతియకాక, హతపుత్త్రినై,

నేను మాటిమాటికిఁ గన్నీటఁ గన్నులు నిండుచుండ దుఃఖించు చున్నట్లు పతివ్రతయై, గురుపత్నియై, బ్రాహ్మణుండైన వీనికిఁ దల్లియై వర్తించు కృపి పుత్రవిషయంబగు దుఃఖంబును బొందకుండుఁగాక! మఱియు, నే రాజులు దుర్మార్గులయి బ్రాహ్మణకులమునకు నపకారముచేయుదురో, యా రాజుల వంశము సపరివారయుతముగా వేగముగా దుఃఖాగ్నిచేత దహింపఁబడును జుమీ!' అని పలికె. ధర్మంబును, న్యాయంబును దప్పక, కరుణాయుతంబులై, యసత్యములు కాక, యప్రియంబులు కాక, యనురూపములై, పూజనీయములై, యభిప్రాయగంభీరంబులై యున్న ద్రౌపదివాక్యంబులు విని ధర్మరా జిట్లనియె. 'సుందరీ! నీవు పల్కిన వాక్యమునకు మిగుల సంతసించితిని. నీ వాక్యము ధర్మశాస్త్రసమ్మతమైనది. న్యాయమార్గమును విడువలేదు. దయారసమును వెళ్ళఁ గ్రక్కుచున్నది. మఱియు, నీ వాక్యము మిగులఁ బూజనీయమైనది' అని ద్రౌపది సుస్వభావమును నుతించెను. ఆ ద్రౌపదిమాటలు విని నకులసహదేవులును, సాత్యకియు, శ్రీకృష్ణుఁడు మఱియుఁ దక్కుఁగలవారును మిగుల నానందించి స్తోత్రము చేయఁదొడఁగిరి. కాని, యా మాటలకు భీముఁడు కోపముచే మండిపడి 'ఆ వాక్య మెంత మాత్రము మంచిదికాదు. దుర్మార్గుఁడు తనకుఁగాని తన ప్రభువగు ధృతరాష్ట్రునికిఁగాని యెంతమాత్రము హితము కాకపోయినను, నిద్రించుచున్న బాలకులను వృథా చంపి యున్నాఁడు. కావునఁ, దప్పక చంపఁదగినవాఁడే విడిచి పెట్టఁగూడదు' అని పల్కెను. అంతటఁ గృష్ణుఁడు భీముని

వాక్యమును, ద్రౌపదివచనమును విని చిఱునవ్వునవ్వుచు, తన మిత్రుండైన యర్జునుని ముఖము నవలోకించి యిట్లనియె. "ఓ యర్జునా! బ్రాహ్మణుండగుటచేతం జంపందగినవాండు కాండనియు, నాతతాయియగుటవలనం జంపందగినవాండని యును రెండువిధములుగా నేను జెప్పియున్నానుగదా! నీవు యోజించి నా శాసన మతిక్రమింపకుండ ననుష్ఠింపుము. మఱియు, నీ ప్రతిజ్ఞ నెఱవేర్పుము మన ద్రౌపదీభీముల వాక్యంబులం గూడ ననుష్ఠింపుము కావున, * నాకును, నీకును, భీమునకును, ద్రౌపదికిని బ్రియమగునట్లు చేయ వలయును" నని చెప్పినం, గృష్ణుని యభిప్రాయమును దెలిసికొని, కత్తి చేతంబూని తొందఱగాం జని యశ్వ

---

*అశ్వత్థామ శిరస్సును ఖండించి తెచ్చెదననియు, దానిని గాలితోం ద్రొక్కి స్నానముచేసి నీవు పుత్రశోకమును బోంగొట్టుకొనుమనియు, నర్జునుండు ద్రౌపదియెదుటం బ్రతినపట్టెను ద్రౌపది యాతనిం జంపుట కిష్టపడకుండెను భీముం డతనిం జంపవలయు నని పలుకుచుండెను కృష్ణుండు అశ్వత్థామ చంపందగినవాండనియుం జంపందగనివాండనియుం బ్రమాణములతోం జెప్పి, యందఱికిం బ్రియ మగునట్లు చేయువలయునని చెప్పంగా, నందఱికిం బ్రియమైనదని తలంచి యర్జునుండు కత్తితో నశ్వత్థామ శిరోరత్నమును కేశపాశముతోంగూడంగోసి యతని విడిచిపెట్టెను అందువలన నందఱియిష్టములు నెఱవేఱినవి ఎట్లనంగాం, గేశపాశముతోం గూడ శిరోరత్నమును గోయుట తలనఱకుటవంటిదే కనుకను, నా రత్నమును ద్రొక్కి ద్రౌపది తానమాడుటచేతను నరునిప్రతిన నెఱవేఱినది. ప్రాణహాని చేయకుండ విడిచెను గనుక, ద్రౌపదియిష్టము నెఱవేఱినది వీరులకు శత్రుకృతతిరస్కారము మరణమువంటిదే కనుక, భీమునియిష్టము నెఱవేఱినది ప్రాణములు గొనకుండ నతనికి మరణతుల్యమగు నవమానము చేసి పంపుటచేం గృష్ణునియిష్టమును నెఱవేఱినది

త్థామ శిరస్సునందున్న మాణిక్యమును గేశపాశముతోఁ గూడ నాకర్షించి యతని కట్లువిప్పి విడిచిపెట్టెను. అంత, నశ్వత్థామ బ్రహ్మహత్యచేత హతతేజస్కుఁడై, శిరోమణి హరింపఁబడిన దగుటచేత మఱింత తేజోహీనుండై, యా పాండవశిబిరమునుండి తఱుమఁబడెను. ఓ శౌనకాదులారా! దుర్మార్గుఁడగు నశ్వత్థామకుఁ జేసిన శిక్షను జూచినారా! క్షౌరము చేయఁబడెను. తలయందున్న రత్నము హరింపఁబడెను. అతఁడు పాండవుల స్థానమునుండి గెంటివేయఁబడెను. లోకములో బ్రహ్మబంధువుల కింతకంటె నధికమగు శిక్ష కలదా? ఇట్లనుమానపఱుపఁబడి యశ్వత్థామ పోయిన తోడనే పాండవు లందఱు పుత్త్రశోకముచేఁ బీడింపఁబడుచున్నవారయి, ద్రౌపదీదేవితోఁ గూడికొని యుద్ధమందుఁ జనిపోయిన తమ జ్ఞాతుల కందఱికిని జేయవలసిన దహనాది కృత్యములను జేసిరి.

ఇది యేడవ యధ్యాయము.



పాండవులు గంగానదికిఁ బోవుట కుంతి కృష్ణుని నుతించుట.
కుంతి కోర్కెచొప్పునఁ గృష్ణుఁడు హస్తినాపురంబున నుండుట.

పిమ్మటఁ బాండవు లటనుండి కదలి ప్రేతరూపమునొంది పిండాదికమును గోరుచున్న తమ జ్ఞాతులకుఁ బిండోదకముల నీఁ దలంచి, ద్రౌపదిమొదలగు కాంతలతోను, కృష్ణునితోను గంగానదికిఁ బోయిరి. అక్కడ వారు బంధువులనుగూర్చి మాటిమాటికి మిక్కిలి విలపించి, వారికిఁ బిండోదకముల

నొసంగి, శ్రీకృష్ణుని పాదపద్మములఁ బొడమిన దగుటచేఁ
దదీయ పరాగంబునఁ బవిత్రమయిన గంగానదియందుఁ
దానములాడి పరిశుద్ధులైరి. పిమ్మట శ్రీకృష్ణుం డా గంగా
నదీతీరమందు ధర్మరాజాదులతోఁగూడఁ గూర్చుండి, బంధు
వుల మృతికి మిగుల దుఃఖించుచు నున్న ధృతరాష్ట్రుని,
పుత్రశోకపీడిత లయియున్న ద్రౌపదీగాంధారులను, గుంతీ
దేవిని సమీపించి, సకల ప్రాణులకును మాఱులేక జనన
మరణాదులఁ గలిగించుచుఁ గాలగతి వర్తించునని తెలిపి,
మునులుం దానును మంచిమాటలాడి యోదార్చెను. ఓ
శౌనకా! ఇట్లు శ్రీకృష్ణుండు ద్రౌపదికి మానభంగము
గలిగించుటచేతనే గతాయువులయిన దుశ్శాసనాదుల నర్జునా
దులచేతఁ జంపించి, ద్యూతాది మాయోపాయంబులు పన్ని
యపహరించిన రాజ్యమును సాధించి, ధర్మజున కర్పించి,
మంత్రదక్షిణాదులచే లోపమొందని యశ్వమేధంబుల
మూఁడింటి నతనిచేఁ జేయించి, యతని సత్కీర్తి దేవేంద్రుని
సత్కీర్తివలె ముల్లోకముల వ్యాపింపఁజేసెను. అనంతరము
కృష్ణుండు పాండుపుత్రుల ననుమతివడసి సాత్యకియు, నుద్ధ
వుండును దన్నుఁ గొల్చివచ్చుచుండ, వ్యాసాదిమునులఁ
బూజించి, వారలచేఁ బ్రతిపూజలంది, ద్వారకాపురంబునకుఁ
బోవనెంచి, రథంబు నధిరోహించి, భయాతురయై తన
రథంబును వెంబడించి వచ్చుచున్న యుత్తరను జూచెను.
అంత, నుత్తర కృష్ణున కిట్లు విన్నవించుకొనెను. ''ఓకృష్ణా!
నీవు దేవాదులకును దేవుండవు. నీవు సమస్త ప్రపంచంబును
రక్షించుచున్నవాఁడవు. నీవు సూక్ష్మార్థంబులనయిన బాగుగఁ

జూడఁగలవు. జరామరణాది రూపమయిన భయంబు లేని వాఁడవు నీ వొక్కఁడవే. నీకంటె నితరులందఱు జరామరణాది భయంబు గలవారలె. కావున, మృత్యుభయంబు నుండి తప్పింపలేరు. అందులకు నీ వొక్కఁడవే సమర్థుండవు. నన్ను రక్షింపుము, రక్షింపుము. ఓ జగన్నాథా! ఎట్టిగాఁ గాల్పంబడిన యయోవికారమయిన శరంబొకటి నాకభిముఖంబుగా వచ్చుచున్నది. ఆ శరము నన్నుఁ జంపినఁ జంపుఁగాక! నా గర్భమందున్న శిశువును జంపకుండునట్టు లనుగ్రహింపుము.'' అని యేడ్చుచుఁ బలుకుచున్న యుత్తర వాక్యంబు లాలకించి భక్తవత్సలుండయిన శ్రీకృష్ణుం డా శరము పాండవాభావమును జేయుటకయి యశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రమని తెలిసికొనియె. ఆ సమయంబునఁ బాండవులును దమ కభిముఖముగాఁ బ్రజ్వరిల్లుచు వచ్చుచున్న యైదు బాణంబులఁ జూడఁగాంచి, యా శరంబుల నున్మూలింపఁ బ్రతిశరంబులఁ జేకొనిరి. అంతఁ గృష్ణుండు తనకంటె నితరరక్షకులు లేని పాండవుల దుఃఖంబును జూడఁ గాంచి, చక్రాయుధంబుచే నాయస్త్రంబులఁ దునిమి పాండవుల సంరక్షించెను. అనంతరము సమస్తమునందంతరాత్మయై సమస్తమునకు లోనఁజొచ్చి ధారకుండై, మిగుల సూక్ష్మ పదార్థములఁ జూచుచున్న భగవంతుఁడు కురువంశము వర్ధించుటకై స్వయముగా నుత్తరగర్భంబుం బ్రవేశించి, బ్రహ్మాస్త్రమునఁ దదీయగర్భము చెడకుండునట్లు మాయచే నావరించి, తనచక్రముచే బ్రహ్మాస్త్రమును ఖండించెను. ఓ

శౌనకా! * ఆలోచింపఁగా బ్రహ్మశిరోనామకమగు నస్త్రంబు నకుఁ బ్రతిక్రియ లేదు. అది యెప్పుడు వ్యర్థమును గాదు. అయినను, నయ్యస్త్రము విష్ణుతేజోరూపమగు నా చక్రమును సమీపించి శాంతించినది. అప్రతిహతమయిన బ్రహ్మాస్త్రమును విష్ణుచక్ర మెట్లుపశమింపఁ జేయఁగలిగె నని యబ్బురపడ నక్కఱలేదు. విష్ణువు సర్వైశ్వర్యమయుఁడు. అతఁడు కర్మాయత్తములయిన శరీరాదులు లేనివాఁడై, తన యైశ్వర్యశక్తిచేత నీ చిదచిదాత్మక మయిన ప్రపంచమంతయు సృజించుచున్నాఁడు, పాలించుచున్నాఁడు. నశింపఁజేయుచున్నాఁడు. కావున. సమస్త ప్రపంచకంబునకు సృష్టిస్థిత్యాద్యవస్థలు కల్పించుచున్న భగవంతుని కిది యొక ఘనకార్యము కాదు అనంతరము కుంతీదేవి, బ్రహ్మాస్త్రబాధను దొలంగించుకొనిన తన కుమారులతోను, ద్రౌపదితోను బ్రయాణాభిముఖుండయిన కృష్ణుని సమీపించి యిట్లనియె † ఓ దేవా!

---

* ఈ చెప్పుటచే బ్రహ్మాస్త్రము చక్రముచేఁ దప్ప మఱియొకదానిచేఁ బ్రతిహతము కాదనియుఁ, జక్రము లోకమున నేదానిచేతను బ్రతిహతము కాదనియుఁ దెలియవచ్చుచున్నది

† కుంతీదేవి ప్రయాణాభిముఖుండయిన కృష్ణుంజూచి తదీయవిరహమును సహింపలేనిదై, అతని నాప్రయాణమునుండి మఱలింప నిశ్చయించుకొని, లోకములో గుణోత్తముండయిన పురుషుండే తన యాశ్రితులను విడువఁజాలకుండుట చూచుచున్నాము. ఆలోచింప, నీవు ప్రధానకారణుండవు. సర్వమున కంతరాత్ముండవు ఊహింపఁ దరముకాని వివిధవిచిత్రశక్తి కలవాఁడవు స్వేచ్ఛచే స్వీకరింపఁబడుచు, నప్రాకృతమయి యబ్బురముగొలుపు దివ్యమంగళవిగ్రహము కలవాఁడవు ఆశ్రితవాత్సల్యమునకు నిలయుమయినవాఁడవు ఆశ్రితబాధల హరించువాఁడవు నిరతిశయ

నీవు సర్వజగత్కారణుండవు. ప్రకృతికంటెఁ బరుండవు. మఱియు, నీవు సమస్తమున *కీశ్వరుండవు. సర్వభూతంబుల వెలపటను లోపటను వర్తించుచున్నవాఁడ వయినను, ప్రకృతి వలె గోచరుండవు కావు దేవా! నీవు మాయయనెడి తెర మాటునఁ దిరోహితుండ వగుచుందువు కాన, †ననుపాసకుల

మయిన సుఖము గలిగించువాఁడవు యోగపరిశుద్ధమయిన మానసంబునకుఁ జూపట్టువాఁడవు. సర్వము శరీరముగాఁ గలవాఁడవు అందఱికిని స్నేహితుండవు పరులు గ్రహింపలేని వివిధవిచిత్రచేష్టలు గలవాఁడవు ఊహింపఁ దరముగాని యవతారంబులఁ దాల్చుచున్నవాఁడవు ఇట్టి యపారప్రభావంబుగల నీవు, నీపాదపద్మంబులు దక్క శరణంబు లేదని నమ్మి నిన్నే యాశ్రయించి యున్న మమ్ముల విడువ నుద్యమించుట తగదని సూచించుచు, లౌకిక పురుషదృష్టాంతముచేఁ గృష్ణుని సామాన్యునిగాఁ దలంతు రేమోయని సంశయించి, కృష్ణుఁ డితరులకు దుర్లభములగు ధర్మములు గలవాఁడని తెలియఁజేయుటకుఁ, దాదృశధర్మంబులు గల శ్రీకృష్ణునకు ముందుగా నమస్కరించుచున్నది

* ఈ చెప్పుటచే సాంఖ్యుల కభిమతుండయిన పురుషుండు కాఁడని తెలియవచ్చుచున్నది. మఱియు, సాపేక్షమైన యీశ్వరత్వము బ్రహ్మాదులకున్నను, కృష్ణుండు బ్రహ్మాదులకంటె నధికుండని తెలియుచున్నది. మఱియు "యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా। అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" అనెడి శ్రుత్యర్థము సంగ్రహింపఁబడుచున్నది.

† ఈ చెప్పుటచే నుపాసకులయినవారి యోగపరిశుద్ధమయిన మానసంబునకుఁ గానవచ్చుచుండు నని తెలియవచ్చుచున్నది ఇందులకుఁ బ్రమాణము— శ్రు॥ "నచక్షుషా పశ్యతి కశ్చనైనం । నమాంసచక్షురభివీక్షతే తం" మఱియు, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ

యింద్రియంబులకుఁ గానరావు. నీవు వివిధంబులగు వికారంబులను బొందనివాఁడవు నటుని యాథాత్మ్యము నెఱుంగని పురుషుఁడు, నటుఁడు నాట్యోపయుక్తములయిన వేషములు దాల్చుచున్నవాఁ డగుటచే నతనిని జూడలేనట్లు, భవదీయంబగు తత్త్వము తెలియనివారు మాయయనెడి తెరచాటున వర్తించుచుఁ, బెక్కు లవతారంబులు దాల్చుచున్న నిన్నుఁ జూడలేరు అట్టి నీ పాదముల కభివందనము గావించుచున్నాను. ఓ దేవా! ఎల్లప్పుడు నీ స్వరూపమును మననము చేయుచు విమలాత్ములై యున్న పరమహంసల భక్తియోగంబునకు విషయీభూతుఁడవయిన నిన్ను, యోగాభ్యాసమం దధికారము లేని మూఢస్త్రీల మగు మేమెట్టుగాఁ జూడఁగలము! నాట్యోపయుక్తంబులగు నామరూపంబులఁ దాల్చి వర్తించు నటుఁ డా యా నామరూపంబులచేతనే వ్యవహారింపఁబడుచున్న చందమున, నీ యవతారం బెత్తిన నీవును కృష్ణ వాసుదేవాది నామంబులచేతనే వ్యవహరింపఁ బడుచున్నావు. ఆ నామములను మాత్రమే యెఱుంగుదును. కాన, వానిచేతనే నిన్ను సంబోధించెదను. ఓకృష్ణా! ఓ వాసుదేవా! ఓ దేవకీనందనా! ఓ నందగోపకుమారా! ఓ గోవిందా! నీకు వందనంబు లర్పించుచున్నాను. ఓ పంకజనాభా! నీకు నమస్కారము. ఓ పంకజనేత్రా! ఓ పంకజమాలీ! ఓ పంకజాంఘ్రీ! నీకు నభివందించుచున్నాను. ఓ దేవా! నీవు ప్రకృతికిఁ బరుండ

---

దర్శిభిః । వ్యాదా మసేపామనసాభక్ష్ప్రో యవీనంవిదుః॥ ఈ చెప్పుటచే వివిధవికారంబులఁ బొందునదే (అనఁగాఁ బ్రకృతియే) యజ్ఞులకుఁ జూడఁబడు నని తెలియుచున్నది.

వయినవాఁడవు. కావున, నీ వవతారదశయందయినను నీ స్వభావమును విడువక, యసాధారణధర్మంబులను జూపు చున్నావు. ఓ హృషీకేశా! దురాత్ముఁడయిన కంసునిచే నిరోధింపఁబడి చిరకాలము దుఃఖితయయిన దేవకీదేవిని దుఃఖంబుల నుండి విడిపించినట్టు లో సర్వశక్తీ! * నీవు మాకుఁ బ్రభువవయి పుత్త్రిసహితనయిన నన్ను నాపదలనుండి తప్పించి రక్షించినాఁడవు. నేను మిమ్ముల నే యాపదలనుండి రక్షించితి నని యందువేని చెప్పెద విను. విషాన్నముదినిన మా భీముఁడు చావకుండఁ జేసితివి. దుర్యోధనుని యానతిచే దహింపఁబడిన లక్కయిండ్లనుండి తప్పించితివి, రాక్షసదర్శనజాతమయిన భయంబునుండి కాచితివి వనవాసదుఃఖంబులనుండి సంరక్షించితివి ప్రతియుద్ధమందును మహావీరుల యస్త్రములనుండి కాపాడితివి. అశ్వత్థామ బ్రహ్మాస్త్రమునుండి మనిచితివి! ఓ జగద్గురూ! కృష్ణా! తిరిగి సంసారము సంభవింపని! నీ సందర్శనము లభించుచుండె నేని, సర్వదా యప్పటప్పట నీచే నివారింపఁదగిన యాపదలు మాకు సంప్రాప్తమగుఁగాక నే నీశ్వ రుండనయినచో, నీవలె నందఱు నన్ను నిశ్వరునిగా నేల చెప్పరు అందువేని, వినుము. ధన విద్యా సంపదలచేతను, సత్కుల ప్రసూతత్వముచేతను మిక్కిలి గర్వించి, మానవుఁడు నిజపర యాథార్థ్యం బెఱుంగక, కేవలము నిష్కాములకు మాత్రమే

---

* ఈ చెప్పుటచేఁ గృష్ణుండు స్వార్థమందు నిరపేక్షకలిగి పర దుఃఖంబుల నిరాకరించు కృపాళుఁడనియు, నాశ్రితులకు సంప్రాప్తమగు ననిష్టంబుల నపహరించువాఁడనియు, నాశ్రితపక్షపాతియనియు సూచిత మగుచున్నది.

గోచరుండ వగు నిన్ను భగవంతునిగాఁ జెప్ప నర్హుండు కాఁడు దేవా! నీవు నిష్కాములకు లభ్యుండవు. † త్రిగుణవృత్తులయిన కామక్రోధాదులు లేనివాఁడవు క్షుత్పిపాసాది షడూర్ములు లేనివాఁడవు ఆత్మారాముండవు మోక్షప్రదుండవు, అయిన నీకు వందనంబులు గావించుచున్నాను నీ చెప్పిన పురుషుండు బ్రహ్మరుద్రేంద్రాదులలో నొకఁడు కాని. నేను గాను అన్నచోఁ జెప్పెద నవధరింపుము దేవా! కాలమాద్యంతములు లేనిది. అది యంతట సమముగా వర్తించుచుండును. *దానివలననే భూతముల కన్యోన్యము కలహము సంభవించుచుండును. అది బ్రహ్మాదులనయిన వశీకరించుకొని వర్తించుచుండును. దేవా! అట్టి కాలము నీకు శరీరమగుచున్నదని తలంచెద ఇట్లుండ, నా చెప్పిన పురుషుఁడు బ్రహ్మ

---

† ఇందువలన భగవంతునియం దున్న యసాధారణగుణంబులు వెల్లడి యగుచున్నవి ఎట్లనఁగా, నివృత్తగుణవృత్తి-అనఁగా నివర్తించిన రజస్తమోగుణజనితములైన కామాదులు కలవాఁడు ఈ చెప్పుటచే నచిత్తునకు వ్యావృత్తి కలిగినది శాంతుం డనఁగా, క్షుత్పిపాసాశోక మోహజరామృత్యువు లనఁబడు షడూర్ములు లేనివాఁడు, అనుటచే బద్ధజీవునకు వ్యావృత్తి కలిగినది ఆత్మారాముఁ డనుటచేతను, మోక్షప్రదుఁ డనుటచేతను, నిత్యముక్తజీవులకు వ్యావృత్తి కలిగినది

* 'భూతానాం యన్మిథః కలిః' అని యున్నది ఈ చెప్పుటచే నాయా జీవులకుఁ దత్తత్కర్మానుసారముగాఁ బ్రాప్తించు సుఖదుఃఖంబులకుఁ గాలము నిమిత్తమాత్ర మగుచున్నట్లు తెలియవచ్చుచున్నది 'సమం చరంత' మ్మని చెప్పుటచేఁ దాదృశ కాలశరీరకుఁడవయిన నీకు, వైషమ్యాదులు లేవని సూచిత మగుచున్నది

ములలో నొకఁ డెట్లగును? అట్టి పురుషుఁడవు నీవె నేను గొందఱి ననుగ్రహించి కొందఱిని నిగ్రహించుచుండఁగా, వైషమ్యము లేనివాఁడ నెట్లయ్యెదను? అందువేని వినుము. ఓ భగవంతా! *మనుష్యుల విడంబించుచున్న నీ చేష్టితంబుల నొకండును దెలిసికొలేఁడు. నీ కొకఁడు ప్రియుండనియు, నొకఁడు ద్వేష్యుండనియు లేఁడు కొందఱియందు నీవు చూపించుచున్న నిగ్రహంబుగూడఁ దుద కనుగ్రహరూపమై ముక్తి నొసంగుచున్నది. కానిచో, నీచేఁ దెగటార్పఁబడిన పూతనా శకటాసుర చాణూరాదులు నిరతిశయపురుషార్థ రూపమయిన ముక్తి చెందనేల? కాన, నీ కేవైషమ్యంబు లేదు ఇట్లు వైషమ్యరహితుండవయిన నీయందు వైషమ్య మున్నదని చెప్పువారల మతియే విషమ మయినదికాని, వేఱుకాదు. ఓ విశ్వస్వరూపా! నీవు కర్మరహితుండవు, కావుననే కర్మాయత్తమయిన యుత్పత్తిలేనివాఁడవు. కాన, నీవు తిర్యక్కులందును, ఋషులందును, నరులందును, జలజంతువులందును నవతరించి, చేసినకర్మంబు లత్యంతము విడంబనంబులే! చిన్నప్పుడు నీ వొకయపరాధ మాచరింప, యశోద నిన్ను బంధించుట కొకత్రాటిని బట్టుకొనెను. అప్పుడు కన్నీటిచేఁ గలుషితమయిన కాటుక గలుగు

---

* ఇందులకు మూలము—'ఈహమానస్య నృణాండమ్బనమ్' అని యున్నది. అనుటచే, నరచేష్టల ననుకరించుటమాత్రమే చెప్పవలయును గాని, యన్నివిధములచేతఁ దత్సజాతీయచేష్టిత మని చెప్పరాదు అట్లు చెప్పినచో "జన్మ కర్మ చ మేదివ్యం" అనెడి భగవద్గీతాశాస్త్రముతో విరోధించుచున్నది.

నట్టుగాఁ, ఆకితదృష్టులు గలుగునట్లుగా ముఖమును జేసి కొని † మృత్యువునకుఁగూడ భయము కలిగించు నీవు భయ మభినయించుచుఁ బ్రవర్తిల్లిన యప్పటి నీ స్థితి నన్ను మిగుల మోహంబున ముంచుచున్నది విడంబనము కానిచో నిది యెట్లు సరిపడుచున్నది? కొందఱు జన్మాదులు లేనివాఁడ వయినను నిన్ను, భక్తుఁడును బుణ్యశ్లోకుఁడును నగు యదువుకీర్తిని విస్తరింపఁజేయు, నతని వంశమందు మలయ పర్వతముకీర్తి విస్తరింపఁజేయుఁ జందనవృక్షంబువలె, నుద్భ వించితి వని చెప్పుచున్నారు మఱికొందఱు పరమపురుషుఁడ వైన నీవు దుర్మార్గులైన రాక్షసులను జయించుటకును, నీ ప్రపంచకమునకు క్షేమము గలిగించుటకును, దేవకీవసు దేవులచేఁ బూర్వజన్మంబున యాచింపఁబడి కుమారుఁడవై జన్మించితి వని పలుకుచున్నారు ఇంకొక కొందఱు బ్రహ్మాది సురప్రార్థితుండవై మహాసముద్రమం దున్న పడవయందలి బరువును దింపునట్లుగా, భూమిభారముచేఁ బీడితమగు భూదేవి భారమును దొలగించుటకై పుట్టితి వని పలుకుచున్నారు. తత్త్వజ్ఞానవంతులైన కొందఱు దేహాత్మభ్రమాదులకు నిమిత్త మైన యజ్ఞానముచేతను, విషయాభిలాషచేతను, దత్తదను కూలవ్యాపారములచేతను బీడితులై, సంసారసాగరమ్మున మునుంగుచుం దేలుచున్న మానవులు నీ దివ్యచరిత్రములు వినుటకును, నీ రూపములను ధ్యానించుటకును దగినట్లు

† ఇందులకుఁ బ్రమాణము—'భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః । భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి' ఇత్యాదికముచే మృత్యువునకుఁగూడ భయప్రదుఁ డనుట తెలియంగునది

చేయుటకయి యిట్టి యవతారములఁ దాల్చుచున్నావని పల్కుచున్నారు. ఓ దేవా! నీ చరిత్రలను ప్రవక్తలవలన వినుచున్నవారును, శ్రోతలకుఁ జెప్పువారును, వానిని గానము చేయుచున్నవారును, స్మరించుచున్నవారును, నీ గుణములను వర్ణించి యానందించువారును మాత్రమే వేగముగా సంసార ప్రవాహమును నశింపఁజేయు నీపాదపద్మములను జూడఁగలరు గాని, తక్కినవారలు చూడలేరు. ఓ దేవా! సమస్తరాజులలో జితదుఃఖులమై, దీనులమై యున్న మాకు నీ పాదపద్మములకంటె దిక్కులేదు. ఇట్లు సమస్తమును నిన్నే నమ్ముకొని శ్రితులమై, మిత్రులమై యున్న మమ్ముల నీ విప్పుడు విడిచి పెట్ట నూహించుచున్నావు. దేవా! క్షేత్రజ్ఞుని సందర్శనంబు లేనిచో, సర్వేంద్రియంబులు నష్టై నిలిచిపోవుంగాని, యేమియుఁ జేయలేవు. అట్లే భవదీయదర్శనంబు లేనిచో, మేమును యాదవులును నామరూపంబులచే నేపాటివారము. మేమేమియుం జేయలేము. ఎందుకుఁ బనికిరాము. భూమి సమస్త సాముద్రికలక్షణములచేత నొప్పియున్న నీ పాదపద్మములచేఁ ద్రొక్కఁబడుచున్నప్పుడే ప్రకాశించునుగాని, నీ వీదేశమును విడిచినతరువాతఁ బ్రకాశింపదు. ఓ కృష్ణా! నీ వీక్షణంబులచేతనేకదా, యీ దేశములు బాగుగ పండి, సస్యములచేతను, మహౌషధులచేతను, బుష్పలతలచేతను, నుద్యానవనములచేతను, నదీపర్వతములచేతను వృద్ధిపొందుచున్నవి. ఓ విశ్వాత్మా! ఓ కృష్ణా! ఓ విశ్వశరీరా! సర్వాంతఃకరణములను నియమించువాఁడా! నీవారలయిన యదుపాండవులయందును, నాయందును దృఢపడియున్న యీ

స్నేహపాశమును మొట్టమొదటికి ఛేదింపుము. అట్లయినచో, నీకంటె నన్యులయందుఁ జొరక, నాబుద్ధి మాటిమాటికి గంగాప్రవాహము సముద్రమును బొందునట్లు, నీయందుఁ బ్రవేశించి యమితానందము నొందఁగలదు. ఓ కృష్ణా! ఓ యర్జునసఖా! నీవు భూమికి భారము గలిగించుచున్న రాజుల వంశములను దహింప నగ్నిహోత్రమువంటివాఁడవు కదా! నీవు పొగడఁదగిన పరాక్రమము గలవాఁడవు. నీవు గోవులయు, బ్రాహ్మణులయు, దేవతలయు బాధలను దొలఁగింపఁగోరియే యిట్టి యవతారములను ధరించుచున్నావు. మఱియు, నీవు సమస్తయోగీశ్వరులకు గురువవై యొప్పు చున్నావుకదా! అట్టి నిన్నెవ్వరు నుతింపఁగలరు? ఓ గోవిందా! ఓ భగవంతా! నీ కనేకవందనంబుల నాచరించు చున్నాను చేకొనుము అని యిట్లు కుంతీదేవి మృదుమధుర వచనములచేఁ దన మహిమను వర్ణింపఁ గృష్ణుండు విని, హాసాత్మకమయిన యాశ్చర్యశక్తిచే మోహింపఁజేయు చున్నట్లు మందహాసము చేయుచుఁ దనపురంబునకేగఁ దలం చినవాఁడయినను, కుంతికోర్కె నెఱవేర్పఁదలంచి, పయ నంబు వలదనుచున్న ధర్మజుని వాక్యంబు నతిక్రమింపలేక యా కుంతీదేవిని, సుభద్రాదులైన తక్కిన స్త్రీలను, సమా ధానపఱిచి తిరిగి హస్తినాపురంబుఁ బ్రవేశించె. తరువాత, ధర్మరాజు తాఁ జేయించిన బంధువధ కపరిమితదుఃఖము నొందుచుండ వ్యాసాది మహామునులును, నద్భుతమగు ప్రభావము గల శ్రీకృష్ణుఁడును, పెక్కు లితిహాసములు చెప్పి, యాతని దుఃఖమును బోఁగొట్టఁ దొడంగిరి కాని,

యతని దుఃఖము కొంచెమేనియు శాంతము నొందలేదు. ఆ ధర్మరాజు మాటిమాటికిఁ దన స్నేహితజ్ఞాతి గురుజనంబుల మరణమును దలంచుకొని స్నేహమునకును, మోహమునకును వశుఁడై, యజ్ఞానముగల చిత్తముతో నిట్లు పలుకఁజొచ్చెను. అకటా! మిగుల దురాత్ముఁడనైన నా యజ్ఞానమును మీ రందఱు చూచితిరా! కుక్కలకును, నక్కలకును భోజనము కాఁదగిన తుచ్ఛమైన యీ శరీరమును సుఖింపఁజేయ లెక్కలేని సైన్యములను జంపించితిని. ఇంతటి యవివేకి లోకమందు మఱియొకం డున్నాఁడా? బాలురను, బ్రాహ్మణులను, మిత్రులను, దండ్రులను, దమ్ములను, గురువులను, నిర్దయుఁడనై చంపించిన నే నా పాపమునుండి పదివేలజన్మము లెత్తినను దప్పించుకొనఁగలనా? ధర్మయుద్ధమునందు శత్రువులను జంపినను బాపము లేదని యొకవేళ నుపదేశింతురేమో! అందులకు నే నిష్టపడను. తన ప్రజలను బాధించు శత్రువుల వధించినను, బాపము లేకపోయినఁ బోవచ్చును. నే నట్లుచేయక, దుర్యోధనుండు చక్కఁగ రాజ్యపరిపాలనము చేయుచుండఁగా, రాజ్యలోభముచేత నందఱిని జంపించితి అందువలన నా కా పాపము రాకమానునా! మఱియు, యుద్ధమునందుఁ బురుషులఁ జంపుట ధర్మమే యనికొందము. సుతులను, భర్తలను, సోదరులను, దక్కిన బంధువులను జంపి, స్త్రీలకు నే నొనరించిన మహాద్రోహము, గృహస్థు చేయఁదగిన కర్మము లన్నియుఁ జేసినయైనను దానిని బోఁగొట్టుకొలేను. అయినను, బహుకాల మనుభవించినంగాని తెలుగని ఫలంబులు గల యీ మహాద్రోహము స్వల్పకాలములో నిర్వర్తింపఁదగిన

గృహాస్థకర్మములచే నెట్లు నిరసింపఁబడు? మఱియుఁ, గర్మముచేఁ గర్మమును దొలగించుకొనుటయు నయుక్తమే. పంకిలమగు శరీరమును బురదనీటిచే నెట్లు నిర్మలమగునట్లు చేయలేమో, సురాభాండమును సురచేత నెట్లు నిర్మలమగునట్లు చేయలేమో, యట్లే సమస్త బంధుగురుహితులను జంపినఁగా, జనితమయిన పాపమును బశువధపాపముతో మిశ్రమైన యాగములచే నెంతమాత్రమును బోఁగొట్టుకొనలే నని తలంచుచున్నాను

ఇది యెనిమిదవ అధ్యాయము.



ధర్మరాజు తన తమ్ములతోఁ గృష్ణునిఁ దోడ్కొని భీష్మునికడ కేగుట,
ధర్మరాజు భీష్ముని ధర్మంబు లడిగి తెలిసికొనుట,
భీష్ముడు శ్రీకృష్ణుని నుతించి శరీరమును బాయుట

అని యిట్లు ధర్మరాజు ప్రజాద్రోహమునకు మిగుల భయపడుచు సకలధర్మములను దెలిసికొనఁ దలంపుతో కురుక్షేత్రమందు పడియున్న భీష్ముని దర్శించుటకై బయలుదేరెను ఇట్లతఁడు బయలుదేరినతోడనే, యతనితమ్ము లందఱును హాయక్షేమంబులచేతను స్వర్ణభూషలచేతను నలంకరింపఁబడిన రథములపైఁ గూర్చుండి యతని వెంబడించిరి. అది చూచి, ధౌమ్యుండు, వ్యాసుండు మొదలగు బ్రాహ్మణు లందఱును బయాణమయి నడచుచుండిరి భగవంతుఁడైన కృష్ణుఁడుకూడ రథముపైఁ గూర్చుండి యర్జునయుతుండయి బయలుదేఱెను ఇట్లు బయలుదేఱిన సమస్తపరివారముతోను

బరివేష్టింపఁబడియున్న ధర్మరాజు, యక్షులచేఁ బరివేష్టితుం డగు కుబేరునివలె, మిగులఁ బ్రకాశించెను. ఆకాశమునుండి భూమికిఁ దిగివచ్చిన దేవతవలెఁ బ్రకాశించుచున్న భీష్మునిఁ జూచి, పాండవులు కృష్ణసహితులయి నమస్కారముచేసిరి. ఓ సత్తమా! ఆ సమయమున దేవర్షులును, సమస్తబ్రహ్మర్షులును, రాజర్షులును, భీష్మునిఁ జూచుటకయి యచ్చటికి వచ్చి, యా స్థలమందే యుండిరి. అచ్చటికి వచ్చినవా రెవ్వ రనినఁ జెప్పెద నాలింపుము. పర్వతుండును, నారదమహాముని యును, భగవంతుఁ డయిన వ్యాసమహామునియు, ధౌమ్యుఁడును, బృహదశ్వుఁడును, భారద్వాజుఁడును, శిష్యసమేతుఁ డయిన పరశురాముఁడును మొదలగు మునీశ్వరు లందఱు వచ్చిరి. మఱియు శ్రీశుకుఁడును, వసిష్ఠుండును, నింద్రప్రమదుండును, త్రితుండును, గృత్సమదుండును, నసితుండును, గక్షీవంతుండును, గౌతముండును, నత్రిమునియు, విశ్వామిత్రుండును, సుదర్శనుండును, శిష్యసమేతులయిన కశ్యపాంగిరసాదులును, మఱికొందఱు బ్రహ్మర్షులును నా భీష్మునిసన్నిధి కేతెంచిరి. ఇట్లు వచ్చిన మునీశ్వరుల నందఱిని ధర్మజ్ఞుండును, దేశకాల విభాగమును జక్కఁగఁ దెలిసినవాఁడును నగు భీష్ముఁడు యథావిధిగాఁ బూజచేసెను. పిమ్మట, నాతఁడు కృష్ణునిప్రభావమును దెలిసినవాఁడు గావున, లీలామానుష విగ్రహధారి యయి తనముందల నుపవేశించియున్న శ్రీకృష్ణుని హృదయకమలంబునఁ జేర్చికొని, మానసోపచారములచేఁ బూజించెను. తరువాతఁ, దన దగ్గరఁ గూర్చుండి వినయప్రేమసంయుతులై యున్న పాండవుల ననురాగజనిత బాష్పమ్ములచే నిండి,

ముడువఁబడియున్న చూపుతోఁ జూచుచుఁ గుశలమడిగి గౌర వించెను ఇట్లు గౌరవించి ధర్మరాజాదులతో నిట్లనియె. ఓ వత్స లారా! ధర్మమునకును, బ్రాహ్మణులకును, భగవంతుఁడగు శ్రీకృష్ణునకును విధేయులై యున్న మీరు, కష్టజీవనము చేయుచున్నా రనుట మిగుల విచారకరమగు సంగతి! తన భర్తయగు పాండురాజు మృతిఁ బొందినప్పటినుండియు, నా కుంతీదేవి సంతానవంతురాలై యుండియుఁ బుత్రిలయిన మీరు బాలురగుటంబట్టి, మీ నిమిత్తము మాటిమాటికిఁ బలు దుఃఖంబు లందవలసివచ్చె అయినను, వానిని గుఱించి మీ రెంతమాత్రము విచారింప నవసరము లేదు వాయువునకు మేఘపంక్తి వశమయినట్లు, సమస్త ప్రాణులును గాలమునకు వశులై యుందురు. కనుక, నిదివరకు మీకు సంప్రాప్తములగు కష్టములన్నియుఁ గాలవశమున వచ్చినవని తలంచుచున్నాను. అయ్యారే! కాలము దుర్ఘటములగు వస్తువులనైన ఘటింపఁ జేయునుగదా! కేవలము ధర్మదేవత కుమారుఁడగు నజాత శత్రువు రాజుగా నుండెను గదాదండమును ధరించిన భీముఁ డును, గాండీవ మను మహాచాపమును ధరించిన యర్జునుఁ డును, నతనికి సహాయులును, దమ్ములునై యుండిరి లోక నాథుఁడై భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడతనికి స్నేహితుఁడుగదా! ఇట్లు పుణ్యబలమును, శరీరబలమును, నస్త్రనైపుణ్యమును, దైవసంపత్తియుఁ, గల స్థలమందును గష్టములు పొరయుట యోజింపఁ, గాలవశ మనుటకు సందియ మున్నదా? కృష్ణుఁ డొనర్చిన దివ్యచేష్టితంబులను దెలిసికోవలె నని తలంపుగల్గి బ్రహ్మాదులును మోహము పొందుచున్నారు అట్లుండ, మఱె

వ్వాఁడు తెలిసికోఁగలఁడు? ఓరాజా! సమస్తప్రాణుల సుఖ దుఃఖంబులు కాలాధీనంబులు. సుఖదుఃఖనిమిత్తకము లయిన కర్మములు కృష్ణుని కధీనంబులు. ఆ కృష్ణుఁడు కాలాదుల ననువర్తించుచుండును కావున సుఖదుఃఖాత్మకమగు నీ సమస్తమును గాలకర్మాదులం నుద్బోధించుచుఁ, దదనువర్తియయి వర్తించునట్టి కృష్ణున కధీనమని నిశ్చయించుకొని, యీయీ కృష్ణుని విహితమును ననువర్తించుచు, దిక్కులేని ప్రజల నందఱిని ప్రేమముతోఁ బాలింపుము. ఈ శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు ఇతఁడు పరమపురుషుఁడైన నారాయణమూర్తి. ఇతఁడు తన మాయచేత లోకుల నందఱిని మోహింపఁ జేయుచు, యాదవులయందు రహస్యముగాఁ బ్రవర్తించు చున్నాఁడు పరమగుహ్యమయిన యీ కృష్ణుని మాహాత్మ్య మీశ్వరుఁ డెఱుంగును దేవర్షియైన నారదుం డెఱుంగును. మఱియు, భగవంతుఁడైన కపిలముని యెఱుఁగును. ఇంతకుఁ దప్పఁ, గృష్ణుని మాహాత్మ్యమును దెలిసికొన నెవ్వరు సమర్థులు? ఓ ధర్మజా! నీవీ కృష్ణుని బావమఱఁదిగాను, మిత్రుని గాను, దూతగాను, మంత్రినిగాను, రథచోదకునిగాను దలంచుచున్నావు ఈ కృష్ణుఁడు పరమపురుషుఁడుగాని, నీ వనుకొన్నట్లు మనుష్యమాత్రుఁడు కాఁడు. ఓయీ! ఈ కృష్ణుఁ డట్టి పరమపురుషుఁడే యయినయెడల, మా చేయుమన్న నీచకృత్యముల నేల యాచరించెను? అని యందువేమో! ఆతని గుఱించి యిట్లు శంకింపఁ బనిలేదు. సేవకగత నికృష్టత్వంబు లేనివాఁడై, దేహాత్మభ్రాంతిరహితుండై, ద్వితీయవస్తుశూన్యుండై, ప్రకృతి పురుషాదులగు సమ సవ సుఖులును

స్వశరీరభూత మగుటంబట్టి, యొక్క రీతిగాఁ జూచుచున్న వాఁడై యున్న కృష్ణమూర్తి కొకప్పుడును మతివైషమ్యము కలుగ నేరదు. ఔరా! భగవంతుం డిట్లు సర్వసముండై నను, దన యేకాంతభక్తులందు మిగుల దయగలిగి యుండును. అట్లే కానియెడల భక్తుఁడనై కాలవశమునఁ బ్రాణములు విడిచి పెట్టుచున్న నాకీ కృష్ణుఁ డేల సందర్శన మిచ్చుచున్నాఁడో యోజింపుము. అతని సందర్శనంబువలనఁ గలిగెడి ఫల మేమందువా? ఆ ఫలంబు నిరుపమాన మైనది. యోగీశ్వరుండే భగవంతునియందు భక్తిసంయుక్తమైన చిత్తమును జేర్చి, యే భగవంతుని నామంబులఁ గీర్తించుచుఁ గళేబరంబు విడిచి కామముక్తుఁడును, గర్మముక్తుండు నగుచున్నాఁడో, యాతండే యీ కృష్ణుఁడు. నామకీర్తనమే కామకర్మవిముక్తిఁ గలిగించి మోక్షసుఖంబుల నిచ్చుచుండ, నమ్మహాత్ముని దర్శనంబువలనఁ గలుగుఫలం బింతయని చెప్పనగునా? కావునఁ, బ్రసన్న మగు మందహాసంబు చేతను, నరుణనేత్రంబులచేతను, వదనారవిందము కులుకుచుండ, చతుర్భుజుండును, శ్రీదేవదేవుండును, భగవంతుఁడు నగు శ్రీకృష్ణుండు నా ధ్యానంబునకు విషయీభూతుండయి, నే నీ కళేబరంబు త్యజించునందాకఁ బ్రతీక్షించి యుండుఁగాక! అని పలుకుచున్న భీష్ముని పలుకు లాలకించి, ధర్మరాజు శరపంజరంబున శయనించియున్న భీష్మునిఁ జూచి పండితత్వ, పామరత్వ, శక్తత్వాశక్తత్వాదులగు పురుషస్వభావములకు ననుకూలముగా విధిచోదితము లయిన ధర్మముల నడిగి తెలిసికొనెను మఱియు, బ్రాహ్మణాదివర్ణములకును, బ్రహ్మచర్యాద్యాశ్రమంబులకు నుచితంబులగు

ధర్మంబులను, రాగవైరాగ్యంబు లుపాధిగాఁగల ప్రవృత్తి నివృత్తి భేదంబులను నడిగి, యిట్లు వర్ణాశ్రమాది ధర్మంబులఁ దెలిసికొనెను. పిమ్మటఁ బాండవాగ్రజుండు దానధర్మముల తెఱంగులను, నీతిశాస్త్రోక్తంబు లగు రాజధర్మంబులను, బంచరాత్రాది తంత్రోక్తములయిన మోక్షధర్మములను, ససాధనములయిన ధర్మార్థకామమోక్షములను, స్త్రీధర్మములను, దత్కథాశ్రవణ కీర్తనాదులయిన భగవద్ధర్మంబులను భీష్మ నడుగ, నతం డితిహాసములందును, వ్యాఖ్యానంబులందును జెప్పఁబడిన ట్లఖిలధర్మములను, సంగ్రహముగాను విపులముగాను వర్ణించి చెప్పుచుండెను ఇట్లు చెప్పుచుండఁగా, స్వచ్ఛంద మరణముగల భీష్మునికి వాంఛితమయిన యుత్తరాయణకాల మేతెంచెను. అంత, సహస్రముల సంఖ్యగల కురుపాండవులకు నాయకుఁడయిన భీష్ముండు మాటాడుట మాని, దేహాదిసంబంధములను విసర్జించి, విలసత్పీతాంబరమును దాల్చి తనయెదుట నాసీనుఁడయి చతుర్భుజంబులతో వెలయుచున్న శ్రీకృష్ణునియందుఁ దన మానసంబును జేర్చి, నేత్రముల నిమీలించి, యతని రూపమును ధ్యానింపఁదొడంగెను. ఇట్లు పరిశుద్ధమయిన ధారణచే భగవద్విగ్రహమును ధ్యానించుటం జేసి, భగవత్ప్రాప్తికి విలంబము కలిగించెడి ప్రారబ్ధము నశింప, నా భగవద్దర్శనంబుచే నాయుధప్రహారముల బాధ తొలంగ, నింద్రియంబుల వ్యాపారంబులు నివర్తింప, దేహాత్మభ్రమ నశింప, భీష్ముఁడు శరీరము విసర్జించుచు జనార్దను నిట్లు నుతించెను.

## భీష్ముఁడు శ్రీకృష్ణుని నుతించుట

భగవద్భక్తుల కధిపతియై, నాగాదులకంటెను, జీవుల కంటెను విలక్షణుండయి, యపరిచ్ఛిన్నంబగు స్వాభావికానందంబుచేఁ దనరుచు, నొకప్రదేశమందు విహరింప లీలావిగ్రహంబునుబొంది, స్వసంకల్పమాత్రంబుననే సమస్తజీవులకును సంసారప్రవృత్తి గలిగించుచు వర్తించు శ్రీకృష్ణుని యందుఁ దనివిచెందకుండ నామతి సుస్థిరంబయి యుండుఁగాక! ముల్లోకములకుఁ గమనీయమయి తమాలమువలె నీలవర్ణము కలిగి, సూర్యకిరణములవలె గౌరవర్ణముగల వసనముచే నొప్పుచుఁ, గుంతలములచేఁ బరీతమయిన ముఖపద్మముతోఁ గూడి, బెడఁగారుచున్న శరీరముగల శ్రీకృష్ణునియం దనన్యప్రయోజనమైన యనురాగంబు నాకు లభించుఁగాక! యుద్ధ సమయములయందు గుఱ్ఱపుడెక్కలచే నుద్ధూతంబయిన పరాగంబుచే ధూసరితమై వ్రేలాడు కేశకలాపముచేతను, స్రవించు చెమటబిందువులచేతను నలంకృతమై నెమ్మొగంబు తులకింప, నిశితంబులయిన నా బాణంబు లతని కవచమును భేదింపఁ, దజ్జనితమయిన రక్తముచేఁ గవచము ప్రకాశించుచుండ, వర్తించుచుండెడి శ్రీకృష్ణునియందు నా మానసంబు దృఢంబుగా నిలిచి యుండుఁగాత! మఱియు, యుద్ధప్రారంభ సమయమందుఁ దన స్నేహితుఁడయిన యర్జునుండు చెప్పిన చొప్పున నుభయసైన్యంబుల నడుమ రథంబును నిలిపి, దృష్టిప్రసారముచేతనే శత్రుసైనికుల యాయువును హరించిన పార్థసఖునియందు నా కనురాగంబు జనించుఁగాత! యుద్ధ

ప్రారంభదశయందు నర్జునుండు తనరథంబు నుభయసైన్యం బుల నడుమ నుంపుమన నట్లు కావించె. అర్జునుం డుభయ పార్శ్వంబుల నుండునట్టి స్వబంధువర్గంబునుజూచి, వారలఁజంప యత్నింపక యుద్ధవిముఖుఁడగుటయు, నతని కుత్సితబుద్ధినిజూచి గీతోపదేశమును జేసి యా కుత్సితబుద్ధిని హరించిన సర్వాధికుం డగు శ్రీకృష్ణుని పాదపద్మంబులందు నా మానసంబున కను రాగం బుదయించుఁగాత! మఱియు, యుద్ధసమయంబున నొక నాఁడు నేను దుర్యోధనునియెదుటఁ గృష్ణునిచేఁ జక్రము పట్టింతు నని ప్రతిన చేసితి. కాన, నా ప్రతిజ్ఞ నెఱవేర్చుకొను టకై నిశితంబులగు శరంబులచేఁ గృష్ణుని నొప్పించి, యతని కవచమును జీల్చితిని. అంత, నా శరంబుల సహింపనోపక రక్తసిక్తగాత్రుండయి "యుద్ధమున నాయుధమును స్వీక రింప" నని ప్రతినచేసినవాఁ డయ్యుఁ, దన ప్రతినకంటె భక్తుని ప్రతిజ్ఞ ముఖ్యమయినది కావున, భక్తుఁడనయిన నా ప్రతిన నెఱవేర్ప నెంచి, చక్రంబుం గేలఁగీలించి, రథంబు డిగి, యా సమయంబున భూమి కంపింప, నుత్తరీయము క్రిందికి జాఱుచుండ, మదపుటేనుఁగుపయికి లంఘించు సింహంబు చందంబున,నాపయికి లంఘించి నాకభిముఖంబుగాఁజను దెంచు శ్రీకృష్ణుండు నాకు మోక్ష మొసంగి దిక్కగుఁగాక! అర్జునుని రథంబును సర్వదా రక్షింపుచు, హయచోదనంబుకై వేత్రం బును దాల్చి,గుఱ్ఱములపగ్గంబుల రెండవచేతఁ ధరించి, చూడఁ దగిన రూపంబున నొప్పుచుండ, నెవ్వని దివ్యరూపంబును జూచుచు యుద్ధంబున మృతులగు వీరు లపహతపాప్మత్వము మొదలగు గుణాష్టకంబు గలవా రగుచున్నారో, యట్టి దివ్య

రూపంబు గలిగి వర్తించు భగవంతునియందుఁ జావ సిద్ధుండనైన నాకుఁ బ్రీతి జనించుఁగాత! మనోహర మయిన గమనములచేతను, విలాసములచేతను, మందహాసములచేతను, ననురాగమును బ్రకటించు చూపులచేతను, గల్పింపఁబడిన పూజగలవారలయి, కృష్ణుండు కావించిన యమానుష చర్యలను ననుకరించుచున్నవార లయి, భగవంతుఁ డగు కృష్ణుని దివ్యచేష్టలను స్మరించుటవలనఁ బరమానందము గలిగి, మెయిమఱచియున్న గోపికాస్త్రీ లందఱు నెవ్వని సాధర్మ్యము నొందిరో, యట్టి శ్రీకృష్ణునియందు నా మనస్సు విహరించుఁగాక! ధర్మరాజు రాజసూయయాగము చేయు సమయమ్మున మునీశ్వరులును, రాజశ్రేష్ఠులును దన్నుఁజూడ, సభామధ్యమందు ధర్మరాజిచ్చిన పూజను గ్రహించినప్పటి కృష్ణస్వరూపము నాకు గోచర మగుఁగాక. *లోకమున వాయువు తనబలముచే వెదు

---

*ఈ వాక్యార్థంబు నిచ్చునట్టి "క్షితిభర మవరోపితుం కురూణాం శ్వసన ఇవాస్రుజ దక్షువంశవహ్నిం। తమిమ మహమనుత్రవతా త్రిపాంఘ్రిం వ్యాది పరిరభ్య జహామి మర్త్యనీడం" అనెడి శ్లోకము కొన్ని ప్రతులలో లేదు అంతమాత్రమున దీనిఁ బ్రక్షిప్తం బనరాదు. మఱియు, వీరరాఘవీయ వ్యాఖ్యానంబులో భీష్ముఁడు పదునొకండు శ్లోకంబులచేఁ గృష్ణుని నుతించుచున్నాఁ డని యవతారిక వ్రాసినాఁడు కాని, యందు పదిశ్లోకములు మాత్రమె కానవచ్చుచున్నవి విడువఁబడిన శ్లోకంబునకు వ్యాఖ్యానంబుగూడఁ గానరాదు దీనిబట్టి యోజింప నీ శ్లోకంబు వీరరాఘవీయాదుల కాలంబున నుండియున్నట్లును, దానికి వీరరాఘవాచార్యులు వ్యాఖ్యానించి యున్నట్లును, తరువాతఁ బ్రమాదవశంబున శ్లోక వ్యాఖ్యానంబులు గతించినట్లును, దెలియవచ్చుచున్నది. (ఇది యింకను విచారణీయము )

ళ్లను రాపాడించి యా వెదురుపొదలను భస్మము చేయఁజాలిన యగ్నిహోత్రమును బుట్టించుచున్నది అట్లే యెవఁడు కౌరవులవలనఁ గలిగెడి భూభారమును బోఁగొట్టఁ దలపోసి ధృతరాష్ట్రుని వంశంబునంతను దహింపఁజేయుటకు నగ్నిహోత్రరూపమగు భారతయుద్ధమును గల్పించెనో, యెవ్వనిపాదములు భక్తుల కష్టములఁ దొలంగించుచున్నవో, యట్టి శ్రీకృష్ణుని పాదములను బ్రాపుగఁ జేసికొని యీ మానవ దేహమును విడిచిపెట్టుచున్నాను † సూర్యుండు గగనంబున వర్తించునప్పు

---

† ఇట భగవంతునకును సూర్యునకును వ్యాప్యగతదోషములు పొందకుండుటమాత్రములోనే దృష్టాంతము చేకొనవలెను ఎట్లనఁగా, సూర్యుఁడు జలాధారములందుఁ గానవచ్చుచున్నను, నతఁడు తజ్జలగతములయిన వృద్ధిహ్రాసచలనాదులను బొందఁడు అట్లె భగవంతుండును పృథివ్యాదులందంతరాత్మయై వర్తించుచుండినను, నతఁడు పృథివ్యాదిగతములయిన దోషముల నొందక, యనంతకల్యాణగుణంబుల కాకరుండయి వర్తించుచుండును. ఇట్లు నిర్దోషత్వములోమాత్రమె దృష్టాంతము చేకొనక, స్థితియందుఁగూడఁ జేకొనినచో, నర్కదృష్టాంతము కుదరదు. 'ఏమనఁగా, జలాధారములందు సూర్యుఁ డున్నట్లవభాసించునే కాని' వాస్తవముగా నుండఁడు. పృథివ్యాదులందు భగవంతుని స్థితిగూడ నట్టిదే యని చెప్పినచో, శ్రుతివిరోధము కలుగుచున్నది. ఏమనఁగా, సూర్యుఁడు జలాధారములం దుండుట భ్రాంతి భగవంతుండు పృథివ్యాదులం దుండుట సత్యము కావుననే "శ్రు॥ యః పృథివ్యాం తిష్ఠన్" ఎవఁడు భూమియందు నివసించుచున్నాఁడో, "శ్రు॥ యో౽ప్సుతిష్ఠన్" ఎవఁ డుదకమందు నివసించుచున్నాఁడో, 'శ్రు॥ య ఆత్మనితిష్ఠన్' ఎవఁడు జీవాత్మలం దంతరాత్మయై యున్నాఁడో, ఇత్యాది శ్రుతులు ప్రపన్నము అగుచున్నవి. కావున, వ్యాప్యగతములయిన వృద్ధిహ్రాసాదులు భగవంతునికిఁ గలుగవని మాత్రమె సూర్యదృష్టాంతము చే

డొక్కఁడుగానే యెల్లవారికిఁ గన్పించును కాని, జలాదులందు భాసించునప్పుడు నానాత్వ మంది కానవచ్చును. అట్లు సూర్యుఁడు జలాదులఁ గానవచ్చినను, దజ్జలగతములయిన వృద్ధిహ్రాసాది దోషములు వాని కంటవు. అట్లే భగవంతుఁ డొకఁడయ్యును, దత్తత్కర్మానుసారముగాఁ దన వేఁ గల్పితులయిన జీవుల ప్రతిహృదయమందును నంతరాత్మయై వర్తించుచు నానాత్వము నొందియున్నాఁడు. అట్లయిన, నతనికి వ్యాప్యగతములయిన దోషము లంటవు. నేన బ్రహ్మాత్మకములైన స్వతంత్రవస్తువులు పెక్కులు గలవనెడి మోహ

---

నిశ్చయింపవలయును మఱియు, వృద్ధి హ్రాస భాక్త్వ మిత్యాదిక సూత్రమున "ఉభయసామంజస్యాత్" ఉభయమయిన గగన సూర్య్య దృష్టాంతములు సమంజస మగుటవలన, అని వ్యాసుండు చెప్పియున్నాఁడు అది యెట్లనఁగా "ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్ । తథాత్మైకో హ్యనేకస్థో జలాధారేష్వివాంశుమాన్" అనఁగా, నొకటైన యాకాశము ఘటాదులందు నానాత్వము చెంది వర్తించుచున్న విధమునను, సూర్యుఁడొక్కఁడైనను జలాధారములందుఁ బెక్కురూపము లొంది వర్తించుచున్న చందమునను, బరమాత్మ యొక్కఁడే పృథివ్యాదులందు నానావిధములుగా వర్తించుచున్నాఁ డవి యర్థము ఇట్లు రెండు దృష్టాంతములు భగవంతునికిఁ బృథివ్యాదిగతములయిన దోషములు పొందవని చెప్పినచో సమంజసము లగుచున్నవి మఱియు, జలాధారములందు వాస్తవముగా సూర్యుఁడు లేకపోవుటచేతనే తద్గతదోషము అంటలేదు ఆకాశము వాస్తవముగా ఘటాదులందు వర్తించుచున్నను, తద్గతములగు వృద్ధిహ్రాసాదులు కలుగలేదు భగవంతునికో, పృథివ్యాదులందు వర్తించుచున్నను, దోషము లతఁడు ప్రత్యనీకమయిన యాకారము కలవాఁ డగుటంబట్టి, దోష హేతువు లేకపోవుటచేతనే దోషము అంటలే దని తెలియఁ దగినది.

మును, నొకఁడయిన యాత్మయందు దేవమనుష్యాదిభేదములు గలవనెడ మోహమును విడిచి, యట్టి భగవంతునిఁ బొందు చున్నాను. అని యిట్లు భీష్ముఁడు శ్రీకృష్ణమూర్తిని నుతించి, భగవంతుఁడయిన కృష్ణునియందు మనోవాగ్దృష్టుల వ్యాపారంబుచేఁ బ్రత్యగాత్మ ననుసంధానంబు గావించి, యంతర్లీన మగు శ్వాసవాయువులు గలవాఁడయి, శరీరంబు విడిచి, యర్చిరాది మార్గంబుచేఁ బరమపురుషునిఁ జేరెను. అంత, నచ్చట నున్నవారలందఱు భీష్ముఁ డుపాధివిధూననంబు గావించికొని నిర్దోషియగు పరబ్రహ్మమును జేరుటఁజూచి, రాత్రియందలి పక్షులవలెనే మౌనమును దాల్చియుండిరి. ఆ సమయమున మానవులచేతను దేవతలచేతను వాయింపఁ బడినవై, దుందుభులు మ్రోసెను. అక్కడి సాధువు లందఱు భీష్ముని గుణములను, బరాక్రమమును, జ్ఞానసంపత్తిని మిగులఁ గొనియాడిరి. అప్పుడే యాకాశమునుండి యఖండమగు పుష్పవృష్టి గురియఁదొడంగెను. తరువాత, ధర్మరాజు వ్యాసాదుల ననుమతిచొప్పున భీష్మునికి దహనాది కృత్యంబుల నొనర్చి, కురువృద్ధయిన యాతని మరణమునకు ముహూర్త కాలము దుఃఖపడెను. పిమ్మట నచ్చటికి వచ్చిన మునులందఱు శ్రీకృష్ణమూర్తిని వేదాంతవేద్యమై యున్న రహస్యంబుల వెల్లడించు తదీయనామంబులచే స్తోత్రముచేసి, యా కృష్ణునిఁ దమతమ చిత్తంబుల హత్తించుకొని, యాతని యనుజ్ఞ పొంది తమ తమ యాశ్రమములకుఁ బోయిరి. తరువాత, ధర్మరాజు కృష్ణునితోను, సోదరులతోను హస్తినాపురము ప్రవేశించి, పుత్రశోకముచేతఁ దపించుచున్న గాంధారీధృతరాష్ట్రులను

సమీపించి, నమస్కరించి మంచిమాటలచే వారి దుఃఖమును బోవునట్లుచేసెను ఇట్లుచేసి, ధర్మరాజు వారల యాజ్ఞ పుచ్చుకొని కృష్ణమూర్తి సెలవుకైకొని, పితృసంబంధమైన రాజ్యమున కభిషిక్తుండై, ధర్మము తప్పకుండఁ బరిపాలింపఁ నారంభించెను

ఇది తొమ్మిదవ యధ్యాయము

---

కృష్ణుఁడు ధర్మజుని రాజ్యంబుచేయ నియమించి తాను ద్వారక కేగుట

అని యిట్లు పలికిన సూతుంగాంచి శౌనకుం డిట్లనియె. ఓ సూతా! తమ రాజ్యభాగము నపహరించి, యాతతాయులనిపించికొనిన దుర్యోధనాదుల సంహరించి రాజ్యంబును బొంది ధర్మవిదులలో నగ్రేసరుండగు ధర్మజుండు రాజ్యశాసనమందుఁ దమ్ములతోఁ గూడ నెట్టు ప్రవర్తించె? మఱియు నేమిచేసెను? అని యడిగిన శౌనకునకు సూతుం డిట్లనియె. "ఓ శౌనకా! భగవంతుండగు శ్రీకృష్ణుఁడు వేణువనసంఘర్షణవలన జనించిన దవాగ్నితోఁ దుల్యమైన కులకలహంబుచే నశించుచున్న కురువంశమును బరీక్షిత్తును రక్షించి, దానిని దిరిగి వర్ధించి పరీక్షిత్తు పెద్దవాఁ డగునంతవరకు ధర్మరాజును రాజ్యము చేయుమని చెప్పి, తాను కృతకృత్యుఁ డగుటవలన మిగుల సంతసించె. ఇట్లు ధర్మరాజు కృష్ణుని యానతి చొప్పున రాజ్యంబు స్వీకరించి, భీష్ముఁ డుపదేశించిన ధర్మమార్గముల ననుసరించి, విస్తారమగు జ్ఞానముగలవాఁడు గనుక, నజ్ఞానమును దొలగించుకొని, కృష్ణునిఁ దనకుఁ

ప్రాపుగాఁ జేసికొని తమ్ములచే సేవింపఁబడుచు, నారాయణ మూర్తిని ప్రాపుగాఁగొని దేవేంద్రుఁడు స్వర్గమును బరిపాలించిన విధమున, సముద్రపర్యంతముగల భూమండలమును బరిపాలించుచుండెను ఓ శౌనకా! ధర్మజుఁడు రాజ్యము చేయుచున్న సమయమున మేఘుఁడు తఱితప్పకుండ వర్షించుచుండెను భూమి కోరినట్టి పంటలనెల్లఁ బండుచుండెను. గొప్ప పొదుగులతోఁ గూడికొని యావులన్నియు వలయు నన్ని పాల నిచ్చుచుండెను. పలురకములగు నోషధులన్నియుఁ బ్రతిఋతువునందును ఫలించుచుండెను. నదులెల్లప్పుడు నిర్మల జలములతో నిండియుండెను. సముద్రములు పలు రకములగు రత్నములచేత విలసించుచుండెను. పర్వతములన్నియు సప్తధాతువులచేత వెలయుచుండెను. వనములన్నియుఁ బ్రశస్తములగు పుష్పములతోను, బండ్లతోను బ్రకాశించుచుండెను ధర్మరాజు రాజ్యమునందలి ప్రజలకు నొకప్పుడైనను మనోవ్యథలుగాని, దేహసంబంధమయిన రోగములుగాని, యాధిదైవికములు నాధ్యాత్మికములు నాధిభౌతికములు నగు బాధలుగాని, యెంతమాత్రము కలుగ లేదుసుమీ! తరువాత, శ్రీకృష్ణుండు తన చెల్లెలగు సుభద్ర కోరికదీర్చు నిమిత్తమును, ధర్మరాజు దుఃఖము నుపశమించు నిమిత్తమును, హస్తినాపురమునందుఁ గొన్ని మాసములు నివసించి, ధర్మరాజు నాజ్ఞనుబొంది భీమాదులఁ గౌఁగలించుకొని తనకుఁ గొందఱు నమస్కరింపఁ, గొందఱు తన్నుఁ గౌఁగలింప, మెల్లమెల్లనఁ జని తనరథముపైఁ గూర్చుండెను ఇట్లు కృష్ణుండు రథముపైఁగూర్చుండి స్వపురమైన ద్వారకకుఁ

బోవు నవసరమ్మున నాతని వియోగమును సహింపలేక ద్రౌపదియుఁ గుంతీదేవియు, సుభద్రయు, నుత్తరయు, గాంధారియు మొదలగు స్త్రీలును, ధర్మరాజ భీమ నకుల సహదేవులును, ధృతరాష్ట్రాదులును, ధౌమ్యాది మునీశ్వరులును, శ్రీకృష్ణుని రథమును వెంబడించి నడువఁజొచ్చిరి. మానవుఁడు సజ్జనసహవాసమువలన దుస్సంగములును విడిచిపెట్టి సత్పురుషులకు వందనీయమైన శ్రీకృష్ణుని యశస్సు నాలకించినంతమాత్రముననే యతని విడిచిపెట్టలేఁడు ఇట్లుండఁగా, సర్వకాలములయందు శ్రీకృష్ణునితోఁగలిసి భుజించుచు, నిద్రించుచు, గూర్చుండుచు, సంభాషించుచు నున్నట్టి పాండవు లా శ్రీకృష్ణు నెట్లు విడిచిపెట్టఁగలరు? పిమ్మట ధర్మరాజాదులును, గుంతీప్రముఖులగు స్త్రీలును, గృష్ణునియందలి స్నేహమును విడిచిపెట్టలేక తమచిత్తము లతని వెంబడింప, రెప్ప వేయకుండ నతనినే చూచుచు, మిగుల విచారించుచు, నచ్చటచ్చటఁ దిరుగఁజొచ్చిరి. కుంతి మొదలగు స్త్రీలు కృష్ణుండు వెడలుచున్న సమయంబున నమంగళసూచకంబని యాతని యందలి ప్రేమచేతఁ బొడముచున్న కన్నీటిని బలాత్కారముగ నణిఁకట్టుచుండిరి. మఱియుఁ గృష్ణుండు ప్రయాణంబయి పోవు నవసరంబున మృదంగంబులను శంఖంబులను, భేరులను, విపంచికలను, తప్పెటలను, గోముఖంబులను, దుందుభులను, ఘంటలను, కరతాళంబులను, మంగళసూచకంబుగా యుగపత్కాలమందే ప్రమోయించుచుండిరి. ఆ కాలంబున హస్తినాపురమందున్న స్త్రీలందఱును ప్రేమత్రపామందహాసంబులు వెలువడునట్టు లాకృష్ణునిఁ బొడఁగాంచుచు, మేడలపై కెక్కి

యాతం డరుగుచున్నప్పు డాతని శిరస్సుమీదఁ బుష్పవర్షములఁ గురియఁజొచ్చిరి. ఆ సమయమునఁ దనకుఁ బ్రియతమముఁ డగు శ్రీకృష్ణమూర్తి వారికి నర్జునుండు ముత్యాలగొడుగు పట్టి పార్శ్వంబున నిలువంబడియుండ, సాత్యకియు, నుద్ధవుఁడును మిగుల నాశ్చర్యముగొలుపు వింజామరలఁ బట్టికొని సేవింప, మార్గమందుఁ గులస్త్రీలు బుష్పసంతతుల వర్షింపుచుండ, శ్రీకృష్ణుండు మిగులఁ బ్రకాశింపఁజొచ్చెను మఱియు, నప్పట్టున హేయప్రాకృత గుణరహితుండై జ్ఞానశక్త్యాది సద్గుణంబులు కలిగియున్న కృష్ణునకు సంపూర్ణకాముఁ డగుట వలన ననురూపంబులును, భక్తిస్నేహంబులచే నొనర్పఁబడుచున్న వగుటంబట్టి యనురూపంబులునగు బ్రాహ్మణాశీర్వచనంబు లెల్లయెడల వినఁబడఁజొచ్చెను. ఆ సమయమునందు భక్తులయు, స్త్రీలయు మృదువైన వాక్యములు నలుగడల మిగుల మనోహరముగా వినఁబడుచుండెను ఆ సమయమున జను లొకరితో నొక రిట్లనుకొనిరి ఓహో! ప్రళయకాలమందు–సత్త్వాది గుణోత్పత్తికిఁ బూర్వము–కర్మరూపశక్తులన్నియుఁ గార్యాప్రవృత్తములై యుండఁగా, నెవఁడు సూక్ష్మచిదచిద్రూపమ్మగు జగమ్ము శరీరంబుగాఁ గలవాఁడై, సర్వనియామకుండై, సర్గాదిసంకల్పంబు విడిచియుండుటంబట్టి నామరూప విభాగరహితుండగుచుఁ, గావుననే యొక్కఁడై నిమిత్తాంతరహితుండై ప్రకాశించుచున్నాఁడో, యా పరమపురుషుండే యీకృష్ణుండని తలంపుఁడు. మఱియు, కారణదశయందే భగవంతుఁ డొక్కఁడై యద్వితీయుండగుచు స్వసంకల్పచోదితమై, స్వశరీరభూతంబులగు జీవులకుఁ దిరోధాయకంబై ,

సృష్టి కున్ముఖంబగు ప్రకృతి ననుసరించి నామరూపమ్ములు లేని జీవాత్మయందు నంతరాత్మయై ప్రవేశించి నామరూపంబులు గల్పింపఁ దలంపుగొని వేదప్రవర్తకుండగుచున్నాఁడో, యా మహానీయుండే యీ కృష్ణుండని భావింపుఁడు లోకము నందుఁ బండితు లందఱు ప్రాణవాయువుల నరికట్టి, యింద్రియములు జయించి, నిర్మలమయిన మనస్సుగలవారై మిగుల భక్తియుతులయి యే మహానుభావుని స్వరూపంబును జూచుచున్నారో, యా పురుషుఁడేగదా యీ కృష్ణుఁడు! ఓ సఖి! ఎవని సత్కథలు గుహ్యంబులగు వేదాంతంబులందు వేదాంతవిదులచే గీయమానంబు లగుచున్నవో, యేవాఁ డొక్కఁడైనను, లీలలకై జగంబును సృజించుచుఁ, బాలించుచు, నశింపఁజేయుచు వర్తించుచున్నాఁడో, యే మహానుభావుండు జగదంతరాత్మయై యుండుటవలనఁ గలిగిన దోషసంబంధంబు లేనివాఁడో, యా యీశ్వరుఁడే యీ శ్రీకృష్ణమూర్తి ఈ శ్రీకృష్ణమూర్తియే లోకమునందు విషమబుద్ధి గల రాజులు నీచప్రవర్తనులయి యధర్మము నవలంబించి ప్రవర్తించుచున్నప్పుడెల్లను లోకమును రక్షించుటకయి మత్స్యాద్యవతారంబులఁ దాల్చుచు ధర్మమును, జ్ఞానాది కల్యాణగుణములను, సత్యమును, దయారసమును, గీర్తిని మొదలగువానినెల్ల స్థాపనచేయుచు నున్నవాఁడు ఈ శ్రీకృష్ణుఁడు జన్మించుటచేతనే యదుకులము మిగులఁ బవిత్రమైనది మథురాపురము పుణ్యాతిశయమై యుండుట శ్రీకృష్ణమూర్తి యెల్లప్పుడును బాదవిన్యాసముల నిడుచుండుటచేతనే కదా! ఏ పురము నందలి ప్రజలు సదా భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తిని

దర్శించి మిగుల నానందము చెందుచున్నారో, యే పురమును సంబంధించిన భూములు విష్ణుని పాదములచేఁ ద్రొక్కఁబడి మిగులఁ బవిత్రములైనవో, కృష్ణమూర్తి యెల్లప్పుడు తన యందు నివసించి యుండుటంబట్టి యేది స్వర్గపట్టణముగూడ నతిక్రమించుచున్నదో, యేద్వారకాపురంబు భూమికి పుణ్యం బును యశంబును గలిగించుచున్నది. ఓ చెలులారా! ఈతని భార్యాజనము గోపికలు, తమతమ స్వాంతంబుల సంతత మెవనియందుఁ బొందుపఱిచి మోహాదివశులైరో, యాకృష్ణుని యధరపానంబు నొనర్చుచుందురు. అయారే! ఆ సుందరీ లలామలందఱు పూర్వజన్మంబున భగవంతు నుద్దేశించి యెట్టి సుకృతంబు లొనర్చిరో! ఎట్టి నోములు నోచిరో! ఎట్టి దానం బులు చేసిరో! ఎట్టి హోమంబు లొనర్చిరో కదా! లేనిచో, యోగీశ్వరవందనీయుఁడగు శ్రీకృష్ణుని దర్శనమే దుర్లభ మగు చుండ, నధరపానం బొనర్చునంతటి భాగ్యమెట్లు లభించును? మఱియు, నీ శ్రీకృష్ణుండు మదోన్మత్తులయిన శిశుపాలాదుల గర్వాంధకారంబడఁచి, స్వాయంవరమునఁ గొనివచ్చిన రుక్మిణీ జాంబవతీప్రభృతు లగు సుందరీలలామలును, నరకా సురుని సంహరించి గొనివచ్చిన పదాఱువేల స్త్రీలును, మార్ద వము లేనివారై పవిత్రత లేనివారయి యున్నను, స్త్రీధర్మ ముల మాత్రమే లెస్సగాఁ జేయుచుందురు. అయిన, నిమ్మహాను భావుండు సంతతము వారి గృహములందే వసించుచు "ఓ రుక్మిణీ! యిటురా"మ్మని యిట్లా యా స్త్రీల నా యా నామం బులచే హృదయరంజకముగాఁ బిలుచుచుఁ, బయికి రానే రాఁడు! అని యివ్విధంబున వక్కాణించుచున్న పురస్త్రీల

వాక్యంబుల నాలకించుచు, దరహాసంబుతోఁ గూడిన యవలోక
నంబులచేత వారల నానందసము పేతలగాఁ జేయుచు, హస్తినా
పురంబును దాఁటి పోవుచుండెను అప్పట్టునఁ బాండవాగ్ర
జుండు ప్రియబాంధవుండగు కృష్ణున కరాతులవలన నపా
యము మూడునేమోయని తలంచి, తద్రక్షణార్థంబు గజరథ
తురగపదాతులను నాలుగంగములు గల మహాసైన్య మొక
దానిని బుత్తెంచె అంత, శ్రీకృష్ణుండు సేనాసమేతుండయి
దృఢానురాగంబుగలవారగుటచేఁ దన్నెడఁబాసియుండ నంగీక
రింపక చాలదూరము తన్ను వెంబడించివచ్చిన ధర్మరాజా
దులను మృదుమధురవాక్యంబులచే వెనుకకు మఱలించి,
ప్రియులతో ద్వారకాభిముఖుండయి పోయెను అట్లు పోవుచు
మార్గమునఁ గురుదేశంబుల నతిక్రమించి, పాంచాల శూర
సేనాది దేశముల దాఁటి, యమునానదీప్రాంతములను,
బ్రహ్మావర్తమును కురుక్షేత్రమును, మత్స్యదేశమును,
సరస్వతీనదీప్రాంతములను దృణజలరహితమయిన బయళ్లను
నతిక్రమించి, సౌవీరాది దేశముల నుపగమించి ద్వారకకు
సమీపముననున్న యానర్తదేశములఁ జొచ్చునప్పటి కతని
హాయములు కొంచె మలఁతచెందె అట్లయినఁ బయనంబు
వదలక పోవుచు, మార్గమధ్యంబునఁ దత్తద్దేశజను లిచ్చిన
కానుకలనందుచు, సూర్యుం డపరగిరిశిఖరావలంబి యయి
జలంబులఁ గ్రుంకునప్పటికి ద్వారకాపురప్రాంతంబున నున్న
యానర్తదేశములఁ జేరెను

ఇది పదవ అధ్యాయము

---

## శ్రీ కృష్ణుఁడు ద్వారకం బ్రవేశించుట

ఇట్లు కృష్ణుండు నిజపరిపాలితంబయి సకలసంపదలచే నుపేతంబగు నానర్తదేశములను బ్రవేశించి, స్వవియోగజనిత మగు నాదేశస్థుల దుఃఖంబు తొలంగునట్లు తన పాంచజన్య మను శంఖరాజంబును బూరించెను. ఆసమయంబునఁ దదీయాధర కాంతులచే నరుణితం బయినశంఖంబు, హరికరకమలంబునం దున్నదయి, పద్మబృందమధ్యమందు ధ్వనిచేయుచున్న కలహంసచందంబునఁ బ్రకాశించెను. లోకభయంకరు లగు వారికి భయమును గలిగించు నాశంఖనినాద మాదేశస్థులాలకించి, తమ ప్రభువగు కృష్ణుండు వచ్చుచున్నాఁడని నిశ్చయించి, యాతని సందర్శన మాచరింప వేడుకపడుచు నభిముఖులరై పోయిరి అట్లుపోయి, నిత్యము నిరవధిక మయిన స్వానందమనుభవించుట యనులాభముచేఁ బూర్ణకాముండై, యాత్మారాముండై, యితరులనుండి కానుకలందనపేక్షలేని కృష్ణునిఁ బూజించి, తన్నును జగంబులను బ్రకాశిల్లునట్లు చేయుచున్న రవికి దీపము నొసంగునట్లు, సంతోషమున ముఖంబులు వికసింప యథాశక్తిని గానుక లర్పించిరి. తా మర్పించిన యుపహారము లందుకొన్నందుల కమందానంద వికసితముఖులై ప్రజలు కృష్ణుని సమీపించి యందఱి పుత్రులయందును సమానమైన స్నేహము కలవాఁడై, ప్రేమాతిశయంబునఁ దమ్మనవరతంబు రక్షించుచున్న జనకుంగాంచి పల్కుచున్న కుమారులమాడ్కి, సంతోషాతిశయంబుచే గద్గదంబులయిన వాక్యంబుల నిట్లనిరి. 'దేవా! బ్రహ్మాది బృందారకులచేతను, సనకసనందనాది యోగి

బృందంబులచేతను వందనీయమయిన నీపాదారవిందముల కభివందించుచున్నాము మఱియు, నీపాదంబు లీలోకమందలి శ్రేయోభిలాషులకు మిక్కిలి యుత్కృష్టమయినవి అయ్యవి క్షేమసాధనంబులు. బ్రహ్మాది సురల వశీకరింపఁజేయుచున్న కాలము సైతము నీపాదకమలంబుల వశీకరించుకొన సమర్థంబు కాదు అట్టి నీపాదంబుల సేవించుటంజేసి మేము ధన్యుల మయితిమి. ప్రపంచము సత్త్వాదులు కలదానిగాఁ జేయుచున్న యో దేవా! మాకు నీవే స్నేహితుండవు నీవే జనకుండవు. నీవే యధిపతివి. నీవే జ్ఞానోపదేశకుండగు గురుండవు. నీవే పరదైవతమవు నీకంటె నధికమయిన దైవ మేదియు లేదు. ఇట్లు సర్వదా నిన్ను నమ్మియే నీ సేవచేఁ గృతకృత్యుల మైతిమో, యట్టి నీవు మా కభ్యుదయమును దయచేయుము. ఓ నాథా! ముల్లోకంబులవారికిని దుర్లభంబయినదియుఁ, బ్రేమాతిరేకంబునను మందహాసంబునను, గరుణావలోకనంబులను విలసిల్లు ముఖారవిందంబుగలదై, సర్వాతిశాయి సౌందర్యమయి యొప్పు నీ స్వరూపంబుగాంచు మా భాగ్యంబేమని చెప్పఁగలము! అయారే! సుఖప్రదుండయిన ప్రభువు గలవా రెవరన మేమే కదా! ఓ యంబుజాక్షా! నీవు కురుదేశంబులకుఁగాని, మధుదేశంబులకుఁగాని, నీ మిత్రులం జూడఁబోయినప్పుడు, రవిలేనప్పుడు కన్నులకుఁబలె, మాకు క్షణ మొకకోటివత్సరంబులపగిదిఁ గన్పట్టుచుండు అని యిట్లు పలుకుచున్న ప్రజల మృదుమధురవాక్యంబుల నాలకించి భక్తవత్సలుండగు కృష్ణుండు వారలయందుఁ జూపులచే దయారసము నించుచుఁ బురప్రవేశం బొనర్చె. అప్పురంబు

పన్నగంబులచే రక్షితంబగు భోగవతీపురంబువిధంబునఁ గృష్ణునితో సమానమైన బలముగల యాదవులు, భోజులు, దాశార్హులు, నంధకులు మొదలగు వీరులచే రక్షితం బగుచుండె. అయ్యది షడృతుసంభవంబులగు పుష్పఫలంబులచే సమృద్ధంబులగు మందార పారిజాతాది తరుబృందంబులు లతామండపంబులు గల రాజక్రీడాస్థానంబులచేతను, నుపవనంబులచేతను, కృతకవనంబులచేతను నావృతంబులైన పద్మాకరంబులచే నొప్పుచుండె. పురద్వారంబులయందు, గృహద్వారంబులందు నుత్సవసూచకంబులగు తోరణంబులు నెలకొల్పఁబడినవి. అప్పురంబు విచిత్రంబు లగుపతాకాగ్రంబులచే నిరాతపంబయి యుండె. అందున్న రాజమార్గంబులు, రథమార్గంబులు, నంగడివీధులు, చతుష్పథంబులు సమ్మార్జింపఁబడి పరిమళోదకంబులచేఁ దడుపఁబడియె అవి యన్నియు ఫలపుష్పములచేతను, నక్షతలచేతను, జిగుళ్ళచేతను నలంకరింపఁబడియె అందున్న గృహంబుల ప్రతిద్వారముఁ బూర్ణకుంభంబులచేతను, నిక్షుఖండంబులచేతను, దధ్యాదులచేతను, బూజాద్రవ్యంబులచేతను, ధూపదీపాదులచేతను జక్కఁగ నలంకరింపఁబడియె ఇట్లు కన్నులపండువుగా నలంకృతమగు ద్వారకను బ్రవేశించి, మిక్కిలి ప్రేమాస్పదుఁడైన కృష్ణుం డరుదెంచుచున్నాఁడని విని, యుదారచిత్తుండైన వసుదేవుండును, నక్రూరుండును, నుగ్రసేనుండును, నద్భుతపరాక్రమముగల బలరాముండును, బ్రద్యుమ్నుండును, జారుదేష్ణుండును, జాంబవతీసుతుండైన సాంబుండును, గృష్ణుని దర్శింప నుత్కంఠపడుచు, సంతోషాతిశయముచే భోజనము

లను, శయనములను, నాసనంబులను విడనాడి, యొకమద కరీంద్రమును ముందుగా నిడికొని పుష్పఫలాదులను జేతు లందు ధరించి బ్రాహ్మణోత్తముల స్వస్తివాచకనినాదంబు లును, మంగళతూర్యఘోషంబులును మిన్నుముట్ట, నాద రాతిశయము కలవారై, ప్రణయమువలన భయంబుజనింప, రథంబుల నధివసించి కృష్ణున కభిముఖులయి పోవుచుండిరి. అట్లె నూఱులకొలఁది గణికాలలామలు కుండలకాంతి సంతా నంబులు గండస్థలంబులఁ గప్పుకొనుచుండ యానంబులపై నెక్కి పోవుచుండిరి ఆ సమయంబున నభినయశిక్షకులును, నాట్యశిక్షకులును, గాయకులును, పౌరాణికులును, వంశావళిఁ జదువువారలును, స్తోత్రపాఠకులును, నత్యద్భుతంబులయిన భగవంతుని సచ్చరిత్రంబులఁ బాడుచుండిరి ఇట్లతిముదం బునఁ దన కెదురుగా వచ్చుచున్న బంధువర్గమును, బురజను లను, యథోచితంబులగు నమస్కారంబులచేతను, నాలింగ నంబులచేతను, మందహాసంబులచేతను, కరస్పర్శములచేతను, దృష్టిప్రసారంబులచేతను కుశలప్రశ్నము గావించి మన్నిం చెను ఇట్లు కృష్ణుండు వసుదేవాదులు మొదలుకొని చండా లుర పర్యంతము యథార్హంబుగఁ గుశలప్రశ్నాదులచే గౌర వించి, తానుగూడ గురువులచేతను, బ్రాహ్మణులచేతను, దనయందాదరాతిశయము గల వసుదేవాది వృద్ధులచేతను, వందిబృందంబులచేతను నాశీర్వదింపఁబడుచు, రాజమార్గం బునం బడి యంతఃపురంబునకుఁ బోవుచుండెను కృష్ణుండు రాజమార్గముననుండి వచ్చుచున్నాఁడని విని, యాతని దర్శింప ద్వారకాపురస్త్రీ లతిముదంబున సౌధాగ్రంబుల నారో

హించిరి. మునీంద్రా! ద్వారకావాసులు నిత్యము శ్రీనివాసుఁడైన కృష్ణసందర్శనంబు చేయుచున్నను, వారి నేత్రంబు లెంతమాత్రము తనియకుండెను. ద్వారకావాసులు కృష్ణుని నిత్యము చూచుచున్నను దృప్తిచెందలేకుండుట యుచితమే! ఏమందురా! శ్రీలక్ష్మీదేవియు నా కృష్ణుని వక్షఃస్థలమందున్న లావణ్యము ననుభవింపఁ గోర్కెతోఁ, దాను సర్వదా యాశ్రయించినది కదా! లావణ్యరసపూరితమగు నాతనిముఖము చూపఱచూపులకుఁ బానపాత్రమువంటిది కదా! నిరతిశయమైన సౌందర్యాతిశయము గల యతని బాహాదండంబులు లోకపాలురకుఁ దదీయ లావణ్యరసమును బానము చేయఁదగిన పాత్రములవంటివి కదా! అమ్మహాత్ముని పాదపద్మంబులు సారగ్రాహులైన మునీశ్వరులకుఁ దదీయ లావణ్యరసమును బానము చేయఁ దగిన పాత్రంబులై యున్నవి కదా! శ్రీమహాలక్ష్మి మొదలగువారికిఁగూడ నబ్బురంబు గొలుపు లావణ్యముకల కృష్ణుని నిత్యము చూచుచున్నను, వారెట్లు తృప్తిచెందఁగలరు? కొందఱు ఛత్రచామరాదులఁ దాల్చి సేవించుచుండ, సౌధవీధుల మెలంగు సుందరీలలామలు పుష్పవర్షంబులు గురియించుచుండ, నంతఃపురప్రవేశం బొనరించుచుండె. ఆ సమయంబునఁ గృష్ణుఁడు తన కిరీటము సూర్యబింబంబువలె విరాజిలుచుండ, శ్వేతాతపంబు చంద్రబింబంబు ననుకరింపఁ, జామరములు గురుశుక్రుల విడంబింపఁ, బుష్పంబులు చుక్కలవలెఁ బ్రకాశింపఁ, బీతాంబరంబు విద్యుల్లతవలె వఱలుచుండ, వనమాల యింద్రచాపంబువడువునఁ జెలంగుచుండ, నల్లని మేఘంబువలెఁ బ్రకాశించుచుండెను అట్లు కృష్ణుండు

చనిచని ముందుగ జనకమందిరంబుఁ జొచ్చి, దేవకీప్రభృతు లగు నేడ్వురు తల్లులచే నాలింగితుండై, వారలపాదంబులకుఁ దల పోఁకునట్లు నమస్కరించె. అంత, వా రంద ఱా కృష్ణుని నంక భాగంబులఁ గూర్చుండఁ బెట్టికొని, యానంద వివశాత్మలై స్నేహాతిశయంబునం జేసి పయోధరంబులనుండి పాలు స్రవించు చుండ, నానందబాష్పబిందువులచేఁ దద్దేహము నభిషే కించుచుఁ దమ మాతృభావమ్మును వెలిపుచ్చిరి. కృష్ణుం డిట్లు కొంతతడవు జనకమందిరమున వసించి, తల్లులం దఱి నానంద రసమగ్నలఁ గావించి, పిమ్మట సమస్తభోగ్యవస్తువులచేఁ బరి పూర్ణంబై సర్వోత్తమంబై తనభార్యాజనసంబంధులగు పదాఱు వేల సౌధంబులచేఁ బ్రకాశితం బగుచున్న తనమందిరంబు ప్రవేశించె

శ్రీకృష్ణుఁ డంతఃపురకాంతలఁ జూడఁబోవుట

అంత, నాతని భార్యలందఱుఁ దమ్మొడఁబాసి చిరకాల మునకుఁ దిరిగి తమయిండ్లకువచ్చిన కృష్ణుం గని సంతోషా క్రాంతస్వాంతలై, లజ్జావనతవదనలై, శయనాసనములనుండి లేచి కృష్ణుని రాకనిమిత్త మాచరించుచున్న వ్రతముల ముగించి (లేక ప్రోషితభర్తృకలకు విహితములయిన వ్రత ములఁ జాలించి) గౌరవించి, దృష్టిచేతను, నంతరాత్మచేతను, బుత్త్రులగు ప్రద్యుమ్నాదుల మూలమునను భర్తను గౌఁగి లించుకొనిరి వారిలోఁ గొందఱు గంభీరాభిప్రాయులైనను వైవశ్యమ్మువలన సంభూతంబగు బాష్పమ్మును, బులకాంకు రంబులను నిరోధింపలేకపోయిరి. ఓ శౌనకా! శ్రీకృష్ణుండు

రహస్యస్థలంబునం దున్నను, దమ పార్శ్వంబులం దున్నను, నాతని పాదయుగంబు మాటిమాటికి నూతన సౌందర్యవంతమై గన్పట్టుచుండుటంబట్టి, పురంధ్రీస్త్రీలంద ఱాతని నెడఁబాసి యుండలేరు. పెక్కేల! చంచలస్వభావముగల లక్ష్మీదేవి సయితమాతనినుండి తన డెందంబుం ద్రిప్పుకొన లేకపోయె ఇట్లుండఁ, దక్కుఁగలవారు విడువలేరని వేఱ చెప్పనేల? మఱియు, సర్వదా యనువర్తించి తిరుగునప్పుడే యతని పాదములు క్రొత్తగాఁ గన్పట్టుచుండఁ, జిరకాలము తమ్మెడఁబాసి వచ్చిన కృష్ణుని పాదములు క్రొత్తవయి గన్పట్టుచుండు నని చెప్పవలయునా? ఇట్లు కృష్ణమూర్తి వెదురుపొదలలో నగ్నిని బుట్టించి, దానిచే సమస్తమ్ము సమూలమ్ముగా దగ్ధంబు గావించు మహామారుతంబుచందంబున భూభారంబు కలిగించు చున్నవారై, యక్షౌహిణుల పరిమితిగల సైన్యము కలవా రగుటచే వ్యాప్తతేజస్కులై యున్న కౌరవపాండవులకు వైరంబు గల్పించి, దానివలన నొండొరులఁ జంపించి రాజ వంశంబుల నెల్ల నిరాయుధుండై నిర్మూలంబు గావించె. తన సంకల్పముచే నరలోకంబున నవతరించి సామాన్యపురుషుని వలె సంచరించుచుఁ, బామరునివలె స్త్రీవశ్యత్వ మనుకరించుచు, సంసారసుఖంబు లనుభవించుచు వర్తించుచుండెను. మునీంద్రా! గంభీరాభిప్రాయమును సూచనచేయు మందహాసంబులచేతను, ప్రసావలోకనంబులచేతను బ్రకాశించు కృష్ణుని, భార్యాజన మును జూచి మోహితుండై మన్మథుండు సయితము చేత నున్న చాపంబు విడిచిపెట్టుచుండును. ఇట్లు ముల్లోకంబుల మోహింపఁ జేయఁజాలు మన్మథునిఁ దమ హావభావాదుల

చేతను, సౌందర్యముచేతను మోహితునిగాఁ జేయుచున్నవా రయినను, నా యుత్తమస్త్రీ లా కృష్ణుని వంచనోపాయములచే మోహింపఁజేయ సమర్థలు కాకపోయిరి. ఇట్లు నిస్సంగుఁడైన కృష్ణుండు మానవునివలెఁ బ్రవర్తించుచు, మనుష్య భావముచేఁ దన యాథాత్మ్యమ్మును గప్పిపుచ్చుచు నున్నం దునఁ, గొంద ఱాతని సంసారసంబంధము కలవానిగా నెంచుచుఁ దమతోఁ బోల్చుకొనుచుందురు. అట్టి మానవులు మిక్కిలి తెలియనివా రనుటకు సందియ మున్నదా! సత్త్వాది గుణంబులుగాని, జీవాత్మగతములయిన యవిద్యారాగద్వేషా దులుకాని, యీశాశ్రయమయిన జ్ఞానము నెట్లు స్పృశింప లేవో, యట్లె మూలప్రకృతి వ్యాపకుఁడయినను భగవంతుని స్పృశింపలేవు సంతతము తత్సంబంధము కలిగియుండియుఁ దద్గతదోషంబులఁ బొరయకుండుటయే భగవంతుని నియం తృత్వ ప్రభావ మని యెఱుఁగుము తమభర్తృయాథార్థ్యము నెఱుంగనివారు కావున, సంతత మా కృష్ణుని ననువర్తించు భార్యాజనముసైత మా కృష్ణుండు సంతతమ్ము తమ్మను వర్తించి యుండుటంబట్టి, తమకు వశుండయి యున్నాఁడని తలంచి, బ్రహ్మపదార్థంబు నెఱుంగని సంసారుల బుద్ధుల చందంబున, మూఢమతులై వర్తించిరి కాని, యతని మహో మహిమ నెఱుఁగఁజాల రయిరి ”

ఇది పదునొకండవ యధ్యాయము.



## పరీక్షిన్మహారాజు జననము

అనిన విని శౌనకుం డిట్లనియె. 'ఓ సూతా! ఉత్తర గర్భము దుస్సహతేజంబయిన యశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రంబుచే హతమయి కృష్ణునిచే రక్షింపఁబడియె నని విని యున్నాను. పరీక్షిత్తు జన్మవృత్తాంత మెట్టిది? మహానుభావుం డగు నతం డే కార్యముల నాచరించె? అతనికి శుకుం డుపదేశించిన తత్త్వజ్ఞానము తెఱం గెట్టిది? అతఁడు మరణించుటకుఁ గత మేమి? పిమ్మట నతఁ డే గతిని బొందె? ఆ సర్వము వినఁ దలంపుగొని శ్రద్ధధానులమై యున్న మాకుఁ జెప్పఁదలంచెదేని చెప్పుము' నావుడు, సూతుం డిట్లనియె. 'శౌనకా! ధర్మరాజు సంతతము భగవంతుఁడగు కృష్ణుని పాదారవిందంబుల సేవించుటం జేసి, సమస్త కామములు తొలంగఁ బాండుమహారాజు చందంబునఁ బ్రజానురంజకముగా రాజ్యంబు పరిపాలించుచుండె. ధర్మరాజు వైభవం బేమని చెప్పను! భోగోపకరణాది వస్తుసంపదలును, స్వర్గాది సుఖహేతువులైన రాజసూయాది యాగములును, బన్నుఁ జెల్లించుచున్న ప్రజలును, సౌందర్యవంతురాండ్రగు పత్నులును, దిగ్విజయం బొనర్చిన భీమాదిసోదరులును, నిష్కంటకమయిన భూమియు, నుత్తమమయిన జంబూద్వీపాధిపత్యంబును, సురలోకపర్యంతము వ్యాపించిన కీర్తియు, నివి యన్నియు దేవతలకుఁగూడ స్పృహణీయము లయియున్నవి. అయినను, నాఁకలిగొనియున్నవాని నన్నముతప్ప స్రక్చందనాదులు సంతోషపెట్టలేని వడువునఁ, గృష్ణధ్యానాసక్తుఁడయిన ధర్మరాజును దద్ధ్యానంబుదప్ప నేదియు సంతో

షము గొలుపలేకపోయినది. ఓ శౌనకా! ఇట్లు కొంత కాలము చనునప్పటికి నుత్తర గర్భంబులోనున్న బాలుం డశ్వత్థామ యస్త్ర తేజంబుచే దహ్యమానుఁ డగుచు నంగుష్ఠమాత్ర ప్రమాణమ్మగల యొక పురుషునిఁ బొడఁగాంచెను ఆ పురుషుఁడు ప్రకాశమానంబులగు మగరాలు కూర్చిన కిరీటము కలవాఁడు. అతని సందర్శన మందఱిచేత నపేక్షణీయమైనది. ఆతని శరీరము మేఘమువలె శ్యామలకాంతితో నొప్పుచుండె. అతని కట్టుపుట్టము మెఱుపువలెఁ బ్రకాశించుచుండె అతనికి శోభాయుక్తము లయిన నాల్గు బాహువులు గలవు. అతని కర్ణములయందుఁ దప్తకాంచన మయములగు కుండలంబులు వెలయుచుండె అతని నేత్రములు మిగులఁ గెంపుగదిరి యుండె. ఆతనిచేత నొకగద పొల్చుచుండె. నిప్పుతో సదృశమయిన యాగద నతఁడు తనచుట్టు నన్నిదిక్కులఁ ద్రిప్పుచుండె అట్టి పురుషుండొకఁడు పొడసూపి, సూర్యుఁడు మంచునుమాయించు నట్లు తన గదచే నస్త్ర తేజంబును నశింపఁ జేసి, తన సమీపముం దుండె అంత వానినిఁజూచి దశమాసపరిచ్ఛేద్యుం డయిన యా బాలుండు వీఁ డెవ్వఁడని పరీక్షించుచుండ, నపరిచ్ఛిన్నము లయిన స్వరూపస్వభావములు గలిగి ధర్మరక్షకుం డయి వఱలు నట్టి యా భగవంతుం డంతర్ధానంబు చెందె తరువాత గ్రహంబు లుచ్చస్థితి నుండఁగా, సకలగుణాధికమయిన యొక్క శుభ లగ్నంబునందుఁ బాండురాజ సదృశుండును, పాండవవంశోద్ధారకుండును నగుచు, ముద్దులమూటగట్టు బాలుండు జన్మించె. ఆ శుభవర్తమానంబు ధర్మరాజాలకించి, యానంద భరితుండై, ధౌమ్య కృపాచార్యాది విప్రోత్తములచే నాశీర్వాదము

చేయించి జాతకర్మ మొనర్చెను అనంతరము దానపాత్రవేది యైన ధర్మరాజు మనుమని జన్మము నిమిత్తము దానములు చేయునప్పుడే తెంచిన బ్రాహ్మణు లందఱికి సువర్ణంబును,గోవులను, భూములను, గ్రామములను, శ్రేష్ఠములయిన కరులను, హయములను నొసంగి, యన్నదానంబుచేఁ దనియించెను. ఇట్లు ధర్మరాజు మహావినయసంపన్నుండయి లోకుల కెల్ల నానందంబు గొలుపుటఁజూచి బ్రాహ్మణు లతని కిట్లనిరి. 'ఓ ధర్మరాజా! పూరుని సంతతివారగు మీ వంశ మంతరింప సిద్ధముగానుండఁ బ్రభవిష్ణుండగు విష్ణుండు దాని వర్ధింప నెంచి, దయాళుండయి యుత్తరగర్భమందున్న పిండమును రక్షించెను. పిల్లవాఁడు విష్ణువుచే రక్షింతుఁడయిన కారణంబున, విష్ణురాతుం డను నామంబుతోఁ బరఁగుఁగాక. మఱియు, నితండు పుణ్యకీర్తి వంతుండయి పరమభాగవతోత్తముఁడయి యుండఁగలం'డని పల్కిన విప్రులవాక్యంబుల విని ధర్మరా జిట్లనియె. 'విప్రోత్తములారా! మా వంశంబునఁ బుట్టినవా రందఱు ప్రశస్త యశోభాస్వరులయి, దయారసనిధానులై, రాజర్షులై ప్రవర్తించుచుండిరి. కావున, నీ బాలుండు తొల్లింటివారివలె మహాఖ్యాతిసంపన్నుండై హరిపాద భక్తుండై చిరకాల జీవియై యుండునో లేదో చక్కఁగ యోజించి చెప్పుఁ'డన విని విప్రు లిట్లనిరి.

### బ్రాహ్మణులు ధర్మరాజుతో పరీక్షితు జాతకఫలంబులు చెప్పుట

'ఓ రాజా! నీ మనుమండగు నీ బాలుండు వైవస్వత మనువు కుమారుండగు నిక్ష్వాకునివలెఁ బ్రజలఁ గాపాడును.

శ్రీరాముని చందంబున బ్రాహ్మణభక్తి గలవాఁడును సత్య ప్రతిజ్ఞావంతుండునై యుండు శిబిచక్రవర్తి చందంబున శరణ్యుండును దాతయునై యుండు. దుష్యంతుని కుమారుం డగు భరతునికరణిఁ దనవారిలోను, యాగకర్తలలోను మిగులఁ గీర్తిసంపాదకుండు గాఁగలండు. అర్జున కార్తవీర్యులవలె విలువిద్యయందు విఖ్యాతుండై యుండు. అగ్నిహోత్రుని వడువున దుస్సహప్రతాపవంతుఁ డగును. పారావారంబు తీరున గంభీరుండును, దుస్తరుండునై యుండు. సింహంబు విధంబున మహాపరాక్రమశాలి యగుచు హిమవంతునిగతి సకలజంతు సంసేవితుం డగును. వసుంధర చందంబున నోర్పుగలవాఁ డగు. మాతాపితలవలె సహనగుణము కలవాఁడగు. కమలాసనునిరీతి సకలభూత సమత్వము కలవాఁడగు. శంకరునివలె నాశ్రిత రక్షకుండగు. విష్ణువువలె సకల భూతాశ్రయుండగు. శ్రీకృష్ణునివలె సమస్త సద్గుణాశ్రయుండై యుండును. మఱియు, నీ బాలుం డౌదార్యంబున రంతిదేవునకు సాటియగును. ధర్మ గుణంబున యయాతిం బోలు. ధైర్యంబున బలిచక్రవర్తి కెనయగు. హరిభక్తిచేఁ బ్రహ్లాదు ననుసరించు. అశ్వమేధ యాగంబుల నాచరించు. పెద్దల సేవించు. ఆత్మసదృశులగు కుమారులఁ బుట్టించు. మంచిమార్గం బవలంబించు. భూమి యందు ధర్మము స్థాపించునిమిత్తము కలిని జయించు. పిమ్మట బ్రాహ్మణశాపంబునకుఁ బాత్రుండై తక్షకునివలనఁ దనకు మృత్యువు సంభవించు నం దెఱిఁగి సకలసంగంబులం ద్యజించి, హరిభక్తిపరాయణుండై, గంగాతీరంబు చేరి ప్రాయోపవిష్టుండై, శుకయోగీంద్రునివలనఁ దత్వజ్ఞానంబుఁ

బడసి జీవంబులం బాసి హరిపదము నొందు' నని చెప్పిన విప్రోత్తముల వాక్యంబులు విని, ధర్మరాజు వారల బహుమానంబులం దనుప వారతని వీడ్కొని పోయిరి. పిమ్మట, నా బాలుండు పూర్వము తల్లి గర్భమందుఁ గన్పట్టిన పురుషుని ధ్యానము చేయుచు, నీ లోకులయందుఁ గలఁడా లేఁడా యని పరీక్షించెను గాన, పరీక్షిత్తని ప్రసిద్ధికెక్కె. పిమ్మట నా బాలుండు, శుక్లపక్షంబున వర్ధమానములయిన పంచదశ కళలచే వర్ధింపఁబడు చంద్రునివలెఁ దన తాతలచే వర్ధింపఁబడుచు, వేగముగా వృద్ధి చెందుచుండెను అప్పుడు, ధర్మరాజు బంధువధజనితమయిన పాపము పోఁగొట్టుకొనునిమిత్త మశ్వమేధయజ్ఞము చేయఁదలఁచి, యందులకుఁ దగినధనము పన్నువలనను, దండనవలనను దప్ప మఱియొకవిధంబుగా లభింపమిచే మిగుల విచారించుచుండెను. ఆ సమయమునఁ గృష్ణునిచేఁ బ్రేరితులై భీమార్జునాదు లందఱు నుత్తరదిశకుఁ జని రాజులజయించి వారలు విడిచిన ధనము నధికముగా గ్రహించి తెచ్చి ధర్మరాజున కర్పించిరి అంత, ధర్మరాజు మిగుల నానందించి యజ్ఞమునకుఁదగినవస్తువులనెల్లఁ గూర్చికొన్నవాఁడు కావున లబ్ధకాముండై, మంత్రతంత్ర ద్రవ్య లోపంబులు గలుగునేమో యని భీతిచెందుచు, మూఁ డశ్వమేధంబులచే శ్రీకృష్ణునారాధించెను. ఇట్లు, యజ్ఞము నిమిత్తము ధర్మరాజుచే నాహూతుండయి కృష్ణుం డతనిచే యాగంబులు చేయించి, తన మిత్రులగు పాండవుల ప్రీతికొఱకుఁ గొన్నిమాసము లచట నివసించెను. అనంతరము కృష్ణుండు

ధర్మరాజాదుల యనుమతివడసి యర్జునునితోఁ గూడికొని బంధువులు తన్నుఁ గొల్చుచు వెంబడించి వచ్చుచుండఁ దనకు ప్రధానపురమ్మగు ద్వారకను ప్రవేశించెను

ఇది పండ్రెండవ యధ్యాయము

---

విదురుఁడు హస్తినాపురమునకు వచ్చుట

ఓ శౌనకా! ఇఁక హస్తినాపురవృత్తాంతము చెప్పెద వినుము. చిరకాలముక్రిందటఁ దీర్థయాత్రకై యేగిన విదురుండు సమస్తతీర్థముల సేవించి, యొకచోటఁ దపంబుచేయుచున్న మైత్రేయమహామునివలనఁ దత్త్వజ్ఞానంబు నొంది కృతకృత్యుండయి, తిరిగి హస్తినాపురంబునకు నేతెంచెను ఓ శౌనకా! విదురుఁడు మైత్రేయుని నడిగిన ప్రశ్నములలోఁ గొన్నింటి కొసంగిన ప్రత్యుత్తరములతోనే భగవంతుఁడగు గోవిందునియందు ననన్యప్రయోజనమగు భక్తిగలవాఁడయ్యె ఇఁక నవశిష్టంబులగు ప్రశ్నముల కుత్తరములు విన నిష్టపడ లేదు ఇట్లు వచ్చిన బంధువగు విదురుని యాగమనంబునకు సంతసించి సోదరసహితుండగు ధర్మరాజును, ధృతరాష్ట్రుఁడును, యుయుత్సుండును, సంజయుండును, కృపుండును, గుంతియు, గాంధారియు, ద్రౌపదియు, సుభద్రయు, నుత్తరయు, కృపియుఁ, దక్కుఁగల పాండురాజుబంధువులును, నంత పురస్త్రీలును నధికమగుహర్షముతోఁ బోయినప్రాణము వచ్చినట్లు భావించికొని యెదుర్కొనిరి అట్లుచేసి, కౌఁగిలింతలచేతను, నమస్కారమ్ములచేతను యథావిధిగా నాతని

గౌరవించి, యానందబాష్పములచేతఁ దమ ప్రేమమును వెడలఁబుచ్చిరి. అంతట, ధర్మరాజు విదురునిఁ దన మందిరమ్మునకుఁ గొనిపోయి యథావిధిగఁబూజించి, యుచితాసనమర్పించి, షడ్రసోపేతములగు భోజనాదులచేఁ దృప్తిపొందించి యొక్కచోఁ విశ్రమింపఁజేసి, విదురునిఁజూచి తన వారందఱు వినుచుండ నిట్లడిగెను. 'ఓ పురుషశ్రేష్ఠా! మీరు మమ్మును, మా తల్లియగు కుంతిని విషవహ్న్యాదులనుండి తప్పించి మీ నీడయందు వర్తింపఁజేసి పెంచితిరి. మీచే రక్షింపఁబడియున్న మమ్ము నొకపరియైనఁ దలంచుకొనుచున్నారా? భూసంచారమే వృత్తిచే నిర్వర్తించితిరి? ఈ భూతలమందు భగవత్క్షేత్రములలో ముఖ్యములయిన వెన్ని? మీ రెన్నితీర్థముల సేవించినారు? ఓ ప్రభూత్తమా! మీవంటి భగవద్భక్తులు స్వయముగానే పవిత్రులు. కావున, మీరు తీర్థయాత్రవలనఁ బవిత్రత్వమును సంపాదింపఁ బాటుపడ నవసరము లేదు. అట్లయినఁ దీర్థయాత్ర చేయుటకుఁ గారణ మేమి? అనినచోఁ జెప్పెద గంగాదినదులు వాస్తవముగాఁ బరిశుద్ధము లేయయినను, పాపాత్ములు వచ్చి తమ పాపముల నందుఁ బరిహరించి పోవుదురు. అట్టి పాపములఁ బరిశుద్ధి నొందించుటకే మీవంటివారు తీర్థముల సేవింపఁబోయి పాపములఁ దొలంగించి తీర్థములనుగూడఁ బవిత్రీకరించుచున్నారు. గంగాది నదులకు లేని పాపనిరసనత్వము మాకుఁగలదా? అన నవసరము లేదు. పాపప్రతిభటుఁడయిన గదాపాణి యెల్లప్పుడు మీయందు వర్తించుచుండును. కాన మీకట్టి సామర్థ్యము కలదు. ఓ తండ్రీ! శ్రీకృష్ణునే దేవతగా

భావించుచున్న యాదవులు మనకు బాంధవులు. వారలను మీరు చూచితిరా? వారు ద్వారకయందుఁ గుశలముతో వర్తిలుచున్నారా?' అని పలుకుచున్న ధర్మరాజువాక్యములకు మిగుల సంతసించి, విదురుండు తాను జూచిన స్థలముల మాహాత్మ్యమును, విన్నవార్తలను, యథాక్రమముగా వర్ణించెనుగాని, యాదవనాశనము చెప్పినయెడల, ధర్మరాజు మిగుల దుఃఖించునేమో యని యూహించి, తా నెఱింగియున్నను జెప్పలేదు ఓ మునీంద్రా! సజ్జనులు దుఃఖించుచున్నవారినిఁజూచి యోర్వలేరు కనుక, నా యదునాశనమును జెప్పిన విని పాండవులు దుఃఖించుచుండఁ దాను జూడలేక, యా వృత్తాంతము నే చెప్పుట మానివేసెను. పిమ్మట విదురుండు ధర్మరాజాదులచేఁ బూజింపఁబడుచు, నప్పురవాసుల కందఱికి సంతసము గలిగించుచు, జ్యేష్ఠసోదరుఁడయిన ధృతరాష్ట్రునకు మరణజ్ఞాపనపూర్వకముగా మోక్షోపాయమును దెలుపుచుఁ గొంతకాలమ్ము హస్తినాపురంబున నివసించె' నని చెప్పిన సూతుని వాక్యంబు లాలకించి శౌనకుం డిట్లనియె. 'ఓ సూతా! శూద్రయోనిసంభవుండగు విదురునికి ధృతరాష్ట్రునికిఁ గాలమాసన్నమయిన దని చెప్ప సామర్థ్యము కలదా?' నావుడు సూతుం డిట్లనియె 'మునీంద్రా! విదురుని విషయ మట్లు శంకింపఁ బనిలేదు ఈ విదురుఁడు సర్వప్రాణుల మృత్యుకాలము నెఱింగిన యముండే యని యెఱుంగుము. ఈతఁడు మాండవ్యుని శాపంబువలన శూద్రుండై జనింప వలసివచ్చుటచేఁ దన యధికారమ్ము సూర్యున కొసంగి విదురుండై పుట్టె అందువలన, విదురునకు ధృతరాష్ట్రుని మరణ

కాలంబు దెలియవచ్చినదని చెప్పి వెండియు నిట్లనియె. ధర్మరాజు వంశోద్ధారకుండయిన మనుమఁ డుండుటచేతను, ననంతమగు రాజ్యంబు లభించుటచేతను, లోకపాలురతో సమానులైన సోదరులచే సేవితుం డగుటచేతను, సకలసంపదలచేఁ దులదూఁగుచుండుటచేతను, నధికమ్మగు నానందముతో రాజ్యం బేలుచుండె ఓ మునీంద్రా! లోకంబున సంసారాసక్తులైన మానవులకుఁ గాలమ్ము తెలియపడక యే వచ్చి చేరుచుండు గదా! అట్టికాలంబు గడవ నెవ్వారి తరంబు? దుర్లంఘ్యమయిన యట్టికాలంబు ధృతరాష్ట్రాదుల సమీపించె. కాని, వార లెవ్వరీసంగతి నెఱుంగరు

విదురుఁడు ధృతరాష్ట్రునకు విరక్తిఁ బుట్టించుట

అంతఁ గాలజ్ఞుండైన విదురుం డా సమాచారము నెఱింగి ధృతరాష్ట్రుం జూచి యిట్లనియె. ఓ రాజా! కాలం బనివార్యమై మనల సమీపించుచున్నది. దానివలనఁ గలుగు భయంబున కేదయినఁ బ్రతిక్రియ యాలోచింపుము ఇఁక నీ వీ పురంబు విడిచి యడవులకుఁ జని తపం బాచరించుట యర్థంబు ఓయీ! ఇట్టి సంపదలను, దజ్జనితంబులగు సుఖంబులను నెట్లు విడిచిపెట్టి యరణ్యమ్ములఁ గాలము గడపఁగలనని యందువా? అట్లనకుము. కాలము సమీపించునప్పుడు మిగులఁ బ్రియమయిన ప్రాణములనే విడిచిపెట్టవలయును. అట్లుండ, ధనాదుల విడిచిపెట్టుట యొకలెక్కా? మఱియు, నీ పుత్త్రులు, బంధువులు, మిత్రులు, మొదలగువారందఱు చచ్చిరి. లేక నీవు యౌవనవంతుఁడవే మోయన, ముక్కాలి

ముదుసలివి. ఇదివఱకు మహారాజవయి సకలభోగముల నను
భవించిన నీ విప్పుడు దాయాదులయింటనుండి యెట్లు జీవిం
తువు? మఱియుఁ బాండవులు విసుగుచెందకుండ నన్నంబుఁ
బెట్టరుగదా! ఓయీ! నీ కొడుకులు మేము నివసించియున్న
యింటికి నిప్పు వెట్టిరి మా భార్యయగు ద్రౌపదిని సభలోనికిఁ
గొనివచ్చి యవమానపఱిచిరి మమ్ము నడవులకు వెళ్లఁగొట్టిరి.
రాజ్యము, సమస్తద్రవ్యము, నపహృతమయ్యె అట్టి
యపకారములు మా కొనరించునప్పుడు నీవు సంతసముతో
నూరకున్నావు కాని, మందలించినవాఁడవు కావు ఆ కారణ
ముంబట్టి నీవును మా కపరాధివే అట్టి మహాపరాధివయి
యుండియు నిప్పుడు మాచేతి యన్నము తినుటకు నీకు సిగ్గు
లేదా? యని పైకనకపోయినను, మనస్సులోఁ దిట్టుకొంచు
భీముండు పెట్టుచున్న యన్నమ్మును దినుచుఁ గుక్కవలె
వర్తించుచుంట నాలోచింపఁ, బ్రాణులకు జీవితాశ యత్యంత
బలకరమైనట్లు తెలియవచ్చుచున్నది అట్టి నీచాన్నమును
దినుటకంటెఁ బ్రాణములు విడిచిపెట్టుట యుక్తముకదా!
మఱియు, వట్టి దీనునివలె బ్రదికియుండుటవలన నీ కేమియుఁ
జిన్నతనమ్ము గలుగ లేదా? మఱియు, నీవు కృపణవృత్తి నంగీక
రించి జీవింపఁ దలఁపుగొనియున్నను, జరాభారమగ్నమైన
నీ దేహము చినిఁగినవసనంబువలెఁ గ్రమముగ నశింపక
మానదు లోకములో జ్ఞానవంతుఁడగు మానవుండు శరీరమ్ము,
ధనమ్ములు, గృహమ్ములు, భూములు, సంపదలు, బంధువులు,
సమస్తము ననిత్యములని యాత్మయందు నమ్మి సంసారబంధ
నంబులఁ బాసి, మోహపాశమ్మును దెగఁగోసి, తాపసవృత్తి

నవలంబింప నడవుల కేఁగి యచ్చట తపస్సు చేసి, పురుషార్థ సాధనమున కుపయోగింపని దేహంబును బరిత్యజించును. అట్టి వాఁడే లోకములోఁ బండితుఁడని చెప్పఁబడు మఱియు, నెవఁడు తనంత తానుగాని, పరోపదేశమునఁగాని, పరోపదేశమువలనఁగాని తత్త్వజ్ఞానము గలిగించుకొని, హృదయకమలమున శ్రీకృష్ణమూర్తి పాదపద్మముల నిలిపి సన్న్యాసియైపోయి మోక్షపదము చెందునో, వాఁడే సర్వోత్తముం డనఁ దగినవాఁడు. కావున, ఓ రాజా! ఇఁక నీవు ధైర్య మవలంబింపుము. ప్రేమానుబంధము తెగఁగోయుము. విరక్తిమార్గము చేకొనుము. ఇఁకమీఁద కాలము జంతువుల ధైర్యాదిగుణముల ఛేదించును. కనుక, వెనుకటివలె విహరింపకుము. జ్ఞాతులైన ధర్మరాజాదు లెఱుఁగకుండ నుత్తరదిక్కుంగూర్చి నడువుము. ఇఁక నెంతమాత్రము వెనుదీయకుము.' అని పలికి విదురుఁడు విరక్తిఁ బోడమించిన, ధృతరాష్ట్రుం డెంతయు సంతసించి ప్రజ్ఞాచక్షుండయి, తనవారియందున్న స్నేహపాశములను ఛేదించి దృఢమానసుం డయి, విదురుఁడు చూపెడి మార్గము ననుసరించి తపంబు చేసికొనఁ బ్రయాణమయి పోవుచుండెను.

### ధృతరాష్ట్రుఁడు గాంధారియుఁ దాఁనై యడవి కేఁగుట

అంత గాంధారియుఁ దన భర్త యడవి కేఁగుచుండుటఁ గనిపెట్టి, భర్తతో సహగమనము చేయవలయునన్న కోరికతోఁ దన భర్తయగు ధృతరాష్ట్రుని వెంబడించి నడుచుచుండెను. సుకుమారశరీర యయినను, గాంధారి దుర్గమంబగు హిమవంతమునందున్న యడవులందుఁబడి యెంతమాత్రము జంకక తన

పెనిమిటికిఁ బరిచర్య చేయుచు, హిమవన్నగమునకుఁ బోయెను. అట్లు ధృతరాష్ట్రుఁ డడవికేఁగుట మనస్స్వాలైనవారికి విరక్తిఁ బొడమింపక మానదు. ఇట్లు గాంధారీ ధృతరాష్ట్రులు విదురునితోఁగూడ నడవికేఁగిన మఱునాఁడు ధర్మజుఁడు ప్రభాతంబున లేచి స్నానంబుచేసి సంధ్యావందనము గావించి, నిత్యహోమంబు నొనరించి బ్రాహ్మణోత్తములఁ బిలిపించి వారలకు గోదాన భూదానాదు లొసంగి సంతోషపెట్టి, నమస్కరించి, యాశీర్వాదంబులఁబడసి, తల్లిదండ్రులయందు బద్ధస్నేహంబు కలవాఁడు కావున, తొంటియట్ల గురువందన మొనర్చుటకయి ధృతరాష్ట్ర మందిరంబుఁ బ్రవేశించెను. కాని, యచ్చట గాంధారీ ధృతరాష్ట్రులుగాని, విదురుండుగాని కానరాలేదు. అంతఁ జే, మిగుల విచారించుచు ధర్మరాజు భీతమానసుండై యొక పీఠంబునఁ గూర్చుండియున్న సంజయుం జూచి యిట్లనియె ఓ సంజయా! ధృతరాష్ట్రుఁడు వృద్ధుఁడును గ్రుడ్డివాఁడును గదా! అట్టి ధృతరాష్ట్రమహారా జెచ్చటి కేఁగెను? పుత్త్రశోకముచేఁ బీడితయగు మా తల్లి గాంధారి యెచ్చటి కేఁగె? మాకుఁ బరమమిత్రుండును బినతండ్రియు నగు విదురుండు కనఁబడలేదు ఆతఁ డెచ్చటి కేఁగెను? ఆతని బంధుగులందఱు నాచేఁ జంపింపఁబడిరి అందువలన దుఃఖితుండై, వివేకహీనుండ నగు నా విషయమై యపరాధంబులఁ దలపోయుచు, భార్యతోఁగూడ గంగానదిలోఁ బడి ప్రాణముల విడిచిపెట్టలేదుగదా? అక్కటా! మా తండ్రి పాండురాజు మృతుఁడైన పిమ్మట దయతోఁ జేరఁదీసి మమ్ముఁ గాపాడిన విదురుఁడును, ధృతరాష్ట్రుండును, మందబుద్ధుల మయిన

మమ్మును విడిచిపెట్టి యెచ్చటికేఁగిరో చెప్పుము అని యడుగుచున్న ధర్మరాజు పలుకుల నాలకించి, దయచేతను, స్నేహముచేతను, ధృతరాష్ట్రుని విరహము నోర్వఁజాలక, యతండు పోయిన జాడ తెలియక, మిగుల దుఃఖించుచుఁ గొంత తడవూరకుండి కన్నీరు దుడిచికొని బుద్ధిబలంబుచేఁ జిత్తంబున ధైర్యంబు నెలకొల్పికొని, తన ప్రభువగు ధృతరాష్ట్రుని పాదములు మనంబునఁ దలంచుకొనుచు, సంజయుండు ధర్మరాజున కిట్లనియె. 'ఓ రాజా! ధృతరాష్ట్రుఁడును, గాంధారియు, నన్నొక్కని వంచించి యెచ్చటికిఁ బోయిరో, వారినిశ్చయము లెవ్వియో నాకుఁ దెలియవని చెప్పి దుఃఖించుచున్న సమయమునఁ దుంబురునితోఁగూడ నారదుం డేఁగుదెంచెను.

నారదుండు తుంబురుసహితుఁడై ధర్మజునొద్దకు వచ్చుట.

అంత, ధర్మరాజు వచ్చిన నారద తుంబురులకు ననుజులతోఁ గూడ నమస్కరించి పూజించి నారదున కిట్లనియె. 'ఓనారదా! మా పితృవ్యులైన విదుర ధృతరాష్ట్రు లెచ్చటి కేఁగిరో నేఁ దెలియఁజాల కున్నాను. హతపుత్త్ర యగుటంజేసి మిగుల వగచుచున్న పతివ్రతయగు గాంధారి యెచ్చటికేఁగెను? వారింగూర్చి నాకుఁ జెప్పరానంత దుఃఖము పొడముచున్నది. ఇట్టి దుఃఖసముద్రములో మునింగియున్న మమ్ముఁ బారంబు జేర్పఁ దలంచి, యపారసముద్రంబు దాఁటనున్నవారికి నావి కునివలె సర్వజ్ఞుండ వగు నీ వరుదెంచితివి. కావున, మాయందు దయయుంచి మా కా తెఱంగు తెలియఁజేయు' మని పలుకుచున్న ధర్మరాజు మాటల నాలకించి నారదుం డిట్లనియె,

ధర్మరాజా! ఈ ప్రపంచమంతయు నీశ్వరాధీనంబయి యున్నది. కావున, నీ వెవ్వనిగుఱించియు దుఃఖింపకుము. భూతము లొకమాఱు సంయోగంబు, నొకమాఱు వియోగంబును బొందుచుండు నాసికారంధ్రములందుఁ ద్రాడు గ్రువ్వంబడినవై యా ముక్కుఁ ద్రాటితోడ మెడత్రాళ్లను బంధింపఁబడి మనుజులకు వశమైయుండు గోవులవలె, లోకపాలురతోఁ గూడిన లోకులు వేదము నెడి పెనుత్రాటం గట్టువడి, వర్ణాశ్రమాదిరూపములైన యుపదామములుగల యా త్రాటితోడ బద్ధులై యుందురు. కావున, నీశ్వరునకుఁ గింకరులై తత్పూజనములాచరింతురు అందువలన, బ్రహ్మాదిసురలు మొదలుకొని క్షుద్రజంతువుల పర్యంతము సమస్తప్రాణికోటియు భగవంతునికి వశమయి యున్నదనియు, నతనికిఁ బూజచేయుచుండుననియుఁ దెలిసికొనుము మఱియు, లోకములో మానవుండు క్రీడింప నిష్టముగలవాఁడయి క్రీడాసాధనమ్ములగు పాచికలు, కందుకములు మొదలగువానికి సంయోగ వియోగంబు లెట్లు గలిగించునో, యట్లె యీ జంతుకోటియంతయు నీశ్వరునకుఁ గ్రీడాసాధనంబులు గనుక, నాతఁడు జంతువులకు సంయోగమును, వియోగమును గల్పించి యాటలాడుకొనుచుండును కావున, మానవులకు సంయోగవియోగంబులు భగవదిచ్ఛచేఁ గలుగుచుండునని తలంపుము. నీ వీ లోకంబును ధ్రువంబని తలంతువా? అధ్రువంబని యెంతువా? లేక ధ్రువాధ్రువంబని భావింతువా? ధ్రువంబని తలంచినప్పుడు, ధ్రువంబగు జీవాత్మకు నాశనం బెన్నడును సంభవింపనేరదు కాన, వందులకై దుఃఖింపం బనిలేదు. అధ్రువంబని యెంచి

నచో, నధ్రువంబగు దేహాదికంబు తప్పక నశింపవలసినదే కాన, నందులకు విచారించిన నేమి ప్రయోజనంబు? ధ్రువాధ్రువ మని భావింతు వందువేని, విరుద్ధములయిన ధ్రువత్వాధ్రువత్వంబు లొకచో నుండుట యసంభవము. కాన, నట్టిది లేదు ఇట్లుండ, నీ వెందులకయి విచారించుచున్నావు. ఇట్లు నీకు దుఃఖంబు పొడముటకుఁ గారణంబు తెల్పెద వినుము. అజ్ఞానాతిశయంబుచే దేహంబు నాత్మగా భావించుచుండుటం బట్టి, దేహాదులం దనురాగం బుద్భవించును. అందువలన దేహాదులు నశించునప్పుడు దుఃఖంబు పొడముచుండు. ఆ దుఃఖంబు దేహాత్మభ్రమమూలకంబే కాని, వేఱయినది కాదు. నీ వా దేహాత్మభ్రమను దొలంగించితివేని, శోకంబు నీకుఁ గలుగ నేరదు. కావున, జ్ఞానాతిశయంబువలనఁ దద్భ్రమనివారణంబు గావించుకొని, తన్మూలకంబయిన దుఃఖంబు విడనాడుము దీనులఁను దిక్కులేనివారు నగు ధృతరాష్ట్రాదులు నన్ను విడిచి యెట్లు జీవింపఁగలరు? అని చింతింపఁబని లేదు. పెనుబాముచే గ్రహింపఁబడుచుండు పురుషుండు పరుల రక్షింపలేని చందంబునఁ, గాలమ్మునకును, బురాతన పుణ్యాపాపకర్మంబులకును, సత్త్వరజస్తమోగుణంబులకును నధీనంబై, పంచభూతమయంబై యున్న దేహం బన్యుల నెట్లు రక్షింప సమర్థంబగు? ఇట్లు నీ దేహంబును నీవే రక్షించుకొన లేనప్పుడు ధృతరాష్ట్రాదుల రక్షింతు ననుట తెలివితక్కువ. మఱియుఁ జేతులు గల మానవాదులకుఁ జేతులులేని మృగాదు లాహారంబు లగుచున్నవి. కాళ్లుగల ప్రాణులకుఁ గాళ్లులేని జంతువు లాహారంబు లగుచున్నవి. మహాజంతువులగు వ్యాఘ్రాదులకు

జింకలు మొదలగు క్షుద్రజంతువులు భోజనం బగుచున్నవి. వేయేల? సజీవంబగు భూతమునకు జీవమే యాహారమగుచున్నది ఇట్లు భగవంతుండే సమస్తజీవులకు జీవనవ్యవస్థ చేసియుండు గావున, ధృతరాష్ట్రాదుల జీవనోపాధిగూర్చి విచారింపఁ బనిలేదు. ఓ రాజా! పరిదృశ్యమానమగుచుఁ జిదచిదాత్మకమైన యీ ప్రపంచమంతయు నా భగవంతుఁడొక్కఁడే అతఁడు సత్వాదిగుణపురస్సరముగా దేవమనుష్యాది భేదములను గల్పించి, యాయా భూతములయం దంతరాత్మయై ప్రవేశించి, వానికి శాసనుఁడయి, ధారకుండయి యున్నాఁడు. అతఁడు స్వాత్మయాథాత్మ్యము దెలిసినవాఁడు గావున, నతనికి వ్యాప్యములయం దంతరాత్మయై ప్రవేశించినను, దద్గతదోషములు కలుగనేరవు. అతఁ డంతర్బహిర్భాగంబుల వెలయుచున్నాఁడు ఒక్కఁడగు భగవంతునికి నానాత్వ మెట్లు వచ్చిన దని సందియ మంద నవసరము లేదు దేవమనుష్యాదిభేదములుగాఁ బరిణమించుచున్న మాయచే భగవంతుఁడు నానాత్వము చెందినట్లు కనఁబడును గాని, చిదచిదాత్మకమయిన దేవమనుష్యాది శరీరభేదంబుచే నున్నవాఁడు భగవంతుం డొక్కండే యని యెఱుంగుము. నిఖిలజగంబందు నంతరాత్మయై, లోకత్రయమును వశము గావించుకొని కాలస్వరూపుఁడై వెలయు నీశ్వరుండు దుష్టనాశనంబు గావింప, ద్వారకయందుఁ గృష్ణుండై యవతరించి యున్నాఁడు. అతండు దేవతాకార్యంబు చాలభాగంబు నెఱవేర్చె గాని, కర్తవ్యాంశంబు కొంచెము మిగిలియున్నది. ఆ యవశిష్టకార్యంబుకై భగవంతుండు వేచియున్నాఁడు.

ఆకృష్ణుండు భూమియందున్నంత కాలము మీరును వేచియుండి, యనంతరము ధృతరాష్ట్రాదులవలె వనంబునకై వెడలుండు. ఇప్పుడు మీ పెదతండ్రి మొదలగువా రెచ్చట నున్నారో చెప్పెద నాలింపుము ధృతరాష్ట్రుండు విదురగాంధారీసహితుండయి హిమవన్నగంబునకు దక్షిణంబున సప్తస్రోతం బని ప్రసిద్ధికెక్కిన యాశ్రమంబును బ్రవేశించి యున్నాఁడు. ఆ యాశ్రమంబు మిగులఁ బవిత్రమయినది. త్రిలోకపావని యగు గంగానది యచ్చట సప్తమహర్షుల ప్రీతికై యేడు పాయలై ప్రవహించినది అట్లు గంగానది సప్తవిధంబులయి ప్రవహించినది కావుననే, యది సప్తస్రోతం బని వాసికెక్కె. అట్టి సిద్ధాశ్రమంబును జేరి, ధృతరాష్ట్రుం డమ్మహానదియందు గ్రుంకులిడి యథావిధిగా మూఁడు కాలంబులందు నగ్నిహోత్రాదులు కావించుచుఁ బానీయంబు మాత్రంబె యాహారంబుగఁ గల్పించుకొనుచు, మనమందున్న కామాది దుర్గుణంబులఁ దొలంగించుకొని, దారేషణ ధనేషణ పుత్రేషణల నశింపఁజేసికొని నిర్మలాంతఃకరణుండై వర్తించుచున్నాఁడు. మఱియు, నతండు చిరకాలము గూర్చుండి యుండినను శ్రమ నొందక, ప్రాణంబుల బంధించి, శబ్దాది విషయంబులనుండి యింద్రియంబుల మఱలించి, భగవద్రూపము ధ్రువమైన దను స్మృతిచేఁ ద్రిగుణకార్యంబు లగు కామాదులను, ముక్తి ప్రతిబంధకములగు పుణ్యపాపంబులను భస్మీభూతంబుగావించి, విజ్ఞానస్వరూపుఁడగు ప్రత్యగాత్మయందు నింద్రియంబుల సంయోజించినవాఁడు. కావునఁ, జిత్తంబు నింద్రియాధీనంబు కాకుండఁ జేసి, యుపాధిభూతమయిన ఘటంబును నశింపం జేసి,

తదంతర్వర్తియైన యాకాశంబును మహాకాశంబుతో సమానంబగు నాకారంబు కలదని యోజించినట్లు, జీవాత్మ నుపాధి రహితంబుగాఁ గావించి బ్రహ్మసమానాకారత్వంబు కలదని నిశ్చయించి నిరాహారుండయి, యింద్రియక్షోభంబుం దొలంగించుకొని, యిప్పుడు మొరడుచందంబున నిర్వ్యాపారుండై యున్నాఁడు. ఇట్లు సన్యస్తకర్ముండై గాఢనిశ్చయంబుతో నున్న యాతనికి నీ వెంతమాత్రము విఘ్నంబు గలిగింపకుము. నేటి కైదవదినంబున నాతండు దేహంబును యోగాగ్నిచే భస్మీభూతంబు చేయఁగలఁడు. ఇట్లు పర్ణశాలాసహితంబుగా భర్తదేహంబు దగ్ధంబగుటఁ గాంచి, గాంధారి యా యగ్నియందుఁ బ్రవేశించి దేహంబు విడువఁగలదు. అంత, విదురుం డద్భుతంబగు వారల చరిత్రఁగాంచి హర్షశోకంబులు మనంబున మల్లడిగొన నటనుండి కదలి తీర్థనిషేవణంబుకై యరుగును' అని చెప్పి నారదుండు ధర్మజుశోకంబుల వారించి జ్ఞానంబు గలిగించి తుంబురుసహితుండై స్వర్గంబున కేఁగె. అంత, ధర్మరాజతని వాక్కుల నక్కున నిడికొని దుఃఖంబు విడిచె.

ఇది పదుమూఁడవ యధ్యాయము



ధర్మరాజు దుశ్శకునంబులఁ గని చింతించుట

అనంతరము ధర్మరాజు బంధువులఁ జూచి పుణ్యశ్లోకుఁడయిన కృష్ణుని చేష్టితంబు లరసివత్తు నని ద్వారకాపురంబున కరిగిన యర్జునుండు కొన్నిమాసము లతిక్రమించినను రాకుండుటను, భయంకరములయిన దుర్నిమిత్తంబులను జూచి, తనలో

నిట్లు విచారించెను 'కాలగతి ఘోరమయి మిగుల వ్యత్యాసం బుగాఁ గనఁబడుచుండె ఋతుధర్మంబులన్నియు మారిపోయెను. మానవులు క్రోధ లోభాదు లగు దుర్గుణములందు మిగుల నాసక్తిగలవారయి ప్రవర్తించుచుండిరి. వ్యవహారమ్ము లన్నియుఁ గపటయుతంబులయి యుండె స్నేహితు లొకరి నొకరు వంచించుకొనుచుండిరి భర్తలతో నిల్లాండ్రు పోరాడఁ దొడఁగిరి మిక్కిలి పూజార్హులైన తల్లిదండ్రులఁ గొడుకులు హింసించుచుండిరి అన్నదమ్ము లొకరితో నొకరు కలహించు చుండిరి. తండ్రి కడుపునంబుట్టిన బిడ్డల నమ్ముకొనుచుండె. కొడుకు తల్లిదండ్రులఁ బోషింప నిష్టపడ కుండె. బ్రాహ్మణు లందఱు వేదాధ్యయనము విడుచుచుండిరి. శూద్రులు వేదమ్ములఁ బఠించుచుండిరి. విపరీతమయిన కాలము ననుసరించియే యిట్టి దుర్నిమిత్తంబులును మానవుల కిట్టి యధర్మస్వభావమును గలుగుచున్నవి' అని యిట్లు విచారించి ధర్మరాజు భీమున కిట్లనియె. 'ఓ భీమా! బందుగులను, గృష్ణునిఁ జూడ వేడుకపడి మన యర్జునుండు ద్వారకాపురంబునకుఁ బోయి యున్నాఁడు ఇప్పటి కేడుమాసము లతీతంబు లాయె కాని, యతండు తిరిగి రాలేదు. అతండు రాకుండుటకుఁ గారణం బేమో తెలియఁజాల కున్నాను. ఆలోచింపఁగా, నారదుండు చెప్పినకాలం బేతెంచినట్లు తోఁచుచున్నది. అట్లయిన, భగవంతుండు లీలకొఱకు స్వదేహంబును విడువఁ దలంచియుండుట నిశ్చయము. మన కీ రాజ్యసంపదలు కలుగుటయు, మనము బ్రదికియుండుటయుఁ బ్రజలఁ బరిపాలించుటయు, శత్రువుల సంహరించి జయము గొంటయు, రాజసూయాది యాగ

మ్ములుచేసి యుత్తమలోకమ్ములు పొందఁ దగియుండుటయు, నివి సమస్తము శ్రీకృష్ణుని యనుగ్రహమ్మువలననే కదా కలిగినవి! అట్టి కృష్ణున కేమయిన విపత్తు వచ్చినదేమో యని నా మనస్సు మిగుల సందేహించుచున్నది ఓ పురుష వరా! భూమియందును, నాకసమందును దేహమందును బొడముచున్న భయంకర దుర్నిమిత్తములం బొడఁగాంచుము. అవి యన్నియు నా బుద్ధిని మోహింపఁజేయుచున్నవి. వామ భాగంబున నున్న నేత్రంబులును, బాహువులును, నూరువులును మాటిమాటికి నదురుచున్నయవి నా హృదయంబు సర్వదా కంపింపఁదొడంగెను. వీనినిబట్టి యోజింప, శీఘ్రకాలంబులోనె యాపదలు మనలఁ జుట్టుముట్టు నని తోఁచుచున్నది. నక్కలు వీతిహోత్రునివంటి ముఖంబులుగలవై సూర్యుని కెదురుగఁ దిరిగి యఱచుచున్నవి. ఒకకుక్క నాముందట నతిభీకరముగా మొఱగఁజొచ్చెను ప్రశస్తముౕయిన పశువులు మొదలగునవి నా కపసవ్యమ్ముగాఁ బోవుచున్నవి శ్రేష్ఠమ్ములయిన గజాశ్వంబుల కన్నులనుండి నీరము ఘోరమ్ముగాఁ గాఱుచున్నది ఒక కపోతమ్ము యమదూతి విధమ్మునఁ గనఁబడుచు నామనంబును జలింపఁ జేయుచున్నది ఘూకంబులు మిగుల భయంకరముగాఁ గూయఁ జొచ్చెను. ప్రతి కూబయుఁ దమ కుత్సితమ్ములగు రవంబుచేఁ బ్రపంచకమ్మును నశింపఁ జేయుచున్నట్టు కన్పట్టు చున్నది. దిక్కులన్నియు ధూళులచేఁ గప్పఁబడుచున్నవి. అకాల మేఘంబులతోఁ గూడఁ బిడుగులు బడుచుండెను. భూమి పర్వతమ్ములతోఁ గూడఁ గంపింపఁ దొడఁగెను. మఱియుఁ బరివే

షంబులు చూపట్టుచున్నవి. గాడ్పులు మిగులఁ దీవ్రమ్ముగా వీచుచు, ధూళులచే లోకమునకుఁ జీఁకటిని గల్పించు చున్నవి. మేఘమ్ము లెల్లయెడలను రక్తమ్ము భయంకరం బుగా వర్షించుచున్నవి. సూర్యునికాంతి యంతయుఁ దఱిగి పోయినది. ఆకాశమందు గ్రహమ్ములు పరస్పరము పోరాడు చున్నవి. చూడు. భూతముల కలకలధ్వనులు భూమ్యాకాశ మ్ములం గప్పుచున్నవి. నదులు, సముద్రమ్ములు, సరస్సులు, సకలభూతంబుల మానసంబులును, మిక్కిలి క్షోభ చెందు చున్నవి నేయిపోసిన నగ్ని మండ కున్నది. ఇట్టి భయంకర మగు కాలమేమి చేయునోకదా! మఱియు, నావులు తమ దూడలకుఁ గా లియ్యవు. దూడలు కుడుచుకొనవు. గోవుల కన్నులనుండి నీరు విశేషంబుగాఁ గాఱుచున్నది. వృషభమ్ము లావులను గూడకున్నవి. దేవాలయమ్ముల నున్న దేవతాప్రతి మలు తమంతతామే కదలుచు విస్తారమ్ముగాఁ జెమ్మటలను గార్చుచున్నవి. దేశమ్ములు, గ్రామమ్ములు, పురంబులు, నుద్యానవనంబులు మున్యాశ్రమంబులు నానందరహితం బులై, కాంతిహీనమ్ములయి కన్పట్టుచున్నవి. ఈ దుర్నిమిత్తం బులయోజింప యవపద్మరేఖాది శుభలక్షణాంచితంబులయిన శ్రీకృష్ణమూర్తి పాదపద్మమ్ములచేఁ ద్రొక్కఁబడునంతటి భాగ్యమ్మిఁకమీఁద నీ భూకాంతకు లేదని తోఁచుచున్నది.' అని చెప్పుచు, మహోత్పాతమ్ములఁగని భీతిల్లుచు మిగుల విచారించుచున్న సమయమున, ద్వారకాపురమునుండి యర్జు నుండు వచ్చి, ధర్మరాజు పాదపద్మములపైఁబడి నమస్క రించె. ఇట్లు నమస్కరించి యర్జునుఁడు తలవంచుకొని కన్నుల

వెంబడిని నీరు ధారగట్టుచుండ, నాతురుండయి నిలువఁబడి కాంతిహీనుఁడయి చూపట్ట, ధర్మరాజు కాంచి మనంబునఁ దొట్రుపడుచు నతని కిట్లనియె 'ఓ యర్జునా! ద్వారకా పురమునందు మన బంధువు లందఱు క్షేమముతో నున్నారా? శూరుం డనఁనొప్పు మన మాతామహుండు క్షేమమున నున్నాఁడా? సహోదరసహితుండగు మన మేనమామ సుఖియే గదా? ఉగ్రసేనుని తోఁబుట్టువులును, మనకు మేనత్తలు నగు దేవకి మొదలగువారు కొడుకులతోను కోడండ్రతోను సుఖంబున నున్నారా? దురాత్ముఁడగు కంసునిఁ బుత్రునిగాఁ బడసిన యుగ్రసేనమహారాజు క్షేమమున వర్తిలుచున్నాఁడా? ఆ యుగ్రసేనుని తమ్ముఁడు దేవకునకుఁ గుశలమే కదా? హృదికుని కుమారుం డగు నక్రూరుండు, జయంతుఁడు మొదలగు వారును, వసుదేవుని కుమారులగు శత్రుజిత్ప్రముఖులును కుశలంబున నున్నారా? యాదవాధిపతియగు బలరాముండు క్షేమంబున నున్నాఁడా? సమస్త యాదవవీరులలోను మహారథుం డనఁదగు ప్రద్యుమ్నునికి క్షేమమా? అట్లే యనిరుద్ధుండు కూడ క్షేమమున నున్నాఁడా? మఱియు, జాంబవతి పుత్రుఁ డగు సాంబుఁడు, సుషేణుఁడు, చారుదేష్ణుఁడు మొదలగువారికి క్షేమమే కదా? కృష్ణకుమారులలో నుత్తములగు ఋషభాదు లందఱుఁ బుత్రసమేతులై క్షేమమున నున్నారా? భగవంతుఁడగు కృష్ణునికి ననుచరులై వర్తించు శ్రుతదేవుఁడు, నుద్ధవుండును, యాదవశ్రేష్ఠులైన సునందుఁడు, నందుఁడు మొదలగువారును సుఖులా? యాదవులందఱు బలరామ కృష్ణులచేఁ జక్కఁగఁ బాలింపఁబడుచున్నారా? వారు మన

యందుఁ బూర్వమువలె స్నేహము గనఁబఱుచుచు మనకుశలమ్మును గోరుచున్నారా? భగవంతుండగు శ్రీకృష్ణుండు సుధర్మయందు మిత్రపరివృతుండయి సేమమున నున్నాఁడా? శ్రీకృష్ణుండు బలరామసహాయుండై లోకములకు హితమును, మంగళంబును గలిగించునిమిత్తము యదుకులాంబుధియందు వర్తించుచున్నాఁడా? ఎవ్వని బాహుదండంబుచే రక్షితంబయిన ద్వారకయందు వసించుచు, యాదవు లందఱు సకల లోకపూజ్యులై మహాపౌరుషవంతులవలె మెలఁగుచుఁ బరమానందంబుతో నున్నారో, యే మహాత్ముని పాదపద్మసేవయే ముఖ్యకారణంబుగాఁగల సత్యభామాదులగు నెనమండ్రు పట్టమహిషులును, దక్కిన షోడశసహస్రయువతులును, భగవంతుఁడు యుద్ధంబున దేవతల జయించి పారిజాతాదులఁ దెచ్చియిచ్చుటంబట్టి, శచ్యాది దేవకాంతల కుచితంబులగు నభీష్టపదార్థంబులఁ బొందుచున్నారో, యే పురుషోత్తముని బాహుదండంబుల నాశ్రయించినయాదవులు భయరహితులై, సురసత్తముల కుచితంబయినదియు, సురలను జయించి బలాత్కారంబునఁ గొనివచ్చినదియు, సుధర్మ యను పేరుగల సభను బాదంబుల నాక్రమించుచున్నారో, అట్టి కృష్ణమూర్తి సేమంబున నున్నాఁడా? ద్వారకాపురమ్మున నీవు సేమముతో నున్నావా? నీవు తేజోహీనునివలెఁ గనిపించుచున్నావు. ఒకవేళ నీకు రోగమేదియు రాలేదుకదా? అక్కడ నీవు చిరకాల మున్నావు. గౌరవహీనుండవై యెవరిచేతనైన నవమానితుండవు కాలేదుకదా? అమంగలంబులయిన శబ్దాదివిషయంబులకు లోఁబడి యుండలేదుగదా?

ఎవరికయిన నిచ్చెదనని ప్రతిజ్ఞ చేసిన వస్తువు నీ లేకపోయితివా యేమి? నీవు శరణాగతవత్సలుండవు గనుక, నీకు శరణు సొచ్చిన బాలుని గాని, గోబ్రాహ్మణులఁగాని, రోగినిగాని, స్త్రీలఁగాని రక్షింపలేకపోవుటచే నిట్లు విచారించుచున్నావా? పొందఁదగని స్త్రీని బొందఁ బ్రయత్నించుటగాని, పొందఁదగినస్త్రీని బొందక యవమానించుటగాని జరిగియుండలేదు కదా? లేక, మార్గమధ్యంబున దుర్మార్గులచే నోడింపఁబడి యిట్లు విచారించుచున్నావా? నీతోఁగూడ భుజింపఁదగిన బాలురఁగాని, వృద్ధులఁగాని విడిచి భుజించితివా? లేక మాకప్రియమయిన నింద్యకర్మంబు నాచరించితివా? పరమాప్తుఁడగు కృష్ణు నెడఁబాయుటచే నిట్లు నిరానందుండవై యున్నావా? లేకపోయిన, నివింత కాంతిరహితుండవై యుండ నేల?

ఇది పదునాల్గవ యధ్యాయము

---

అర్జునుఁడు ద్వారకాపురవృత్తాంతము ధర్మరాజునకు నివేదించుట

ఇట్లు మిగులఁ దొందరతో నడుగుచున్న ధర్మరాజును జూచి, యర్జునుఁడు తన ప్రియమిత్రుని వియోగమ్ముచే మిగులఁ బీడితుఁడయి దుఃఖమ్ముచే ముఖమ్ము తెలతెలపోవుచుండ, హృదయకమలము కాంతితఱిగిచనఁగా, నా విష్ణుమూర్తిని మనంబందు స్మరింపుచు, ధర్మజునితో మాట్లాడఁ బ్రయత్నించియు మాటాడ నశక్తుండై, యతికష్టముచే దుఃఖము నరికట్టి చేతులచేఁ గన్నులనుండి స్రవించుచున్న నీటిని దుడుచుకొని, పరోక్షమందున్నను నధిక ప్రేమపురస్సరంబుగాఁ

గృష్ణుని స్మరించుచుండుటవలనను, దదీయ విరహాసహాత్వంబు వలనను భీతుండయి, కృష్ణమూర్తి సారథ్యము చేయునపుడు చూపిన సఖ్యమును, హితాభిలాషిత్వమును, ప్రేమాతిశయ మును దలంచుకొనుచు గొంతుక రాల్పడ నిట్లనియె. ఓ మహా రాజా! మనము ప్రియబంధువగు శ్రీకృష్ణునిచే వంచింపఁ బడితిమి. బ్రహ్మాదులకునైత మాశ్చర్యమ్ముఁగొలుపు నా తేజం బంతను గృష్ణుం డపహరించెను. ఏ మహాత్ము నొక్క-క్షణము విడిచిపెట్టినను లోకమంతయు నప్రియమ్ముగాఁ గనఁబడునో, యెవని వియోగమ్మువలన నేను జీవచ్ఛవమ్ము వలెఁ గనఁబడు చున్నానో, యే మహానుభావు నాశ్రయించుటవలన నేను ద్రౌపదీస్వయంవర కాలమ్మున మన్మథపీడితులును, దుర్మార్గ లును నగు రాజు లందఱుఁ జూచుచుండఁగా మింటఁ గదులు చున్న మత్స్యయంత్రమ్మును గొట్టి ద్రౌపదీ దేవిని దీసికొని వచ్చితినో, యట్టి శ్రీకృష్ణుఁడు మనల విడిచిపోయెను. మఱియు, ఓ ధర్మరాజా! దేవతలతోఁగూడ నింద్రుని జయించి ఖాండవ వనమ్ము నగ్ని కిచ్చుటయు, నత్యద్భుతములయిన పాణిపాదాది నైపుణ్యముచే నొప్పి యాశ్చర్యము గొలుపు ప్రతిమాది వస్తువులచేఁ దులకించు మయసభ మనకు లభించుటయు, నశ్వ మేధంబునందు రాజులు నానాదిక్కు-లనుండి చనుదెంచి నీకుఁ గానుకలర్పించుటయు, నాకృష్ణుండు మన సన్నిధియం దుండుట వలననే లభించినవి రాజసూయయాగమందలి యభిషేకముచే శ్లాఘ్యమును, సుందరమును నగు నీ ప్రియపత్ని ద్రౌపది కబరీభారమును విప్పి, యాకర్షించి, యామె యశ్రుముఖి యయి తమపాదమ్ములందుఁ బడి నమస్కరించుచున్నను, వద

లక, సభలోనికిఁ గొనివచ్చిన దురాత్ములగు దుశ్శాసనాదులను నెవండు సంహరించి వారి స్త్రీల కేశపాశముల శోభ హరించెనో, పదివేలగజంబుల బలముగల యా భీమసేనుండు రాజశ్రేష్ఠుఁడయిన జరాసంధునిఁ జీల్చిచంపి, యతఁడు భైరవ బలికై కొనివచ్చిన రాజులను విడిపించి, యాతండు రుద్రయాగం బొనరింప సమకూర్చిన ధనంబులను నీవొనరించు యాగము నిమిత్తము తెచ్చుట యా కృష్ణుని సహాయత్వముండుట వలననేకదా? దురాత్ముఁడగు దుర్యోధనుని పంపునఁ బదివేల బ్రాహ్మణులతో భుజింపవలె నన్న తలంపుతో మనయొద్దకు వచ్చిన *దూర్వాసునివలన మనకు

* దూర్వాసునివలనఁ బాండవులకు వచ్చిన యాపద యేమన — ఒకప్పుడు దూర్వాసుఁడు దుర్యోధను గృహమునకుఁ బోయి, యతఁడిచ్చు పూజాభోజనాదుల కానందించి వరము గోరుమనియె అంత, దుర్యోధనుండు పాండవుల నాతని శాపముచే దగ్ధులఁగాఁ జేయఁదలంచి 'వనములో నున్న పాండవులయింట మాగృహమందు భుజించినట్లు భుజింపవలెను' అని కోరెను దూర్వాసుఁ డందుల కంగీకరించి, పాండవులున్న వనమును జొచ్చి ధర్మరాజుం జూచి "ఓయీ! పదివేగురు బ్రాహ్మణులతోఁగూడ వేగముగా నన్ను భుజింపఁజేయవలయును" అని పలికెను అంత ధర్మరాజు భయమున వడఁకుచుఁ, బదివేవురు బ్రాహ్మణులు లేక పోవుటకును, వారిని దనుపునంత సామగ్రి లేకపోవుటకును విచారించుచు, నతఁడు కోరిన ట్లన్నము పెట్టనియెడల నతఁడు శపించునని వగచుచు మనము దృఢపడిచికొని, మునితో స్నానాది నిత్యకృత్యము లొనరించుకొని రం డని పలికె అ ట్లతఁడు నదికేఁగ, శ్రీకృష్ణుండు పాండవుల దుఃఖము బాపఁగోరి వారున్నచోటికి వచ్చి, విచారకారణ మడుగ, ధర్మరాజు సర్వమును నివేదించెను అంతఁ గృష్ణుం డా సర్వము దుర్యోధన కృత్యముగా నెఱింగి, ధర్మజుం జూచి 'భుక్తశేష మేమయినను గలదా' నావుడు 'శాకమమాత్రమే మిగిలియున్న' దనియె అది విని

ఘోరాపద సంప్రాప్తము కాఁగా, నెవఁడు వచ్చి శాకరూప మైన భుక్తశేషమును దిని, దూర్వాసునే కాక, ముల్లోక ములఁగూడఁ దృప్తిపొందించి యా యాపదనుండి మనల రక్షించెనో, యా కృష్ణుండు మనల మోసపుచ్చెను. నేను యుద్ధమందు భగవంతుండగు శంకరుని కాశ్చర్యము గొలిపి యతనివలనఁ బాశుపతాస్త్రంబుఁ గొనుటయు, నట్లె యింద్రాదుల నాశ్చర్యభరితులఁగాఁ జేసి యిప్పుడు తేజో హీనమయిన యీ కళేబరంబుతోనే సురేంద్రుని భవనంబు నకుఁ బోయి యర్ధాసనంబున నధివసింపఁ గలుగుటయు, శ్రీ కృష్ణుండు నిజ తేజంబు నాయందుంచుటచేత నే. మఱియు, నేను సురలోకమున విహారించుతఱి గాండీవసంయుతమయిన నా బాహుయుగము కాలకేయాదుల వధను గోరుచున్న యింద్రాది దేవతల కాశ్రయభూతమగుట కృష్ణుండు నా బాహువుల కట్టి ప్రభావ మిచ్చియుండుటచేత నేక దా! అట్టి కృష్ణుండు మనలవిడిచి నిజలోకమున కేఁగినాఁడు. ఎవఁడు నాకు బాంధవుఁడై యుండుటచే, దుస్తరమగు బలము కలిగి, నిరవధికమై యొప్పు కౌరవసైన్యసముద్రము నసహాయుఁడనై రథసాధనముచేఁ దరించితినో, శత్రువుల ధనరాసులఁ గొని వచ్చితినో, వైరవీరుల శిరస్సులవలన రత్నరూపమయిన ధనము నపహరించితినో, యా కృష్ణుండు నా హృదయము నపహరించి పోయెను. ఎవఁడు నాముందఱఁ జరించుచు,

గోవిందుండు దానిని గొనిరమ్మనుడు వారట్లొనర్చిరి కృష్ణుఁడు దాని భక్షింప, దూర్వాసుండు స్థావరజంగమాత్మక ప్రపంచ మంతయుఁ దృప్తి నొందినట్లు తలంచి సంతసించి పోయెను

మహా వీర్యవంతులయిన రాజశ్రేష్ఠుల రథజాలములతోఁ బ్రకాశించు భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యుల సేనలందు సమస్త రథికుల పరాక్రమముతోఁగూడ నాయువులను, మానసంబులను జూపులచేతనే హరించెనో, యా కృష్ణుండు నా హృదయము నపహరించినాఁడు భీష్ముఁడు, ద్రోణుఁడు, కర్ణుఁడు, ద్రోణసుతుండు, త్రిగర్తలు, శల్యుఁడు, సైంధవుఁడు, బాహ్లికుఁడు మొదలగు కురువీరులు ప్రయోగించిన నిరుపమాన మహిమగల బాణంబులు, హిరణ్యాకశిపుం డొనర్చిన బాధలు ప్రహ్లాదునిఁ జెందలేని చందంబున, నెవ్వని బాహు దండంబుల శరణంబుగాఁ జేసికొన్న నన్ను స్పృశింపలేక పోయెనో, యా కృష్ణుండు నా హృదయ మపహరించెను ఎవని పాదపద్మములను సాధువులు ముక్తి నపేక్షించి భజించుచుందురో, యెవఁడు *తన్నైన నొసంగునట్టి యీశ్వరుఁడో, యా మహానుభావునిఁ గుత్సితబుద్ధిచే సారథ్యమందు నియోగించితిని యుద్ధమున నా హయము లలఁతి చెందినపుడు నేను భూమిపై నుండవలసివచ్చె. అప్పు డెవని ప్రభావంబున మోహిత చిత్తులగుటచే శత్రువీరులు నన్నుఁ గొట్ట నూహింపరైరో, యా కృష్ణుండు నా హృదయము నపహరించెను ఓ రాజా! మిగుల సుందరమయిన మందహాసముచే శోభితములైన శ్రీకృష్ణుని పరిహాసవాక్యములును ఓ పార్థా! ఓ యర్జునా! ఓ మిత్రమా! ఓ కురునందనా! యనెడి సంబోధనములును, హృదయంగమములయి స్మరించుచున్న నా హృదయమును హరించు

---

* ఇందులకుఁ బ్రమాణము శ్రు. "య ఆత్మదా బలదా ఏకో బహూనాం యో విదధాతి కామాన్" అనెడి శ్రుతి.

చున్నవి నేనును గృష్ణుండును శయనించుటయందును, నుప వేశించుటయందును, విహరించుటయందును, భుజించుట యందును మొదలగువానియం దైక్యమంది వర్తించుచుంటిమి. అప్పుడు కృష్ణుండు నన్నొకమాఱు "అర్జునా! నీవు సత్యవాదివి కదా!" యని వక్రభాషణములాడుచు, నొకపర్యాయము గుణముల శ్లాఘించుచు, నేఁ గుమతినై యేదేని పాపకార్య మాచరించినచోఁ, దనయుని పాపంబును జనకుండును, మిత్రుని పాపమును మిత్రుండును క్షమించినట్లు, మహామహిముండు గాన, నా పాపంబుల సహించుచుండువాఁడు. ఓ రాజా! నాకు మిత్రుండును, నిరతిశయప్రీతి విషయుండును, నా హిత మభిలషించువాఁడును, హృదయంగముండు నగు పురుషోత్తమునిచే విరహితుండనై మార్గమధ్యమున శ్రీకృష్ణుని భార్యా జనమును రక్షించుచు, దుర్జనులైన గోపాలురచే నబలవలె జయింపఁబడితిని. రాజా! కృష్ణుండు నాకు సహాయభూతుండై యుండునప్పు డున్నధనువే యిప్పుడున్నది. అప్పటివే బాణములు. అప్పటిదే రథము. అప్పటివే హయములు. రాజులచే మహారథుండనని యెన్నఁబడుచున్న నేను నప్పటివాఁడనే. అయినను, ప్రస్తుతము కృష్ణుండు లేమింజేసి, యవి యన్నియు నూషరక్షేత్రమందుఁ జల్లిన బీజంబులచందంబునను, భస్మమందు వేల్వఁబడిన హోమద్రవ్యంబు విధంబునను, మహాపాపి యగు విప్రున కొసంగిన దానాది సత్కారము వడువునను, క్షణమాత్రములోనే వ్యర్థము లాయెను. ద్వారకయందు మన బంధువులు సుఖంబున నున్నారా? అని యడిగితివి. ఇఁక నా వృత్తాంతమత చెప్పెద నాలింపుము. ఓ

అన్నయ్యా! యాదవవీరు లందఱు నొకనాఁడు మద్యమును బూత్రిగాఁ ద్రావి మయిమఱచి, యొండొరుల నెఱుఁగక, మునిశాపప్రకారము కాలమునకు వశులయి, తమలోఁదాము కలహించికొని ముష్టిహతులచే నొకరినొకరు చంపికొనిరి. ఆ యాదవవీరు లందఱిలోను నలుగు రైదుగురు మాత్రము జీవించియున్నారు ఎవ్వాని సంకల్పంబువలన భూతంబులు వర్ధిల్లుచుండునో, యా భగవంతుని సంకల్పంబువలననే భూతంబులన్నియు నశించును కావున, యాదవనాశనము భగవంతుండగు కృష్ణుని సంకల్పంబువలననే జరిగియున్నది నీటి యందు సదా సంచరించుచున్న పెద్దచేఁపలు చిన్నచేఁపల నెట్లు తినుచున్నవో, బలముగల జంతువులు దుర్బలజంతువుల నెట్లు చంపుచున్నవో, గొప్పజంతువులును బలవజ్జంతువులు నెట్లు పరస్పరము చంపుకొనునో, యట్లె శ్రీకృష్ణుఁడు బలిష్ఠులును గొప్పవారు నగు యాదవులచే దుర్బలులను, మఱియు నన్యులను జంపించి, పిమ్మట యాదవులచేతనే యాదవులఁ బరస్పరము జంపించి భూభారమును హరించెను ఆహా! భగవంతుని యుద్దేశము తెలిసికొన శక్యముకాదు మఱియు, గోవిందుని వాక్యములు నా మనస్సును హరించుచున్న వని తన యన్న యగు ధర్మరాజునకుఁ జెప్పి నిరుత్తరుండై, యధికమయిన స్నేహముచేఁ గృష్ణుని పాదకమలమ్ముల స్మరింప, నతని చిత్తము రాగాదుల విడిచిపెట్టి నిర్మల మాయెను వాసుదేవుని పాద పద్మముల సంతతము ధ్యానించుటచే నధికసామర్థ్యముకల భక్తివిశేషమ్ముచేఁ గామక్రోధాదులను జయించి, పూర్వము యుద్ధభూమియందు స్వాత్మపరమాత్మ యాథాత్మ్యమును,

భగవత్ప్రాప్తికి సాధనముల యాథాత్మ్యమును, దెలియఁ జేయునదియు భగవంతుండగు కృష్ణుఁ డుపదేశించినదియు నగు జ్ఞానము చిరకాల మగుటచేతను, గార్యాంతరాసక్తుఁడయి యుండుటచేతను, దమోగుణముచేతను దిరోహితమై యున్నను, దత్త్వావధారణమందు సమర్థుఁడు కాన, నర్జునుం డా జ్ఞానము నవగతము కావించుకొనెను. ఇట్లు తన కలవడిన బ్రహ్మజ్ఞానముచే నర్జునుం డాత్మకు దేహాదిగతమయిన దేవాదిభేదములు కలవనెడి భ్రాంతిని దొలఁగించికొని, స్థూలసూక్ష్మ శరీరములను బాసి, సూక్ష్మప్రకృతిని గూడఁ బాసినవాఁ డగుటచేఁ, దదీయమయిన గుణత్రయమును విడిచి పుట్టుకలేనివాఁ డయి, యపహత పాప్మత్వము మొదలగు గుణములు పొంది యుండెను తరువాత ధర్మరాజు తమ్మునివలన యాదవనాశనమును విని, నారదుని వాక్యంబులు తలంచికొని, భగవంతుని మార్గము తెలిసికొని నిశ్చలమయిన మనస్సుగలవాఁడయి స్వర్గంబున కరుగఁ బ్రయత్నించుచుండె. అంతటఁ గుంతీదేవియు నర్జునునివలన యాదవనాశనమును, భగవంతుని యవస్థను దెలిసికొని, యనన్యప్రయోజనంబులేని భక్తిగలదయి తన మనస్సును శ్రీకృష్ణుని పాదకమలములయందు నిలిపి సంతోషముచే సంసారమును విడిచిపెట్టె. ఓ శౌనకా! ఒక కంటకముచే మఱియొక కంటకము నూడఁ బెఱికి, పిమ్మట రెండింటిని పాఱవైచినవిధంబున భగవంతుండగు శ్రీకృష్ణుండు యదువంశంబున నవతరించి, లోకమ్మునకుఁ గంటకులకు దుర్మార్గులనెల్ల జంపించి భూభారంబుతగ్గించి తన లీలాశరీరంబును విడిచెను. భగవంతునకుఁ దనశరీరము విడిచి

పెట్టుటయుఁ బరశరీరమును విడిచి పెట్టునట్లు చేయుటయు సమా నమే. ఆ భగవంతుండు నిజస్వరూపముతోఁ బ్రవర్తించుచు, నొకప్పుడు మఱియొక రూపమును ధరించి తిరిగి పరిహరించు నటువంటి చందమున, లీలాపరుండై వలయునప్పుడు మీన కూర్మాద్యవతారంబులఁ దాల్చి, ప్రయోజన మున్నంత కాలము విహరించి, మఱల వానిఁ బరిహరించుచుండు. కానఁ గృష్ణుండు భూభారమును దొలంగించి తన శరీరమును విడిచెను.' అని చెప్పి తిరిగి యిట్లనియె. 'ఓ శౌనకమునీంద్రా! శ్రోతవ్యములగు కథలు గలిగిన భగవంతుండగు కృష్ణుం డేదినమ్మున నసాధారణమగు దివ్యమంగళ విగ్రహంబుతోఁ గూడ భూమిని విడిచి వైకుంఠమున కేఁగెనో, యాదినమే యశుభ హేతువగు కలి ప్రవేశించినది. అటుపిమ్మట, ధర్మ రాజు కలిప్రవేశించుటవలనఁ దన పురమునందును, దేశ మందును, బ్రతిగృహమునందును, బ్రతిమానవులందును, లోభము, హింస, యసత్యము, కౌటిల్యము మొదలగు దుర్గుణంబులు ప్రబలియుండుట గనిపెట్టి, యిఁక నీలోకమున నుండ నిష్టపడక, స్వర్గలోకమున కేఁగ నిశ్చయించుకొనెను

ధర్మరాజు పరీక్షిత్తునకుఁ బట్టముకట్టి స్వర్గంబున కేఁగుట

ఇట్లు నిశ్చయించుకొని, ధర్మరాజును వినయసంపద గలవాఁడును, సుగుణములచేత నాత్మసమానుండు నగు తన మనుమనిఁ గొనివచ్చి, తనరాజ్యం బతనికిచ్చి సముద్రజలము లచే నభిషిక్తుం జేసి, మధురాపురమందు ననిరుద్ధునికుమారుం డయిన వజ్రుని శూరసేన దేశముల కధిపతిగాఁ జేసెను. తరు

వాతఁ బ్రాజాపత్య మను నొక యిష్టిని జేసి, యగ్నిహోత్రములఁ నాత్మారోపణము గావించికొని, మోహము నెడఁ బాసి, యహంకారమును దొలఁగించుకొని, ప్రేమానుబంధముల నెల్లఁ దెగఁ గోసి, యింద్రియముల నన్నింటిని వాని విషయముల నుండి లాగికొని ఉభయేంద్రియ వ్యాపారమును దన మనస్సునందు లీనముగావించి ప్రాణమ్ములకు వశమయిన వృత్తిగల మనస్సును బ్రాణమందుఁ జేర్చి, యా ప్రాణము నపానమందును, పోత్సర్గమయిన యపానమును వ్యానమందును, నా వ్యానము నుదానమునందును, నా యుదానమును మృత్యుసంజ్ఞికమయిన సమానమునందును, నా సమానమును బ్రాణాది పంచకమునకుఁ గారణమయిన వాయువునందును విలయింపఁజేసి, తాదృశ వాయుసహితమయిన భూతములను దామసాహంకారమునందును, నింద్రియసమూహమును రాజసాహంకారానుగృహీత సాత్వికాహంకారమునందును, నా త్రివిధములయిన యహంకారమును మహత్తత్వమూలముగాఁ బ్రకృతియందు లయింపఁజేసి, వాగాది ప్రకృత్యంతముగా నున్న సమస్తమును జీవాధీనముగాఁ జేసి యా జీవాత్మను బరబ్రహ్మ సమర్పణము గావించి, సమస్త వ్యాపారములను విడిచిపెట్టి నారచీరలను దాల్చి యాహారమును మాని మౌనమును దాల్చి కేశపాశము జీరాడునట్లు చేసి జడుని వలె, వెఱ్ఱివానివలెఁ బిశాచగ్రస్తునివలెఁ బ్రవర్తించుచు, సోదరులను గూర్చి ప్రతీక్షింపక చెవిటివాని చందమున నొకరు పిలిచినను బలుకక, తన పెదతండ్రి మొదలగు

మహాత్ములరిగిన యుత్తరదిక్కు గుఱించి బ్రహ్మము నావృత్తి చేసికొనుచు నడుచుచుండెను తరువాత, నాతనిసోదరు లందఱు నాతనిం జూచియుఁ, గలిప్రవేశముచేఁ బ్రజలందఱు పాపకర్ములయి యుండుటం జూచియు, సకలపదార్థంబులు నీచంబు లని నిశ్చయించి తమకు మరణము సమీపించిన దని తెలిసికొని ధర్మరాజు ననుసరించిరి పిమ్మట వారందఱు నారాయణుని పాదకమలంబులందుఁ దమతమ మనంబుల ధారణాయోగంబుచే నిలిపిరి అట్లుచేసి, భగవంతుని ధ్యానాతిశయముచేతను, భక్తివిశేషముచేతను నిర్మలమయిన బుద్ధిగలవారయి, భగవత్ప్రాప్తిప్రతిబంధకంబులయిన పుణ్య పాపకర్మముల నన్నింటిని భస్మముగావించుకొని, నారాయ ణునియం దేకాంతబుద్ధి కలవారయి రజస్తమోరహితమగు స్వరూపంబుగలిగి, విషయములందుఁ గోర్కిగలవానికిఁ బొంద రానిదియు, భగవద్భక్తులకుఁ బొందఁదగినదియు నగు నారా యణమూర్తిపరమపదమును బొందిరి. అంతట, విదురుండు ప్రభాసతీర్థంబునందుఁ గొంతకాలము వసించి తనచిత్తమును హరియందుఁజేర్చి శరీరమును విడిచి తాను శాపవశంబునఁ బుట్టిన యముండేకనుకఁ, బితృదేవతలందఱు తన్నుఁగొల్చు చుండఁ దనలోకంబునకేఁగె. అనంతరము ద్రౌపదీదేవి తన పతులచే విడువఁబడి భగవంతుండగు వాసుదేవునియందు విజాతీయమైన మఱియొక ప్రత్యయంబులలేని తనచిత్తంబు చేర్చి పరమపదంబు నొందెను. ఓ శౌనకా! పాండవ శ్రీకృష్ణనిర్యాణము నే మానవుండయినఁ బఠించినను,

విన్నను, వాఁడు సంసారబంధమ్మును విడిచి విష్ణుభక్తుండయి మోక్షపదముఁ జెందఁగలఁడు.

ఇది పదునేనవ యధ్యాయము.

---

ఇట్లు ధర్మరాజాదులు తనకుఁ బట్టముకట్టి పోయిన పిమ్మటఁ బరీక్షిన్మహారాజు సూతికాగృహమందు జ్యోతిశ్శాస్త్రవేత్తలు నుడివినట్లు, బ్రాహ్మణోత్తముల యుపదేశబలంబునఁ బరమభాగవతోత్తముండై సద్గుణుండై భూమండలమును బరిపాలించుచుండెను. రాజ్యము తనకు వచ్చిన తరువాత నుత్తరుని కొమార్తయగు నిరావతి యను కన్యకను బెండ్లియాడి, యామెయందు జనమేజయుఁడు మొదలగు నల్వురు పుత్త్రులను గనెను. తరువాత నమ్మహారాజు కృపాచార్యుఁడు తనకు గురువయియుండ, దేవతలు స్వస్వరూపంబులతో వచ్చి హవిర్భాగంబులఁ జేకొనుచుండ, గంగాతీరమందు మహాదక్షిణలుగల మూఁడశ్వమేధయాగంబుల నాచరించెను. పిమ్మట నతండు దిగ్విజయంబుచేయఁ బూనుకొని, దిక్కులన్నింటిని జయించుచు వచ్చుచుండెను. ఆ సమయమున నొకశూద్రుండు రాజలక్షణములు గలవాఁడయి గోమిథునమునుబట్టి కాలితోఁ దన్నుచుండఁగా, వానిని గలిపురుషునిగా భావించి, వానిని శాసించెను.' అని చెప్పుచున్న సూతుం గాంచి శౌనకుం డిట్లనియె.

### పరీక్షిన్మహారాజు దిగ్విజయంబున భూధర్మదేవతల సంవాద మాలించుట

'ఓ సూతా! దిగ్విజయ సమయమునందుఁ బరీక్షిన్మహారాజు కలిపురుషు నెందునిమిత్తము జయించెను? గోమిథునంబును గాలితోఁ దన్నుచున్నవాఁడై శూద్రలక్షణంబులు గలవాఁడై యున్నరాజె ట్టిగుణంబులు కలవాఁడు? మఱియు, తత్కథ భగవత్కథాసమ్మిశ్రమైకాని, లేక భగవత్పదకమల జనితమగు మకరంద మాస్వాదించుచున్న భక్తుల సచ్చరిత్రంబులతోఁ గూడుకొనుచున్నదై కాని యున్నచోఁ జెప్పవలయును అట్లు చేయుటయే యుచితము. కాని, యల్పాయువులుకలవారై, కర్మ ఫలాపేక్షకలిగి మరణశీలురై యున్న దురాత్ముల దుష్టకథలను పలుమాఱు చెప్పుకొనుచున్నను, వినుచున్నను గాలము వ్యర్థము చేయుటతప్ప నేమి ప్రయోజనమున్నది? ఓసూతా! దేహము నిత్యముకాదు. చచ్చుట సిద్ధమని నిశ్చయించి, స్వల్పాయుర్దాయము గలవారమని తలపోసి, మోక్షముచెంద నపేక్షతోనున్న మాకు నితర చరిత్రములతో నేమి ప్రయోజనము? మా యాయువును వృథా చేయలేము కావున, విష్ణుకథలనే చెప్పుము మఱియు, మేము చేయునట్టి సత్రయాగమునందు మునీశ్వరులు పిలువఁగా వచ్చి యముఁ డిచ్చటనే యున్నాఁడు. చూడుము. అతఁడు విష్ణుకథాశ్రవణపరుండై మా యాగసమాప్తి యగు నంతవఱకు నిచ్చట నే యుండును. అందువలన, నీ సమయమున నొక్కఁడును జావఁడు. ఇచ్చటివారి కీ కాలమందు మరణము లేకుండు నిమిత్తమే మునులచే నాహూతుండై యముండు

వచ్చియున్నాఁడు. ఓ సూతా! కొందఱు మాత్రము మంద బుద్ధులును, స్వల్పమగు నాయుర్దాయము గలవారును నగు మానవులు రాత్రియందు నిద్రామూలంబుగాను, బవలు సంసారికర్మమూలముగాను దమ యాయువును వ్యర్థము చేయు చున్నారు. అట్టివారికిఁ జెడుకార్యములఁ జేయుటకే కాని, విష్ణుమూర్తి పాదపద్మములనుండి స్రవించు మకరందమును ద్రాగుటకుఁ దీఱుగడయే యుండదు. బుద్ధిమంతులు కొందఱు మాత్రము హరికథామృతమును పానముచేయు చుందురు. అయారే! వారిభాగ్య మేమనిచెప్పుదుము!' అని భగవచ్చరిత్రము వినవలయునన్న కుతూహలముతోఁ బలుకునట్టి శౌనకమునీంద్రుని వాక్యముల నాలించి, సూతుం డిట్లనియె 'ఓ శౌనకా! పరీక్షిన్నరేంద్రుండు కురుజాంగలములను దేశములందు నివసించుచుఁ, దాఁ బాలించుచున్న దేశమునందుఁ గలి ప్రవేశించె ననినవార్త నాలకించి, యాతనితో యుద్ధము చేయఁ గుతూహలియై విలునమ్ముల చేఁబూని, నల్లని మేఘములవలెఁ బ్రకాశించు గుఱ్ఱములఁబూన్చిన రథంబు పయిఁ గూర్చుండి, తన సింహపతాక నెత్తించి, చతురంగ బలములను ఒరివేష్టించిరా, దిగ్విజయార్థంబు బయలువెడ లెను ఇట్లు బయలుదేఱి, పూర్వపశ్చిమ సముద్రములకును దక్షిణోత్తరసముద్రములకును సమీపముగా వ్యాపించియున్న భద్రాశ్వము, కేతుమాలము, హరివర్షము, హిరణ్మయము, భారతము మొదలగు వర్షమ్ములనెల్ల జయించి, పిమ్మట నుత్తరకురుభూములజయించి, శత్రుభూపాలురవలనఁ గప్పం బులఁగొనుచు, నచ్చటచ్చటఁ బెద్దలు కీర్తించు పూర్వుల

కీర్తి నాలకించుచు, సర్వ సంతతము నుతించు శ్రీకృష్ణ మాహాత్మ్యము విని మిగుల సంతసించుచుఁ దాను దల్లి గర్భంబులోనుండి యశ్వత్థామబ్రహ్మాస్త్రముచేఁ బీడితుఁ డగుచుఁ గృష్ణునిచే రక్షితుండగుటయు, యదుపాండవులు స్నేహము గలిగి వర్తించుటయు, వారు కృష్ణునియం దతి భక్తితోఁ జరించుటయు విని, మిగుల సంతసించి పరీక్షిత్తు ప్రీతిచే నేత్రములు వికసింప, నుదారబుద్ధియై కథలు వినిపించినవారి కమితబహుమానములు చేసెను. భక్తవత్సలుండయిన శ్రీకృష్ణుండు పాండవులందలి ప్రేమచే వారివిషయమయి సారథ్యము, మంత్రిత్వము, సభాపతిత్వము, దూతత్వము, రాజానువర్తనము, స్తోత్రము, నమస్కారము మొదలగువానిఁ జేయుటను స్మరించికొని, పరీక్షిన్మహారాజు ధర్మరాజాదుల ప్రవర్తనము ననుసరించి శ్రీకృష్ణుని పాదపద్మములను దన చిత్తమునందు నిలిపికొని ధ్యానించుచు నుండెను. ఇట్లు, ధర్మరాజాదుల ననుసరించి ప్రవర్తించుచున్న యీ మహారాజు నెదుట నొక చిత్రము జరిగినది. దెప్పెదను వినుము. ధర్మపురుషుఁడు వృషభరూపమును ధరించి యొక్క పాదమును నేల మోపి నడచుచుఁ, దనదాపునఁ గాంతి తొలంగి గోరూపమును దాల్చి పిల్లలేని తల్లివలె మిగుల దుఃఖించుచున్న భూదేవి నుద్దేశించి యిట్లు పలికెను 'ఓ తల్లీ! నీ దేహ మారోగ్యవంతమై యున్నదా? నీ కన్నులవెంబడిని నీరు కాలువలు గట్టుచున్నది! నీ మోము వాడి కాంతిఁ బాసియున్నది! నీ మనస్సు నేదియో విచారము బాధించుచున్నట్లు తలంచెద! నీ ప్రియబంధువుల కేమయిన నాపదలు వచ్చి

యున్నావా? లేక దుర్మార్గులగు శూద్రులు సన్నాంటికాలిచే నడిపించుచున్నారని దుఃఖించుచున్నావా? లేక యింకమీఁద నీవు సంకరజాతివారిచేఁ బాలింపఁబడుదు వని దుఃఖించు చున్నావా? ఓ తల్లీ! ఇంకమీఁద యాగములందలి హవిర్భాగములు దేవతలకుఁ జెందకుండ రాక్షసులు హరి తురని విలపించుచున్నావా? లేక పర్జన్యుండు వర్షింపఁడనియుఁ బంటలు పండవనియు, నీ బిడ్డలన్నము లేక బాధలపాలగుదురనియు, విచారించుచున్నావా? రాక్షసులవంటి దుష్టులచేఁ బీడింపఁబడు బాలకులును స్త్రీలును రక్షింపఁబడరని విచారించు చున్నావా? బ్రాహ్మణులందఱు కుత్సితకర్మములం దాసక్తులై యుండఁ దదాశ్రితమగు వేదమునకు దిక్కు లేదని విచారించు చున్నావా? లేక రాజులు దుష్టులై బ్రాహ్మణరక్షాతత్పరులు కాక పత్రింతురనియు, నందువలన బ్రాహ్మణులు దిక్కులేని వారగుదురనియు శోకించుచున్నావా? కలిచే సృజింపఁబడిన రాజలోకమునుగూర్చి విలపించెదవా? లేక దురాత్ములయిన క్షత్రియాధములు రాష్ట్రముల కుపద్రవము కలిగింతు రనియుఁ, దదీయపీడ సహింపలేక, జీవలోకము నిషిద్ధదేశంబులకుం జని యన్నాదులకుఁ బాటుపడుననియు దుఃఖించెదవా? కాక, నీకుఁ గంటకులగు దుర్మార్గులను జంపి భారము నంతటిఁ దొలఁగించి, నీ కమందసుఖములు కలిగించుచు మానవరూపధరుండై యింతదనుక నీయందుఁ జరించిన భగవంతుండు శ్రీకృష్ణుండు నిన్ను విడిచిపోవుటచే నతఁ డొనర్చిన మోక్షదాయకంబులగు చరిత్రంబులను దలంచుకొనుచు విలపించెదవా? దేవతలుసైతము బహుమానింపవలసిన

నీ సౌందర్యము బలవంతులలో కెల్ల బలిష్ఠమైన కాలముచే హరింపఁబడినదా? నాయందు దయయుంచి చెప్పుము. నీ విట్లు దుఃఖపడుటకుఁ గారణమేమి? ఓ తల్లీ! ఏ దుర్మార్గునిచే నీ విట్లు పీడింపఁబడితివి?' అని యిట్లు విడువక యడుగుచున్న ధర్మపురుషునిఁ జూచి భూదేవి యిట్లనియె 'ఓ ధర్మపురుషా! నన్నేల క్రొత్తగా నడుగుచున్నావు? నీకుఁ దెలియనిసంగతి యే మున్నది? సమస్తము నీకుఁ దెలిసినవిషయమే! పూర్వము నీవు లోకమునకు సుఖము కలిగించుచున్న నీనాలుగుకాళ్లతోఁ జరించుచు, నీ వేకారణమున నిప్పుడొక్కపాదముచేత నడుచుచున్నావో, యదియె నా దుఃఖకారణము. ఇంతకంటె నాకు రావలసిన కష్ట మేది కలదు? మును పటివలె నాకుఁగాని, నాయందున్న జనులకుఁగాని యిఁక సుఖమెట్లు కలుగును? సత్యముపల్కుటయుఁ, బరిశుభ్రతయు, నపరాధిజనుల సహించెడి స్వభావము కలిగియుంటయుఁ, దాయగంబును, బరిపూర్ణకాముం డగుటంబట్టి సకలవస్తుతిరస్కారమును, సంతోషంబును, నిష్కాపట్యమ్మును, మనోనిగ్రహంబును, బాహ్యేంద్రియనిగ్రహంబును, జగద్వ్యాపారోచితమగు నాలోచనమ్మును, నశనాదిరాహిత్యమ్మును, నిఖిలద్వంద్వనిరాసమును, నిష్ఫలవ్యాపారంబునుండి మఱలుటయు, శాస్త్రార్థతత్వంబు నెఱుంగుటయు, నాశ్రితులయనిష్టములఁదొలఁగించి యిష్టంబు లొనగూర్చుటయం దుపయోగించు జ్ఞానంబును, విషయనిస్పృహత్వంబును, సర్వనియామకత్వంబును, యుద్ధంబుల వెనుదీయ కుండుటయుఁ, బరాక్రమంబును, బలంబును, బెక్కు లపరాధంబు లున్నను విడిచి

యుపకారస్మరణంబును, స్వాతంత్ర్యంబును, నిపుణత్వంబును, గాంతిసంపద గలిగియుండుటయు, ధైర్యంబును, సాధుత్వంబును, సద్వ్యాపారంబును, ప్రాణమునకు స్వభావసిద్ధ సామర్థ్య మనఁదగు సహనంబును నన్నాదిజనితబలంబనఁదగు నోజంబును, జ్ఞానాదులం దుత్కర్షత కలిగియుండుటయు, గాంభీర్యంబును, స్థైర్యంబును, శాస్త్రవిశ్వాసంబును, యశంబును, బూజార్హత్వంబును, దేహాత్మాభిమానంబు లేకుండుటయు, నీ మొదలుగాఁగల మహాగుణములన్నియు శ్రీకృష్ణమూర్తియందుఁ బ్రకాశించుచుండెడివి. వెనుక వర్ణింపఁబడిన మహాగుణములు గలిగి శ్రీనివాసుఁడయిన శ్రీకృష్ణమూర్తి యిప్పుడు నన్ను విడిచిపోయె. అందుచేత, నీలోకమంతయుఁ గలిప్రేరితమై పాపభరితంబయి యున్నది. అట్టి యీ లోకమును జూచుటచే నాకు మిగుల దుఃఖము వొడముచున్నది. మఱియు దేవతలకును, మహామునులకును, సజ్జనులకును, పితృదేవతలకును, బ్రాహ్మణాదివర్ణములకును, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును, గోవులకును, నీకును, నాకును, నిక మీఁద నధికములగు బాధలు సంప్రాప్తము లగునని దుఃఖించుచున్నాను. బ్రహ్మాదిదేవత లే మహాత్ముని కడకంటిచూపులఁ బొందుటకు బహుకాలమ్ము తపమ్మాచరించిరో, శ్రీమహాలక్ష్మి తనకు నివాసస్థలమగు పద్మవనమ్ము విడిచి మిగుల ననురాగముతో నే భగవంతుని పాదపద్మమ్ముల నెల్లప్పుడు సేవించుచున్నదో, పద్మరేఖ, కులిశరేఖ, యంకుశరేఖ, ధ్వజరేఖ

మొదలగు శుభ రేఖలతో నొప్పుచున్న తన పాదపద్మములతో నా కృష్ణుఁడు నాయందుఁ జరించునంతటి భాగ్యము నాకు లేదని మిగుల వగచుచున్నాను. ఓ ధర్మపురుషా! శ్రీకృష్ణ మూర్తి నాయందుఁ జరించుచుండుటచే నేను మిగులఁ బ్రకాశించుచు, నన్ను మించిన లోకము లేదని గర్వపడుచుండెడి దానను. ఆ నా గర్వమంతయు నశించినది ఓ మహాత్మా! విష్ణుమూర్తి యదువంశమునఁ బుట్టి, నాకు మిగుల భారమును గలిగించుచున్న దుర్మార్గులగు రాజుల వంశములను నశింపఁ జేసెను మఱియు, నిన్ను నాలుగు పాదములచేత నడిపించెను. అట్టి మహానుభావుం డగు శ్రీకృష్ణమూర్తి నన్ను విడిచిపోయె నని మిగుల నేడ్చుచున్నాను ఆ ప్రేమము, ఆ దయారసము, ఆ మందహాసము, ఆ మనోహరగమనము, ఆ మృదువాక్యములు, శ్రీకృష్ణమూర్తికే కలవు గాని, పరులకుఁ గలవా? అట్టి కృష్ణుని వియోగమును యోగీశ్వరులే సహింపలేరు. మావంటి వారనఁగా నెంత? మఱియుఁ, గృష్ణమూర్తి తన పాదములను నాపై నిడి నడచునప్పుడు మోహావశనై, పులకాంకురములో యనునట్లు వెలయు సమస్త సస్యములతోఁ దులఁదూఁగుచుండెడిదానను' అని యిట్లు ప్రభాసతీర్థము నందు భూదేవియు, ధర్మపురుషుఁడును సంభాషించుచున్న సమయమ్మున, రాజర్షియైన పరీక్షిన్మహారాజు సమీపమునకు నేతెంచెను.

ఇది పదునాఱవ యధ్యాయము.



### కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట

అట్లు పరీక్షిన్మహారాజు వచ్చుచున్న సమయమున, నాతనికిఁ దామరతూఁడువలె మిగులఁ దెల్లని గోమిథునమును, నా గోమిథునమును దన్నుచు, దండహస్తుఁడయి రాజలక్షణములతోఁ గూడికొనియున్న యొక శూద్రుండును గనఁబడియె. ఆ గోమిథునములో వృషభము శూద్రునిచేఁ దాడింపఁబడుచు, మూత్రము విడుచుచు, భయము నొంది కంపించుచు, నొక కాలిని భూమిపై మోపి నిలువఁబడియుండెను. ఆ గోవుగూడ నా శూద్రునిచేఁ దన్నఁబడుచు, మిగుల దీనురాలయి బాష్పవిలమైన ముఖముతో, వత్సరహితయయి మిగులఁ గృశించియుండెను అట్లు సేయువానిని జూచి పరీక్షిన్మహారాజు కనకమయమయిన రథముపయిఁ గూర్చుండి, ధనుస్సు నెక్కిడి, మేఘగర్జనసమానమ్ములగు వచనమ్ముల నిట్లనియె. 'ఓరీ క్రూరుఁడా! ఈ లోకమంతయు నాచే రక్షితమగుచుండఁగా, బలవంతుఁడవగు నీవు బలము లేని యీ సాధుజంతువులఁ బట్టి యేల హింసించుచున్నావు! నీ వెవఁడవు ? వేషమునుబట్టి రాజువలెఁ గన్పించుచున్నావు గాని, యీ క్రూరకర్మములనుబట్టి యోజింప, నీవు శూద్రునివలెఁ గానవచ్చుచున్నావు. ఆ శ్రీకృష్ణమూర్తి యర్జునునితోఁ గూడ నీ భూమండలమును విడిచియుండుటచే మదమత్తుండవై, నిరపరాధమ్ములగు నీ సాధుజంతువుల దండించుచున్నావా! దండింపఁ దగని వీని దండించుటచే నీవు దోషివి కనుక, నిన్నుఁ దప్పక చంపెదను జూడు' అని పలికి, యా సమీపమ్మున నున్న వృషభమును గాంచి యిట్లనియె 'ఓ వృషభ రాజమా!

నీవు మృణాళనాళమువలె మిగులఁ దెల్లగా నున్నావు. పాదముల నన్నింటిని నేల మోపక, యొక్క కాలిచేతనే నడుచుచున్నావు. నీ వెవండవు? ఈ వృషభరూపముచేఁ జరించుచున్న నీ వొక దేవతవై యుందువని తోఁచుచున్నది. నీ దుర్దశ చూచినచో, నాకు మిగుల దుఃఖము వొడము చున్నది కురువంశసంభూతులమగు మాచేత నీ భూతలమ్ము రక్షింపఁబడుచుండ నింతకాలము నొక ప్రాణియు బాధ చేఁ గన్నీరు విడిచియుండలేదు ఇట్లుండఁగా, నీ కన్నులనుండి కన్నీరు వెలువడుచున్నది. ఇఁక నీకుఁగూడ నెంతమాత్రము భయములేదు నీవు దుఃఖింపవలసిన యవసరము లేదు. దుర్మార్గుఁడైన యీ వృషలుని నా వాఁడి బాణములపాలు చేసి, భూమిపై నిన్ను నాలుగు పాదములతో నడచునట్లు చేయుదును. దుష్టులను శిక్షింపఁ గంకణముగట్టియున్న నే నుండ, నీ వేడువ నేల?' అని పలికి గోరూపధారిణియగు భూదేవిని జూచి యిట్లనియె 'ఓ తల్లీ! నీ వెంతమాత్రము దుఃఖింపకుము తనరాజ్యమునందలి ప్రజలందఱు దుర్మార్గులచే బాధింపఁబడుచుండఁగా, నది తెలియక, రాజు మదోన్మత్తుం డయి వారల బాధలఁ దొలంగింపకపోయినచో, నా రాజాధముని యాయుర్దాయము, కీర్తి, భాగ్యములు, సమస్తము నశించునుగదా! ఓ తల్లీ! దుర్జనులచే బాధింపఁబడుచున్న సజ్జనుల బాధలఁ దొలంగించుటయె కదా మావంటి రాజులకుఁ బరమధర్మము. అట్లుండ, మేము దుష్టులను శిక్షింపక పోయినచో, మా జన్మ మేల? కాన, నీ దుర్మార్గునిఁ జంపి, నా పుట్టువును సఫలముచేసికొందును' అని భూమితోఁ బలికి,

వెండియు ధర్మదేవున కిట్లనియె 'ఓ ధర్మపురుషా! ఏ దుర్మార్గుఁడు నీ మూఁడు పాదములను కట్టియున్నాఁడు! అకటా! విష్ణుభక్తులమయిన మావంటి రాజుల రాజ్యము లందు నీవంటివారికి దుఃఖము కలుగఁగూడదు నీ కిఁక మీఁద శుభమగుఁగాక! నీవంటి సాధువుల కిట్లు బాధ గలిగించి యున్నవాఁడు బహుదుర్మార్గుఁడు. ఆ నీచుఁడు పాండవేయుల కీర్తికి నాశనము గలిగించుచున్నవాఁడు అట్టి దుర్మార్గుఁ డెవఁడో చెప్పిన, వానిని దప్పక వధింతును. మఱియు, నిరపరాధులయినవారికి బాధగలిగింప నెవ్వఁడు పాటుపడునో, యా దుర్మార్గునికి నావలననుండి తప్పక భయము గలుగక మానదు. నిరపరాధులయిన భూతముల కపరాధము చేసినవాఁడు, దేవేంద్రుఁడైనను వాని చేతులను మొదటి కిల్లను ఖండించెదను అట్లుచేసి, ధర్మస్థాపనము చేయుట మావంటి రాజులకుఁ బరమధర్మము, అధర్మపరులను శాసించు టయు, నార్తుల భయము తొలగించుటయు నివియె మాకుఁ గర్తవ్యములు.' అని పలుకుచున్న పరీక్షిన్మహారాజునకు ధర్మదేవుం డిట్లనియె. 'ఓ మహారాజా! పాండవుల గుణ సంపదకుఁ బట్టువడియెకదా! శ్రీకృష్ణుండు వారికి దూతయై కూడఁ బ్రవర్తించియుండెను. అట్టి పాండవుల వంశమందుఁ బుట్టినందులకుఁ దగినట్టుగా నీ వభయవచనములఁ బలుకు చున్నావు. పురుషశ్రేష్ఠా! ఎవనివలన దుఃఖకారణములు సంభవించుచున్నవో, యా పురుషుని మే మెఱుఁగము. ఆ దుఃఖ కారణముల నుద్దేశించి వాక్యభేదములచే మోహితులై పలువురు పలువిధంబుల మాహించుటయే దుఃఖకారణం

బిదియే యని చెప్పఁజాలము. కొంద ఱాత్మయే దుఃఖకారణ మందురు. కొందఱు జీవాదృష్టమె దుఃఖకారణ మందురు. మఱి కొందఱు పురాతనకర్మకలాపంబే కారణ మందురు మఱికొందఱు ప్రకృతిపరిణామరూపమగు స్వభావమే దుఃఖ కారణమందురు ఇంకొక కొందఱీశ్వరుఁడే దుఃఖకారణ మందురు. వేఱొక కొందఱు నిరూహంబును, వాక్కులచే నిర్దేశింప వలనుపడనిదియు నగు నొకానొక కారణమువలన దుఃఖంబులు కలుగుచున్నవని యందురు ఈ చెప్పిన దుఃఖ కారణములయం దేదియు నిశ్చయింపలేము వారివారి యభిమానముం బట్టియే నిశ్చయించుకొనవలసియున్నది కావునఁ, బ్రస్తుతము మాకు సంభవించిన క్లేశకారణంబును నీవే సూక్ష్మబుద్ధిచే నాలోచించి తెలిసికొనుము ' అని పల్కుచున్న ధర్మపురుషుని వాక్యంబులు విని, సమాహిత మయిన మానసంబుచే ధర్మపురుషుని యభిప్రాయంబును జక్కఁగ నాలోచించి, నిశ్చయించి, ఖేదమువిడిచి భూపాలుం డిట్లనియె 'ఓ ధర్మపురుషా! నీవు వృషభరూపమునుదాల్చిన ధర్ముండవు. నీవు సమస్తధర్మంబుల నెఱుంగుదువు. కావుననే, యాపదయందును దుఃఖకారణమును జెప్పలేదు నీ యభి ప్రాయము తెలిసినది. అధర్మకారి సమీపమందున్నను, నా పురుషుని నిరూపించి చెప్పినచో, ధర్మజ్ఞునకైనను తమాయధర్మకారి పొందవలసిన పాపమార్గమే సంభవించును. అందువలన, నీ వా కారణంబు నెఱిఁగియున్నను జెప్పలేదు. మఱియు, భగవత్సంకల్పము భూతలంబుల వచనంబులకును మనంబులకును దెలియరాదు కావున, వీఁడే యధర్మకారి

యని నిరూపించుట యధర్మమని నీ చెప్పిన వాక్యంబులవలనఁ దెల్లంబగుచున్నది ఓ మహనీయా! నీవు వృషభరూపంబు దాల్చిన ధర్మదేవతవు. అందువలననే సామాన్యవృషభంబులకుంబలెఁ గాక, నీకుఁ దపంబు, శౌచంబు, దయ, సత్యము నను నాలుగును పాదంబులై ప్రథితంబులైనవి అట్టి నీ పాదంబులలో మొదటి మూఁడును, నధర్మాంశములయిన స్మయ సంగ మదంబులచే నశింపఁజేయఁబడినవి. ఓ ధర్మపురుషా! సత్యం బను పాదంబు మాత్రమె మిగిలియున్నది. ఆనియొక్క పాదంబు, నధర్మరూపుం డయిన యి కలిపురుషుం డనృతముచే వర్ధితుండై, నశింపఁజేయఁ దలంపు గొని యున్నాఁడు. గోరూపధారిణియగు నీ భూకాంతయుఁ బూర్వము కృష్ణుండు దయాళుఁడయి దుష్టుల సంహరించి భారంబు తొలంగించి పద్మాదిరేఖలతో నొప్పుచున్న పాదంబులఁ దనపై నిడుటచే నెంతయు సంతోషంబుతో వర్తిల్లెను. పతివ్రతయగు నీ భూకాంత కృష్ణుఁడు తన్ను విడిచిపోవుటచేఁ గన్నీరువిడుచుచు, నికమీఁద దుర్మార్గులైన శూద్రులకు లోఁబడి, వారికి భోజ్యమనై యుండవలసివచ్చె నని కాఁబోలు దుఃఖించుచున్నది' అని యిట్లు మహారథుఁడయిన పరీక్షిన్మహారాజు ధర్మదేవతను, భూదేవిని నోదార్చి, యధర్మమునకుం గారణభూతుండయిన కలిపురుషుని సంహరించు నిమిత్తము నిశితమ్మగు నొక ఖడ్గమ్ము ధరించెను. ఇట్లు మహాకోపమ్మతోఁ గత్తిఁబట్టుకొని తన్నుఁ జంపవచ్చు రాజుంజూచి, యా కలిపురుషుండు రాజచిహ్నమ్ముల విడిచి మిగుల భయపడుచు, నతని పాదపద్మములపయిఁ బడి నమస్కరించె.

అంతఁ, బరీక్షిన్మహారాజు తనపాదములపైఁబడిన కలిం జూచి, దీనవత్సలుండును శరణ్యుండును గావున, వానియందు దయగలవాఁడయి చంపక, మందహాసముచేయుచు వాని కిట్లనియె నా పితామహుండయిన యర్జునుని కీర్తిని వర్ణించు నా సన్నిధియందు బద్ధాంజలివయిన నీకుఁ గొంచెమేనియు భయము లేదు నీవు పాపబంధుండవు కావున, నేను పరిపాలించుచుండిన దేశమందుఁ జరింపఁగూడదు. మఱియు, నరజీవుల దేహమందు వర్తించు నిన్ను ననుసరించియే లోభము, అసత్యము, చౌర్యము, పాపము, దుష్టత్వమురాచారమ్ములు, మాయాకలహమ్ములు, నిద్రాగర్వమ్ములు మొదలగు నధర్మసమూహ మంతయుఁ బొడముచుండును ఈ బ్రహ్మావర్తము సత్యమునకును, సమస్తధర్మములకుఁ బుట్టినిల్లు. మఱియు, నీ దేశమందు మునులందఱుఁ జేరి యజ్ఞస్వరూపుఁడగు కృష్ణుముద్దేశించి యజ్ఞములు చేయుచుందురు. శ్రీకృష్ణమూర్తి వార లొనరించెడి యాగమ్ములకు సంతసించి, వారల కమోఘములగు కోర్కుల నిచ్చుచు, సన్నిభూతములయం దంతరాత్మయై ప్రవేశించి ధారకుఁడయి, శాసకుఁడై వర్తించుచు, సమస్త స్థావరజంగమముల నంతరంగమందును బహిరంగమందును వ్యాపించి సంచరించుచున్న వాయువువలెనే ప్రవర్తించుచుండును. ఇట్టి బ్రహ్మావర్తదేశంబున నీవంటివాఁడు ప్రవర్తింపఁగూడదు.' అని యిట్లు పరీక్షిన్మహారాజుచే ననుశాసింపఁబడి కలి భయమున గడగడ వడఁకుచు, ఖడ్గపాణియై తనపాలిటి యమునివలె నున్న రాజుంజూచి యిట్లు పలికెను. 'ఓ సార్వభౌమా! నే నెక్కడ నిలిచియుండును? నీ సెలవు

చొప్పున నీవెచ్చట నుండుమన్న నచ్చటనే యుండుదును అచ్చటను ధనుర్బాణధరుఁడవయిన నిన్నుఁ జూచుచునే యుండుదును. ధర్మవేత్తా! నీ యనుశాసనమును బాలించుచునే మెలఁగుచుందుచుగాని, వేఱుకాదు. కావున, నా కేదయినఁ దావు చూపు మని పలుకుచున్న కలిపురుషునకు రాజేంద్రుం డిట్లనియె. 'ఓరీ! నీవు ప్రార్థించుచున్నావు కనుక, నీకు నివసింప స్థలములు చూపించెదను. ప్రాణివధము జరుగుచుండు స్థలమ్ములందును, జూదమాడుచుండెడి చోట్లను, మద్యపానము చేయుచుండు స్థలములయందును, స్త్రీసంగమములయందును సర్వదాచరించుచుండుము.' అనిపలికి, మఱికొన్ని స్థలములం జూపుమని వేఁడిన, కలిపురుషునకు సువర్ణము నొసంగెను. పిమ్మట వాఁడు మఱియు యాచింప, ననృతము, మదమును, కామమును, క్రోధమును, వైరమును ప్రవర్తిల్లుచుండు స్థానంబులుగా నొసంగి 'నీ వీ స్థలములందుఁ దప్ప మఱి యెచ్చటను జరింపఁగూడ' దని యాజ్ఞాపించిన, నాతనియాజ్ఞను గలిపురుషుఁడు తలయందుఁదాలిచి, యా స్థలములయందు మాత్రమే నివసించుచుండెను. ఓ మునులారా! వెనుకఁ జెప్పఁబడిన స్థలములయందు నధర్మభూతుఁడయిన కలి సంచరించుచుండును. కనుక, నాత్మసత్తనుగోరు పురుషుఁ డెప్పుడు నట్టి స్థలములందుఁ జరింపఁగూడదు. చరించినచో, వాఁ డంతమున స్థావరత్వము నొందును. మఱియు, ప్రజాపరిపాలన మొనర్చు రాజు ధర్మశీలుండయి యుండవలయుఁ గాన, నతఁ డెంతమాత్రము వెనుకఁజెప్పిన స్థలంబులఁ బ్రవర్తింపఁగూడదు. రాజట్లు ప్రవర్తించినచోఁ దత్పాలితులయిన ప్రజలు నట్లే వర్తించి

తుదకు నశింతురు. ఇట్లు పరీక్షిన్మహారాజు కలిపురుషుని నిగ్రహించి ధర్మదేవునకు తపశ్శౌచదయ లనెడి తక్కిన పాదత్రయం బొసంగి, భూదేవికిని సంతోషమును గలిగించుచు మిక్కిలి పోషించెను తరువాత నా పరీక్షిన్మహారాజు పూర్వము తనకుఁ బట్టముగట్టి యరణ్యమునకుఁ బోవు సమయంబున ధర్మరా జొసంగిన సార్వభౌమార్హ మయిన సింహాసనము నధివసించె. పిమ్మట చక్రవర్తియై విపులమయిన కీర్తితో నొప్పుచు, సార్వభౌమలక్ష్మితోఁ జెలంగుచుఁ బరీక్షిత్తు హస్తినాపురమందు మొన్నటివఱకు నివసించియుండెడివాఁడు. ఇట్టి మహానుభావుండయిన పరీక్షిత్తు మొన్నటివఱకీభూమండలమును బాలించుచున్నాఁడు. కావుననే మీరు సత్రయాగ మారంభించి నిర్విఘ్నముగాఁ జేయుచున్నారు. లేనిచోఁ, గలిచేత నీ సత్రయాగము ధ్వంసముచేయఁబడి యుండును.

ఇది పదునేడవ యధ్యాయము.

---

## పరీక్షిత్తు వేటకుఁ బోవుట శృంగిశాపము

ఓ మునులారా! ఎవఁడు తల్లిగర్భంబున నున్నకాలమున నశ్వత్థామ బ్రహ్మాస్త్రముచే దహింపఁబడియు, నద్భుతకర్ముఁడైన భగవంతుని యనుగ్రహమువలన మృతుండు కాలేదో, యెవఁడు భగవదర్పితమైన మానసముకలవాఁడగుటవలన బ్రాహ్మణశాపమువలనఁ బ్రేరితుండును, ప్రాణాపాయకరుండును, కావుననే భయంకరుండు నైన తక్షకునివలన

భయము పొందలేదో, యా మహారాజు పరీక్షిత్తు, దేహాము నందును, దదను బంధులయందును సంబంధము విడిచి శుకునకు శిష్యుండయి, భగవంతునియందు నిష్ఠగలిగి, తన కళేబరమును గంగాతీరమున విసర్జించెను. ఓ మునులారా! భగవంతునియందుఁ బ్రవృత్తిగలవారికి, మోహ మెట్లయినను గలుగనేరదు మఱియు, భగవంతుని కథామృతమును బానము చేయుచున్న వారికిని, దదీయ పాదపద్మములను స్మరించువారికిని, నవసానదశయందును దొందరపాటు కలుగనేరదు. కలి భూమియందుఁ బ్రవేశించినను, బరీక్షిత్తు రాజ్యము పరిపాలించునంత కాలమును, నతనియాజ్ఞ లోకమం దనువర్తింపఁబడునంత కాలము, నంతట సంచరింప సమర్థుండు కాఁడు. ఆ కలి యెప్పుడు ప్రవేశించె నని యడిగినఁ జెప్పెద వినుఁడు. ఏ దినమందు శ్రీకృష్ణుండు భూమిని విడిచెనో, యా దినముననే యధర్మకారణుండైన కలి భూమియందుఁ బ్రవేశించెను. ఇట్టి యధర్మకారణుండైన కలిపురుషు నేల చంపలేదందురా! కలియుగమునందు భగవత్కీర్తనాదులయినపుణ్యకర్మములు వేగముగా భగవత్ప్రాప్తిని గలిగించుననియుఁ, బాపములు మిక్కిలి వేగముగా ఫలవంతములు కావనియు, నిట్టిసారమును బరీక్షిత్తెఱిఁగిన కారణముచేతఁ గలి యున్నంతమాత్రమున నష్టము లేదని తలంచి, పువ్వులయందున్న తేనెను ద్రావి యా పువ్వులను నశింపఁజేయ నిష్టపడని తుమ్మెదచందమున, నా కలిపురుషుని గర్వమంతయు హరించి, వానిని జంపకుండ విడిచిపెట్టెనుజుఁడీ? మఱియు, నా కలిపురుషుఁడు ప్రమత్తులైన మానవులయందు నొదిఁగియొదిఁగి, తిరుగు తోఁడేలుచంద

మునఁ జరించుచుండునుగాని, యప్రమత్తులైన పండితుల యెడ నెంతమాత్రముఁ జరింపలేఁడు' అని చెప్పి తిరిగి సూతుం డిట్లనియె 'ఓ మునులారా! మీరు పరీక్షిత్తుచరిత్ర మడిగినారు వాసుదేవుని చరిత్రతోఁ గూడియున్న యా నరేంద్రుని వృత్తాంతమును మీకుఁ జెప్పితిని. మఱియు, భగవంతుని చరిత్రములు తప్పక చెప్పఁకొనఁ దగినవికదా! కావున, సద్భావమును గోరుచున్నవారు భగవంతుని కథ లెన్నిగలవో వాని నన్నిటిని దప్పక వినవలయు' నని పలికిన సూతునకు మునీశ్వరు లిట్లనిరి 'ఓ సూతా! మృతి చెందుటకు సిద్ధముగా నున్న మాకు భగవంతుని కీర్తి వినిపించి మమ్మును గృతార్థులను జేసి యున్నావు అందులకు మేము ప్రత్యుపకార మేమియుఁ జేయలేము ఇదిగో! నాశీర్వదించుచున్నాము. నీ విట్లు లోకుల కుపకారంబులు చేయుచుఁ బెక్కు సంవత్సరములు జీవింపుము మేము సత్రయాగము చేయుచున్నారము ఈ యాగమునందు హోమముచేయు కాలమునఁ బొగలు మిగులవ్యాపించి మా శరీరములను బడలునట్లు చేసినవి అట్టి సమయమున మహానుభావుండ వగు నీవు వాసుదేవుని పాదపద్మములందలి మకరందమును మా చేఁ ద్రావించి మా బడలికలను బోఁగొట్టినాఁడవు ధన్యుల మైతిమి. విష్ణుభక్తుఁడ వగు నీ సహవాసమునకు స్వర్గమైనను మోక్షమైనను సమానము లని చెప్పలేము, ఇట్లుండఁగా, విష్ణుభక్తుల సహవాసమునకు మానవుల యర్థకామాదులను సాటి తెచ్చుట యొక వెఱ్ఱితనము కాదా? కావున, నో సూతా! రసజ్ఞుఁడయిన మానవుఁడు మహాత్ములకు మిగుల నుత్కృష్ట

మయిన ప్రాప్యస్థానమును, ప్రాపకుండును, నాధారుఁడు నయిన భగవంతుని కథల వినుటయం దెవ్వఁడు తృప్తి చెందును? ఎవ్వఁడును దృప్తి చెందఁడు. మఱియు, బ్రహ్మాది దేవత లైనను యోగీశ్వరులైనను భగవంతుని గుణసముద్రము పారమును జెందలేరని చెప్పవలసి యుండఁగా, మావంటి సామాన్యులా! భగవంతుని గుణముల పారమును బొంది తృప్తి చెందఁగలరు? భగవద్గుణకర్మముల తత్త్వము నెఱింగిన వాఁడవగు నో సూతా! భగవంతుఁడే ముఖ్యాశ్రయముగాఁ గల నీవు మహనీయులకుఁ బ్రాప్యము, బ్రాపకుండు, నాధారుఁడు నైన భగవంతుని చేష్టితములు విపులములును, విను వారిని బవిత్రము చేయునవియుఁ గాన, వినఁ దలంపుగల మాకు విస్తరించి తెలుపుము. మహాభాగవతుండును, మహా బుద్ధియు నగు పరీక్షిత్తు శుకుఁ డుపదేశించిన పురాణము వలన సంభూతమయిన జ్ఞానంబుచే భగవంతుని పాదమూల మును జేరెనని వినియున్నాము. ఆ పురాణమునే మాకుపదే శింపుము అది చెప్పువారికిని, వినువారికిని నిరతిశయ పుణ్యమును గలిగించునది. దానితో సమానములయిన పురాణములు లేవు. అందు ముముక్షువుల కుపయోగించు విషయములు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నవి. దానిని విన్నవారికిని, ఒఠించువారికిని, నత్యుత్కృష్టమగు భగవద్భక్తి యోగమందలి నియమము సంప్రాప్త మగును. అది యపరి చ్ఛిన్నమగు స్వరూప స్వభావములు గల భగవంతుని దివ్య చేష్టితములచే సంయుతమైనది. కావుననే భగవద్భక్తులకు మిగుల మనోహరమయినది. కావుననే మేము వినఁదలఁచి

యున్నాము.' అని యడుగుచున్న మునులంజూచి, తన్ను భగవత్కథయందుఁ బ్రవృత్తుం జేసినందుల కానందించి యిట్లనియె 'మునులారా! మేము సంకరజాతివారమయినను, జ్ఞానముచేతను, బ్రాయంబుచేతను, బెద్దలగు మీవంటివారి కనువర్తనీయుల మగుటచేఁ బ్రశస్తజన్మము కలవారమయితిమి. మిక్కిలి పూజనీయులయిన మీవంటివారలు వినుచుండఁగా, భగవత్కథల నేవకర్ణించుట సంభవించినది. అది దుష్కులమందుఁబుట్టితి ననెడి మనోవ్యథను వేగముగాఁ దొలంగించుచున్నది మఱియు, మహాత్తములయిన మీవంటివారికిఁ జెప్పుట సంభవించుటచేతనే నేఁడు కులమం దుద్భవించితి మన్న విచారము తొలంగుచుండఁగాఁ, బూజనీయుండకుఁ బ్రాప్యము ప్రాపకుఁడు నాధారుఁడు నగు విష్ణుమూర్తి నామముల నుచ్చరించుటచే, నా దుష్కులత్వ ప్రయుక్తమయిన విచారము తొలంగు నని వేఱ చెప్ప వలయునా? మఱియు, నా విష్ణువు జ్ఞానవైరాగ్యాది గుణములచే నిండినవాఁడు. అతఁ డనంతములయిన శక్తులు గలవాఁడు. కావున, దుష్కులత్వసంబంధమయిన దోషము హరింపఁదగిన శక్తి కలుగుటలో సందేహము లేదు. అతఁడు స్వరూపముచేతనే యనంతుండు. మఱియు, నంతములేని గుణములు కలవాఁడగుటంబట్టియు ననంతుఁడని పిలువఁబడుచున్నాఁడు. విష్ణువుతో సమానముగా గుణములు కలవాఁడు కాని, యతనికంటె నధికమయిన గుణములు కలవాఁడు కాని లేఁడు. లక్ష్మీదేవి బ్రహ్మాదిదేవతలు తన్నుఁ గోరుచున్నను వరింపక, విష్ణువు తన్నుఁ గోరకపోయినను, నతని

పాదపద్మములందున్న పరాగమును సేవించుటయె విష్ణువు నిరుపమానగుణుఁడనియు, సర్వాధికుండనియు స్థిరపఱుచు చున్నది. మఱియుఁ, బూర్వము బ్రహ్మ సమర్పించిన పూజాజలము నా విష్ణువు వామపాదాంగుష్ఠమువలన స్రవించుచు గంగానదియయి, యింద్రాదిలోకపాలురతోఁ గూడిన ప్రపంచంబును బవిత్రముగాఁ జేయుచున్నది. ఇదియే భగవన్మహిమ యనంత మనుటకుఁ జాలును. ఇట్టి మహాగుణ గణములు గల ముకుందునికంటె లోకమున భగవంతుఁ డను నామమునకుఁ దగినవాఁ డన్యుఁ డెవఁడు కలఁడు? ఎవ్వండును లేఁడు. ఇంతేకాక, యీ ముకుందునియం దనురక్తులయి పండితు లింద్రియంబుల జయించి, యాకస్మికముగానే దేహమందును, దేహానుబంధులగు దారసుతాదులందును వేరుపాఱియున్న ప్రేమను వదల్చికొని, హింసచేయనీయకుండ శమదమాది గుణములు గలిగించు నాల్గవదియగు పరమ హంసాశ్రమమును బొందుచున్నారు. అనంతమాహాత్మ్యముతో నొప్పుచున్న యట్టిభగవంతుని మాహాత్మ్యమును వర్ణింప నాకు శక్తిచాలదు ఓ జ్ఞానాధికులారా! మునులారా! భగవన్మాహాత్మ్యము చెప్పవలయు నని మీరు నన్నడిగినారు. ఆ భగవంతునిమహిమ నాబుద్ధి కెంతవట్టు గోచరమగునో యంతవట్టు వర్ణించెదను. పక్షులు లాకాశమున స్వబలము ననుసరించియే పఱ్వెడుచు, బలము క్షయించినచో వెనుకకు మఱలుచున్నవి. అట్లే పండితులును స్వబుద్ధిబలమునకుఁ దగినంత భగవన్మహిమనే విషయముగాఁ జేసికొనుచు,

బుద్ధిక్షయము గాఁగానే మఱలుదురు. * పక్షులును బండితుల బుద్ధులును దమబలము తఱుఁగుటచేతనే మఱలుచున్నవి కాని, యంతకుఁబైని యాకాశ భగవన్మహిమంబులు లేక పోవుటచేఁగాదు.

### పరీక్షిన్మహారాజు శమీకుని యాశ్రమమునకుఁ బోవుట

పరీక్షిన్మహారాజొకప్పుడు విల్లునమ్ములఁ గొని, వనమునకుఁబోయి మృగయావిహారంబు సలుపుచు, మృగముల ననుసరించిపోయి యలసి దప్పిచేతను, నాఁకలిచేఁతను బీడితుఁడయి, యెచ్చటను జలాకరము గానకపోవుచు, శమీకుని యాశ్రమంబు చొచ్చి యతనిం గాంచెను. అమ్ముని యొకచో నాసీనుండయి శాంతుండయి నేత్రముల నిమీలనము చేసి యుండెను. అతఁ డింద్రియములను, ప్రాణమును, మనస్సును, బుద్ధిని, నాయా వ్యాపారములనుండి మఱలించెను. కావుననే బాహ్యవ్యాపారమునుండి మఱలియుండె. మఱియు, నతఁడు జాగ్రత్స్వప్నసుషుప్తు లనఁబడు నవస్థాత్రయమునకుఁ బరుండై, యాత్మానుసంధానముచే బ్రహ్మవిషయకమయిన భావన చేయుచుండెను. కావుననే, వికారములు చెందక వర్తిలుచుండెను మఱియు, మిగులఁ బొడవగు జటాసమూహ మతనిశరీరమును గప్పియుండెను. ప్రశస్తమైన మృగచర్మము నతఁడు ధరించియుండెను ఆతనిముఖము తాలువులు మిగులఁ

---

* ఇందులకుఁ బ్రమాణము శ్లో॥ ఇషుక్షయాన్నివర్తంతే, నాంతరిక్ష క్షితిక్షయాత్ । మతిక్షయాన్నివర్తంతే నగోవిందగుణక్షయాత్ ॥ అని యెఱుంగునది

గృహించియుండెను. అట్టి మునీశ్వరుని సమీపించి రాజు మంచి మాటలతో నిట్లనియె. 'ఓ మునివర్యా! నేను బరీక్షిత్తను రాజేంద్రుఁడను, వేఁటకై వచ్చితిని. మిగుల దప్పిగొని యున్నాను నాకుఁ గొంచెము జలమిమ్మని యడిగెను. కాని, యా మునీంద్రుఁ డతనిఁ గుశల మడుగ లేదు. కూర్చుండ నాసన మీలేదు అర్ఘ్య మొసంగ లేదు. కావున, నా భూపా లుండు ముని తన్ను హేళనముచేసినట్లుగా భావించి, మిగులఁ గ్రుద్ధుండాయె. మఱియు, నా రాజు క్షుధచేతను, దప్పిచేతను బీడితుం డగుటంబట్టి, మ నివిషయమై పూర్వమం దెప్పుడును జనింపని ద్రోహమును, గోపంబును నతనికి జనించినవి.

### పరీక్షిత్తు శమీకుని మెడలో సర్పశవమును బడవైచుట

అంతఁబరీక్షిన్నరేంద్రుం డాముని తన్ను గౌరవింపక పోవుట యొక గొప్ప యవమానముగా భావించి, మిగులఁ గోపము తెచ్చుకొని, యా సమీపమునఁ జచ్చిపడియున్న యురగకళేబరమును మెల్లనఁ దన వింటి కొప్పుతోఁ దీసి మునీశ్వరుని మెడలో వేసి, తన పురమునకు వెడలెను. ఓ మునులారా! అట్లురగకళేబరమును వేసిన యాతని యభిప్రాయమేమో చెప్పెదను, వినుఁడు ఈ మునీశ్వరుండు నిజముగా సమాధియందుండి, యట్లు నేత్రములు మోడ్చియున్నాఁడా? లేక యీ తుచ్ఛులైన రాజులతో మాట్లాడ నేల? అని మిథ్యా సమాధిని దాల్చియున్నాఁడా! ఇందలి నిజము తెలియకున్నది. ఈ యురగకళేబరము నీతని మెడలో వైచినయెడ, నితని సమాధి నిజమో కల్లయో

తెలియవచ్చునని యోచించి, యా ముని నట్లవమానపఱిచి తన పురమునకుఁ బోయెను. అనంతర మా మునీంద్రుని కుమారుఁడు శృంగి యనువాఁడు తనతోడి బాలురతో విహరించుచుఁ, దన తండ్రియగు శమీకునియొద్దకువచ్చి, రాజు తనతండ్రికిఁ జేసిన యవమానమునకు మిగుల దుఃఖించి యిట్లు పలికెను 'ఆహా! ఏమీ! రాజుల యధర్మము చూడుఁడు! బలిపెట్టిన యన్నముతిని పోతరించిన కాకులవలె నీ క్షత్రియాధములు క్రిందుమీఁదుఁ జూచుకొనక, మహా గర్వంబునఁ జరించుచున్నారే? మఱియు, రాజులు బ్రాహ్మణులకు దాసులవంటివారు. యజమానుల యిండ్లను గాచికొని యుండు కుక్కలవలె, నీ రాజులు బ్రాహ్మణుల నెల్లప్పుడు కాచుచుండవలసినవారు అట్లుండ, ద్వారమును గాచికొని యున్న కుక్క యజమానుని గఱచిన చందంబున, దాస భూతుండగు నారా జెవ్వఁడో తనకు యజమానునివంటి యీ మునికే యపకారము చేసినాఁడు. ఇటువంటి దురాత్ములను శిక్షించెడి (శ్రీ) కృష్ణమూర్తి యీ భూమిని విడిచిపోయిన తోడనే, యీ రాజాధములు మర్యాదల నతిక్రమించి మిగులఁ గావరముతోఁ జరించుచున్నారు. ఇఁకమీఁద నిట్టి దుష్టపథులను నేను శిక్షించుచుందును! నా సామర్థ్య మందఱుఁ జూచి యాశ్చర్యము చెందుదురుగాక!'

### శృంగి పరీక్షిత్తునకు శాపం బొసంగుట

అని పలికి కోపముచేఁ గనుఁగొనలు కెంపుగదుర నతి త్వరితగమనంబున నచ్చటికి సమీపమున నున్న కౌశికీనది కేఁగి, జలమువార్చి, వజ్రాయుధముతో సమానమయిన శాప

మొసంగ నిశ్చయించి "ఏ దుర్మార్గుఁడు తన మర్యాద నతిక్ర
మించి మాతండ్రి గళంబున నురగకళేబరంబు వైచెనో, యా
దుర్మార్గుండు నేఁటి కేడవదినమునఁ బాముచేఁ గఱవఁబడి
చచ్చుఁగాక' యని శపించెను. ఇట్లు శపించి, యా శృంగి తన
యాశ్రమంబునకు వచ్చి తండ్రి మెడపైనున్న యురగకళేబర
మును జూచి మిగుల భయపడి యెలుంగెత్తి యేడ్వఁ జొచ్చెను.
ఇట్లు దుఃఖించుచున్న తనకుమారుని రోదనధ్వని నాలకించి,
యా శమీకమహర్షి సమాధి చాలించి, కన్నులువిచ్చి, తన
మెడయందు వ్రేలాడుచున్న సర్పశవమును బాఱవైచి,
కుమారుం జేరఁబిలిచి యిట్లనియె. 'ఓకుమారా! నీ వేడ్చుటకుఁ
గారణ మేమి? నీ కెవ్వఁ డపకారమును జేసియున్నాఁడు? ఇఁక
నీ కెంతమాత్రము భయము లేదు దుఃఖమును మాని దుఃఖ
కారణమును దెలుపుము' అని యడుగఁగా, తండ్రినిజూచి
కుమారుండు దుఃఖము చాలించి, రాజువచ్చి యురగశవమును
వైచుటయుఁ, దాను శాపమిచ్చుటయు నివేదించినఁ, దండ్రి
కొడుకు చేసిన పని కెంతమాత్రము సంతసింపక యిట్లనియె.

### శమీకుఁడు శృంగియిచ్చిన శాపము విని కుమారునిఁ గోపించుట

'ఓ కుమారా! ఆ రాజు చేసిన యపరాధము శపింపఁ
దగినంత పెద్దది కాదు. అట్లుండఁగాఁ, బాముకాటుచేఁ జావు
మని పట్టపురాజు నేల శపించినావు? ఆ వచ్చినరా జెంత
మంచివాఁడో నీకుఁ దెలియునా? ఓయీ! నీబుద్ధి యింకను
రాగద్వేషాదులను విడువలేదు. రాజు ప్రజల కపకారము చేసి
నను ప్రజలు రాజున కపకారముఁ జేయరాదు. నరదేవుఁ

డనఁ బ్రత్యక్షవిష్ణువని తలపోయుము. అట్టిరాజును నీవు గౌర వింపఁదగినది. శాప మీరాదు. ప్రజలందఱు శత్రువులకు దుస్సహమయిన యీ రాజుతేజంబుచేతనే రక్షింపంబడు చున్నారు. మఱియుఁ బ్రజలందఱు నెందులనుండియు భయము చెందక, సుఖములఁ జెందుచున్నారు. ఇట్లు లోకమునకు సుఖావహుఁడయినరాజు చంపఁదగినవాఁడు కాఁడు ప్రత్యక్ష విష్ణు వనఁదగు రాజు లేనిచోఁ, బ్రజ లెవరిచేతను రక్షింపఁ బడక, తోఁడేళ్ల మందలచే వ్యాప్తమయిన గొఱ్ఱెమందవలె క్షణమాత్రములోనే నశించును. లోకము నశించిన మన కేమి? అందువేసి, చెప్పెద విను రాజు లేనిచోఁ బ్రజలు చోర ప్రాయులయి యొకరిధనము నొకరు హరించుచుఁ బరస్పరము కొట్టుకొనుచుఁ, దిట్టుకొనుచుఁ, దుదకుఁ జంపుకొందురు. మఱియు, స్త్రీలను బశువులను బలాత్కారముగాఁ గొని పోవుదురు వర్ణాశ్రమాచారములతోఁగూడ వైదికకర్మము లన్నియు నశించును మానవుల యార్యధర్మము లన్నియుఁ బోలియును ఇట్లు ధర్మములు నశించుటంజేసి, ప్రజలందఱు నర్థకామములం దాసక్తి గలిగియుందురు. కావున, నీకుఁ గుక్కలకువలెను, కోతులకువలెను, మానవుల జాతులు సంకీ ర్ణము లగును ఇట్టి యపాయంబులు పొరయుటకెల్ల ముఖ్య కారణము రాజు లేకపోవుటయే. కావున, లోక సుఖావహుం డయిన రాజును జంపుటవలన, మహాపాపము సంభవింపక మానదు అట్టిపాపము కులనాశకమయి మనలఁ బొందు చున్నది. ఆ పరీక్షిన్మహారాజు సామాన్యరాజులవంటివాఁడు కాఁడుగదా! అతఁ డుత్తమమగు భరతవంశమునఁ బుట్టి

నాఁడు. అతఁడు నశించుచున్న వర్ణాశ్రమధర్మములను దిరిగి స్థాపించినాఁడు. అతఁడుదారకీర్తి. అతఁడు సార్వభౌముఁడు. అతఁడు యథావిధిగ నశ్వమేధయాగముల నాచరించెను. అతఁడు పరమభాగవతులలో నుత్తముఁడు. అట్టి మహానుభావుఁడు దప్పిగొని దీనుండయి నీరముకోసము మన యాశ్రమమునకు వచ్చినప్పు డాతనికి నీరమిచ్చుట యుచితమా? శాపమిచ్చుట యుచితమా? నీవే చెప్పుము.' అని పలికి, భగవంతు నుద్దేశించి 'ఓ దేవా! నా పిల్లవాఁడు వివేకహీనుండయి బుద్ధిచాపల్యముచేఁ దగినంత యపరాధము లేకపోయినను, నీ భక్తుని శపించినాఁడు కావున, నాయందు దయయుంచి యందువలనఁ గలిగెడి పాపమును నశింపఁజేయుము ఓకృష్ణా! ఓ గోవిందా! నీకు నమస్కారము. లోకమున భాగవతోత్తములు తమ్మునొరులు పరిభవించినను, వంచించినను, నిందించినను, శపించినను, గొట్టినను, సహించియుందురే కాని, కోపించి ప్రత్యపకారము చేయుటకు నంగీకరింపరు గదా! అని శమీకమహర్షి తనకుమారుఁడు చేసిన పనికయి మిగుల వగచుచుండెనుగాని, తన్ను నా రాజేంద్రుఁ డవమానించెనని కొంచెమేనియుఁ జింతింపఁడాయెను. ఓ మునులారా! లోకంబున సజ్జనుల యాత్మ రాగద్వేషాదిగుణముల కాధారమయి యుండదు. కావున, సాధువులు తమ కొరులు సుఖంబులఁ గూర్చినపుడు సంతసింపరు. దుఃఖంబులు గలిగించినపుడు వ్యథ చెందరు.

ఇది పదునెనిమిదవ యధ్యాయము,



### పరీక్షిన్మహారాజు విచారించుట

అట్లు పరీక్షిన్మహారాజు పురముప్రవేశించిన యనంతరము మిగుల విచారించుచుం దా నొనర్చిన కార్యమును నిందించుకొనుచు నిట్లు తలపోయం దొడంగె. 'అక్కటా! సమాధి నవలంబించి గూఢ తేజస్కుం డయి నిరపరాధియయి యున్న యా మునీశ్వరుకంఠమునందు సర్పశవమును వైచి యేల యవమానించితిని? అయ్యో! నాయొనర్చిన దుష్టకార్యమువలనం శాపము రాక మానదు నే నా దుష్టకార్య మొనరించి కేవలము బ్రాహ్మణునే యవమానింపలేదు భగవంతుని గూడ నవమానించితిని. ఆ పాపమువలన వేగముగానే దురంతమగు కష్టము సంప్రాప్తమగును. ఆ దుఃఖము నా చేసిన పాపకార్యము పోవుటకే సంప్రాప్త మగుచున్నది కావున, నది నాకు హితకరమయినదే! అది తప్పక పాప శుద్ధిని జేయుంగాక! మఱియుం దాదృశదుఃఖము నాకు సంప్రాప్త మగుటచే నింకమీంద నెప్పుడు నట్టి పాపకార్యముల నాచరింప నా బుద్ధి చొరకుండుంగాక! మఱియుం గ్రుద్ధుండగు నా మునిశాప మను నగ్నిహోత్ర మిప్పుడే నా కులమును, నా రాజ్యమును, నా ధనములను దహించిన దహించుంగాక. అట్లయినను, నా బుద్ధి తిరిగి దేవతలకును గోవులకును బ్రాహ్మణులకును నపకారము చేయకుండును గాక!' అని విచారించుచు, మునిశాపప్రకారమున సప్తమ దివసంబునం దక్షకుని విషానలంబువలనం దనకుం జావు సంప్రాప్తమగు నని విని, విషయాసక్తుండయిన తన కావిషానలము విరక్తికారణ మగుచున్నందుల కెంతయు సంత

సించుచునే యుండెను. అనంతరము పరీక్షిన్నరేంద్రుండు రాజ్యంబు విసర్జించి, భూలోక సుఖములుగాని, స్వర్గలోక సుఖములుగాని నిత్యములు గావని నిశ్చయించికొని, హరిపాద భజనము నిరతిశయ పురుషార్థసాధన మనుకొని, తులసీ మిశ్ర మగు విష్ణుమూర్తి పాదపద్మ పరాగముచేఁ బ్రశస్తమగు నుదక ప్రవాహముకలదై, పావనమైనదై, లోకపాలురతోఁ గూడ సమస్తజనములను బవిత్రము చేయునదై యున్న గంగానది తీరమునకుఁబోయి, యచ్చట ననశనాదివ్రతము చేకొని ముక్తిఁజెంద నిశ్చయించి దేహమునందును, దదను బంధులయందును నభిలాషవిడిచి, మానసంబు నితరవస్తువు లందుఁ జొరనీయక మౌనియయి, ముకుందుని పాదారవిందము లను ధ్యానించెను. అంతట, లోకములను బవిత్రముచేయఁ జాలినవారును, మహానుభావులు నగు మునీశ్వరులు తమ శిష్యులతోఁ గూడికొని, యా పరీక్షిన్నరేంద్రునొద్దకువచ్చిరి. ఆ మును లందఱుఁ దఱుచుగాఁ దీర్థయాత్ర యనెడి మిషచేఁ దీర్థములందుఁ దిరుగుచుందురు. వా రట్లు తిరుగుట తీర్థము లను బవిత్రములుగాఁ జేయుటకేకాని, వేఱుకాదు. అచ్చటికి తెంచిన మును లెవ్వరనినఁ జెప్పెద వినుఁడు. అత్రియు, వసిష్ఠుండును, చ్యవనుండును, శరద్వంతుండును, అరిష్టనేమియు, భృగుమహామునియు, అంగిరసుండును, పరాశరుండును, విశ్వామిత్రుండును, పరశురాముండును, ఉచథ్యుండును, ఇంద్రప్రమదుండును, ఇధ్మవాహుండను, మేధాతిథియును, దేవలుండును, వార్ష్ణిషేణుండును, భారద్వాజుండును, గౌత

ముండును, పిప్పలాదుండును, మైత్రేయుండును, ఔర్వుండును, గవషుండును, నగస్త్యుండును, వ్యాసుండును, భగవంతుఁడగు నారదుండును, వీర లేతెంచిరి. మఱియు, దేవర్షిశ్రేష్ఠులును, బ్రహ్మర్షిశ్రేష్ఠులును, రాజర్షిశ్రేష్ఠులును, నరుణాదులగు ఋషీశ్వరులును బరీక్షిత్తుం జూడవచ్చిరి. అంత, నా మహారాజు వచ్చిన మహామునులం జూచి లేచి యెదురుగాఁ జని వారల కండఱికిఁ బూజ లిడి నమస్కార మొనరించి, వారు సుఖాసీనులైన పిమ్మటఁ దిరిగి నమస్కరించి సమీపమున నిలిచి బద్ధాంజలియై చిత్తము వివేకముగలిగి వర్తిలుచుండఁ, దాఁ జేయఁదలంచినదానిని విన్నవించుకొనెను. 'ఓ మునులారా! మేము రాజులలో నెల్ల ధన్యులము కానిచో, మహాత్ములయిన మీవంటివారి యనుగ్రహంబులకుఁ బాత్రుల మగుదుమా? మఱియు, బ్రాహ్మణులయిన మీవంటివారి పాదముల సేవింపఁగలిగిన పరిశుద్ధికి దూరస్థమయిన రాజవంశము నిందనీయ మగు కర్మములు గలది కదా! అకటా! ఎంతకష్టము! భయంకరమయిన సంసారమందు సక్తుండనయి, యీ బాధలచేత విసుకుచెంది నేనెట్లు దేహమును విసర్జింతునని యాలోచించు సమయమున, నాకు విప్రశాపము ముక్తికారణమయినది. మిక్కిలి యహంకారమమకారములతో వర్తించుచుండు నాయందు శ్రీహరి కరుణించి బ్రాహ్మణశాపరూపమున నన్ను ముక్తసంగునిగాఁ జేసినాఁడు. నాకు వేగముగా నభయ మీఁగలఁడు. ఓ మహర్షులారా! మీరును, గంగయు, భగవంతునియందు దృఢమయిన చిత్తముగల నన్ను సేవకునిగా గ్రహింతురుగాక! బ్రాహ్మణ

శాపముచేఁ బ్రేరితుఁడయి తక్షకుఁడు నన్ను వంచించి మిక్కిలి కఱచుఁగాక! అందులకు నే భయపడను. మీరు విష్ణుకథలను గానము చేయుఁడు, భగవంతునియందు భక్తియు దద్భక్తులయం దనురక్తియు నాకుఁ గలుగున ట్లనుగ్రహింపుఁడు. ఇఁకమీఁది జన్మములందు నాకు విష్ణుభక్తియు, హరి కథాశ్రవణాసక్తియు, హరిపాదసేవయుఁ గలుగున ట్లనుగ్రహింపుఁడు' అని నమస్కరించి ప్రాచీనాగ్రములయిన దర్భలయం దుపవిష్టుండై, యుదఙ్ముఖుఁడై కూర్చుండె. అంత, నరేంద్రునిఁజూచి మునులందఱు నుతించిరి. ఆ సమయమున దేవత లతిసంతోషముతో నాకసమందుండి దేవదుందుభులు మ్రోయించి పుష్పవర్షము గురియఁదొడఁగిరి. అంత, నచ్చటికి వచ్చిన మునులందఱుఁ బ్రశంసనీయములయిన గుణములు గల రాజునుజూచి నుతించి, ప్రజల ననుగ్రహించుటే స్వభావముగాఁ గలవారు కాన, నతని వ్యవసాయమును 'బాగు బా' గని యనుమోదించి యిట్లనిరి. 'ఓ రాజసత్తమా! మీరు భగవంతుని పార్శ్వమును గోరుచు, సమస్తరాజులచేతను సేవితమగు సార్వభౌమ సింహాసనమును విడుచుచున్నారు. నిత్యము శ్రీకృష్ణమూర్తిని సేవించు మీవంటి భక్తు లిట్లు చేయుట యొక చిత్రముకాదు. రాజా! సంతతము భక్తుల సేవించు నీ వీకళేబరమును విడిచి, శుద్ధసత్త్వమయమును, నపహతపాప్మత్వము మొదలగు గుణాష్టకము ప్రాదుర్భావము చెందుటకుఁ దావైన పరలోకమును బొందునంత కాలము మే మందఱము నీ సన్నిధియందే యుండుము' అని పలికిరి. అంతఁ బరీక్షిత్తు వైషమ్యములేక యమృతము లొలుకుచు, నాకయగంభీరములై, నిష్క-

పటములై యున్న మునుల వాక్యములు విని, తనహితము గోరు చున్న వారికి నమస్కరించి, హరిచరిత్రములను విన దలంచి యిట్లుపలికె. 'ఓ మునులారా! మీరు సత్యలోకంబున మూర్తీభవించిన వేదములవలెం బ్రకాశించుచు, నలుదిక్కుల నుండి వచ్చియున్నారు. మీకు మావంటివారల ననుగ్రహించుటయే స్వభావము. అంతేకాని, మీకీ లోకమందుం గాని, పరలోకమందుం గాని ప్రయోజన మేమియు లేదు కావున, మిమ్ము నమ్మి చేయందగిన యొక యర్థ మర్థించు చున్నాను. చావ సిద్ధముగా నున్న మానవులు కరణత్రయము చేతను జేయందగిన కర్మ మేదికలదో, దానిని మీరు చక్కఁగ విమర్శింపుఁ' డని యడిగిన పరీక్షిన్నరేంద్రు వాక్యములకుఁ బ్రత్యుత్తరం బొసఁగ నాలోచించుచున్న సమయమున, స్వేచ్ఛచే భూమండలమునం దిరుగుచు దైవయోగముచే వ్యాసమహాముని పుత్త్రుండగు శుకయోగి యాస్థలమున కు వీతెంచెను

### పరీక్షిన్మహారాజు నొద్దకు శుకుండు వచ్చుట

ఆ శుకయోగి యావనవంతుఁడే. అయిన నించుకేనియుఁ గోరిక లేనివాఁడు. అతనికి నే యాశ్రమసంబంధమైన చిహ్నమును లేదు. అతం డవధూత వేషముతో నొప్పుచుండెను. అతఁడు బ్రహ్మాత్మక స్వానుభవముచేతనే యానందించువాఁడు. అతఁడు హేళనము చేయందగిన వేషముతో నుండెను. కావుననే బాలురు గేలిచేయుచు, నతనిఁ బరివేష్టించియుండిరి. అతని కరచరణాద్యవయవములు మిగుల

సుకుమారము లయియుండెను. అతనికిఁ బదునాఱు వత్సర
ముల వయస్సుండును. ఆతనిముఖము మిగుల సుందరముగా
నుండెను. అతఁడు సుందరవిశాలనేత్రములు కలవాఁడు.
అతఁడు పొడుగైన నాసిక కలవాఁడు. అతఁడు సమానమయిన
కర్ణములు గలవాఁడు. అతఁడు సొగసయిన కనుబొమలు గల
వాఁడు. అతనికంఠము శంఖమును బోలియుండెను అతని
కంఠముక్రింద నున్న యెముకలు మాంసముచేఁ గప్పఁబడి
మిగుల రమ్యముగా నుండెను. అతని వక్షస్థలము మిగుల బలిసి
యెత్తుగా నుండెను. అతని నాభి సుడిని బోలియుండెను. వళులచే
నాతని యుదరము మిగుల సుందరముగా నుండెను అతఁడు
కామక్రోధాదులను విడిచిపెట్టినట్లు, వస్త్రమును విడిచి
యుండెను. అతని కేశపాశము శరీరమును గప్పుచు వ్రేలాడు
చుండెను. అతని బాహువులు జానువులపర్యంతము వ్రేలాడు
చుండెను. అతని దేహావర్చస్సు మిగుల రమ్యముగా
నుండెను. అతని సౌందర్యము సమస్తభామినులకుఁ గోరఁదగి
యున్నది. అట్టి మహానుభావుఁడగు శుకమహాముని జూచి
యచ్చటనున్న మునీశ్వరులందఱు తమతమ యాసనముల
నుండి లేచిరి. అంతటఁ బరీక్షిన్మహారాజు తన యాసనము
నుండి లేచి నమస్కరించి, యథావిధిగఁ బూజల నొనరిం
చెను. ఓ శౌనకాదులారా! వెఱ్ఱివానివలె వర్తించుచు దిగం
బరియై వచ్చుచున్న శుకుని హేళనచేయుచు, నాతని వెంబ
డించి వచ్చుచున్న తెలివిలేని బాలురును, స్త్రీలును, వారిచే
సత్కృతుండగుటఁ గనుఁగొని మహాత్మునిగాఁ దలంచికొని
వెనుకకు మఱలిచనిరి. అనంతరము పరీక్షిన్మహారాజు శుకునికి

మున్నతాసన మర్పించి, తానుచితాసనమందుఁ గూర్చుండెను. మహాత్ములలో మహాత్ముఁడయిన శుకమహాముని రాజిచ్చిన యాసనంబునఁ గూర్చుండి దేవర్షులతోను, రాజర్షులతోను, మహామునులతోను నిండియున్న యా సభయందు శుక్రాది గ్రహములతోను ఋక్షములతోను నిండిన యాకాశమందున్న చంద్రునివలెఁ బ్రకాశించుచుండెను. ఇట్లు సభయందుఁ బ్రకాశించుచు మిగుల శాంతుఁడయి, మహాప్రతిభాశాలియయి యున్న శ్రీశుకుని సమీపించి, పరీక్షిన్నరేంద్రుండు భక్తి మెయి శిరస్సుచే నమస్కరించి, యతని వాక్యముల విన శ్రద్ధాళుఁడై బద్ధాంజలియై మధురవాక్యములచే నిట్లనియె 'ఓ మహామునీంద్రా! క్షత్రబంధుఁడ మయిన మేము మీవంటివారిని సేవింపఁదగినవారము. మీదర్శనమువలన నేనుఁ గృతార్థుండనైతిని. తమసేవచే నా పాపములన్నియు నశించినవి. తమవంటి మహాత్ములు మావంటివారియొద్ద కతిథిరూపముగా వచ్చుట మా పూర్వపుణ్యముకాదె? తమవంటి మహాత్ముల సంస్మరణమే సంస్మరించు లోకుల గృహమును బవిత్రముచేయుచున్నదని చెప్పవలసియుండగాఁ, దమవంటివారి దర్శనముచేసి సేవించి పాదజలమునుగొని సంభాషించుటవలన, మేము పవిత్రులమైతిమని వేఱ చెప్పవలయునా? తమవంటి యోగిసత్తముల సన్నిధియందుండుటచే మహాపాతకములైనను, విష్ణువు సాన్నిధ్యమువలన రాక్షసులు నశించునట్లు తత్కాలమందే నశించుచున్నవి. పూర్వము శ్రీకృష్ణుండు మా తాతలగు పాండవులకు స్నేహితుఁడయి మేనమఱందియయి, సముద్రమధ్యగతంబగు భూమికంతకు రాజులనుగాఁ జేసినాఁడు.

కనుక, నా కృష్ణుఁడు వారలవంశమందుఁ బుట్టిన నాయందుఁ గూడ నట్టి బాంధవ్యముంచినాఁడని చెప్పుట కెంతమాత్రము సందియము లేదు. అట్లే కానిచో, నవ్యక్తగతుండవగు నీ దర్శనము మావంటి మానవాధములకు లభించుట యెట్లు? మహానుభావుండవగు నీదర్శనము లభించుటవలన, నా యభిమతము లన్నియుఁ దప్పక సిద్ధించిన వనియె చెప్పవచ్చును. యోగీశ్వరులకెల్లను గురుండవగు నిన్ను నొక్కటి యడుగుచున్నాను. నేఁడో రేపో చావసిద్ధముగ నున్నవాఁ డేమిచేసిన సంసారమును బాయఁగలఁడు? వాఁ డేమి జపింపవలయును? వాఁ డేమి వినవలయును? ఏమి పఠింపవలయును? ఏమి భజింపవలయును? వానికి విపర్యయములైన వున్నచోఁ జెప్పుము. నేను నేఁటి కేడవదినమునఁ జావ సిద్ధముగా నున్నాను. అట్టి నా కెట్లు ముక్తిగలిగెడిని గృహమందుండు గృహస్థులకు గోవును బిదుకునంతమాత్రపుఁ గాలమును గనిపింపవుగదా! అట్టి నీవు మాకు దర్శనమిచ్చుట, మా పూర్వపుణ్యము కాదే!' అని యిట్లడిగిన పరీక్షిన్మహారాజుతో శ్రీశుకుండిట్లనియె.

ఇది పందొమ్మిదవ యధ్యాయము.

ప్రథమస్కంధము సమాప్తము.





శుభమస్తు

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భాగవతము

## ద్వితీయస్కంధము

ఓ శౌనకాదులారా! పరీక్షిన్నరేంద్రుఁ డడిగిన ప్రశ్నములకు శ్రీ శుకులవారిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి. దానిం జెప్పెదను వినుఁడు. శుకయోగీంద్రుండు రాజున కిట్లనియె 'ఓ రాజవర్యా! నీ యడిగిన ప్రశ్నము నీకేకాక, లోకమున కంతకు హితకరమగుచున్నది. అందుచే నది మిగుల శ్రేష్ఠమైనది నీ ప్రశ్నము నాత్మజ్ఞానపరు లందఱు మెచ్చుకమానరు మఱియు, నీ ప్రశ్నము పురుషులకు వినఁదగినవియు, మననము చేయఁదగినవియు, ధ్యానింపఁదగినవియు నగు నర్థములలోనెల్ల మిక్కిలి యుత్కృష్టమైనది ఓ రాజేంద్రా! కేవల మైహికాముష్మికఫలములందే యాసక్తులయి, యాత్మతత్త్వ మెఱుంగఁజాలని గృహస్థులకు శ్రోతవ్యాదులగు నంశంబులు పెక్కులు గలవు. ఇట్లున్నను, గృహస్థులైన మానవు లాత్మజ్ఞానమును లేశమైన నెఱుఁగఁ బ్రయత్నింపక, రాత్రిందివములు వ్యర్థముగాఁ బుచ్చుచున్నారు. రాత్రియంతయు నిద్రచేతను, మైథునముచేతను,

బుచ్చుచున్నారు. పగలంతయు దారపుత్త్రాదులను బోషింపఁ బాటుపడుచుఁ గాలము గడుపుచున్నారు. 'అనిత్యమైన కటుంబమును బోషించుట కేల పాటుపడవలయును? ఆత్మజ్ఞానమునకై ప్రయత్నింపఁగూడదా' అందు వేమో! గృహస్థులై యున్నవారి కట్టిబుద్ధి పుట్టదు. జీవాత్ముఁ బరికరమయిన దేహామునందును దారపుత్త్రాదులయందును మిగుల నాసక్తుఁడై యుండి, తనతండ్రి మొదలగువారి మరణమును గన్నులారఁజూచియు. దేహాదులను నిత్యములనుగా భావించుచుండునే కాని, అనిత్యములని భావింపఁడు. కావున, నే నొక ముఖ్యాంశమును జెప్పెదను, వినుము. భగవంతుండు సమస్తభూతములయందు నంతర్యామియై చరించుచున్నాఁడు. అతఁడు సకలలోకములను నియమించుచున్నాఁడు. * అతఁడు తన్ను నాశ్రయించువారి పాపములనెల్ల నశింపఁ జేయుచున్నాఁడు. అట్టిభగవంతుఁడే నుతింపఁ దగినవాఁడు. పరమపదము నపేక్షించువారి కాభగవంతుఁడే స్మరింపఁదగినవాఁడు. అతని చరిత్రములే వినఁదగినవి. ఓ రాజేంద్రా! సాంఖ్యమువలనఁగాని, తనకు విహితమయిన ధర్మమునందలి నియమమువలనఁగాని, మరణకాలమునందు నారాయణస్మరణ చేయుటయే జన్మమెత్తినందులకు లాభము. అది లేనిచో, జన్మము వ్యర్థమే సుమీ! అందుచేతనే సనకాది మునీశ్వరులందఱు వేదబోధితములయిన కామ్యకర్మముల విధినిషేధములకు లోఁబడక, పరబ్రహ్మము నుపాసించి, యాశ్రిత

* ఈ చెప్పుటచే భగవంతుఁడు స్వప్రాప్తికి విరోధులయిన యుపాసకుల దురితముల నివర్తించువాఁడని తెలియుచున్నది.

దురితహారుఁడయిన హరిసద్గుణముల ననువదించుకొనుచు నానందము నొందుచుందురు. ఈ భగవంతుని నామముల వర్ణనము ప్రధానముగాఁ గలది భాగవతమని చెప్పఁబడు. అట్టి భాగవత మొకటి కలదు అది సమస్తబ్రహ్మవిదులకు సమ్మతమయినది ఆ భాగవతమును మా తండ్రియగు వ్యాసముని కలియుగాదియందు రచించి నా కుపదేశించె. నేను పరబ్రహ్మమందు సక్తమయిన చిత్తముగలవాడనయి నను, భగవంతుని లీలలు నా చిత్తము నాకర్షించుటచే, నే నా యాఖ్యానము నభ్యసించితిని. నీవు హరిపాదభక్తుండవు కనుక, నీ కాభాగవతము నుపదేశించెదను వినుము. మావంటి యాత్మారాములకే యీ భాగవత ముపాదేయమై యుండ, మోక్షార్థులు తప్పక వినవలసినదని వేఱె చెప్పనేల? ఈ భాగవతమును నీవు శ్రద్ధాళుండవయి వినినచో, నీకు విష్ణుసేవయందు నాసక్తి హెచ్చును. మోక్షము నపేక్షించిన నీకు మోక్షము తప్పక సిద్ధించును. తాపత్రయముచే నిర్వేదమును బొంది మోక్ష మపేక్షించి ఫలాపేక్షలేని కర్మయోగమందు నిష్ఠులై యున్నవారికి హరినామములఁ గీర్తించుటయు, హరిస్వరూపమును జింతించుటయుఁ దప్ప, ముక్తిసాధనంబులేదు. "స్వల్పమగు నాయువుగల నేనీపని సాధింప నెట్లు పూనుకొందు" ననెడి సందియము విడువుము. దారసుతాదులందు సక్తుండై యున్నవానికిఁ బెక్కుసంవత్సరముల యాయుర్దాయ మున్నను, దెలియఁబడకయే పోవుచుండు. ఏమి ఫలము? కాని, కాలము వృథాపోవుచున్నదని తెలిసినవానికి ముహూర్తమాత్ర మయినఁ జాలును ఆ

ముహూర్తకాలములోనే మోక్షము నిమిత్తము ప్రయత్నించి పొందవచ్చు. ఇందుల కొక దృష్టాంతము చెప్పెద వినుము.

### శుకుఁడు ఖట్వాంగుని చరిత్రమును జెప్పుట

పూర్వము ఖట్వాంగుఁ డను నొకరాజర్షి గలఁడు. అతఁ డేడుద్వీపములను బాలించునట్టి బలాఢ్యుఁడు. ఇట్లుండ, దేవతలు రాక్షసులతో యుద్ధముచేయలేక భయపడి వచ్చి యా ఖట్వాంగునిఁ దమకు సహాయుఁగాఁ వేఁడిరి. అంత నా రాజసత్తముఁడు వారలతో నేఁగి రాక్షసులను జంపి, సురలకు జయము కలిగించెను. అందులకు సురలు సంతోషించి యతని కిష్టమగు వరము వేఁడినచో, నిచ్చెద మనిరి. అది విని యా రాజు మిగుల సంతసించి 'యింక నా కాయుర్దాయ మెంతకాలమున్నదో యోచించి చెప్పుఁడు. ఇదియె నా కోరెడి వర మని' చెప్పెను. అంత సురలు యోచించి చూచి, నీకిఁక ముహూర్తమాత్ర మాయుర్దాయము కలదని చెప్పిరి. ఆ మాటలు విన్నతోడనే ఖట్వాంగుఁడు విమానము నధిరోహించి వేగముగాఁ దనపురంబునకు వచ్చి తన రాజ్యమును, గురులను, గుఱ్ఱములను, భార్యలను, ధనములను విడిచి గాఢమగు వైరాగ్యము గలవాఁడయి భగవంతుఁజేరి యతని నామస్మరణముచేయుచు, రెండుగడియలలోపలనే కైవల్యమును జూఱగొనియెను. రెండుగడియలలోపలనే హరిని భజించి మోక్షము చెందియుండఁగా, నేఁడుదినములకాలము జీవింపఁగల నీవు హరిని భజించి మోక్షము చెందుట యెంత [illegible] కావున, స్వల్పకాలములోనే పరలోకసాధన

ములను సంపాదించి మోక్షము చెందుము. ఓ రాజేంద్రా! పురుషున కంత్యకాలము వచ్చినప్పుడు, భయమును బాఱఁదోలి సంగమును విడిచి, దేహమందును, దారపుత్త్రాదులయందును, గృహములందు నున్న ప్రేమను మొదటికి నశింపఁజేయవలెను * అట్లు వైరాగ్యమును బొంది తన గృహమునుండి వెలువడి సన్న్యసించి జితేంద్రియుం డయి దారపుత్త్రాదులను విడిచివచ్చితి ననెడి విచారమును మానవలెను. † పిమ్మటఁ బుణ్యనదియందుఁ దానమాడి పవిత్రమయిన యొక విజనస్థలమును జేరి యథావిధిగా దర్భలచేఁ గల్పింపఁబడియున్న యాసనమునందుఁ గూర్చుండవలెను [1]సకలలోకములను బవిత్రముచేయు నకారాదులగు మూఁడక్షరములు గల యోంకారమును మనస్సుచేత నభ్యసించునది రేచకము పూరకము కుంభకము ననెడి ప్రాణాయామములచే నుచ్ఛ్వాసనిశ్వాసరూపమయిన వాయువును జయించునది. పిమ్మట బ్రహ్మబీజమగు నోంకారమును స్మరించుచు మనస్సు నిర్బంధించునది [2]శరీరము రథమువంటిది. జీవాత్మయే యొకరథికుఁ డనఁదగినవాఁడు. బుద్ధి సారథివంటిది మనస్సు కళ్లెమునకుఁ గట్టిన త్రాళ్లవంటిది ఇంద్రియములు బలిసిన గుఱ్ఱములవంటివి. విషయములు వీథులవంటివి. కావున, బుద్ధియనెడు సారథిచేత మనస్సనెడి త్రాళ్లచే బంధింపఁ

---

* ఇందువలన నష్టాంగయోగములలోను నియమాంగము చెప్పఁబడినది

† ఈ చెప్పుటచే నాసనరూపమగు నంగము తెలుపఁబడియె

1 ఇందువలనఁ బ్రాణాయామరూపమగు నంగము తెలియవచ్చెడిని

2 ఇందువలనఁ బ్రత్యాహారరూపమగు నంగము స్ఫుటమగుచున్నది

బడియున్న యింద్రియములనెడి గుఱ్ఱములను విషయము లనెడి వీథులయందుఁ బర్విడకుండ లాగి పట్టి యుంచునది. [1]వెనుకటి జన్మములయందుఁ జేసిన పుణ్యపాపకర్మముల సంబంధముచే బలాత్కరింపఁబడుచున్న మనస్సును సదసద్వివేకమందు నిపుణతగల బుద్ధితోఁగూడ నిశ్చలముగా నుండునట్లు చేయునది. [2]అట్లు నిర్బద్ధమయి సంపూర్ణశుభాశ్రయముగల మనస్సుచేఁ బూర్ణధ్యానాసక్తుఁడయి వాసుదేవుని మహాభావయవమును ధ్యానింపవలయు. [3]అంతట, బాహ్యవిషయములం దనుభవములేని మనస్సు స్థిరముగా నుంచి, యప్పుడు భగవంతునికన్న నితరమయిన పదార్థమును దేనిని స్మరింపఁగూడదు. సత్వరజస్తమోగుణములచేత మూఢమయిన మన స్సెవనిధ్యానమువలన నిర్మలత్వమును జెందుచున్నదో, మనస్సునకుఁ బ్రసాదమును గలిగించు నావిష్ణుస్వరూపమందుఁ జిత్తమును ధారణాయోగమువలనఁ జరింపఁజేయవలెను. ధారణాయోగమును ముందుగా సంపాదింపవలయు. ఆ ధారణ రజస్సుంబువలనఁ గలిగిన రాగాదికమును నశింపఁజేయును. అది యలవడినతోడనే మంగళకరమయిన యాధారమును ధ్యానించువానికి భక్తియోగము సంప్రాప్తమగును' అని చెప్పుచున్న శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. 'ఓ మునీంద్రా! ధారణ యనఁగా నెట్టిది? అట్టిధారణ యే యాధారమందు నిలుచును? ఆ

---

1. ఇందువలన ధారణరూపాంగము ప్రకటిత మగుచున్నది.

2. ఇందువలన ధ్యానాంగము తెల్లమగుచున్నది.

3. ఇందువలన సమాధిరూపమగు నంగము తెల్లమగుచున్నది.

ధారణ యెట్టిగయినయెడల, పురుషునిమనస్సునందున్న మలిన మును బోఁగొట్టఁగలదు?' అని యడిగిన రాజునకు శుకయోగి యిట్లనియె. 'ఓ రాజా! నీవడిగినప్రశ్నము బాగుగ నున్నది ధారణ కాధార మేదియో చెప్పెద వినుము పురుషుఁ డాసన యోగమందు మిగుల నేర్పుగలవాఁడయి రేచకపూరకాదు లచే వాయువును సరింపఁజేసి, దారపుత్త్రాది సంగమును విడిచినవాఁడయి పదునొకండగు నింద్రియములను జయించి, భగవంతుని విరాడ్రూపమందు బుద్ధిచే మనస్సు నిలుప వలయును భూత భవిష్యద్వర్తమాన కాలంబులం దున్న ప్రపంచకమంతయు నే భగవంతుని విరాడ్రూపమందుఁ గనఁబడుచున్నదియో, యట్టి విరాడ్రూపమే భక్తియోగావ లంబియగు పురుషుని మనస్సునకు విషయము. మఱియు, భగ వంతుని యండకోశాఖ్య మగురూపము భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్త్వము అనఁ బడెడి యేడావరణములచే నొప్పుచుండును. అట్టి శరీరమందు వెలయుచున్నవాఁడు విరాట్టని చెప్పఁబడును. ఆ పురుషుఁడు భక్తిసాధనమగు ధారణాయోగమునకు నాధారమయి యుండును మఱియు, నమ్మహాత్మునికిఁ బాతాళలోకం బఱి కాళ్లయి యున్నది. రసాతలంబు పార్ష్ణిపాదాగ్రములయి యున్నది. మహాతలంబు చీలమండలు, తలాతల మమ్మహా త్ముని జంఘలు. సుతలంబు జానువులు వితలాతలము లను లోకము లా మహాపురుషుని యూరువులు అతని కటిప్రదే శము భూలోకము. ఆకాశ మా యాదిపురుషుని నాభీకూపం బని చెప్పుదురు. అతని వక్షస్థలంబు గ్రహనక్షత్రాదులతోఁ

గూడిన నక్షత్రలోకమందురు. మహర్లోకం బా పురుషుని కంఠము. జనలోకం బాతని ముఖ మని చెప్పుదురు. తపోలోక మా మహాత్ముని ఫాలభాగ మందురు. సత్యలోకము నతని శిరస్సుగా వర్ణింతురు. ఇంద్రాది దేవత లందఱు నతని బాహువులని యందురు. దిక్కు లతని కర్ణములు. శబ్దం బతని శ్రవణేంద్రియము. అశ్వి దేవత లతనికి నాసాపుటంబులు. గంధ మతని ఘ్రాణేంద్రియంబు అగ్నిహోత్రుం డతని వదనంబు. ద్యులోక మతని నయనంబులు. సూర్యుం డతని చక్షురింద్రియము రాత్రిందివము లతని కనుఱెప్పలు, బ్రహ్మపద మతని భ్రూవిక్షేపము జలంబును, దదభిమాని యగువరుణుండు నతని తాలువులు. రసం బతని జిహ్వేంద్రియంబని పలుకుచుందురు. సమస్తవేదంబు లతని సంభాషణము లని చెప్పుదురు. యముం డతనికోఱపల్లయి యొప్పుచుండును. దారపుత్త్రాదులయందున్న స్నేహకళ లమ్మహాత్ముని దంతములని వర్ణింతురు. సకలలోకములను మోహింపఁజేయుచున్న మాయ, యా పురుషుని మందహాస మని వక్కాణింతురు. ఆ మహాత్ముని కటాక్షవీక్షణములే సమస్త ప్రపంచక సృష్టియని వచింతురు లోభము, సిగ్గు నీరెండు నప్పురుషుని పెదవు లందురు. ధర్మం బా పురుషుని స్తనము లందురు. ధర్మమార్గంబు నతని వెన్నని చెప్పుచుందురు. మఱియుఁ బ్రజాపతి యతని గుహ్యంబనియు, మిత్రావరుణులు వృషణంబులనియు, సముద్రము జఠరమనియు, గిరులు శల్యసమూహములనియు, నదులు నాడీసమూహమనియు, వృక్షంబు లతని రోమములనియు, వాయువు లా మహాత్ముని నిశ్వాసములనియుఁ, గాల మతని గమనమనియుఁ,

బ్రాహ్మణుల కర్మజాలం బాపురుషుని సంచారము లనియుఁ జెప్పు దురు. మఱియు, మేఘంబు లతని కేశములనియు, సంధ్య లత నికి వస్త్రమనియు, చందురుఁడు సర్వవికారముల కాశ్రయ మయిన యతని మనస్సనియు, సర్వాత్మం బమ్మహామహుని హృదయకమలమనియు, రుద్రుం డతని యహంకారమనియు, మహత్తత్త్వ మతని విజ్ఞానశక్తి వ్యవసాయ శక్తులనియు, వశ్వములు గజములు నుష్ట్రములు మొదలగునవి యప్పురు షుని గోళ్లనియు, పశుమృగాదు లమ్మహాత్ముని శ్రోణి యనియు, సమస్తవిధములగు పక్షిజాలము లప్పురుషుని శిల్ప నైపుణ్యంబు లనియు, మంత్రము లతని బుద్ధి యనియు, మానవు లా పురుషుని వాసస్థల మనియును, గంధర్వాది దేవత లందఱు నతనిస్వరము లనియుఁ, బ్రహ్లాదముఖు లతని స్మృతి యనియుఁ బలుకుచుందురు. ఇదియునుంగాక, యమ్మహామహు నకు బ్రాహ్మణులు ముఖంబులనియు, క్షత్రియులు భుజంబు లనియు, వైశ్యు లతనియూరువు లనియు, శూద్రు లతని పాదము లనియును, వసురుద్రాది దేవతల యభిధానము లతని నామము లనియు, ద్రవ్యములు హవిర్భాగంబు లనియు, యజ్ఞ ప్రయోగము లతనిక్రియ లనియు మహామునులు వచించుచుందురు. భగవంతుని యవయవస్థానము చెప్పితిని. అతని రూపమందు బుద్ధిచేర్చినవారికి నితరమగు వస్తువు కాన రాదు. * స్వప్నములందొకఁడైన జీవాత్మ తన పుణ్యపాపాను సారముగాఁ బరమాత్మచే సృజింపఁబడి, తనకుమాత్రమే

* ఇట జీవాత్మ దృష్టాంతము, అధిష్ఠాతయై యుండుటలో మాత్రమేయని యెఱుంగునది.

యనుభవింపఁదగినవయి యా స్వప్నకాలమందె నశించుచు నుండు పదార్థముల నధిష్ఠించి రాజ్యాభిషేకము, శిరశ్ఛేదము మొదలగు సుఖదుఃఖాదుల నెట్లనుభవించుచున్నాఁడో, యట్లె భగవంతుండు ప్రత్యక్షము, అనుమానము మొదలగు సర్వవిధ జ్ఞానములచేతను ననుభూతములయిన పదార్థము లన్నింటియందు నధిష్ఠించియుండియు, శ్రుతదృష్టము లగుచున్న చేతనాచేతనములు శరీరముగాఁగలవాఁడయ్యు, నా శరీర సంబంధమగు దోషంబులఁబొందక * స్వరూపముచేతను, గుణములచేతను నిర్వికారుండయి † యానందాశ్రయుఁడును, నానందస్వరూపుఁడును నగుచున్నాఁడు. అట్టి భగవంతుని సేవింపవలయును. మఱియు, నబ్రహ్మాత్మకమగు స్వతంత్రవస్తు వొక్కటియు లేదని తెలిసియున్న వివేకముచే నట్టివస్తువును గల్పించికొని, యందు సక్తుండయి యుండరాదు. ఒక వేళ నట్టివస్తువులం దాసక్తుఁడయినచో, వాఁడు తప్పక సంసారమందుఁ బడుచున్నాఁడు

ఇది ప్రథమోఽధ్యాయము.

---

అని చెప్పి, యన్నరేంద్రునకు శ్రీశుకుండు వెండియు నిట్లనియె. ఓ రాజా! సృష్టికిఁ బూర్వమందు బ్రహ్మదేవుఁడు వెనుక నేఁ జెప్పిన ధారణ నవలంబించెను. చతుర్ముఖుండట్లు

---

* స్వరూపగుణములచే నిర్వికారుఁడనుటచే నచిత్తునవ వ్యావృత్తి కలిగినది.

† భగవంతుఁ డానందాశ్రయుఁడు నానందస్వరూపుఁడు నని చెప్పుటచే జీవునికి వ్యావృత్తి కలిగినది.

ధారణ నవలంబించి, దానిచే భగవంతునికి సంతుష్టి గలిగించి యతని యనుగ్రహమును బొంది, ‡ పూర్వకల్పమందు నశించిన సర్గవిషయక జ్ఞానమును దిరిగిపొంది, సంతసించి, తత్తద్వస్తు విషయకమైన జ్ఞానముగలవాఁడయి నిశ్చయాత్మకమగు బుద్ధితోఁ బ్రళయమునకుఁ బూర్వమందున్న సృష్టి ననుస

‡ ఇందులకు మూలము — "నష్టాం స్మృతిం ప్రత్యవరుధ్య" అని యున్నది అనఁగాఁ "బూర్వకల్పమందు నశించినస్మృతిని మఱలఁ బొంది" అని యర్థము ఈ చెప్పుటచేఁ బూర్వకల్పమందలి చతుర్ముఖుఁడే ప్రతికల్పమందు వర్తించుచుఁ బూర్వకల్పమందున్న సృష్టివిషయక జ్ఞానమును బొంది సృజించుచున్నట్లు తోఁచుచున్నది అయినను, బ్రతికల్పమందు నొక్కొక చతుర్ముఖుఁ డుండునని చతుర్ముఖులకు భేద మొప్పుటయే న్యాయ్యమని తోఁచెడిని ఏమన, ఆయాకల్పములందున్న చతుర్ముఖులు "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే" "తే బ్రహ్మలోకే తు పరాన్తకాలే పరామృతాత్పరిముచ్యంతి సర్వే" ఇత్యాది ప్రమాణములచే ముక్తి చెందుచున్నట్లు తెలియవచ్చుచున్నది. మఱియు "ఋషిమాద్యం న బధ్నాతి, పాపీయాంస్త్వాం రజోగుణః। యాత్మావసీదత్యస్మిం స్తేన రీయాన్ మదనుగ్రహః॥" అని భగవంతుండే చెప్పుటవలనఁ బ్రహ్మకుఁ దిరిగి సంసారప్రాప్తియు లేదు. కావునఁ జతుర్ముఖులు భిన్నులనియె చెప్పఁదగినది మూలమందున్న స్మృతిశబ్దమునకు సర్గవిషయక జ్ఞానమని యర్థము చెప్పుకొనవలయును ఓయీ! విరాట్పురుషుని ధారణాయోగము నవలంబించి భజించుటచేత, బ్రహ్మకుఁ బ్రపంచసృష్టి సామర్థ్యము కలిగినది ఆతనికిఁ దత్సామర్థ్యము కలిగినపిమ్మటఁ బాతాళాది లోకములను సృజించుచున్నాఁడు. ఆ పాతాళాదులు విరాట్పురుషుని యవయవములుగా నేర్పడినవి తాదృశావయవంబులు ముందు సిద్ధముగానిచో, విరాట్పురుష విషయకమయిన ధారణ సంభవింపదే? కనుక, ఏ యన్యో

రించియే సమస్త ప్రపంచకమును సృజించెను ఓ రాజా! మఱియొకసంగతి చెప్పెద, వినుము. లోకమున మూఢజనుఁడు శబ్దస్వరూపములయిన వేదములు చూపించుచున్న మార్గంబునం దిరుగుచుఁ దదుక్తములయిన కర్మముల నాచరించుచు, వానివలనఁ గలుగుచున్న స్వర్గాది సుఖంబులకు నాశించి, యందువలనఁ బరితుష్టి చెందియుండును. మఱియు, మాయామయమయిన ప్రపంచంబున వర్తించుచు, స్వర్గాది సుఖములకయి ప్రయత్నించుచు, మోక్షమునుగాని తత్సాధనములఁగాని పొందలేఁడు. సుఖము కలుగదు. ఓయీ! వేదము మాతాపితలకంటె వేలుమడుఁగు లధికమయిన వాత్సల్యము కలది ఇట్లుండ, వేదము నామము చేతనే యసారము లగు స్వర్గాదులు లభింపఁ, గర్మకలాపము చేయుఁడని బోధించి వంచించునా? అందువేని, వేద మట్లు వంచింపదు. ఆ వేదము తమోగుణప్రచురములును, రజోగుణ ప్రచురము

---

న్యాశ్రయదోషము వారించుటెట్లు? అని యందువేని, చెప్పెద విను. భగవంతుని నాభికమలమునుండి చతుర్ముఖుం డుదయించి తపమాచరించి భగవంతుని ప్రత్యక్షము గావించికొనినపిమ్మట, భగవంతుఁడు బ్రహ్మతో "భూయస్త్వం తప ఆతిష్ఠ విద్యాం చైవ మదాశ్రయాం। తాభ్యామంతర్హృది బ్రహ్మన్ లోకాన్ ద్రక్ష్యస్యపావృతాన్। తత ఆత్మని లోకేచ భక్తియుక్తస్సమాహితః। ద్రష్టాసి మాం తతం బ్రహ్మన్ మయి లోకాం స్త్వమాత్మనః॥ అని చెప్పఁ బోవుచుండుటచే, సృజింపఁబడు పదార్థములన్నియు బ్రహ్మకు దృష్టము అగుచున్నవి. కాన, నా పదార్థము లను భగవదవయవములుగాఁ గల్పించికొని, ధారణచే సృష్టివిషయక జ్ఞానమును, సామర్థ్యమును బొందుట సంభవించుచున్నది.

లును, సత్త్వగుణప్రచురములు నగు నీమువ్విధములను గూర్చియు బోధపఱుచును. కాని, కేవలము రజస్తమః ప్రచురములయిన స్వర్గాదులను సాధింపుఁడని యే బోధింపదు. ఇట్లుండఁ గొందఱు రజోగుణస్వభావులును, తమోగుణస్వభావులును సత్త్వగుణ స్వభావులకు ఫలమయిన మోక్షమునకు విముఖులై, తామపేక్షించిన స్వర్గాదిఫలముల తత్త్వము నెఱుంగక కామాసక్తిచే వివశులయి నశింతురు. కాని, బుద్ధిమంతులు కొందఱు వేదమునందుఁ జెప్పఁబడిన రజస్తమస్స్వభావములగు లోకములం దిష్టము లేక తత్సాధనములను విడిచి, కేవలము మోక్షమునకుఁ దగిన కర్మములను మాత్రమే చేయుచు, దేహధారణ కుపపన్నము లగుచున్నను, వన్నాదులందు సక్తుఁడుగాక, స్వర్గాదులు క్షయిష్ణువులని తెలిసికొని నామ మాత్రముచేతనే యసారములగు భోగ్యములు పొందఁబోక, ప్రయోజనము కలుగునంతకాలము నిట్లు ప్రవర్తింతురు. ఇంతియకాని, దేహధారణనిమిత్తము క్షుద్రఫలములకయి ప్రయత్నింపరు. దేహధారణకుఁ బూర్వకర్మానురూపమగు ఫలము తమకుఁ గలుగుచుండఁగా, దేహధారణనిమిత్తము చేయు యత్నమునందుఁ బరిశ్రమను జూచుచుండియు, నందులకై యేల ప్రయత్నింపవలెను? ఈ దేహధారణకుఁ దగిన పరికరమెట్లు లభించుచున్నది? అనిన చోఁ జెప్పెద విను శయనించుటకు విశాలములైన భూములుండఁగాఁ, దత్ఫలముల నిమిత్తమేల ప్రయత్నింపవలెను? స్వతస్సిద్ధమైన బాహువు తనకుండఁగాఁ దలగడలకయి యేల ప్రయాసము పడవలెను? అన్నముఁ దినుటకు దోసిలియుండగాఁ బలువిధములయిన

భోజనపాత్రములకై యేల శ్రమచెందవలెను? * తనకు దిక్కులే యుత్తరీయములై యుండఁగా, పట్టువస్త్రంబులకై యేల ప్రయత్నింపవలెను? మఱియు, మార్గమందు జీర్ణవస్త్ర ఖండములు లభింపవా? వానిని గౌపీనంబులఁగా నేల ధరింపరాదు? వృక్షములు తమ ఫలములచే నితరులఁ బోషించుచుండలేదా? ఆ ఫలములఁ దిని యేల జీవింపరాదు? నదులన్నియు నివురఁ బాఱినవా? లేదే! ఆ నదులందున్న జలమును ద్రావి యేల మనరాదు? పర్వతగుహలం దుండరాదని యెవ్వరయిన నిరోధించినారా? లేదే! ఆ పర్వతగుహలందేల శయనింపరాదు? ఇవన్నియు నొకవేళ లభింపకపోయినను, శరణాగతులను బోషింప భగవంతుండు లేఁడా? ఉన్నాఁడే! ఇట్లుండ, ధనమదముచేఁ గ్రిందుమీదుఁ జూడని తుచ్ఛుల నేల సేవింపవలెను. ఇట్లన్యథాసిద్ధము లగుచున్న వస్తువులనుగూర్చి చింతింపక, వానియందు విరక్తుండయి భగవంతుని భజింపవలయు. అతని భజించినచో, బంధము

---

*ఇందులకు మూలము —దిగ్వల్కలాదౌ సతి కిం దుకూలైః" అని యున్నది. అనఁగా, దిగంబరుఁడయి యుండరాదా! దుకూలములతో నేమి ప్రయోజనము? అని యర్థము వచ్చుచున్నది. అయినను, వల్కలాదు అను పదమున కుత్తరీయములని యర్థము చెప్పుకొని పైవస్త్రమునకు దిగంబరముండఁగా, దుకూల మెందుకు? అని నిర్వచించుట మంచిది. అట్లుకాక, దిగంబరియై తిరుగరాదా? యని యర్థము చెప్పినచో "అపవిత్రకరో నగ్నః" అను స్మృతిప్రకారము ముముక్షువులైన నగ్నుఁ డయినచో నపవిత్రుఁడయి కర్మార్హత్వము లేనివాఁడగును గాన, ముముక్షువయిన, నగ్నుఁడగుట యుక్తము కాదు.

లకు హేతుభూతమైన యవిద్య నివర్తించును. మఱియు, నా భగవంతుఁడు జీవాత్మలందుఁ బ్రవేశించి, వారికి ధారకుఁడయి యున్నాఁడు. అతఁడు నిరతిశయప్రీతికి విషయీభూతుండు. అతఁడు నిరతిశయమగు సుఖమే స్వరూపముగాఁ గలవాఁడు. కావుననే, యతఁడు నిరతిశయ పురుషార్థస్వరూపుఁడు. అట్టి భగవంతుని సేవించి, భగవత్ప్రాప్తికి విరోధియై యుండు నవిద్య నివర్తించుటచేతను, నిరతిశయసుఖస్వరూపుఁడగు పరమాత్మ నుపాసించుటచేతను సుఖవంతుఁడై, ఫలాంతరములనుండి నివృత్తుండయి యుండవలయును. ఇట్లు నిరతిశయసుఖము గలిగించు భగవంతుని చింతను విడిచి, యర్థాంతరములను జింతింపఁ బశువు పూనుకొనును గాని, మఱి యెవఁడు పూనుకొనును? అట్లు భగవంతునికంటె నితర వస్తువులను జింతింపఁ బూనుకొని, వైతరణీనదివంటి సంసారమందుఁబడి, స్వకర్మజనితములయిన యాధ్యాత్మికాది బాధలనుభవించుచున్నవారిని జూచుచుఁ, బశువుతప్ప మఱి యెవఁడంముల కంగీకరించును? జ్ఞానవంతుఁడగు మానవుండు మాత్రము కొంచెమేనియు నాపదలఁబొరయిక, తన హృదయమధ్యమందున్న యాకాశమున జగత్స్వరూపుఁడగు భగవంతుని నుతించుచుండు. ఆ పురుషుఁడు నాలుగుభుజములచే నొప్పుచుండును. అతఁడు శంఖచక్రములను గదను బద్మమును ధరించియుండును. అతని ముఖమున శాంతిరస ముట్టిపడుచున్నట్లుండును. అతనినేత్రములు పద్మదళములవలె మిగుల విశాలములయియుండు. అతఁడు ధరించిన వస్త్రము కదంబపుష్పములయందున్న కేసరములను బోలుచుండును. అతని

బాహువులు రత్నమయము లయియున్న భుజకీర్తులచేఁ బ్రకాశించుచుండును. అమ్మహాత్ముని శిరస్సునందుఁ గనకమయమగుకిరీటము వెలుఁగుచుండును. అతని కర్ణములయందుఁ బసిండికుండలములు వెలయుచుండును. అతని పాదపల్లవములు యోగీశ్వరు హృదయపద్మమందు వెలయుచుండును. అతని వక్షఃస్థలము శ్రీవత్సమనెడి చిహ్నముచేతను, కౌస్తుభమాణిక్యముచేతను బ్రకాశించుచుండును. అతనికంఠము శంఖమును బోలుచున్నదయి, వనమాలచే వెలయుచుండును. అతని కటిప్రదేశము మనోహరమగు కటిసూత్రముచే వెలయుచుండును. అతనివ్రేళ్లు ప్రశస్తములగు ముద్దుటుంగరములతో నొప్పుచుండును. అతని ముంజేతులు సొగసైన బంగారుకడియములచే నలరుచుండును. అతనిపాదములు మనోహరమగు నందెలచే రంగారుచుండును. ఆ మహాత్ముని ముఖము నల్లని కుంతలములచేతను, మందహాసముచేతను బ్రకాశించుచుండును. అప్పురుషుండు తిన చూపులచేతను, భ్రూవిక్షేపములచేతను, గరుణారసమును బ్రకటించుచుండును. ఓ పరీక్షిన్మహారాజా! ఇటువంటి యీశ్వరుని మనోహరమైన యాకారమును, దాను ధారణవలన మానస మెంతకాలము స్థిరముగా నుండునో, యంతకాలమువఱకును జూచుచుండవలెను. అట్లు తన మనస్సునందు నిలిపికొని చూచుచు, నా పరమపురుషునిరూపమును బాదములు మొదలుకొని మందహాసపర్యంతము నొక్కొక్కయవయవమును బ్రత్యేకముగా ధ్యానము చేయవలెను. పిమ్మట భావనచే స్ఫురించుచున్న పాదాద్యవయవస్థానమును విడిచి క్రమముగా జానువు

మొదలగు మీఁది యవయవములను దనబుద్ధి ప్రసన్నమగు నంతవఱకు ధ్యానించుచుండవలెను. ఇట్లు బ్రహ్మాదులకంటె నధికుండయి సర్వనియామకుఁడయియున్న భగవంతుని యందు భక్తియోగ మెంతకాలము జనింపదో, యంత కాలము నావశ్యకమగు ననుష్ఠానము చేసిన పిమ్మట, భగవంతుని విరాట్స్వరూపమును బ్రయత్నించి స్మరించుచుండవలెను. ఓ రాజేంద్రా! యోగీశ్వరుండు పరిపూర్ణమగు భక్తియోగమును సంపాదించి శరీరమునకుఁ గారణభూతమయిన ప్రారబ్ధకర్మ మవసానమును బొందఁగా, నీలోకమును విడిచిపెట్ట నెంచి, గంగాది ప్రదేశములందును నుత్తరాయణాది కాలములందును, మానసంబును బ్రవేశింపనీయక నిర్భయప్రదేశమున సుఖముగాఁ గూర్చుండి ప్రాణములను, నింద్రియములను నిర్బంధింపవలయును భగవదుపాసనచేఁ బాపములనుండి నివర్తించిన నిశ్చయాత్మకమైన బుద్ధిచే మనస్సును బంధించి, యాబుద్ధిని క్షేత్రజ్ఞునియందుఁ జేర్చి, యా జీవాత్మను బరమాత్మకు నర్పించి, బ్రహ్మపదమున బ్రహ్మానందసుఖము ననుభవించుచు, సమస్త కార్యములనుండియు మఱలవలెను. ఆ బ్రహ్మపదమునందు బ్రహ్మాది దేవతలకంటె నెక్కుడగు కాలమునకయినను సామర్థ్యము చాలదు. దేవతలకంటె నెక్కుడగుకాలమునకే సామర్థ్యము లేదని చెప్పవలసినప్పుడు, తాదృశకాలముచేఁ బరిణామవంతులయియున్న బ్రహ్మాది దేవతలకు శక్తిగలదని యెట్లు చెప్పఁగలను! మఱియు, నా బ్రహ్మపదమునందు కేవల సత్త్వగుణము దప్ప మిశ్రసత్త్వగుణమయిన నుండదు. మిశ్ర

సత్త్వగుణమే లేదనవలసినప్పుడు, రజస్తమోగుణంబులును, వానిచేఁ జేయఁబడు దేవమనుష్యాది వికారములు నుండవని చెప్పనేల? వీనిమాట కేమి? యటుండనిమ్ము. సమస్త ప్రపంచకమును సృజించుటకుఁ గారణభూతమయిన ప్రకృతియుఁ, దదీయగుణములగు సత్త్వాదులును, దత్కార్యములగు మహదహంకారములును, నచ్చటఁ దమకార్యములఁ జేసికొన సమర్థములు కావు. ఆ పరబ్రహ్మ మప్రాకృతుఁడయి యుండఁగా, నది యెట్లు సంభవించును? కావున నో రాజేంద్రా! వ ఱియొకటి చెప్పెదను వినుము. వేదాంతములు విష్ణుసంబంధియగు పరమపదము పొందఁదగిన దని చెప్పుచున్నవి. ఇంకను వేదాంతము లబ్రహ్మాత్మకమగు స్వతంత్రవస్తువు లేదు లేదని బోధించుచున్నవి. మఱియు, నవి ప్రాప్యమగు నా విష్ణుస్వరూపము కాలాదులకు నియామక మయినదనియు, సత్త్వాదిగుణకార్యములచే స్పృశింపఁబడనిదనియుఁ జెప్పుచున్నవి. కావున, యోగీశ్వరుఁడు చిత్తముననున్న రాగాదులను బాఱఁదోలి, యన్యతాత్పర్యము లేని మానసముచే నారాధనీయుఁ డయిన భగవంతుని పదమును బ్రతిక్షణముఁ గౌఁగిలించుకొని, కృత్యములనుండి మఱలవలయు. అట్టియోగి దేహత్యాగము చేయుటనుగూర్చి చెప్పెదను వినుము. అతఁడు సర్వము బ్రహ్మాత్మకమేయని బుద్ధియందు వ్యవస్థచేసికొని, భగవదుపాసనాత్మకమును, దర్శనాత్మకమును నగు తెలివిబలిమిచే సమస్తవాసనలను దొలఁగించుకొని, తన పాదమూలముచే గుదస్థానమును నిరోధింపవలయు. అట్లు చేసినపిమ్మటఁ బ్రాణవాయువును శ్రమరహితుండయి ముందు చెప్పఁబోవు నాభి మొదలగు

స్థానంబులను బొందింపవలయును. మొదట మూలాధార చక్రమునందున్న వాయువును నాభియందుండు మణిపూరక చక్రంబునం జేర్చి, యటనుండి హృదయమందుండు ననాహత చక్రమును బొందించి, యాస్థానమునుండి యా వాయువు నుదానవాయువు సంచరించునట్లు సంచరింపఁజేసి, కంఠమున కధోదేశమునందున్న విశుద్ధచక్రమును బొందించి నియత చిత్తుండై, గంతవ్యమార్గము ననుసంధించి, విశుద్ధచక్రాగ్ర ముందునట్టి స్వతాలుమూలమును మెల్లగాఁ బొందింపవల యును. ఆ తాలుమూలమునుండి ప్రాణవాయువును గను బొమ్మలమధ్యమున నుండు నాజ్ఞాచక్రమును బొందింపవలయు. అప్పుడు యోగి వదనకుహరమును, నాసారంధ్రములను, గర్ణ బిలములను, నేత్రరంధ్రములను మూసి, విషయాంతరములం దపేక్ష వదలి, తాఁ బోఁదగిన ప్రదేశమునుగూర్చి యప్రతి హతమయిన జ్ఞానముతో నొప్పుచుఁ, దా నాజ్ఞాచక్రము బొందించిన వాయువును ముహూర్తకాల మట్లెయుంచి, పర మాత్మను బొంద మూర్ధమును భేదించికొనిపోయి, స్థూల దేహము విసర్జింపవలయును.

### శుకుఁడు పరీక్షిత్తునకు ధూమాద్యర్చిరాదిగతులను జెప్పుట

ఓ రాజా! ఇఁక నొకసమాచారము తెల్పెద విను. ధూమాదిగతియనియు, నర్చిరాదిగతియనియు, రెండుగతులు కలవు. వానిలో ముముక్షువునకు నర్చిరాదిగతి నవలంబించు టయే యుచితముకాని, ధూమాదిగతి నవలంబింపఁగూడదు. ఆ బ్రహ్మాత్మకులగు స్వతంత్రజీవు లనెడి బుద్ధితో బ్రహ్మాదులను

సేవించువారు ధూమాదిగతి నవలంబించి, యణిమాదులగు నష్టైశ్వర్యంబులతోఁ దులఁదూగుచు, సిద్ధులకుఁ గ్రీడాస్థానమయి పొలుచు చతుర్ముఖ లోకమునుగూర్చి పోఁదలఁచినచో, మరణించునప్పుడు స్థూలదేహము విడిచినవారు కావున, మనస్సును, నింద్రియములను గూడికొనియె పోవుదురు. మఱియు, నట్టియోగులు ముల్లోకంబుల కంతర్భాగమందును దద్బహిర్భాగంబున నుండు జనలోకాదులందు వాయుతుల్యమగు వేగముకలిగి వర్తింతురు. ఇట్లు శాస్త్రజన్య జ్ఞానమును, గర్మయోగమును, యమనియమాదులను, సమాధిని నవలంబించువారికి బ్రహ్మాండాంతర్గతములగు లోకంబులందు యథేష్టవిహారము ప్రాప్తించినట్లు, కామ్యకర్మముల నొనరించువారికి సంప్రాప్తము కాదు. దీనివలనఁ గేవలకర్మికంటె యోగీశ్వరుండధికుండని స్పష్టమగుచున్నది. ఆ యోగీశ్వరునికంటె భగవదుపాసకుఁ డధికుండు. కావుననే, వాఁడు ముజ్జగంబుల కంతర్భూతమై చతుర్దశభువనాత్మకమయి యొప్పు నండకోశమునకుపరిభాగమందుఁగూడఁ జరింపఁగలఁడు. ముముక్షువుల కర్చిరాదిగతియే ముఖ్యమయినదని చెప్పితినిగదా! ఇఁక ముముక్షువర్చిరాదిగతి నవలంబించి పోవుక్రమమును దెల్పెద వినుము. ముముక్షువు హృదయకమలమం దున్న పరమాత్మ యనుగ్రహంబునకుఁ బాత్రుఁడయి యతనిచేఁ దెలుపఁబడినదయి పరబ్రహ్మమును జేరుటకు మార్గభూతమై యున్న, సుషుమ్నానాడి ముఖద్వారమునుండి బయలువెడలి, శీర్షకపాలమునకు బహిర్భాగముననున్న యాకాశమునం బడిపోవుచు, నర్చిశ్శబ్ద

వాచ్యుఁ డగు నగ్నిని బొందును. అట్లు పొంది, యచ్చటఁ
* బుణ్యపాపకర్మముల నన్నింటిని నాశనము నొందించి
కొనును. ఇట్లు పుణ్యపాపముల నశింపఁజేసికొనుట ధూమాది
గతి నవలంబించినవారికి సంభవింపదు. పిమ్మట నతఁడు
సూర్యున కుపరిభాగమందున్న శింశుమార చక్రమునుగూర్చి
పోవును. ఆశింశుమారము గ్రహనక్షత్రాదుల కెల్ల నాశ్రయ
భూతమయినది అది విష్ణువునకు స్థానభూతమయినది అది
బ్రహ్మాదులకు నమస్కరింపఁ దగినది. ముముక్షు వా శింశు
మారము నతిక్రమించి, పుణ్యపాపరహితమయి మిగుల సూక్ష్మ
మైయున్న లింగశరీరముచే నగహాయుఁడై పోవుచుఁ గల్పాం
తమువఱకు నాయువుగలిగి వర్తించు దేవతలకు విహరణీయ
మయిన జనలోకమును బొందును తరువాత, నవాంతర
ప్రళయమున ననంతుని విషాగ్నులవలన దహ్యమానమగు నని
తెలిసికొని, యటనుండక, యోగీశ్వరుల విమానంబులచేనొప్పి,
రెండు పరార్థముల కాలముదనుక నుండునట్టి బ్రహ్మలోక
మునకుఁ బోవును ఆ బ్రహ్మలోకము స్వర్గాదిలోకములకంటె
నెక్కుడు కాల ముండును. ఆ లోకమందు దుఃఖముగాని,
చిత్తవిక్షోభముగాని, ముందు దుఃఖములు సంప్రాప్తము
లగునని పుట్టెడి జ్ఞానముగాని, శీతాతపములవలనను వాతము
వలనను, వర్షమువలనను గలిగెడి బాధలుగాని లేవు.
కాని, పరిదృశ్యమానమగు ప్రపంచముకంటె విలక్షణుఁడగు

* ఇందుకు శ్రు॥ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య
ముపైతి. "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్రయివ రాహోర్ముఖా
త్ప్రముచ్య ధూత్వా శరీరమ్" అను. శ్రుతులు ప్రమాణములు

పరబ్రహ్మమును గుర్తెఱిఁగిన యా లోకవాసులు తా మొనర్చిన కర్మములనుబట్టి యపారదుఃఖంబునకుఁ గారణమయిన సంసారము సంభవించునని * నిర్వేదము చెందుచుందురు. ఓ రాజా! పృథివ్యావరణమనియు, జలావరణమనియుఁ, దేజోమయావరణమనియు, వాయురూపావరణమనియు, నాకాశావరణమనియు, నహంకారావరణమనియు, మహత్తత్త్వావరణమనియు నేడావరణములు కలవు. ఇట్లుండ, చతుర్ముఖలోకమున నిర్వేదము చెందువాఁడు పరమపదమును జనఁ బోఁదలంచి, యటనుండి కదలి, పృథివ్యావరణమును బొంది నిర్భయుండై, యా స్వరూపముచే నుపలక్షితుండై పోయి. యావరణరూప జలమును బొంది, పిమ్మట మూర్తీభూతమగు నావరణాగ్నిని బొంది, క్లేదము, తాపము మొదలగునవి లేకపోవుటచేఁ ద్వరపడక, యగ్నిస్వరూపుఁడయి యావరణరూపమయిన వాయువును బొంది, వాయు

* ఓయీ! బ్రహ్మలోకమందున్న బ్రహ్మవిదులు తిరిగి తమకు సంసారదుఃఖము సంభవించునని దుఃఖపడుదురని చెప్పుట యంతయు నసంగతముగా నున్నది ఆ లోకమున నున్నవారికిఁ దప్పక తమకు మోక్షము గలుగు నన్న నిశ్చయ ముండునుగాన, వారికట్టి నిర్వేదము సంభవింపదే? అన వీలులేదు. భూలోకమందున్న యోగులకుఁ గూడ మోక్షము నొందఁగలమన్న నిశ్చయము గలదు. కావున, వారికిని బునరావృత్తిభయము గలుగదు. ఇట్లుండఁ జతుర్ముఖలోకములో నున్నవారికిని, భూలోకములో నున్నవారికిని గల భేదమేమి? కావున, నట్లు చెప్పవలనుపడదు. మఱియు, "ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావృత్తినోర్జున" అని చెప్పఁబడియున్నది. కావున, బ్రహ్మలోకవాసులకును దప్పక పునరావృత్తిభయ మున్నదనియు చెప్పవలసియున్నది

స్వరూపముచే నుపలక్షితుండై స్వకార్యభూతము లగు వాయ్వాదులకంటె నుదారుండయి, శబ్దమే యసాధారణ గుణముగాఁగల యావరణాకాశమును బొందును. ఓ రాజా! ఇఁక ముముక్షువు తన సూక్ష్మదేహమందున్న యింద్రియములచే నాయా భూతములందున్న గుణముల గ్రహించునట్టి క్రమమును జెప్పెద వినుము. ముముక్షువు తన ఘ్రాణేంద్రియముచే నావరణభూతమగు పృథివియందలి గంధమును, దన రసనేంద్రియముచే నావరణభూతమగు జలమందలి రసమును, దన చక్షురింద్రియముచే నావరణాగ్నియందలి రూపమును, దన త్వగింద్రియముచే నావరణవాయువునందున్న స్పర్శమును, దన శ్రవణేంద్రియముచే నావరణగగనమందలి శబ్దమును, నంతఃకరణముచే నభిప్రాయమును గ్రహించుచుఁ బోవును. పిమ్మట నాయోగి యాకాశాదులయిన భూతములకును, శబ్దాది తన్మాత్రములకును, జ్ఞానేంద్రియపంచకమునకును, కర్మేంద్రియపంచకమునకుఁ గారణమయిన యహంకారావరణమును బొంది, యతిక్రమించిన యహంకారముచే నుపలక్షితుండయి మహత్తత్త్వావరణమును బొందును. పిమ్మట, సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థగల ప్రకృతిని బొందును ఇట్లు యోగి, స్వకీయములగు భూతసూక్ష్మేంద్రియంబులను, వాని వాని కారణములను, లయమును బొందించిన తరువాత, రజస్తమోగుణరహితమగు రూపముచే నుపలక్షితుండగుచు, తాను నిరతిశయానందమనుభవించుచు, షడూర్ములు లేక యానందస్వరూపుఁడయి యున్న పరమాత్మను బొందుచున్నాఁడు. ఓ పరీక్షిన్నరేంద్రా!

నేఁజెప్పిన యీయర్చిరాదిమార్గమును బరమభాగవతోత్తము లందఱు ననుసరింతురు. ఈ మార్గము ననుసరించి ముక్తి చెందినవాఁడు తిరిగి జన్మము నొందక, పరమానందసుఖము ననుభవించుచుండును. ఇందుల కెంతమాత్రము సందేహము లేదు. ఓ రాజా! వినఁదగినవేవి? యని నీ వడిగితివి. కావున, వానిని జెప్పియున్నాను. ధూమాదిగతియు, నర్చిరాదిగతియు నాఁబరఁగు నీ రెండుమార్గములు వేదములందుఁ జక్కఁగ వివరింపఁబడెనుగాని, నాయంత నే నాలోచించి చెప్పలేదు. పూర్వము బ్రహ్మచే నారాధింపఁబడి, వాసుదేవుఁడు సంతసించి, యతనికి నీ విధమంతయుం జెప్పెను. సంసారమందున్న వానికి నర్చిరాదిమార్గముకంటె నుత్తమమయిన మార్గము లేదు. ఆ యర్చిరాదిమార్గమును జింతించినచో, వాసుదేవునందు భక్తి జనించును. మఱియు, నీ బ్రహ్మదేవుఁడు వేదముల నన్నింటిని మూఁడుసారులు పరీక్షించి చూచి చూచి, మోక్షము పొందుటకు భక్తిమార్గముకంటె సులభమయిన మార్గము లేదని వక్కాణించి యున్నాఁడు. మఱియు, నా భక్తిమార్గమువలన నిర్వికారుఁడయిన వాసుదేవపరబ్రహ్మమందు మిగుల ననురాగము గలుగక మానదు. ఓయీ! అనుభూతమయిన దానియం దనురాగము గలుగునుగాని, యననుభూతమయిన బ్రహ్మమందుఁ బ్రేమ యెట్లు జనించును? అని యందువేమో! దానికి సదుత్తరము చెప్పుచున్నాను వినుము. శ్రీహరి సర్వభూతములయం దంతరాత్మయయి, యెల్లప్పుడు ప్రకాశించుచుండును. అతఁడు కార్యాద్యులచేత ననుమేయుండై కనఁబడును. మఱియు, నతనిని వేదములు

గూడఁ జెప్పుచున్నవి. అందువలన భగవంతునియందు దను రాగము పుట్టవచ్చు. కావున, రాజేంద్రా! సర్వవిధముల చేతను నట్టిభగవంతుని కెల్లప్పుడు నమస్కారములు చేయుచు, నాతనిరూపమునే నుతించుచు, నతనినే స్మరించుచు, నతని కథలనే వినుచుండవలెను. అట్లు శ్రీహరికథామృతమును పానము చేసినవారు, మలినమైన యీ దేహములను విడిచి, వాసుదేవుని పాదమూలమును జెందుదురు.

ఇది రెండవ యధ్యాయము

పరీక్షిన్మహారాజునకు శుకుండు భక్తిమార్గమే ముఖ్యమని చెప్పుట

ఓ రాజేంద్రా! నీ వడిగిన ట్లాసన్నమరణులయిన మానవులకును, జ్ఞానసంపన్నులైన వారలకును, ముఖ్యమయిన మార్గమును నీకుఁ దెలిపితిని మఱియొకసమాచారము తెల్పె దను వినుము బ్రహ్మవర్చసమును గోరుచున్న వాఁడు వేదము లకుఁ బ్రభువగు బ్రహ్మను బూజింపవలయును. ఇంద్రియపాట వమును గోరుచున్నవాఁడు దేవేంద్రుని సేవింపవలయును. సంతానము నపేక్షించుచున్నవాఁడు దక్షుఁడు మొదలగు వారిని భజింపవలయును. భోజనమును గోరుచున్నవాఁ డతిథిని బూజింపవలయును స్వర్గమును గోరుచున్న వాఁ డతిథి కుమారులను భజింపవలయును మఱియును, రాష్ట్రంబును గోరువాఁడు విశ్వేదేవతలఁ బూజింపవలయును, దేశమునందలి ప్రజలను స్వాధీనము చేసికొనఁ దలంచినవాఁడు సాధ్యుల నుపా సింపవలయును. సిరిని గోరువాఁడు భగవంతుని యాశ్చర్య

శక్తిని గొలువవలయును. తేజస్సు నపేక్షించువాఁడు అగ్నిహోత్రు నుపాసింపవలయును. ధనమును గోరువాఁడు వసువులను బూజింపవలయును. పరాక్రమము నపేక్షించువాఁడు రుద్రులను భజింపవలయును. ఆయుర్దాయమును గోరువాఁడశ్వి దేవతలను గొలువవలెను. తన దేహబలమును గోరువాఁడు భూదేవి నుపాసింపవలయును. ప్రతిష్ఠను గోరువట్టి వాఁడు భూమ్యాకాశములను సేవింపవలయును. సౌందర్యమును గోరువాఁడు గంధర్వులను సేవింపవలయును. స్త్రీలను గోరువాఁ డప్సరఃస్త్రీయయిన యూర్వశినుపాసింపవలయును. సర్వాధిపత్యము గోరువాఁడు పరమేష్ఠిని భజింపవలయును. కీర్తిని గోరువాఁడు యజ్ఞస్వరూపుఁ డగు విష్ణువును గొలువవలయును. ధనకోశములను గోరువాఁడు ప్రచేతసుని సేవింపవలయును. విద్యను వాంఛించువాఁడు శివుని భజింపవలయును. దాంపత్యప్రీతి గోరువాఁడు పార్వతిని, ధర్మార్థకామములఁ గోరువాఁడు విష్ణువును, సంతానకాముఁడు పితృదేవతలను, రక్షణమును గోరుచున్నవాఁడు యక్షులను, బలము నపేక్షించువాఁడు మరుద్గణములను సేవింపవలయును. మఱియు, రాజ్యమును గోరువాఁడు మనురూపదేవతలను, శత్రుమరణ మపేక్షించువాఁడు దిక్పాలకుఁ డయిన రాక్షసుని, భోగకాముఁడు చంద్రుని సేవింపవలయును. వైరాగ్యము నపేక్షించిన భక్తుఁడు కేవలము పరమపురుషుని భజింపవలయును. ఓ రాజా! సర్వము నపేక్షించినవాఁడు గాని, వైరాగ్యమును గోరువాఁడుకాని, మోక్ష మపేక్షించు వాఁడుకాని, యవిచ్ఛిన్నమయిన భక్తియోగ మవలంబించి,

పరమపురుషునిఁ బూజింపవలయును. ఓయీ! ఇట్లు భజించువా రెప్పుడు మోక్షమును బొందఁగలరు? అందువేని, చెప్పెద విను. ఈలోకమందట్లు భగవంతుని భజించువారికి మోక్షలాభము భగవద్భక్త సహవాసము సంప్రాప్తమయినచోఁ, దప్పక లభించునని తెలియుము. భక్తసహవాసమువలన భగవంతునియందు మనోనిశ్చలత్వము కలుగును. అది కలిగినతోడనే మోక్షము సంప్రాప్తమగును. కాన, మనోనిశ్చలత్వమె తప్పక సంపాదింపవలయును. ఓరాజా! హరికథలు వినినచో, సత్త్వరజస్తమోగుణ కార్యములయిన యాఁకలి, పిపాస, శోకము, మోహము, జర, మృత్యువు సంభవింపవు, మఱియుఁ, జిత్తనైర్మల్యము సంప్రాప్తమగును. ఈ లోకమందును, బరలోకమందును, శబ్దాదివిషయములందు విరక్తి గలుగును. మోక్షమునకుఁ బ్రధానోపాయమయిన భక్తియోగము లభించును. ఇట్టి హరికథాశ్రవణమునందు సుఖాభిలాషియైన మానవుఁ డెవఁ డనురాగమును జెందఁడు?' అని యిట్లు పరీక్షిన్మహారాజునకు శుకుండు చెప్పె నని సూతుండు పలుక విని, శౌనకుం డతని కిట్లనియె. 'ఓ సూతా! శ్రీశుకుని మాటలు విని పరీక్షిన్మహారా జేమి ప్రశ్నము చేసెను? అందులకు శుకుఁ డేమి ప్రత్యుత్తర మిచ్చెను? మేము వినుటకు మిగుల వేడుకపడుచున్నాము. కనుక, మాకుఁ జెప్పవలెను. ఓయీ! శుకనరేంద్రుల ప్రశ్నములవలన నీ కేమి లాభము? అనినఁ జెప్పెద. వా రిరువురును భగవద్భక్తులు. కావున, వారు సభయందు హరికథాప్రధానము లయిన ప్రసంగములనే ప్రసంగింపుచుందురు. కావున, హరికథాశ్రవణ మొక

లాభము కాదా? ఆ పరీక్షిన్మహారాజు చిన్నతనమున బాలురం గూడి యాడుచుండియు, నా కృష్ణుని చర్యలనే యవలంబించెనుగాని, మఱియొక రీతిం బ్రవర్తింప లేదు. అట్టి పరమభాగవతుండయినట్టి పరీక్షిత్తునకు, హరిభజన మందాసక్తిం గలిగిన శ్రీ శుకునకుం బ్రసంగము వచ్చినప్పుడు, హరికథలు ప్రవర్తిల్లక మానవు. మఱియు, సూర్యుం డుదయ కాలమునందును, సాయంసమయమందును, జనుల యాయుర్దాయమును గొనిపోవుచుండును గాని, భగవంతుండగు కృష్ణుని కథలు వినుచుం గాలము గడపుచున్నవారి యాయుర్దాయమును మాత్రము గొనిపోలేండు. హరిభజనమువలనం గలిగెడి సామర్థ్య మెట్టిదియో యోచింపుము. ఇట్లు సూర్యుం డాయువును హరించుచున్నాండని నతెం డెఱుంగక, యింకను చిరకాలము జీవింపంగలనని నిశ్చయించుకొని, దారపుత్రాదులను ధనములను గృహములను నిత్యము లని భావించి వర్తించుచుండును. ఆయుర్దాయము గలిగియుండుటకు ఫలము పొట్టం బోషించుకొనుచు జీవించుటయే కాదు! అట్లు జీవించుటయే యాయువునకు ఫల మనినచో, నందులకు సమాధానము చెప్పెదను వినుము. మహారణ్యములయందు వృక్షము లాకసమునంటునట్లు పెరిగి జీవించుచుండ లేదా? కడుపునిండ గడ్డితిని నీరుద్రావి పశువులు గ్రామములయందుం జరించుచుండవా? తోలుతిత్తు లుచ్ఛ్వాస నిశ్వాసరూపములయిన వాయువులు గలిగి వర్తించుచుండ లేదా? సూకరములు, కుక్కలు, పిల్లులు మొదలగునవి యింటింటం దిరుగులాడుచుండ లేదా? మఱియు గాడిదలు, లొట్టియలు వీథులందాడుచుం జరించుచుండ లేదా?

పైఁ జెప్పినవానికిని, హరిభక్తిహీనులైన మానవాధములకును భేదమేమి గలదు? కావున, నాయుర్దాయముయొక్క ఫలము హరిభజనముగాని, బ్రదుకుట కాదు. ఇట్లుండఁగా నిది తెలిసి కొనక ప్రవర్తించుట వట్టి నిష్ఫలమే కదా? అటువంటి మానవుల పుట్టువే వ్యర్థమగుచుండఁగా, వారల యవయవములు వ్యర్థము లని వేఱె చెప్పవలయునా? అయినను, జెప్పెద వినుము. విష్ణుకథలను విననట్టివాని కర్ణములు వట్టిబిలములు గాని, యవి యెంతమాత్రము చెవులు కావు. విష్ణుకథలతోఁ గూర్చిన పద్యములు చదువనివాని నాలుక కప్పనాలుకవలె నిష్ఫలమయినది. విష్ణువునకు నమస్కరింపనివాని శిరస్సు కిరీటముతోఁ గూడినను, నది కేవలము బరువునకే కాని, ఫలము లేదని చెప్పవచ్చును శ్రీహరిని జూడనికన్నులు నెమలిపింఛము నందలి కన్నులుగాని, నిజమైన కన్నులుగావు. శ్రీహరిని బూజింపనివాని చేతులు కనకకంకణములతోఁ గూడియున్నను, శవముచేతులవలె వ్యర్థములయినవి. విష్ణునిఁ బూజించినప్పు డాతనిపాదముల నున్న తులసీదళమును ధరింపనివాఁడు బ్రదికి యున్నను శవసమానుఁడే? మఱియు, విష్ణువు పాదపద్మములందున్న తులసీదళముగంధము నాఘ్రాణించి సంతసింపనివాఁడు, జీవచ్ఛవంబని చెప్పవలసియున్నది. హరి పుణ్యతీర్థములకయి నడవనివానిపాదములు చెట్లవ్రేళ్లవంటివి గాని, నిజమగు కాళ్లు కావు. హరికథల వినుచున్నప్పు డెవనికి నానందబాష్పములు, ముఖవికాసమును, బులకాంకురములుం గలుగవో, వానిహృదయము కాలాయససమానమయినది. శ్రీహరిభజనము చేయనివాఁడు గాలివలనఁ గదలుచున్న

శవమువంటివాఁడుకాని, మనుష్యుఁడు కాఁడు. భగవంతుఁడే ముఖ్యాశ్రయముగల యో సూతా! ఆత్మవిద్యానిపుణుఁడైన శుకుండు రాజున కేమి చెప్పెనో, దానినే మాకుఁ జెప్పుము' అని పలుకుచున్న శౌనకుని వాక్యములను విని సూతుం డిట్లనియె.

ఇది మూఁడవ యధ్యాయము

---

పరీక్షిత్తు శుకునిని లోకసృష్ట్యాదుల నడుగుట

ఓ మునులారా! మహాయశుఁడైన పరీక్షిన్నరేంద్రుండు తత్త్వనిశ్చయము చేయు శ్రీశుకుని వాక్యము లాలకించి దేహమునందును, గృహములందును, ధనంబులందును, పశువులందును, దారసుతాదులందును, బంధువులందును, నిరుపద్రవమగు రాజ్యమందును మమకారము విడిచి, విష్ణుకథాశ్రవణమం దాసక్తికలవాఁడయి, తనకు మృత్యువు సమీపించినదని యెఱిఁగి, త్రివర్గమును సాధించు కర్మములను విడిచి, భగవంతుఁడగు వాసుదేవునియందుఁ దనయాత్మ దృఢముగా లగ్నమగునట్లు చేసి, మీరు నన్నడిగినట్లే, శుకమహాముని నడిగెను. వానిని జెప్పెద వినుఁడు 'ఓ బ్రాహ్మణోత్తమా! మీరు చెప్పిన వచనములు మిక్కిలి యుక్తముగా నున్నవి తమరు చెప్పుచున్న హరికథలు వినుటంబట్టి, నా యవివేకమంతయు నశించినది. భగవంతుఁడగు వాసుదేవుఁడు తన మాయచే లోకములను నెట్లు సృజించినాఁడో, బ్రహ్మాది దేవతలకునైన నూహింప శక్యముగాని యీ ప్రపంచకమును భగవంతుఁడే యేశక్తినవలంబించి పరిపాలించుచున్నాఁడో,

మఱియుఁ, బరమపురుషుం డేయేశ_క్తి నవలంబించి ప్రళయ మందు సమ_స్తలోకములు సంహారించుచున్నాఁడో, మఱియు, నా భగవంతుఁ డేయే శక్తులఁ బూని తనకు లీలలను సంపాదించు నిమిత్తము భూమియందుఁ బెక్కు లవతారముల నేరీతిఁ దాల్చినాఁడో, ఏయే రీతిగాఁ దన యవతారములను జాలించెనో, అట్టి హరిచర్యలు మిగుల నాశ్చర్యకరముగా నుండును గనుక, వానిని జెప్పి చెవు పండువు లొనర్పుము. ఒక్కఁడైన విష్ణుమూ_ర్తి, లీలావతారములను బెక్కింటిని దాల్చి, పెక్కుకార్యముల నాచరించుచున్నాఁడు. భగవంతుం డట్లు లాచరించుచుండుట, స_త్త్వరజ_స్తమోగుణముల నొక్కమాఱు ధరించియే చేయుచుండెనో, లేక యాగుణములఁ గ్రమముగాఁ దాల్చియే చేయుచుండెనో చెప్పుము. ఓ శుకమునీంద్రా! ఈనాప్రశ్నముల కు_త్తరంబు లిచ్చుటకు నీవే సమర్థుండవు. వేదార్థము నీకుఁ దెలిసినట్లు మఱియొకరికిఁ దెలియదు కదా! తత్త్వజ్ఞానము గూర్చి ముందుగా నిన్నుఁ జెప్పి తీఱవలెను ఇట్లుభయమును దెలిసినవారు నీకంటె నధికు లెవ్వరు కలరు? కావున, నాయందు దయయుంచి నా సంశయము తొలంగునట్లు చేయవలయును' అని ప్రార్థించిన రాజువచనములకు శుకయోగి సంతసించి, యతని ప్రశ్నములకు సదు_త్తరముల నియ్యఁదలంచి, ముందుగా శ్రీహరి నివిధంబుగఁ దన మనంబున ధ్యానించి నమస్కరించె. 'దేవా! నీవు ప్రకృతికంటెను, జీవునికంటెను బరుండవు. కావుననే, నీవు స్వరూపముచేతను, గుణములచేతను, నంతర్బహిర్భాగంబుల వ్యాపించి వ_ర్తించుచున్నవాఁడవు. ప్రపంచము సృజించు

టయుఁ, బెంచుటయు, నాశనము నొందించుటయు నీకు లీలలు. ఆ లీలలచేతనే బ్రహ్మాయు, స్వావతారము, శంకరుఁడు నాఁబడు శక్తిత్రయముఁ దాల్చుచున్నావు. మఱియు, నీవు సర్వమునం దంతరాత్మవై వెలయుచున్నావు. స్వరూపాదులు భవదుపాసనారూపమయిన జ్ఞానమునకే ప్రత్యక్ష మగునుగాని, యొండొకవిధమునఁ బ్రత్యక్షము కావు. అట్టి నీకు వందనంబు లర్పించెద. ఓ మహానుభావా! నీవు సజ్జనుల పాపములను దొలంగించుచుందువు. దుర్జనుల శిక్షించుచుందువు. నీవు కేవలము సత్త్వదేహుండవు పరమహంసాశ్రమమునం దుండి, యా యాశ్రమమునకుఁ దగిన కర్మముల ననుష్ఠింప నాసక్తిగలవారి కిష్టార్థముల నిచ్చుచుందువు. అట్టి నీ కభివందనములు గావించెద. దేవా! నీ వాశ్రితులయందుండు వాత్సల్యాతిశయముచే యాదవశ్రేష్ఠుండవయి జన్మించితివి. నీ స్వరూపము కుయోగులకు దుర్లభమయినది. దివ్యమయి నిరుపమానమయిన నీ తేజోవైభవముచేత నీ మహిమయందే రమించుచుందువు. అట్టి నీకు నమస్కారము. ఓ భగవంతా! నిన్ను నుతించినను, నిన్ను ధ్యానించినను, నిదర్శన మాచరించినను, నీ పాదములకు నమస్కరించినను, నీ కథల నాకర్ణించినను, నిన్నుఁ బూజించినను, మానవుల పాతకములన్నియుఁ దత్కాలమందే నశించునుగదా! సుమంగళకీర్తి వగునట్టి నీకు నమస్కారము. జ్ఞానవంతులందఱెవని పాదపద్మముల నాధారముగాఁ గొని యుభయలోకసుఖములయందును మనస్సును జొరనీక సంసారములను సంబంధించిన తాపత్రయమును దొలంగించికొని పరమపదమును జెందుచున్నారో,

సుమంగళకీర్తివగునట్టి నీకు వందనంబు లర్పించెద. ఓ దేవ దేవా! కాయమును గష్టపెట్టి చాంద్రాయణాది తపస్సులఁ జేయుచున్నవారలుగాని,యపరిమితమగుధనములను దానము చేసినవారుగాని,దానముచేతనుబరాక్రమముచేతను మిక్కుటమగు కీర్తిని సంపాదించినవారుగాని, మంత్రార్థముల ననుసరించి సమస్తకర్మముల నాచరించుచున్నవారుగాని, సదాచారపరులుగాని, తా మొనర్చు తపోదానాదులన్నియు నీకర్పితంబులు కావింపనిచో, నా తపంబు మొదలగువానికిఁ బరమ ఫలమును బొందలేరు. కాని, భక్తియోగమున కంగముగాఁ దపంబు మొదలగువాని నొనర్చినచో, నిరతిశయఫలమును బొందుదురు. అట్టి నీకు నమస్కారము ఓ మహానీయా! కిరాతులుగాని, ఆంధ్రదేశమందున్న నికృష్టజాతులవారుగాని, పుళిందులుగాని, చండాలురు మొదలగువారుగాని,హూణులుగాని, పల్లెవాండ్రుగాని, తురకలుగాని, యింక నెంత నీచకులమందుఁ బుట్టినవారుగాని, యెట్టిపాపాత్ములయిన, నెవని నాశ్రయించి తమ పాపములఁ బోఁగొట్టుకొని పరిశుద్ధిగలవా రగుదురో, యట్టి నీకు వందనములు. ఓ మహాపురుషా! నీవు భక్తియోగనిష్ఠుల కెల్లరకు నధిపతివి. నీవు వేదపూర్వభాగమందుఁ జెప్పఁబడిన కర్మములచే నారాధింపఁబడి, తత్ఫలము నొసంగుచున్నవాఁడవు. మఱియు, నీవు స్మృత్యుక్తములగు దానధర్మాదులచే నారాధితుండవయి తత్ఫలము నొసంగుచున్నవాఁడవు. ఉపనిషద్భాగోక్తమై, యుపాసనాత్మకమైయున్న జ్ఞానమునకు వేద్యుండవయి తత్ఫలము నొసంగుచుందువు. నీవు దోషరహితులయిన బ్రహ్మరుద్రాదులకయినను దెలియఁ

బడని చిహ్నములు గలవాఁడవు. ఇట్టి గుణంబులు గలిగి భగవంతుఁడ వయిన నీవు నాకుఁ బ్రసన్నుండ వగుదువుగాక. ఓ దేవా! నీవు సాత్వల్లక్ష్మీదేవి కధిపతివి. సమస్తయజ్ఞముల ఫలము నిచ్చువాఁడవు నీవే! సకల ప్రపంచకమును సృజించువాఁడవు నీవే! బుద్ధి కధిపతివి నీవే! సమస్తలోకములకు నధిపతివి నీవే! భూమండలమున కధిపతివి నీవే! యాదవుల కందఱికిఁ బతివి గతివి నీవే! అట్టి నీవు నాకుఁ బ్రసన్నుండ వగుదువుగాక! ఓ మహనీయా! ఎవని పాదపద్మములను స్మరించుటవలన బుద్ధిని బవిత్రముగాఁ జేసికొని, యా కారణమునఁ దత్త్వజ్ఞానమును సంపాదించుచున్న యోగీశ్వరు లందఱు పరమపదము నొందుచున్నారో, యా భగవంతుఁడ వగు నీవు నాయందు దయయుంచి నాకుఁ బ్రసన్నుం డగుదువుగాక! కల్పాదియందు బ్రహ్మకు సృష్టివిషయకమయిన స్మృతిని గలిగించు నెవనిచేతఁ బ్రేరితయయి వేదరూపయగు సరస్వతి ముఖమునుండి ప్రాదుర్భవించెనో, ఋషులకు జ్ఞానప్రదుండవగునట్టి నీవు నాకుఁ బ్రసన్నుండవగుదువుగాక! ఓ వాసుదేవా! పూర్ణుండవగు నీవు పంచభూతములచేతను సమస్త శరీరములను నిర్మించుచున్నావు. పిమ్మట, నా శరీరములయందు నీ వంతరాత్మరూపివై వెలుఁగుచున్నావు. మఱియుఁ బంచభూతములచేతను బదునొకం డింద్రియములచేతను, నేర్పడిన యా శరీరములయందు నధిష్ఠానదేవతవయి వానివగు పదునాఱు కళల ననుభవించుచున్నావు. అట్టి మహాత్ముఁడవగు నీవు నా వాక్కులకు గోచరుండ వగుదువుగాక.' అని భగవంతుని నుతించి, తన జనకునికి నమస్కరింప నిట్లు

పలికెను. 'ఎవని ముఖపద్మమునుండి స్రవించుచున్న జ్ఞానమక
రందమును మహాజనులగు శిష్యులందఱు త్రావుచున్నారో,
యట్టి మహానుభావుఁడవగు నో జనకా! నీకు నమస్కారము'
అని గురువందనము చేసి, శుకయోగి రాజున కిట్లనియె. 'ఓ
రాజేంద్రా! నీ వడిగిన విధంబుననే నారదుండు బ్రహ్మ నడు
గఁగా, నాఁగు తనకు విష్ణువుపదేశించిన ప్రకారమును
జెప్పె. దానిఁ జెప్పెద వినుము

ఇది నాల్గవ యధ్యాయము.

---

నారదుఁడు బ్రహ్మను బ్రపంచప్రకారము నడుగుట

నారదుండు బ్రహ్మ కిట్లనియె 'ఓ దేవదేవా! నీకొఱకు
నమస్కారము చేయుచున్నాను నీ వందఱువేల్పులకన్నఁ
బెద్దవాఁడవు. సమస్తప్రాణులను సృజించినవాఁడవు నీ విశ్వ
రుఁడు మొదలగువారికిఁగూడ దేవుఁడవు. కావున, నాకు
నాత్మతత్త్వమును వెలువరించు జ్ఞానమును దెలియఁ
జేయుము. మఱియుఁ, బ్రపంచకజ్ఞానము బాగుగానున్నచో,
నాత్మజ్ఞాన మప్పుడే సంభవించును. ఓ జనకా! ఈ ప్రపంచమే
భగవంతుని శరీరము. దీనికి నుపాదానకారణమేది? ఇది
యెవరిచేత నిలుపఁబడుచున్నది? ఇది ప్రళయమందు దేని
యందు లీనమగును? ఈ ప్రపంచకమున కంతయు నధీశ్వరుఁ
డెవ్వఁడు? ఈ సర్వమును నాకుఁ దెలుపుము. ఆ సర్వము
నా కెట్లు తెలియునని యందువేమో? అట్లనుటకు వలను
పడదు. ఓ దేవా! నీవు మూఁడుకాలములందు గోచరములగు
వస్తువులకుఁగూడ నధిపతివిగదా! ఈ ప్రపంచమంతయు

నీకుఁ గరతలామలకమువంటిది. అందుచేత నే నడిగినదంతయు నీకు స్పష్టముగాఁ దెలియు. మఱియు, నీ కిట్టి విజ్ఞానము నిచ్చినవాఁ డెవఁడు? నీ కాశ్రయుఁ డెవఁడు? నీ కధిపతి యెవఁడు? నీ స్వరూప మెవనివలనఁ గలిగినది? నీ వొక్కఁడవే పంచభూతములను సాధనముగాఁ జేసికొని సమస్తప్రాణులను సృజించుచున్నావు, ఇట్లు సృజింపఁబడిన భూతములకుఁ బరిభవము గలుగకుండఁ గాలించుచున్నావు. ఓ మహానీయా! సాలెపురుగువలెనే స్వకీయమయిన శక్తి నవలంబించుచుఁ, గొంచెమేనియు శ్రమ చెందక, స్వశరీరమునుండియే సమస్తభూతములను బుట్టించుచుఁ గాలించుచు, సంహరించుచు చున్నావు ఓ దేవా! నామములచేతను, దేవతాదిరూపములచేతను, సత్వరజస్తమోగుణములచేతను, నుత్తమాధమమధ్యములుగా విభజింపబఁడిన చేతనాచేతనమయిన ప్రపంచక మంతయు నీవలననే కల్పింపఁబడుచున్నది, ఒక వస్తువయినను మఱియొకరిచేఁ గల్పింపఁబడినట్లు లూహింపను. ఓ మహాత్మా! సమస్త ప్రపంచస్రష్టవగు నీవు సమాహితుఁడవయి ఘోరమగు తపస్సు చేసియున్నావని వినుట కెంతయు విచారించుచున్నాను. నీవే యందఱికంటె నధికుఁడవు కాని, నీకంటెఁ బరులు లేరనియు, నందఱు నిన్నుపాసింపవలసినదే కాని, నీచే నుపాసింపఁ దగినవాఁ డెవఁడు లేఁడనియు, మేము నిశ్చయముగా నమ్మియుంటిమి. ఇట్లుండ, నీవుగూడఁ దపస్సు చేసితివని వినుటచే మా కెంతయు సందియము పొడముచున్నది, ఓ దేవా! నీవు సమస్తమునకు నధిపతివి. మఱియు, సమస్తము దెలిసినాఁడవు. కావున, నా సందేహములు పోవు

నట్లు నాకుఁ దెలియఁజెప్పి సంతసింపఁ జేయుము.' అని పల్కిన నారదుంజూచి సంతసించి బ్రహ్మ యిట్లనియె. 'ఓవత్సా! నారదా! కరుణాశాలివయిన నీ ప్రశ్నము మిగుల బాగుగ నున్నది మఱియు, లోకములకుఁగూడ హితమైనది. మఱి, నే నెట్లు కరుణాశాలి నని యడిగెద వేని, చెప్పెద వినుము. నన్ను మఱియొకరినిగూర్చి యడుగక, కేవలము భగవంతునిగూర్చి యడుగుచున్నావు. భగవంతుని వీర్యమును నీకుఁ జెప్పుటవలన నా కమితమగు సుకృతము కలుగక మానదు. నాకట్టి సుకృతము ఘటించుట నీకు నాయందున్న కరుణారసమును వెల్లడింపక మానునా? నారదా! నాకుఁ జతుర్దశభువనాధికార మిచ్చిన పరమపురుషుఁ డొకఁ డుండుఁగా, నది తెలిసికొనక, నీ వొకఁడవే భూతముల సృజించుచున్నావని యడిగితివి. ఆ వచనము మిక్కిలి యసత్యముకాదు కాని, కొంచె మసత్య మగుచున్నది. నీకంటె బలుఁడగు నీశ్వరుం డెవఁ డని యడిగినచోఁ, జెప్పెద వినుము. ఏ భగవంతుని కాంతిచేతనే సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, గ్రహములు, నగ్నిహోత్రుఁడు మొదలగువా రందఱు ప్రకాశించుచున్నారో, యీ ప్రపంచకముగూడ నా భగవంతుని కాంతిచేతనే విలసిల్లుచున్నది. అట్లు ప్రకాశించుచున్న విశ్వమునే నేను నిమిత్తమాత్రుండనయి ప్రకాశింపఁజేయుచున్నాను. అంతియకాని, యీ ప్రపంచమును బ్రకాశింపఁజేయుటకు నేను సమర్థుఁడనా? కాను. సమస్తమునకు నధారుఁడయిన యీశ్వరుఁ డొకఁడున్నాఁడు. ఏ యీశ్వరుని మాయచే మోహితులయిన మీరందఱును

నన్ను జగదీశునిగఁ జెప్పుచున్నారో, యట్టి యీశ్వరునికి వందనము లాచరించెదను మఱియు, భగవంతుని దృష్టి మార్గమున నుండుటకు సిగ్గుపడుచున్న మాయ మిమ్ము నందఱి నవివేకులఁగాఁ జేయుచున్నది. అందుచేతనే, మీవంటివా రందఱు భగవంతునికిఁ దక్క, మఱియొకనికి స్వాతంత్ర్యము లేకపోయినను, నట్టిస్వాతంత్ర్యమును నాయం దారోపించు చున్నారు. మీ యవివేకము చూచినచో, నాకు మిక్కిలి నవ్వు పొడముచున్నది. ఓ నారదా! ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము మొదలగునవియు, పుణ్యపాపరూపములగు కర్మములు, కాలము, సత్త్వరజస్తమోగుణములు, సమస్తమైన జీవకోటియు, నీసర్వము, వాసుదేవునికంటె వ్యతిరిక్తమయినది కాదు ఇది నిశ్చయమని తెలిసికొనుము. సమస్తవేదములును నారాయణునే ప్రతిపాదించుచుండును, సమస్తదేవతలును నారాయణుని శరీరమువలననుండియే పుట్టిరి. లోకము లన్నియు నారాయణున కధీనము లయినవి. సమస్తయజ్ఞములు నారాయణుని యారాధనరూపము లయినవియె. ప్రాణాయామాది యోగమంతయు నారాయణపర మయినదియె. కృచ్ఛ్రము, చాంద్రాయణము మొదలగు తపస్సుకూడ నారాయణుని యారాధనరూపమైనదియె. మిగుల నుత్కృష్టమయిన భక్తికూడ నారాయణుని పూజారూప మయినదే! సమస్తమయిన పురుషార్థములసిద్ధియు భగవదధీనములయినవే! సమస్తవస్తుసాక్షాత్కారము గలవాఁడయి, సమస్త లోకములను నియమించుచున్నవాఁడయి, యయఃకూటము వేత్త వైనవాఁడయు, సర్వాంతర్యామి యగు భగవంతుని

క్రేఁగంటిచూపుచే సృజింపఁబడి ప్రేరితుండనయియున్న నేను భగవంతునిచే సృజింపఁబడియున్న యీ ప్రపంచమునే తిరిగి సృజించుచున్నాను హేయగుణములు లేనట్టి భగవంతుఁడు సృష్టిస్థితిలయరూపమైన లీలలనిమిత్తము సత్త్వరజస్తమములనెడి మూఁడుగుణములు స్వీకరించె. *ఓ నారదా! సత్త్వరజస్తమోగుణములు మూఁడును మూఁడువిధములగు స్వభావములు గలవి అందు సత్త్వగుణము ప్రకాశనస్వభావము గలది రజోగుణము ప్రవర్తనస్వభావము గలది తమోగుణము మోహనస్వభావము కలది. ఈ మూఁడుగుణములును శరీరేంద్రియముల నిమిత్తము స్వరూపమువలన నవ్యయుఁడయినను జీవుని నిత్యము బంధించుచుండును ఇట్లు తనకు శరీరభూతమగు ప్రకృతియందుండు సత్త్వాదిగుణములు మూఁడింటిచే నుపలక్షితుఁడగుచున్న యీ భగవంతుఁడు సమస్తప్రపంచమును, నన్నునుగూడ నియమించువాఁడని యెఱుంగుము నిఖిలప్రపంచమునకుఁ గారణభూతమయిన మాయకు నియామకుఁడయిన భగవంతుఁడు, తన మాయచేత నిఖిలప్రపంచరూపముగాఁ గాఁదలంచినవాఁడయి కర్మమునకు

---

* ఇందులకుఁ బ్రమాణము—‘సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః। నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయం। తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయం। సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ। రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవం। తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినం। తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం। ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత॥’ అనెడి గీతాశాస్త్రము.

వశుండు కాక, యప్రయత్నముగాఁ దనయందుఁ బ్రాప్తమయి, మహదాది కార్యములకుఁ బరిణామసంపాదకమయిన కాలమును, జీవాదృష్టమును, మూలప్రకృతిపరిణామస్వభావగుణమును, వీని నన్నిటినిఁ బ్రపంచసృష్టికి సహకారులనుగా స్వీకరించెను. ఆ కాలకర్మస్వభావముల మూఁడింటిలోను, గాలము వలన సత్త్వరజస్తమోగుణముల వ్యత్యాసము కలుగుటంజేసియుఁ, బ్రకృతిపరిణామస్వభావము కలుగుటంజేసియు, జీవాదృష్టరూపమయిన కర్మములంజేసియు, పురుషాధిష్ఠితమగు ప్రకృతివలన మహత్తత్త్వము జనించినది. రజస్సత్త్వగుణములచే సంవర్ధితమై వికారమును బొందుచున్న మహత్తత్త్వమువలనఁ దమఃప్రధానమయిన భూతపంచకము, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము రూపము గాఁగల యహంకారము జనించినది. అట్టి యహంకారము వికారము నొందుచు, మూఁడువిధము లయ్యెను. ఆ మూఁడును ద్రవ్యశక్తియు, జ్ఞానశక్తియుఁ, గర్మశక్తియునై యున్నవి. ఆ మూఁడింటిలో ద్రవ్యశక్తి యనఁగాఁ బృథివ్యాది పంచమహాభూతములను బుట్టింప సమర్థమయినది. జ్ఞానశక్తి యనఁగా, త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము అనెడి జ్ఞానేంద్రియపంచకమును గలిగింప సమర్థమయినది. క్రియాశక్తి యనఁగా, వాక్కు, పాణులు, పాదములు, పాయువు, ఉపస్థ యనెడి కర్మేంద్రియపంచకమును గలిగింప సమర్థమయినది. వీనినే చక్కఁగా వివరించి చెప్పెద వినుము. ద్రవ్యశక్తి యనఁబడు తామసాహంకారము వలనఁ బంచభూతములలో నాకాశము జనించినది. ఆ యాకా

శముసుండి తన కసాధారణగుణమయిన శబ్దము జనించి, పరమాత్మకుఁ బ్రపంచమునకుఁ బ్రమాణభూతమగుచున్నది. వికారమును బొందుచున్న యాకాశమువలన స్పర్శగుణ ప్రధానమయిన వాయువు జనించినది. ఆ వాయువునకుఁ, దనకుఁ గారణమయిన యాకాశమందున్న శబ్దగుణము, స్వతస్సిద్ధమగు స్పర్శగుణము నీ రెండును గలవు. మఱియు, నా వాయువు దేహమునం దుండుటంజేసి, ప్రాణరూపమయినదయి, యింద్రియములకు, మానసమునకు, శరీరమునకు బలమును గలిగించుచున్నది. వికారము నొందుచున్న యీ వాయువు వలనఁ బూర్వోక్తము లయిన కాలకర్మస్వభావముల సహాయముచేతఁ దేజస్సు జనించినది. ఆ తేజస్సునందుఁ దనకుఁ గారణభూతములగు నభోవాయువులందున్న శబ్దస్పర్శగుణంబులును, దనయందే జనించిన రూపగుణము, నీ మూఁడుగుణంబులును వర్తించుచుండు. వికారము నొందుచున్న తేజస్సు వలన రసాత్మకమయిన జలముద్భవించినది. ఆ జలమునందుఁ దనకుఁ గారణమగు తేజమునందున్న శబ్దస్పర్శరూపగుణంబులే కాక, రసగుణ బుగూడఁ గలిగియున్నది. వికారము నొందుచున్న జలమువలన గంధగుణము ప్రధానముగాఁగల పుడమి యుద్భవించినది. భూమియందుఁ దనకుఁ గారణభూతమయిన జలమునందుండు శబ్దస్పర్శరూపరసములను నాల్గుగుణంబులే కాక, గంధగుణం బొకటి యధికముగా నుండును. ఈ చెప్పినవి తామసాహంకార కార్యములు. ఇఁక సాత్త్వికాహంకార కార్యములు చెప్పెదను వినుము. సాత్త్వికాహంకారమువలనఁ జంద్రుఁ డధిదైవతముగాఁ గల మనస్సు జనించెను. మఱియు,

దిశలును, వాయువును, సూర్యుఁడును, ప్రచేతసుండును, నశ్వి దేవతులును, వహ్నియు, నింద్రుఁడు, నుపేంద్రుఁడును, మిత్రుఁడును, ప్రజాపతియు ననెడి పదుగురు దేవతలచే నధిష్ఠితములగు నింద్రియములు జనించినవి. వికారము నొందుచున్న రాజసాహంకారానుగృహీత సాత్వికాహంకారము వలనఁ గర్మేంద్రియపంచకము, జ్ఞానేంద్రియపంచకము, బుద్ధి, ప్రాణములు గలిగినవి. ఆ పదియింద్రియములకు నధిదేవతల వర్ణించెదను, వినుము, శ్రవణేంద్రియమునకు దిక్కులును, త్వగింద్రియమునకు వాయువును, నయనేంద్రియమునకు సూర్యుఁడు, రసనేంద్రియమునకుఁ బ్రచేతసుండును, ఘ్రాణేంద్రియమునకు నశ్వి దేవతలును, వాగింద్రియమునకు వహ్నియు. హస్తములకు దేవేంద్రుఁడును, పాదములకు నుపేంద్రుఁడును, వాయువునకు మిత్రుఁడు, గుహ్యేంద్రియమునకుఁ బ్రజాపతియు నధిదేవతలు. ఇట్లు భూతములు, నింద్రియములు, మనస్సును, వానికి విషయములైన తన్మాత్రములు వేఱువేఱ యుండి బ్రహ్మాండశరీరమును నిర్మింప నసమర్థములయ్యె. అప్పుడు భగవంతునిశక్తిచేఁ బ్రేరితంబులగుచు, నవి యన్నియు స్థూలత్వ సూక్ష్మత్వముల నంగీకరించి, కార్యకారణ భావాన్వితమయిన బ్రహ్మాండమును గల్పించె. ఆ యండము కల్పావసానమం దుదకంబున నుండఁ, గాలకర్మ స్వభావంబులం దగులుపడక, సనుస్తమును సజీవముగఁ జేయఁజాలు భగవంతుండు ప్రాణవంతిముగాఁ జేసెను. అంతట, నొక పురుషుం డా యండమును భేదించి బయలువెడలెను. ఆ పురుషుఁడు చతుర్ముఖరూపమున నున్న పరమపురుషుఁడే

అతనికి వేయితొడలు, వేయిపాదములు, వేయినేత్రములు, వేయిముఖములు, వేయిచేతులు గలవు. ఆ పురుషుని యవయవములనే బుద్ధిమంతు లందఱు లోకములనుగాఁ గల్పించి యున్నారు ఆ పురుషుఁడే విరాట్టని చెప్పఁబడును. అతఁడే సమస్త యోగీశ్వరులకు సమారాధనీయుఁ డయియున్నాఁడు. కటిప్రదేశము మొదలుకొని క్రింది యవయవములను నేడు లోకములనుగా భావించియున్నారు. కటిప్రదేశము మొదలు కొని మీఁదనున్న యవయవముల నూర్ధ్వభాగమందున్న యేడులోకములనుగా భావించియున్నారు మఱియుఁ, బ్రపంచ స్వరూపుఁ డగు భగవంతుని ముఖమునుండి బ్రహ్మకులంబు జన్మించె. అతని బాహువులనుండి క్షత్త్రకులంబు, నూరువుల వలన వైశ్యకులము, పాదములవలన శూద్రకులంబు నుద్భవించినవని చెప్పుదురు భూలోకంబును గటిపర్యంతప్రదేశము గాను, భువర్లోకంబును నాభిగాను, సువర్లోకంబును హృదయముగాను, మహర్లోకంబును వక్షఃస్థలంబుగాను, జనలోకంబును గంఠముగాను, తపోలోకమును స్తనద్వయముగాను, బ్రహ్మనివాసమయిన సత్యలోకమును శిరస్సుగాను జెప్పుదురు. మఱియుఁ, గటిప్రదేశము నతలలోకముగాను, తొడలను వితలముగాను, జానువులను సుతలంబుగాను, పిక్కలను దలాతలంబుగాను, జీలమండల మహాతలంబుగాను, బదాగ్రంబుల రసాతలముగాను, పాదతలములను పాతాళముగాను భావింతురు. ఇది భువనములు పదునాల్గు గలవని చెప్పినవారి మతము. ఇంక లోకంబులు మూఁడని చెప్పినవారి మతము వినుము. భూలోక మా పురుషుని పాదములనియు, భువర్లోకము

నాభియనియు, స్వర్లోకము మూర్ధమనియుఁ జెప్పుదురు. ఇట్లు భావించి, యా పురుషుని లోకమయునిగా నెన్నుదురు.

ఇది యైదవ యధ్యాయము.



విరాడ్విభూతివర్ణనము

అని చెప్పి బ్రహ్మ నారదునకు వెండియు నిట్లనియె. 'ఆ పురుషోత్తము ముఖంబువలన వేదవాక్కులును, వానికధి దైవతంబగు వహ్నియు నుదయించె. ఆ పురుషుని సప్త ధాతువులనుండి గాయత్ర్యాదిచ్ఛందస్సులు పుట్టెను. పురోడాశరూపమగు హవ్యమునకుఁ జరోదనాది రూపమగు హవ్యకవ్యములకు, నమృతాదిరసములకు, రసాధిపతియగు వరుణునకు, నా పురుషుని రసనేంద్రియము స్థానమయినది. మన వంటివారి ప్రాణాదులకును వాయువున కా మహాపురుషుని నాసికారంధ్రములు నిలయంబులు. సమస్తవాసనలకును, నోషధులకును, నశ్వి దేవతలకును బరమపురుషుని ఘ్రాణేంద్రియము నివాసంబు. దేవలోక సత్యలోకములకును, సూర్యునికిని, సకల చక్షువులకును, నా భగవంతుని చక్షురింద్రియము నిలయము. దిక్కులకును, గగనమునకును, శ్రుతిభూతములగు శబ్దములకును, బరమేశ్వరుని కర్ణేంద్రియంబు జననస్థానంబయి విలసిల్లు, శ్రేష్ఠమయిన వస్తువులకును, వర్ణనీయమగు సౌందర్యమునకును, భగవంతుని గాత్రము స్థానభూతంబయ యొప్పును. స్పర్శగుణమునకును, వాయువునకును, నీశ్వరుని త్వగింద్రియము నిలయంబయి తనర్చారు. యజ్ఞోపకరణములకు ముఖ్యములైన తరులతాగుల్మాదులకు సర్వేశ్వరుని రోమంబు

లాలయంబులు లోమములకు, శిలలకు, నీశ్వరునిగోళ్లు నిలయంబులు. మేఘజాలము లీశ్వరుని కేశంబులయి యున్నవి మెఱుపులు భగవంతుని శ్మశ్రువులుగా విలసిల్లు పాలనకర్త లైన యా లోకపాలకు లందఱికిఁ బరమేశ్వరు బాహువు లాలయంబులు సమస్తలోకముల క్షేమమునకు నీశ్వరుని విక్రమంబు లాధారంబులు. సమస్తమయిన కామములకు హరిచరణంబులు శరణంబులు జలంబులకును, శుక్లంబున కును, పర్జన్యునకును, బ్రజాపతిసృష్టికి నీశ్వరుని గుహ్యంబు నిలయంబయి యుండును. మఱియు, సంతానమునకును, కామాది పురుషార్థంబులకును, జిత్తమునకు సౌఖ్యమయి దోఁచు నానందములకు నచ్యుతుని యుపస్థేంద్రియమే స్థాన భూతంబు. యమునికిని, మిత్రునకును, మలవిసర్జనంబునకును నీశ్వరుని పాయువను నింద్రియము నిలయంబు. హింసకును, నిరృతికిని, మృత్యువునకును నీశ్వరుని గుదస్థానంబు స్థానంబయి యొప్పును పరాభవమునకును, నధర్మమునకును, నజ్ఞానము నకును హరియొక్క పృష్ఠభాగం బాలయంబయి యుండును. సమస్తమయిన నదీనదములకు ననంతుని నాడీసమూహము నిలయంబయి యుండును కొండల కన్నింటికి నీశ్వరుని శల్యం బులు స్థానంబులై విలసిల్లు. ప్రధానమునకును, సముద్రముల కును, భూతప్రళయమునకును ముకుందుని గర్భగోళము నివా సంబయి తనరును. సర్వప్రాణుల మనస్తత్త్వమునకుఁ బరమ పురుషుని హృదయంబు నివాసమై యొప్పుచుండును. ధర్మ మునకును, నాకును, నీకును, సనకసనందనాది యోగులకును, రుద్రునకును, జ్ఞానమునకును బరమాత్ముని యాత్మ యాధార

మయి యుండును. నేను, నీవు, నీశ్వరుఁడు, మునీశ్వరులును, సురాసురులును, పర్వతములును, గజములును, పక్షులును, మృగములును, ప్రాఁకెడి జంతువులును, గంధర్వులును, నచ్చరలును, యక్షులును, రక్షస్సులును, భూతగణమును, నురగులును, పశువులును, పితృదేవతలును, సిద్ధులును, విద్యాధరులును, జారణులును, వృక్షములును, భూమియందును నాకసమందును జలములందును జరించుచున్న తక్కిన జంతువులును, సూర్యాది గ్రహములును, నక్షత్రములును, గేతుసదృశమగు నక్షత్రములును, మెఱుపులును, మేఘములును, పెక్కేల? *భూత భవిష్యత్కాలములందు వర్తించు సమస్తవస్తుజాతమును భగవంతుని శరీరభూతమనియే గ్రహింపుము. ఆ పరమపురుషునికి శరీరభూతమయి యుండని స్వతంత్ర

* ఈ చెప్పుటవలన శ్రు॥ పురుషఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యమ్॥ అను శ్రుతి స్మరింపఁబడుచున్నది మఱియు, నిట సచరాచరమగు ప్రపంచమంతయు భగవంతునికి శరీరభూతమని చెప్పుటచే, భేదమున్నదని గ్రహింపరాదు. ఏమనఁగా, నామరూపముల విభజింపఁదగనంత సూక్ష్మావస్థలో నుండిన ప్రకృతియు, జీవుండును, గాలమును శరీరముగాఁగల పరమపురుషుఁడే, నామరూపముల విభజింపఁదగినంత స్థూలావస్థలో నున్న ప్రకృతియుఁ బురుషుఁడును కాలము శరీరముగాఁగల స్వస్వరూపమగు జగత్తుగా పరిణమించియున్నాఁడు. కావున, నేకత్వము సంభవించుచున్నది వేదాంతములందుఁగూడ నేకత్వము శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ॥ శ్రు॥ అయమాత్మా బ్రహ్మ॥ శ్రు॥ తత్త్వమసి॥ ఇత్యాది శ్రుతులచేఁ జెప్పఁబడుచున్నది.

వస్తువొక్కటియు లేదు. ఓ నారదా ! * ఈ విశ్వమంతయు నాభికి జేనెఁడు దూరమూర్ధ్వముగా నున్న హృదయకమలము నధిష్ఠించియున్న పరమాత్మచే వ్యాప్తమగుచున్నది మఱియు, హృదయాంతరములందు వర్తించు పరమాత్మ, స్వవాసస్థానమగు శరీరమును దన శాసనమున కధీనముగాఁ జేయుచు, స్వనివాసస్థానమగు శరీరముకంటె బహిర్భాగమం దున్న వస్తుజాతమునుగూడఁ దన ప్రశాసనాధీనముగా నెట్లు చేయుచున్నాఁడో, యట్లె † విరాట్టని పిలువఁబడు ననిరుద్ధునికిఁ గార్యభూతమయిన ప్రపంచకమంతట వ్యాపించి యంతర్భాగమందును, బహిర్భాగమందును, వర్తిలు సర్వము దన శాసనమున కధీనముగాఁ జేసికొనుచున్నాఁడు ఇట్లు భగవంతుఁడు జీవాంతరాత్మయై వర్తిలుచున్నను, భుక్తియు మోక్షప్రదుండునుగూడ నగుచున్నాఁడు ఇది యెట్లో చెప్పెద విను ‡ ఆ భగవంతుండు కర్మఫలసంబంధము లేనివాఁడు, కావున, మోక్షప్రదుఁడగుచున్నాఁడు. సమస్తచేతనాచేతనాత్మకమగు ప్రపంచమునందు లోపలను, వెలుపలను వ్యాపించి, సర్వమును దనయాజ్ఞకు లోఁబఱుచుకొనుచున్న పరమాత్మ

---

* ఈ చెప్పుటచే శ్రు॥ "అధోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యాముపరి తిష్ఠతి॥" శ్రు॥ "హృదయం తద్విజానీయా ద్విశ్వస్యాయతనం మహత్" అనెడి శ్రుతులు స్మరింపఁబడుచున్నవి

† ఈ చెప్పుటచే శ్రు॥ 'స్వభూమిం విశ్వతోవృత్వా" అనెడి శ్రుత్యర్థము సంగ్రహింపఁబడియె

‡ ఇందువలన శ్రు॥ "ఉతామృతత్వస్య" అను శ్రుత్యర్థము సంగృహీతమగుచున్నది

(మోక్షప్రదత్వరూపమగు) మహిమ హద్దులేనిది, ఓ నారదా! * సమస్తప్రపంచరూపముగా నున్నను, ప్రపంచగతమగు దోషము లతనికి సంభవింపక పోవుటయు, మోక్షప్రదాత యగుటయు నెట్లని శంకింపం బనిలేదు. ఆ రెండును దుర్లభములయినను, భగవంతుఁడు తన మహిమచేఁ గలుగునట్లు చేసికొనుచున్నాఁడు. మఱియు, భూమి మొదలగు లోకము లంశభూతములుగాఁ గల భగవంతుని కంశభూతములయిన భూలోకాదులందు దేవాది చతుర్విధభూతములు గలవని చెప్పుదురు. ఇట్లు చెప్పినంతమాత్రమున బద్ధజీవులకును ముక్తజీవులకును గలుగు ప్రాప్యస్థానములకు సాంకర్యము వచ్చునని తలపోయవలదు. † ఆ భగవంతుఁడు మరణాది వికారములు లేకపోవుటయు, మరణాదులవలని భయము లేకపోవుటయు, నిష్టము ప్రాప్తించుటయు, నను మూఁడువిధములగు నక్షయ సుఖమును, ప్రకృతిమండలమునకు వెలుపటనుంచియున్నాఁడు.

---

* ఇందువలన శ్రు॥ "ఏతావానస్యమహిమా" అనెడి శ్రుత్యర్థము స్మరింపఁబడుచున్నది.

† ఇందులకు మూలము "అమృతం క్షేమమభయం త్రిమూర్ధాధాయి మూర్ధని" ఇందు అమృత మనుటకు, మరణాదివికారములు లేకపోవుట యని యర్థము కాన, విరజవిమృత్యు శబ్దార్థములు చెప్పఁబడినవి. క్షేమ మనుటకు నిష్టప్రాప్తి యని యర్థము కావున, సత్యకామ, సత్యసంకల్ప శబ్దార్థములు గ్రహింపఁబడినవి అభయ మనుటకు మరణాదులవలనఁ గలుగు భయము లేకపోవుట యని యర్థము. కావున, నపహతపాప్మ విశోకశబ్దార్థములు సంగృహీతములయ్యె. ఈ మూఁడింటిచేతను నపహతపాప్మత్వాదికమగు గుణాష్టకము నావిర్భావము సంగృహీతమయ్యె

ఈ ప్రకారముగా నుపరిభాగమం దుంచిన త్రివిధమగు నైశ్వర్యము ముక్తులకు లభించునేకాని, బద్ధులకు లభింపదు. మఱి, బద్ధజీవులకంటె ముక్తజీవు లెక్కుడు సంఖ్యగలవారు. వారి ప్రాప్యస్థానములును పెక్కులు కలవు. ఈ ముక్తజీవులును, దత్ప్రాప్యస్థానములును భగవద్విభూతు లనియే యెఱుంగుము అట్లే తక్కువసంఖ్యగల బద్ధజీవులును, దత్ప్రాప్యస్థానములునుగూడ భగవద్విభూతులనియె తలపోయుము. భగవంతుని నాల్గంశముల విభూతిలోను నేకాంశము ప్రకృతిమండలమున కంతర్గతమై యున్నది. తక్కిన మూఁడంశముల విభూతియుఁ బ్రకృతిమండలముకంటె మీఁదుగా నున్నది. * ప్రకృతిమండలమున కంతర్గతమైన యేకపాద్విభూతియే సమస్తప్రపంచ మైనది. ఇదియే యహంకార మమకారములు గలవాఁడై వర్ణాశ్రమధర్మములతోఁ గూడికొని కర్మాధీనుఁడయియున్న బద్ధజీవునికిఁ బ్రాప్యస్థానము. ప్రకృతిమండలముకంటె నూర్ధ్వమందున్న భగవంతుని త్రిపాద్విభూతిని జన్మాదిరహితులగు ముక్తజీవులు పొందుదురు. ఓ నారదా! భగవంతుని యపారమహిమను నీకుఁ దెలియఁజేసితిని. ఇఁక బద్ధజీవులు భగవంతుని లీలావిభూతినిఁ జెందుటకును, ముక్తజీవులు భగవంతుని త్రిపాద్విభూతిని జెందుటకును మార్గములు కలవు. వానిని జెప్పెద, విను. ధూమాదిమార్గ

* ఈ ప్రపంచమంతయు భగవంతుని యేకాంశమం దున్నది యని చెప్పుటకుఁ బ్రమాణము 'ఏకాంశేన స్థితో జగత్' అనియు "యస్యాయుతాయుతశతైక కలాంశకాంశే విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగవృత్తమ్" అనియు నెఱుంగునది

మనియు, నర్చ్యాదిమార్గమనియు రెండుమార్గములు గలవని యిదివఱకే చెప్పియున్నాను. అందు ధూమాదిమార్గము భోగలక్షణమయినది. అర్చిరాదిమార్గము వైరాగ్యలక్షణ మయినది. జీవుఁడే రెండింటినిగూడ నాక్రమించి యుండును. మఱియు, నీ మార్గములలో ధూమాదిమార్గమును బొందుట కుపాయము కర్మరూపమగు నవిద్యయె. అర్చిరాదిమార్గమును బొందుట కుపాయము భగవదుపాసనారూపమగు విద్యయె. జీవుఁడే విద్యావిద్య లను నుపాయముల రెండింటిని నాశ్రయించి యుండు. ఇఁక భగవంతుఁడు ప్రపంచమునకు విలక్షణుఁడై యుండుటను, నతఁడు ప్రపంచరూపముగాఁ బరిణమించు చున్నను దద్గతదోషములను బొరయనివాఁడై యుండుటను దెల్పెద వినుఁ. * విరాట్టని పిలువఁబడుచు నండకారణభూతుఁ

* ఇందులకు శ్రు॥ "తస్మాద్విరా డజాయత" యనెడి శ్రుతి. "తస్మాత్ = పరమప్రస్తుతకారణపురుషునివలన, విరాట్ = అనిరుద్ధుఁడు, అజాయత = అవతరించెను" మఱియు, నా యనిరుద్ధునివలన బ్రహ్మాండ శరీరకుఁడయిన పురుషుఁ డవతరించెను ఆ వైరాజపురుషుఁడే భూమిని బశ్చాద్భాగమందును, నగ్రభాగమందును, నూర్ధ్వాధోభాగములందును, నంతర్బహిర్భాగంబులందును వ్యాపించి, తద్విలక్షణుండయి వఱలు చున్నాఁడు మఱియు నిట గ్రహింపవలసిన యంశము మఱియొకటి గలదు. ప్రకృతి, కారణావస్థయందు నామరూపముల విభజింపఁ దగనంత సూక్ష్మావస్థగలదై యుండును అదియే కార్యావస్థయందు నామరూపముల విభజింపఁ దగినంత స్థూలావస్థకలదై యుండును ఇట్లు నామరూప విభాగానర్హ సూక్ష్మప్రకృతియుఁ, బురుషుండును, శరీరముగాఁగల భగవంతుఁడు జగమున కుపాదానకారణ మగుచున్నాఁడు. ఇట్లు ప్రకృతి పురుషవిశిష్టుఁడగు పరమాత్మయే రూపముగాఁ గల యుపాదానకారణము

డగు ననిరుద్ధుండు స్వశరీరభూతమగు నుపాదానకార
ణమువలననే యండమును సృజించి, తానును దేవాది వ్యష్టి

---

మూఁడవస్థలు కలదగుచున్నది. ప్రకృతియనియుఁ, బురుషుఁడనియు, నీశ్వరుండనియు, మూఁడువిధములుగా విభజింపవచ్చును ఈ మూఁడును మూఁడవస్థలుగలవి అందుఁ బ్రకృతి స్వరూపపరిణామ మను నవస్థను జెందియుండును పురుషుండు స్వభావము మాఱుట (అనఁగా, మఱియొక స్వభావము గలిగియుండుట) యను నవస్థ నాశ్రయించియుండును. ఈశ్వరుండు కార్యావస్థయందున్న చేతనాచేతనములకు నియామకుఁడగుట యను నవస్థగలవాఁడు ఇట్టి మూఁడును సంకీర్ణములు కాకుండ నిర్ణీతము లయియున్నవి మఱియు 'తెల్లనితంతువులతో నేసిన వస్త్రము తెల్లగాను, నల్లనితంతువులతో నేసిన వస్త్రము నల్లగాను బరఁగుచుండును తంతువు లందున్న శ్వేతత్వ నీలత్వము లాయా వస్త్రములందు మాత్రమె యుండును గాని, యితరస్థలములం దుండవు అట్లె ప్రకృతిపురుషులందుండు స్వరూప పరిణామ స్వభావపరిణామము లా ప్రకృతిపురుషులందే యుండును గాని, మఱియొకస్థలమం దుండలేవు కావున, భగవంతుఁడు సర్వదా ప్రకృతి పురుషసంబంధము గలిగియున్నను, బ్రకృతియందున్న స్వరూపపరిణా మాదులగు దోషములనుగాని, పురుషునందున్న యజ్ఞత్వాది దోషములను గాని, పొందఁడు

(ఇది మతాంతరము ననుసరించి వ్రాయఁబడినది ) ఈ బ్రహ్మాండ మంతయు నతని జేనలో నిమిడియుండును భూత భవిష్య ద్వర్తమానరూప మగు లోకమంతయు నతనిలో నుండుదాని నెవ్వరును దెలిసికొనలేరు సూర్యుఁడు తన మండలమందుండియే సమస్తమును బ్రకాశింపఁజేయు చున్నట్లు, పరమపురుషుండు విలసిల్లుచు బహిరంగముల నంతరంగములను బ్రకాశింపఁజేయును ఆ పురుషుఁడు నశ్వరములయిన పరలోకసుఖముల నీ లోకసుఖముల నతిక్రమించి, నిత్యసుఖరూపుఁడయియున్నాఁడు అందుచేత నతఁడు మోక్షము నిచ్చుటకును, నభయప్రదానము చేయుటకును,

ప్రపంచరూపుఁడై యున్నాఁడో, యా యండమందు
మాత్రమే పరిచ్ఛిన్నుండు గాక, యాశ్రయభూతముగు

---

సమర్థుండయి యున్నాఁడు. ఓ నారదా! ఆ పురుషుని మహిమ యింతంత యని చెప్పుటకు వలనుపడదు. అతని మహిమకు హద్దులేదని నమ్ముము. అతని పాదముల నాల్గింటిలో నీ భూమియును సమస్తభూతములు నిమిడియున్నవి. ఆ విరాట్పురుషుఁడు మూఁడుమార్గముల చేత మోక్షము, ఇష్టవస్తుప్రాప్తియు, ననిష్టనివృత్తియు నను నీ మూఁడింటిని ధరించుచున్నాఁడు. ఓ నారదా! మఱికొందఱు మహాత్ములీ యంశమును గుఱించి మఱియొకరీతిగాఁ జెప్పుచున్నారు చెప్పెదను వినుము. భగవంతుఁడగు విరాట్పురుషుని యొక పాదము ప్రపంచకము, భూతములు నయ్యెను తక్కిన మూఁడుపాదములు నిత్యసుఖము నిచ్చునట్టి యూర్ధ్వలోకము లాయెను. ఈ మూఁడులోకముల యందును నశ్వరమగు సుఖమే కాని నిత్యసుఖము లేదు. మూఁడులోకములకు మార్గమువలె నొప్పుచున్నది మహర్లోకము. ఆ లోకము మొదలుకొని తక్కిన మూఁడులోకములయందు (అనఁగా మహర్లోక జనలోక సత్యలోకముల యందు) అమృతము, క్షేమము, అభయము క్రమముగా నుంపఁబడినవి. బ్రహ్మచర్యాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము, నీ మూఁడును భగవంతుని పాదరూపములయిన మూఁడులోకములకు బహిరంగముగా నుండును. అందుచేత, నా యా యాశ్రమములకుఁ దగిన ఫలములుగూడ ముక్తిసాధకములె కాని, లోకత్రయాంతర్గతములయి యుండమిచే, నా యా యాశ్రమవాసులకన్న నితరుల కనుభవింప వలనుపడదు. భగవంతుని నాల్గవపాదము గృహస్థాశ్రమరూపమని చెప్పవచ్చును. గృహస్థాశ్రమమందున్నవా రాచరించుచున్న యజ్ఞాదిరూపమయిన ఫలము కామ్యమయియుండును. కనుక, నది మూఁడులోకముల కంతర్గతమయియే యుండును ఇయ్యది యెప్పుడు ముక్తిసాధకము కానేరదు. ఇట్లు భగవంతుఁడగు విరాట్పురుషుని చతుష్పాదరూపమయిన యాశ్రమములో గృహస్థాశ్రమము తక్కఁ దక్కిన మూఁడును ముక్తిసాధకము లగుచున్నవి.

ఘటాది పదార్థములనుండి సూర్యుండు కిరణములచే నతిక్ర మించి బహిర్భాగమందుఁగూడ వ్యాపించియున్నట్లు వ్యాపించి యున్నాఁడు. భగవంతుఁ డిట్లు బ్రహ్మాండము నతిక్రమించి యున్నాఁడు. కావున, దానికంటె విలక్షణుఁడనియు, శరీర భూత చేతనాచేతనములందున్న దోషములఁ బొరయఁ డనియుఁ దెలిసికొనుము. ఓయీ! సమస్త మా పురుష స్వరూపమే యయినచో యాగములును, వానికి సాధనము లయిన వస్తువులును, నా పురుషునికంటె వేఱుకావు గనుక, యాగాదులచే నాతని నారాధించుట యెట్లు తటస్థమగు? నని యడిగినచోఁ జెప్పెదను వినుము నే నా యనంతశక్తియగు

---

నాల్గవపాదమయిన గృహస్థాశ్రమము ముక్తిసాధకము కానేరకయున్నది. భగవంతుండు కామనచేతఁ జేయఁబడు యాగాదికర్మములకును, గోర్కె లేకుండఁ జేయఁబడు భగవదుపాసన మొదలగువానికి నాధారభూతుఁ డయి యున్నాఁడు ఆ కారణముచే నాదిపురుషుఁడు రెండుమార్గముల నేర్పఱిచె. అందులో నొకటి ఫలకామముచేఁ బొందఁదగినది రెండవది నిష్కామములచేఁ బొందఁదగినది. కావున, విరాట్టు కర్మజ్ఞానముల రెండిఁటికి నాధారుఁడయి యున్నాఁడని తెలిసికొనుము ఓ నారదా! విరాట్టున కంతర్వర్తియయిన ఫలములను జెప్పియున్నాను విరాట్టుకంటె నీశ్వరుఁడు మఱియొకఁ డున్నాఁడు ఆ సమాచారము తెలిపెదను వినుము పృథివ్యాది పంచభూతములచేతను, చక్షురాదులయిన యింద్రియములచేతను, సత్వాది గుణములచేతను గల్పితమయి, వేయిమంది సూర్యులతో సమానమయిన కాంతిగల యండము ప్రపంచస్వరూపుఁడయిన యా యీశ్వరునివలనఁ గలిగినది ఆ యండమున విరాట్టు జనించి యందుండి యతిక్రమించి నాఁడు ఈశ్వరునివలన నండము జనించినదనియు, నా యండమువలన విరాట్టు నిర్గమించెననియు గ్రహింపుము

నీశ్వరుని నాభికమలమునుండి యుదయించి, యా పురుషునిఁ గూర్చి యాగముచేయ దలంచుకొంటిని. కాని, భగవంతుని యవయవములు తప్ప, యాగోపకరణములయిన పదార్థములలో నొకటియైన లభించినది కాదు. అంతట, నేను గొంచెము యోజించి యా భగవంతుని రూపమును మనస్సులో నిల్పి కొని యజ్ఞమునకుఁ దగినపశువులను, చంద్ర, మోదుగు మొదలగు వృక్షజాతులను, యాగభూమిని, యాగమునకుఁ దగిన వసంతాది కాలములను, పురోడాశము మొదలగు వస్తువులను, అందుల కుపయోగించు వ్రీహి, యవ, గోధూమాదులగు నోషధులను, ఘృతము మొదలగువానిని, సోమరసము మొదలగువానిని, సువర్ణము మొదలగు లోహములను, కపాలాదులను, జలమును, యజుస్సామాదిఋక్కులను, చతుర్హోత్ర శబ్దములఁ జెప్పఁబడు మంత్రములచేఁ బ్రకాశితమగు కర్మము, జ్యోతిష్టోమాది నామములను, మంత్రములను, దక్షిణలను, వ్రతములను, దేవతానుక్రమమును, ప్రయోగవిధులను, దంత్రములను, స్వర్గాది ఫలములను, మంత్రార్థప్రకారముగా హవ్యాదుల వినియోగములను, ప్రాయశ్చిత్తములను, దేవతలంగూర్చి కర్మసమర్పణమును, నీ మొదలగు యాగాంగములనెల్ల భగవంతుని యవయవములచేతనే కల్పించితిని. ఓ నారదా! యిట్లు నేను భగవంతుని యవయవములచేతనే సమస్తమయిన యాగసాధనములను సంపాదించి, యీశ్వర ప్రీతిగా యాగమును జేసినాఁడను. తరువాత, నీ సోదరులయిన మరీచ్యాదులు నాచేసిన యాగమును జూచి మిగుల భక్తి సంయుతులయి, స్వతస్సిద్ధముగాఁ దా నవ్యక్తుఁడయినను,

నింద్రాదిరూపముగా వ్యక్తుఁడయిన పరమపురుషు నుద్దేశించి యజ్ఞముల నాచరించిరి అదిచూచి మనువులు, దేవదానవులు, రాజులు, మునీశ్వరులు మొదలగువా రందఱు తమ కవసరము వచ్చినప్పుడు నిశ్చలమయిన నియమములతో విష్ణుప్రీతిగా యాగముల నాచరించిరి. ఇట్లే పెక్కండ్రు విష్ణుప్రీతిగా యజ్ఞములఁ జేయుచున్నారు ప్రాకృతగుణరహితుఁడగు పరమాత్మ తనయందు సూక్ష్మరూపముగా నిమిడియున్న జగములను సృజించుకొఱకు మాయాగుణములయిన సత్త్వరజస్తమోగుణముల నాశ్రయించి, సృష్టియందు నన్ను నియోగింప, నే నా యీశ్వరుని యనుమతిప్రకారమున లోకముల సృజించుచున్నాను. ఆ శంకరుఁ డాపురుషుని యనుమతి చొప్పున నే లోకముల నెల్ల సంచరించుచున్నాఁడు ఆ భగవంతుఁడే పురుషరూపముతో లోకములను బాలించుచున్నాఁడు. ఇట్లతఁడు సృష్టిస్థితిలయములఁ జేయ సామర్థ్యము గలిగి వర్తించుచున్నాఁడు. చేతనాచేతనరూపమయిన ప్రపంచమునందు నా భగవంతునికంటె నతిరిక్తమయినదికాని, యధికమయినదికాని, సమమయినదికాని వస్తువు లేదుసుమీ! ఇదియంతయు నిశ్చయమని తలపోయుము నావాక్య మెంతమాత్రము నసత్యము కానేరదు. భగవంతుని గుణవర్ణనామహిమచేత నానోటివెంబడినుండి బయలువెడలిన వాక్యము లన్నియు సత్యము లని తలపోయుము. నా యింద్రియము లెప్పుడును చెడ్డత్రోవయందుఁ బ్రవేశింపనేరవు. నేను వేదమయుండను, తపోమయుండను, నవబ్రహ్మలచేతను నమస్కరింపఁ బడుచున్నాను. భగవదనుగ్రహామువలన జ్ఞానసంప

దను బొందితిని. అట్టి నేను, నిర్విఘ్నమయిన యోగము నవలంబించియు నెవఁడు స్వమాయావిభవమును బొందియున్నాఁడో, యా భగవంతుఁడు స్వరూపగుణములఁబట్టి యిట్టివాఁడని నిశ్చయింపలేకున్నాను. తక్కినజీవు లెట్లు తెలిసికోఁగలరు? సంసారమునుండి మఱలుచుఁ, దన్ను శరణుజొచ్చినవారికి శుభములను గలిగించుచు, సంసారదుఃఖములను నశింపఁ జేయఁజాలు నా పరమపురుషుని పాదపద్మములకు నమస్కారము లొనర్చుచున్నాను. ఆకాశము తాను దన యంతము నెట్లు పొందలేదో, యట్లె తనమాయ నతఁడెఱుఁగఁజాలఁడు. భగవంతుని యథార్థస్థితిని నే నెఱుఁగను, మీ రెఱుఁగరు, ఈశ్వరుఁ డెఱుంగఁడు. ఇట్లుండ, నా భగవంతుని మాయచే మోహితులై, యచేతనమగు శరీరమును నాత్మగా భావించు దేవత లా భగవంతుని తత్త్వ మెట్లెఱుంగుదురు? ఆ పరమపురుషుఁడు పెక్కులవతారములఁ దాల్చియున్నాఁడు. దివ్యచేష్టితముల నెన్నియో చేసియున్నాఁడు. అట్టి చేష్టితములను మన మందఱము తఱచుగా గానము చేయుచున్నాము. కాని, యతని యాథార్థ్యము నెఱుఁగఁజాలము. అట్టి మహామహిముఁడగు నా భగవంతుని కనేక నమస్కారముల నాచరించుచున్నాను. కర్మాధీనమగు జగంబునకుఁ గారణభూతుఁడగు పరమపురుషుఁడు తానే కర్తయయి, ప్రతికల్పమందును నాధారభూతుఁడగు తనయందు సాధనభూతుఁడయి తనచేత నుపాదానకారణమైన తన్నును సృజించుచున్నాఁడు. ఓయీ! జగద్వ్యాపారము భగవంతునికిఁ గర్మాధీనమయినదా? లేక లీలార్థమా? యని

యడిగినఁ జెప్పెద విను. అతఁడు పుణ్యాపాపకర్మములు లేనివాఁడు. కావున, భగవంతుని జగద్వ్యాపారము జీవుని వ్యాపారమువలెఁ గర్మాధీనము కాదు అతఁడు కేవలము జ్ఞానమయుఁడు అతఁడు స్వయంప్రకాశుఁడు అతఁడు జీవునివలె నాధారము నపేక్షించియుండఁడు అతఁడు స్వరూపమువలనను, ధర్మమువలనను నిర్వికారుఁడు. అతఁడు పరిపూర్ణమయిన సమస్తకామములును గలవాఁడు అతఁడు ప్రాకృతగుణములు లేనివాఁడు అతఁ డుత్పత్తివినాశములు లేనివాఁడు. అతఁడు నిత్యుఁడు. అతనితో సమానమైనదిగాని, యతనికంటె నధికమయినదిగాని వస్తువు లేదు. అట్టి భగవంతుని శాంతాత్ములును, జితేంద్రియులు నగు ఋషులు సదూహలచేఁ దెలిసికొనుచున్నారు. కాని, దుష్టులు తమకు తర్కములచేఁ దెలిసికోలేరు. విరాట్పురుషుఁడు భగవంతుని మొదటి యవతారము. కాలమును బ్రకృతిగతమయిన పరిణామస్వభావమును, జేతనాచేతనములును, మనస్సును, స్థూలసూక్ష్మరూపమగు ద్రవ్యమును, బృథివ్యాది వికారములును, సత్త్వాది గుణములును, జ్ఞానకర్మాత్మకములయిన యింద్రియములును, నంతరిక్షమును, స్వర్గమును, స్థావరములును, జంగమములును, నేనును, రుద్రుండును * యజ్ఞస్వరూపుఁడగు విష్ణువును,

---

* ఇట విష్ణువు విభూతుల మధ్యమందుఁ బరిగణింపఁబడినను, నతఁడు విభూతికాఁ డని తెలియవలయును మఱి యెందుల కట్లు చెప్పఁబడిన దనఁగాఁ, బాలనవ్యాపారమున కధికారియయిన విష్ణ్వవతారమందుండు పాలనానుగుణసామర్థ్య మేదికలదో, యా సామర్థ్యమునకు విభూతిత్వము గలిగించుటకని తెలియునది మఱియు "సర్వేశబ్దా స్స్వస్మి

దక్షాది ప్రజాపతులును, భవాదృశులగు మునులును, నింద్రాదులును, పక్షిశ్రేష్ఠులును, పాతాళలోకాధిపతులగు వాసుకిప్రభృతులును, భూలోకాధిపతులగు రాజులును, గంధర్వపతులును, యక్షేశులును, విద్యాధరనాథులును, చారణశ్రేష్ఠులును, రక్షోధిపతులును, నురగనాయకులును, గజనాథులును, ఋషివర్యులును, బితృపాలురును, దైత్యేశులును, సిద్ధేశ్వరులును, దానవప్రభువులును, ప్రేతనాయకులును, బిశాచాధిపతులును, భూతేశులును, జలచరపతులును, మృగశ్రేష్ఠములును, బశుశ్రేష్ఠములును, నీయందఱు భగవంతుని విభూతు లని తెలిసికొనుము. ఇంతేకాక, లోకమందు నేది యైశ్వర్యవంతమో, యేది తేజస్సుకలదో, యేది యుత్సాహముకలదో, యేది వేగముకలదో, యేది ధైర్యముకలదో, యేది ధారణాసామర్థ్యముకలదో, యేది యోర్పుకలదో, యా వస్తుసముదాయమంతయు భగవద్విభూతి యని యెఱుంగుము. మఱియు శోభయు, లజ్జయు, నియామ్యవర్గమును, బుద్ధియు క్రమములగు వస్తువులును, నద్భుత

న్నేవ పర్యవస్యంతి" అనగా, నన్నిశబ్దములు తనయందే పర్యవసానము నొందునని యర్థము ఎట్లనఁగాఁ, బక్షివృక్షాది శబ్దము లా యా శరీరములను బ్రతిపాదించుచు నా యా పక్షివృక్షాదుల కంతరాత్మయైయున్న భగవంతునియందుఁ బర్యవసితము లగును. ఈ చెప్పినప్రకారము పక్షివృక్షాది శబ్దములచే సామానాధికరణ్యము నాశ్రయించి భగవంతుని, భగవచ్ఛబ్దముచేఁ బశ్వాదులను జెప్పవచ్చును. కాని, విష్ణ్వవతారగత పాలనానుగుణసామర్థ్యమునకును, విష్ణువునకు నభేదబుద్ధిచేఁ దాదృశసామర్థ్యమును బరించుటకు మాలుగా విష్ణువునే పఠించియున్నాఁడు.

మనువులును, నింద్రాది దేవతలును, రాజులును, జగ
త్పాలనమందు నియమింపఁబడిరి. అధర్మమును రుద్రుండును,
గోపాధీనములయిన సర్పములును, రాక్షసాదులును, సంహా
రము విషయమై నియమింపఁబడిరి సర్వాత్మకుండయిన
యీశ్వరుం డీప్రపంచమునకు సృష్టిస్థితిలయముల నొందింప
హేతుభూతుఁడయియుండును. కావున, నమ్మహాత్ముని లీలావ
తార కర్మంబు లనంతంబులు. భూమియందున్న పరాగము
నయినను లెక్క పెట్టవచ్చునుగాని, యాపరమేశ్వరుని దివ్య
చేష్టితంబులు గణింప నెవ్వరికిఁ దరము కాదు. అయినను, నాకుఁ
దెలిసినంతవఱకు నీకు సంగ్రహించి చెప్పితిని సవిస్తరంబుగాఁ
జెప్పుటకు నాకే తరముకాదనగాఁ, దక్కినవారిసంగతి చెప్ప
నేల? పూర్వము త్రివిక్రమావతారము దాల్చిన భగవం
తుని యప్రతిహతమయిన పాదవేగముచే నధికముగాఁ
గంపించుచు, స్వనివాసములనుండి జాఱిపడుచున్న ప్రాణులను
జూచి సత్యలోకవాసులందఱు భయమున స్తంభించిరి అట్టి
మహాపురుషుని దివ్యకర్మములను వీర్యము నెవ్వరు గణింపఁ
గలరు? మఱియు నా వాసుదేవుని మాయాబలము నే నెఱుం
గను నీ భ్రాతలగు సనకాది మునీశ్వరు లయిన నెఱుంగరు,
మామాటకేమి? అటుండనిమ్ము. ఆ వాసుదేవుని యవతారావ
తారమయిన శేషుఁడు సహస్రముఖములుగలవాఁ డయినను,
నమ్మహాత్ముని గుణగణముల గానముచేయుచు నిప్పటికిని
లెక్కింప లేకున్నాఁడు. తక్కినవారి సంగతి చెప్పనేల?
ఓయీ! భగవంతుని మాయాబలమును మీరే దాఁట
లేనిచో, నింక దాని నతిక్రమించువా రెవ్వరు? అని యడి

గదవేని చెప్పెదను. వినుము. సమస్తమును విడిచిపెట్టి నిష్క-
పటముగ భక్తితో సేవించుచున్నవారిని భగవంతుఁడు కరు
ణింపఁగలఁడు. అట్లు భగవంతునిదయకుఁ బాత్రులైనవారలు
సంసారములోఁబడి కాలమంతయు వ్యర్థముగాఁ గడపక,
శునక సృగాలములు భక్షింపఁదగిన యీ తుచ్ఛశరీరము
లందు నహంకార మమకారములను విడిచి, యా భగవంతుని
మాయ నతిక్రమించి యతని దెలిసికొనఁగలరు అట్టి మహాను
భావులు కొందఱు గలరు వారిని జెప్పెదను వినుము. ఓ
నారదా! భగవంతుని నెఱిఁగి యతని మాయను నేను దరిం
చితి. కేవలము భక్తియోగముల నవలంబించియున్న సన
కాదు లందఱు భగవంతు నెఱుంగుదురు మఱియు భగవ
న్మాయను శంకరుఁడుగూడఁ దరించెను. దైత్యకులమున కధి
పతియగు ప్రహ్లాదుఁడును, స్వాయంభువమనువును, నతని భార్య
యగు శతరూపయు, నతనిపుత్త్రులగు ప్రియవ్రతుఁడు మొద
లగువారును, నతని దుహితలగు దేవహూతి మొదలగు
వారును, నాపరమపురుషునిఁ దెలిసికొని మాయను దరించిరి.
మఱియుఁ ప్రాచీనబర్హి యను రాజేంద్రుఁడును, ఋభుమహ
ర్షియు, నుత్తానపాదుని కుమారుండయిన ధ్రువుఁడును,
ఇక్ష్వాకు, దిలీప, భీష్మ, యయాతి, ముచికుంద, రంతిదేవ,
శ్రుతదేవ, విభీషణ, విదుర, దేవల, జనక, హనుమదాది
మహాత్ములును, గయుఁడు, నహుషుఁడు మొదలగువారును,
సౌబరియు, నుదంకుండును, శిబియుఁ, బిప్పలాదుండును, బరా
శరుండును, భూరిషేణుండును, నుపేంద్రదత్త, పార్థ, శ్రుత
దేవాదులును, నా భగవంతుని యందలి భక్తివిశేషముచే

విష్ణునిఁ దెలిసికొని యతని మాయను దరించెదరు. మఱి యొకటి చెప్పెదను వినుము స్త్రీలు, శూద్రులు, శబరులు, మ్లేచ్ఛులు మొదలగు పాపజీవులే నారాయణుని పదపద్మముల నాధారముగ నమ్మి నిరంతరము సేవించి యోని దయకుఁ బాత్రులై భగవంతునిఁ దెలిసికొని, యతనిమాయను దరించు చున్నప్పుడు, ధారణాయోగమునందుఁ బ్రవీణులయిన మహాత్ములు భగవంతుని మాయను దరింతురని వేఱ చెప్ప వలయునా! ఓయీ! నీవంటివా రందఱుఁ దెలిసికొనెడి భగవంతుని స్వరూప మెట్టిది? అని యడిగెదవేని, చెప్పెద వినుము ఆ భగవంతుని స్వరూపము శోకరహితమయినది. అది నిత్యానందసుఖము కలిగించునది. అదియె బ్రహ్మమని చెప్పఁబడుచున్నది మాయాకార్యము లా స్వరూపము నెంత మాత్రము స్పృశింపలేవు. సాధ్యసాధనాదులతోఁ గూడిన క్రియాకలాపమును బ్రతిపాదించు వేదపూర్వభాగ మాతని స్వరూపమును బోధింపఁజాలదు. కాని, యుపనిషద్వాక్యములు బోధించునేమో! అదియే పరమాత్మతత్త్వమనఁబడు. అది కర్మాధీన మెప్పుడును గాదు అది ప్రకృతిపురుషులకంటె భిన్నమయినది. అది యేకరూపమయినది. చిదచిత్తుల కంత ర్యామియై యున్నను, నాయా వస్తువులందుండు దోషములు దానికిఁ గలుగవు. అది కేవలము జ్ఞానమయ మగుటచే, నొక ప్పుడును జడత్వము నొందదు. అది సంసారము నివర్తించు టకుఁ దగినది. అది యెల్లప్పుడు నశనాదులగు నూర్ములు లేనిది. కావుననే, తదుపాసకులకుఁగూడ శాంతిని గలిగించును. యతీశ్వరులు జీవసహాచరమైన మానసమును జక్కఁగ నియ

మించి, యట్టిభగవంతుని స్వరూపమందుఁ జేర్చి, సమస్త సంశయములను ద్రోసి, వర్షప్రదుఁడయిన యింద్రుఁడు కూప మును ద్రవ్వు సాధనమును విడుచునట్లు, స్వర్గాదిఫలముల సాధించు కర్మమును బరిత్యజింతురు. ఓయీ! స్వర్గాదిఫలము లకు సాధనమగు కర్మమును విడిచినచో, స్వర్గాదులఁ గోరు చున్నవారు తమకోర్కెల నెఱవేర్చుకొనుటెట్లు? అనినఁ జెప్పెదను విను. భగవంతుఁడు సర్వాంతర్యామియై యుండును గాన, బ్రాహ్మణాది వర్ణములకును, బ్రహ్మచర్యాద్యాశ్ర మంబులకును, నుచితమగు కర్మములకు ఫలరూపములయిన స్వర్గాదుల నిచ్చునట్టివాఁడు నా భగవంతుఁడె కావున, స్వర్గాదుల నపేక్షించువారయినను, దప్పక యా భగవంతునే యారాధింపవలసియున్నది ఓయీ! భగవంతుఁడు సర్వాంత ర్యామి యయినచో, నతనికిఁ జేతనాచేతనగత దోషములు గలుగవా యన, వలనుపడదు. భగవంతుఁడు కర్మాధీనమగు నుత్పత్తి వినాశాదులు లేనివాఁడు. కావున, స్వదేహమునకుఁ గారణములగు భూతసూక్ష్మములు నశించుటం జేసి, దేహము నశించినను, నా దేహములందంతరాత్మయైయున్న భగవంతుఁ డాకాశమువలె నిత్యుఁడయి యుండునేకాని, యా దేహము తోనే నశింపఁడు. అతనికి వ్యాప్యగతములగు దోషము లుండినయెడ, దేహము నశించినతోడనే యాతఁడు నేల నశింపఁడు? ఓ నారదా! విశ్వకారణుండును జ్ఞానాది గుణ ములు గలవాఁడునగు వాసుదేవుని విభూతులనుగూర్చి సంగ్ర హముగాఁ జెప్పియున్నాను. నీ వీ విభూతులను విపులముగాఁ

జేయుము. ఈ భగవద్విభూతి వృత్తాంతము పూర్వము భగవంతుఁడు నాకుఁ జెప్పినాఁడు. కావున, నిది భాగవత మనఁబడును. నీవు దీనిని బాగుగ గ్రహించి, సర్వాంతరాత్మయగు భగవంతునియందు మానవులకు భక్తి యెట్లు సంభవించునో, యట్లు విపులముగాఁ జేయుము. ఓయీ! త్రివర్గము వర్ధిల్లునట్లని చెప్పక, భగవద్భక్తి వృద్ధిచెందునట్లని యేల చెప్పితివి అందువా? అట్లనకుము. మానవులయి పుట్టి, తా మొనరించు కర్మకలాపముచే భగవంతుని సంతోషింపఁ జేయలేనిచో, నట్టికర్మములు నిష్ప్రయోజనము లేకదా! భగవంతుని సంతసింపఁజేయునది భక్తి తప్ప మఱియొకటిలేదు కావున, నందఱు భక్తినే యవలంబింపవలెఁగాని, త్రివర్గసాధనకర్మములను మాత్రమే యవలంబింపఁగూడదు. విష్ణువునందు భక్తియుత్పన్నమయినచో, వర్ణాశ్రమాచారములతోను, దానములతోను, దపంబులతోను, స్వాధ్యాయంబుతోను నేమి ప్రయోజనము? తాదృశ భగవద్భక్తి జనింపనిచోఁ దాదృశ వర్ణాశ్రమాచారములతో నేమి ప్రయోజనము? మాయా పిహితులమయిన మాకు నా పరమేశ్వరునియందు భక్తియెట్లు జనించునని యందువేని, చెప్పెద వినుము. ఆ భగవంతుని లీలలను సర్వదా వినుచు, గానము చేయుచు, నమ్మహాత్ముని నామమునే స్మరించుచుఁ బ్రవర్తించుచున్న మానవుని భగవన్మాయ యెంతమాత్రము మోహింపఁజేయలేదు కనుక, భక్తి తప్పక కలుగును కాని, కలుగకపోదు. అందువలన, నవశ్యము భగవంతుని లీలలను విపులముగాఁజేసి మానవు

లకు భక్తి కలుగునట్లు వర్ణింపుము' అని యిట్లు బ్రహ్మ నారదునకుఁ జెప్పె నని శుకయోగి రాజేంద్రునకుఁ జెప్పెను.

ఇది యేడవ యధ్యాయము.

---

పరీక్షిత్తు శుకుని వివిధప్రశ్నము లడుగుట

అట్లు చెప్పిన శుకయోగినిఁ జూచి పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. ఓ యోగీంద్రా! నారదుం డట్లు ప్రాకృత గుణ రహితుఁడగు భగవంతుని కల్యాణగుణముల వెలువరించుటకు బ్రహ్మచేఁ బ్రేరితుండయి యెవ్వరెవ్వరి కెట్లు చెప్పినాఁడు? ఓ మహామునీ! ఆ సంగతి వినుటకు నా మన స్సెంతయుఁ గుతూహలపడుచున్నది. కనుకఁ దెలియఁజేయుము. మఱియు, భగవంతుండగు విష్ణుమూర్తికథలు లోకములకు మంగళ ప్రదములుగదా! అట్టి మంగళప్రదములయిన చరిత్రములను జెప్పుము నీ వట్లు చెప్పినచో, నా పరమాత్మునియందు నా మానసమును బ్రవేశింపఁజేసి, యీ హేయమైన కళేబరమును విడిచిపెట్టెదను. మనోహరమయిన భగవంతుని కథలను భక్తి శ్రద్ధలతోఁ గూడికొని వినునట్టివాని హృదయపంకజమునందు భగవంతుఁడు కర్ణద్వారముగుండఁ బ్రవేశించుననియు, భగ వంతుఁ డట్లు భక్తుల మానసమునందుండి శరత్కాలము నదీ తటాకాదులయందున్న కలుషజలమును నిర్మలముగాఁ జేసి నట్లు, వారి పాపములఁ దొలఁగించి హృదయములను నిర్మల ముగాఁ జేయుననియుఁ బెద్దలు చెప్ప వినియున్నాను. మఱియు, లోకములోని మానవులు కార్యాంతరాసక్తు లయి పరదేశములకుఁ బోయి తిరిగివచ్చునప్పుడు, మార్గమధ్యమున

నెండచేతను, మార్గాయాసముచేతను మిగుల నలంత చెంది దప్పిగొని వచ్చి తమ మందిరములు చొచ్చి యా శ్రమ మంతయుం దొలఁగించుకొని తమ యిండ్లకడనే యుందురు గాని, బైకిం బోవుట కెంతమాత్రము నంగీకరింపరుగదా! అట్లే భక్తులు సంసారబాధలచే మిగులం గుందికొంది భగవంతుని పాదమూలమును బొంది యా బాధల నన్నింటిని నాశనముచేసికొని, తత్పాదమూలమును విడుచుట కెంతమాత్రము నిష్టపడరు అదియునుంగాక భౌతికదేహరహితుండయిన జీవునికి దేహారంభము కలిగియుండునని వినియున్నాను, అట్లు జీవునికి దేహారంభము కలుగుట స్వేచ్ఛచేతనా? లేక హేతు వేదయినం గలదా? అది నీకెట్లు తెలియునో యట్లే వివరించి చెప్పుము సమస్తలోకముల స్థితికిని గారణభూతమయిన పద్మ మెవని యుదరమువలన జన్మించినదో, వేఱువేఱుగా విభక్తములగు నవయవములుగల యా పురుషుం డెంత ప్రమాణముగలవాఁడు? తాదృశపద్మమందుం బుట్టిన బ్రహ్మ యెవని యనుగ్రహమును బొంది లోకముల సృజించునంతటి శక్తిని సంపాదించెను? మఱియు, నా బ్రహ్మ యా పరమపురుషుని రూపము నెట్టుగాం జూడం గలిగెను? అప్పురుషుం డుత్పత్తి స్థితిలయంబులకుం గారణ మయిన మాయను విడిచిపెట్టి లోకవ్యాపారమునుండి మఱలి, సర్వగుణములకాశ్రయుండయి యే స్థలమునందు శయనించుచున్నాఁడు? పూర్వకల్పమం దనిరుద్ధునివలనం గలిగిన చతుర్ముఖుని యవయవంబులచేతనే లోకపాలురతోం గూడిన లోకములు కల్పింపఁబడిన వని వినియున్నాను, ఈ కల్పమందు

విరాట్పురుషుని యవయవములచేతనే లోకములును లోక పాలురును గల్పింపఁబడిరని వినుచున్నాను. అందుచే "బ్రహ్మ పూర్వకల్పానుసారముగా సృజించె"ననెడు శ్రుతికి విరోధము కలుగుచున్నది దాని నెట్లు వారింపఁ దగునో తెలియఁ జేయుము. మఱియు, నవాంతరకల్పప్రమాణ మెంత ? మహా కల్పప్రమాణమెంత ? భూతభవిష్యద్వర్తమానరూప మగు కాలము గ్రహసంచారముచే నేరీతిఁ బరిగణింపఁబడుచున్నది? మనుజుల యాయుఃపరిమాణ మెంత ? దేవతలకును, బితృదేవ తలకును నాయు వెంత ? నిమేషాదిరూపము, సంవత్సరాది రూపము నగు కాలగతి యెట్లు పరిగణింపఁబడుచున్నది? ఏయే కర్మములవలన నేయే లోకంబులు గలుగు ? కర్మము లెన్ని తెఱంగులయి యుండును ? ఏ దేశమందలి కర్మఫలనిష్పాదన మెవరిచే గ్రహింపఁబడునో, యెట్టికర్మఫలము పొందఁబడునో, యా యుదంతము చెప్పుము. సత్త్వాదిగుణముల పరిణామ రూపమయిన దేవాదిరూపముల నొందఁగోరుచున్న జీవులకుఁ దదభీష్టములయిన శరీరము లెట్టికర్మము లాచరించుటవలనఁ గలుగుచుండు ? భూ పాతాళలోకములును, దిక్కులు, నాకా శము, గ్రహనక్షత్రములు, నదీపర్వతములు, సముద్రములు, ద్వీపములు మొదలగునవి యెట్లు కలిగినవి? ఆ యా స్థానంబు లందున్న ప్రాణుల యుత్పత్తు లెట్లు కలిగినవి ? బ్రహ్మాండము బాహ్యాభ్యంతరప్రమాణ మెంత ? మహాపురుషుల చరిత్రము లెట్టివి ? వర్ణాశ్రమముల నిశ్చయము లెటువంటివి ? భగవం తుని యవతారచరిత్రము లత్యాశ్చర్యకరము లని విందును.

ఆ చరిత్రము లెటువంటివి ? యుగము లెన్ని ? యుగప్రమాణ మెంత ? ప్రతియుగమునందు నరు లాచరింపవలసిన ధర్మము లెయ్యవి ? మనుష్యులకు సాధారణధర్మము లెయ్యవి ? వారలకు విశేషధర్మము లెయ్యవి ? రాజర్షులు నడుపవలసిన ధర్మము లేవి ? ఆ పదంబుధిలో మునిగించినవారికి విహితమగు ధర్మమెట్టిది ? పృథివ్యాదితత్త్వముల చతుర్వింశతివిధత్వ మేప్రకారముగాఁ గలిగెను ? వాని స్వరూపము లెట్టివి ? తత్త్వకారణముల లక్షణము లెయ్యవి ? పరమపురుషుని యారాధన రూపమయిన విధి యెట్టిది ? *అష్టాంగయోగము లన నెట్టివి ? యోగీశ్వరులకు లభ్యములయిన † యష్టసిద్ధు లనఁగా నెట్టివి ? యోగీశ్వరుల యర్చిరాదిగతు లెట్టివి ? యోగులకు లింగశరీరభంగ మెట్లు కలుగును ? ఋగ్యజు స్సామాథర్వవేదంబులు, ఉపవేదములయిన యాయుర్వే దాదులు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు మొదలగునవి యెట్లు సంభవించినవి ? మఱియు, నాకు సర్వ భూతముల యవాంతరప్రళయంబును, వాని స్థితియు, నా భూతముల మహాప్రళయమును, యాగాదిరూపములయిన

---

* అష్టాంగయోగము లనగా — యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి

† అష్టసిద్ధులు—అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకా మ్యము, ఈశిత్వము, వశిత్వము అణుప్రమాణములయిన జీవులయందుఁ బరమాణు ప్రమాణుఁడయి యుండుట యణిమ యనఁబడును బ్రహ్మాం డముకంటె గొప్పవాఁడయియుండుట మహిమ యనఁబడును బ్రహ్మాం డముకంటె నధికమయిన బరువు కలిగియుండుట గరిమ యనఁబడు.

వైదికకర్మములు తటాకాది నిర్మాణరూపమయిన *పూర్త కర్మమును, కామ్యకర్మముల విధమును, ధర్మార్థకామము లను త్రివర్గప్రకారమును, జీవాత్మబంధమోక్షప్రకారమును, కైవల్యప్రాప్తి నొందినతరువాత జీవాత్మస్వరూపావస్థాన మును, స్వతంత్రుఁడయిన భగవంతుఁడు తనమాయను బురస్కరించుకొని సమస్తకర్మసాక్షియయి క్రీడించుటయు, మఱియు మాయ నెడఁబాసి భగవంతుండు ప్రళయమం దుదాసీనుండయి సాక్షియై యున్నవిధంబును, నీ సమస్తము నాకు నెఱింగింపుము. నీవు మహానుభావుండవు కాన, నాకు సమస్తము నిస్సందేహముగా నెఱిఁగింప సమర్థుండవు ఆపదల నొందియున్న నాకు నీకంటె మఱెవ్వరును దిక్కులేరు. నాయందు దయయుంచి సమస్తము నెఱింగించి నన్నుఁ గృతార్థునిఁజేయుము. బ్రహ్మనారదుల సంవాదమునందలి సంప్రదాయార్థములు నీకుఁ దెలిసినట్లు మఱియొకరికిఁ దెలియవు. కావున, నా యడిగిన ప్రశ్నంబులకెల్ల నుత్త రంబు లిచ్చుటకు నీవే తగినవాఁడవు. బ్రాహ్మణశాప తప్తుండనయి నిరాహారుండనయి వ్యాకులత్వంబు చెందియున్న నేను, స్వస్థచిత్తుండనయి యెట్లు వినఁగలనని యందువేని, చెప్పెద వినుము నేను శాపతప్తుండనైనను, నిరాహారుండ నయినను, నీ ముఖపద్మమునుండి స్రవించుచున్న హరికథా సుధారసమును ద్రావి నా ప్రాణములు నన్ను విడిచిపెట్ట నేరవు! నా యింద్రియములు కలఁత చెందనేరవు. కావున,

* వాపీ కూప తటాకములను, దేవాలయములను, దోఁటలను ప్రతిష్ఠించుటయు, అన్నప్రదానము చేయుటయుఁ బూర్త మనఁబడును.

సంశయింపక చెప్పుమని యడిగిన రాజును జూచి శ్రీశుక యోగి విష్ణుకథలందుఁ జేరితుఁడగుటకు సంతసించి, బ్రహ్మ కల్పంబున భగవంతునిచే బ్రహ్మకుపదేశింపఁబడి, బ్రహ్మ సమ్మతమై వేదతుల్యమైన భాగవతపురాణమును జెప్పెద విను మని రాజును సంతసింపఁజేసి యిట్లనియె

ఇది యెనిమిదవ యధ్యాయము



ఓ రాజా! కలగన్నవానికి రథాది పదార్థసంబంధ మాయాపదార్థసంబంధమగు భగవన్మాయ లేకయే ఘటింపని-చందమునఁ బ్రకృతివిలక్షణుండయి, యనుభవస్వరూపుఁడగు జీవునకు భగవన్మాయాసంబంధము లేకుండ భోగ్యవస్తువు లందు భోక్తృతాసంబంధము కలుగనేరదు. కావున, భగవన్మాయవలనఁ దిరోహితమగు స్వరూపముగలవాఁ డగుటం బట్టియే, ప్రాణికిఁ బ్రాకృతములందు భోగ్యబుద్ధి కలుగునని తెలిసికొనుము. విచిత్రపరిణామినియగు మాయచేఁ దిరోహితమగుచున్న జ్ఞానానందస్వరూపము జీవుఁడు, దేవాద్యాకారము నాత్మయం దారోపించుకొని బహురూపములు పొందుచున్నట్లు తోఁచుచున్నాఁడు! ఇట్లు ప్రకృతిసంయుతుఁడయిన జీవుఁడు వాస్తవమువలనఁ బ్రకృతివిలక్షణుఁడైనను, మాయా గుణములయిన సత్త్వరజస్తమోగుణముల విషయముల యందుఁ గ్రీడించుచున్నవాఁడయి, సమస్తము నేనే చేయుచున్నాననియు, ఈ దేహగేహాది వస్తువులన్నియు నావే యనియుఁ దలంచుచుఁ భ్రాంతిచెంది సంసారాసక్తుం డగుచున్నాఁడు. ఇట్లు సంసారాసక్తుఁ డయిన జీవునికి మోక్ష

సాధనమయిన జ్ఞాన మొకటి కలదు దానిని జెప్పెద వినుము. కాలమునకు మాయకుం బరమైన పరమాత్మస్వరూపమయిన మహిమయం దాప్రాణి యెప్పు డహంకార మమకారములు లేక క్రీడించునో, యప్పుడే మాయను గాలమును విసర్జించి, భగవద్భక్తివలనం గలిగిన యానందాతిశయముచే విషయములయందు నిరపేక్షుండయి యుండును. ఓ రాజా! భగవంతునికి జీవునికివలె దేహారంభము కలుగుచుండం దద్భజన వలన ముక్తి యెట్లు కలుగునని యందువేని, చెప్పెద విను. మఱియుం బూర్వము చతుర్ముఖుం డొనరించిన నిష్కపట తపస్సునకు మెచ్చుకొని యీశ్వరుండు తన దివ్యమంగళ విగ్రహము నతనికిం జూపుచు, జీవునికంటె విలక్షణుండయిన పరమాత్మ యాథాత్మ్యమును బరిశోధించుటకుం గొన్ని వాక్యములు చెప్పె వానిని జెప్పెద వినుము.

నారాయణుండు బ్రహ్మతపంబునకు మెచ్చి వరంబు లిచ్చుట

పూర్వమందు బ్రహ్మ తన కాధారభూతమగు పద్మమందు నివసించి, లోకముల సృజించుటకై మిగుల విచారించెను. కాని, ప్రపంచనిర్మాణ మేరీతిగా నగునో యారీతిని గాంచలేకపోయెను. అందుచే బ్రహ్మ మిక్కిలి చింతాక్రాంతుండయియున్న సమయమున నొకప్పుడు ప్రళయకాల పయోధియందు రెండుపర్యాయము లుచ్చరింపంబడిన యక్షర ద్వయము గల వాక్యము వినంబడెను ఆ యక్షరద్వయము మునీశ్వరులకు ధనరూపమయినది. కకారము మొదలు మకార మవసానముగాం గల యక్కరంబులు స్పర్శము లని చెప్పం

బడును కావున, నా యక్షరములయందుఁ బదునాఱవయక్షర మగు తకారము, నిరువదియొక్కటవ యక్షరమగు పకార మును గలిసి తప యనెడి పదము సిద్ధించినది. ఇట్లు తప, తప యని పలుకఁబడిన యా వాక్యమును బ్రహ్మ విని యా వాక్యము నెవ్వరు పల్కిరో వానిని జూడవలెనని నలు దిక్కులు చూచెను. కాని, యా బ్రహ్మకు నచట భయంకర మగు సముద్రముతక్క నేదియుఁ గానరాదయ్యె. అంతట నతఁడు చేయునది లేక, తనకు స్థానభూతమగు పద్మమును బొంది చక్కఁగా నాలోచించి తపంబు నొనరించుటకుఁ బూనుకొనెను అట్లు నిశ్చలచిత్తుండయి జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను జయించి, శ్వాసము బంధించి, తా నాచరించు తపంబునందు సఫలసంకల్పరూప జ్ఞానము కలవాఁడయి, సకలలోకములను బ్రకాశింపఁజేయఁజాలు నా తపంబును వేయి దివ్యవత్సరంబులు చేసెను. అట్లు ఘోరమగు తపంబును జేసిన బ్రహ్మకు నారాధనీయుఁ డగు నారాయణుండు ప్రత్యక్షమయి, తనకు నివాసభూత మగు వైకుంఠలోకమును జూపెను ఆ వైకుంఠమును స్వాశరీరకపరమాత్మ ననుభవించు నిత్యముక్తు లధిష్ఠించి యుందురు. సకలలోకములకంటె నది యుత్కృష్ట మయి నది అచ్చట, నాధ్యాత్మికాది తాపత్రయంబు లేదు. అజ్ఞానముగాని, భయముగాని, చూతమన్నను గానరావు అచ్చట రజస్తమోగుణములుగాని, వానిచే మిళిత మయిన సత్వగుణముగాని లేవు. అచ్చటఁ గేవలము సత్వ గుణము మాత్రమే యుండును. అచ్చటివారికిఁ గాలము

వలనఁ బరిణామాదులు కలుగవు. అక్కడ సత్త్వాది గుణాధార మగు ప్రకృతి యుండదు. అచ్చటి భగవదుపాసకులు సురాసురులచేఁ బూజింపఁబడుచుందురు. అచ్చటివారు శ్యామల వర్ణము గలిగి జగములకు మోహము గలుగునట్లు ప్రకాశించుచుందురు. వారు పద్మపత్రములవలె విశాలమైన నేత్రములు గలవారు వారందఱు పీతాంబరములతో నొప్పుచు, మనోహరమగు కాంతి గలిగి మిగుల సౌకుమార్యము గలవారయి యున్నారు వారందఱు భగవత్సారూప్యము గలవారగుటచే, నాలుగేసి భుజములు గలవారు వారు రత్నములచే మహోజ్జ్వలములయి యుత్తమములై యొప్పు భూషణములచే నలంకృతులయి యున్నారు వారు శ్రేష్ఠమయిన లావణ్యము గలవారు. వారు పగడములవలెను వైడూర్యములవలెను, దామరతూఁడులవలెను ప్రకాశించు వర్ణములచేఁ బరఁగుచున్నారు. మఱియు, వారు ప్రకాశించు కిరీటములచేతను, మకరకుండలములచేతను, వనమాలలచేతను వెలయుచున్నారు. అటువంటి మహాత్ముల దివ్యవిమానములచేత నా లోకము ప్రకాశించుచున్నది. మఱియు, దివ్యవిమానములయం దధిరోహించి దివ్యకాంత లందందుఁ దిరుగులాడుచుండునప్పు డా లోకము మెఱుపుఁదీవెలు గల మేఘపంక్తులచే విలసించు నాకాశమువలె వెలయుచుండును. ఆ లోకమందు శ్రీ మహాలక్ష్మి భూనీలాదేవులతోఁగూడఁ దన భర్తయగు నారాయణుని పాదపద్మములఁ బూజించుచుఁ బ్రశస్తమూర్తితో నొప్పుచుండు. మఱియు, నా శ్రీదేవి యుయ్యేలలోఁ గూర్చుండి యూఁగుచుఁ, దన్నుఁ గోకిల భృంగాదులు

గానము చేయుచుండఁ, దాను దన మనోహరుం డగు విష్ణుని చారిత్రముల మిగుల వింతఁగాఁ బాడుచుండును. రాజా! స్వస్వరూపధారు లయిన లక్ష్మీనారాయణులకు స్థానభూత మగు వైకుంఠముకంటె నధికమయిన లోక మేది కలదు? అట్టి వైకుంఠమునం దున్నవారిదే భాగ్యముగాని, తక్కిన వారిదా భాగ్యము! బ్రహ్మ యట్టిలోకమును బొంది మిగుల ముదమందుచు నందలి వింతల కచ్చెరువందుచుఁ బోయి పోయి, నారాయణమూర్తిని దర్శించెను. అతండు తపంబు మొద లగు యజ్ఞంబులను బ్రవర్తింపఁజేయుచు, వానియం దారాధితుండయి తదనుగుణఫలంబుల నిచ్చువాఁడు. అతఁడు చిద చిదాత్మకమయిన జగంబె శరీరముగాఁ గలవాఁడు అతఁడు పంచరాత్రధర్మంబుల నియమంబుతో నాచరించువారిని దన లోకంబునకుఁ గొనిపోయి రక్షించుచుండు. ఆ మహాను భావుఁడు సునంద నందాది పార్శ్వదులచేఁ బరివేష్టింపఁబడి యుండును అతఁడు తన భృత్యుల ననుగ్రహింప నభిముఖుఁ డయియుండును అతఁడు సుధారసముతో సమమగు కటాక్ష ములు గలవాఁడు. అతఁడు నిర్మలమగు మందహాసముచేతను, నరుణకాంతుల నిను లోచనములచేతను బ్రకాశించుచుండును. అతని మూర్ధమందుఁ గిరీటము మిగులరమ్యముగాఁ బ్రకా శించుచుండును అతని కర్ణములయం దున్న కుండలములు తమ కాంతిసంతానముచే గండస్థలములఁ గప్పుచుండును. అతని శరీరము పీతాంబరముచేతను, జతుర్భుజంబులచేతను రంగారుచుండును. ఆతని వక్షఃస్థలము శ్రీమహాదేవిచే నలం కృత మగుచుండును మఱియు, నా పరమపురుషుండు పూజ

నీయమయిన యాసనంబు నధివసించి యిరువదియైదు తత్త్వ ములనధిష్ఠించియున్న శక్తులచేఁ బరివేష్టింపఁబడి, జ్ఞానశక్త్యా ద్యనంత కల్యాణగుణములచేఁ బరిపూర్ణుండయి, స్వకీయమయిన దివ్యమహిమయందుఁ గ్రీడించుచుండెను. అట్టి భగవంతుని గన్నులారఁ గాంచి, బ్రహ్మ తద్దర్శనజనితమగు సంతసంపు మున్నీటిలోఁ దొప్పదోఁగుచుఁ గన్ను లానందబాష్పములఁ గురియుచుండ, శరీరము పులకితమగుచుండ, మహానుభావు లగు పరమహంసలు భక్తిమార్గ మవలంబించి యెవ్వని పాద పద్మ మూలంబును బొందుచున్నారో, యా భగవంతుని పాద కమలములకు నమస్కరించెను. అంతట, నారాయణుండు తనకు నమస్కరించిన బ్రహ్మనుగాంచి, యతఁడు తనయందుఁ జూపు నిరతిశయ ప్రేమమునకు మిగుల సంతసించుచు, నాతని భక్తికి మెచ్చుకొని యతని హస్తమును గ్రహించి, యతని నిజశాసనప్రకారమున సృష్టిఁగావింప సమర్థుండని నిశ్చయించి, మందహాసముచేఁ దనరారు ప్రియవాక్యములతో బ్రహ్మ కిట్లని యె 'ఓ చతుర్ముఖా! కపట మును లెంతకాలము నా నిమి త్తము తపంబొనరించినను నేను సంతసింపను నీ వట్లుకాక, మహానియమము గలవాఁడవయి సృష్టి చేయవలె నన్న తలంపు గలిగి నిర్మలచిత్తంబుతోఁ దపం బొనరించినవాఁడవు. కావున, నీ తపంబునకు మిగుల సంతసించితిని. నిన్ను నే ననుగ్రహించి తిని. కావున, నీ కభీష్టంబగు వరము వేఁడుము, తప్పక యొసంగెదను. లోకమందలి భక్తులకు శ్రేయస్సాధన ప్రయా సము నాదర్శనము లభించువఱకే యని యెఱుంగుము. కావున, నా పాదపద్మముల దర్శించిన నీ కమితశుభములు కలిగెడును.

శబ్దముచేఁ జెప్పఁబడు వస్తుజాతమంతయుఁ, బరతత్త్వమును, స్వేచ్ఛచే దివ్యమంగళవిగ్రహమును ధరించిన విరాట్పురుషుని విభూతులే యని తెలిసికొనుము. భగవంతుని యవతారంబులకు లెక్కయే లేదు. ఆ మహాపురుషుం డా యా యవతారంబులలో గావించిన యద్భుతకార్యములను గణింప నెవ్వరికయిన శక్యంబు కాదు. అసత్కథలను వినుటవలన సంభవించిన కర్ణమలమును నశింపఁజేయుచు సుందరములయి, ప్రధానములయియున్న భగవంతుని లీలావతారచారిత్రంబులను మునులు చెప్పియున్నారు. వానిని నీకుఁ గ్రమముగాఁ జెప్పెద. ఆ యవతారకథామృతమును పానము చేయుము.

ఇది యారవ యధ్యాయము.

---

బ్రహ్మ నారదునకు భగవంతుని యవతారంబులఁ జెప్పుట

ఓ నారదా! పూర్వము హిరణ్యాక్షుఁ డను రాక్షసుఁడు కండకావరముతోఁ దిరుగుచు, నీ భూమండలమును జాఁప చుట్టినవిధముగాఁ జుట్ట నారంభించెను. అందుచే, నీ భూమి యంతయు సముద్రమధ్యమున మునుంగుటకు సిద్ధముగా నుండెను. అదిచూచి దయాపరుఁడయిన నారాయణుఁడు వరాహావతారుఁడయి పోయి, యా రాక్షసునిఁ దాఁకి దేవేంద్రుఁడు వజ్రాయుధముచేఁ బర్వతమును భేదించినట్లు, తన దంష్ట్రచే వానిని జెండాడెను. ఇట్లు చెండాడి, భగవంతుండు నీటఁ గ్రుంగినభూమిని దన దంష్ట్రాగ్రముచేఁ బైకెత్తెను. ఈ యవతారమును వరాహావతారమందురు. ఇఁక సుయజ్ఞావతారంబును జెప్పెదను వినుము. పూర్వము రుచి యనెడి

యొక మునిశ్రేష్ఠుండు కలఁడు. అతనికి నాకూతి యను భార్య కలదు. ఆ రుచికి నాకూతియందు సుయజ్ఞుఁ డను నామముతో భగవంతుఁ డుదయించెను. విష్ణువు నపరావతారమయిన యా సుయజ్ఞుండు తన భార్యయగు దక్షిణయందు యాము లనెడి పేరుగల పన్నిద్దఱు దేవతలను బుట్టించెను. పిమ్మట, నతఁడు సమస్తలోకముల బాధలను హరించెను. కాన, మాతామహుండయిన మనువు సుయజ్ఞుఁ డొనరించిన పనికి సంతసించి లోకముల యార్తిని హరించుటంబట్టి హరి యను నామం బతనికి నొసంగెను దీనినే సుయజ్ఞావతార మందురు. తరువాత, కపిలావతార వృత్తాంతము చెప్పెదను, వినుము. ఓ నారదా! కర్దమప్రజాపతి యను నొక మునిశ్రేష్ఠుండు కలఁడు అతనికి దేవహూతి యను భార్యగలదు. ఆ కర్దమునికి దేవహూతియందు శ్రీ నారాయణుండు కపిలాచార్యుండై యుదయించెను. అతఁడు తొమ్మండ్రు స్త్రీలతోఁగూడ జన్మించెను. ఆ మహాత్ముఁడు తన తల్లియగు దేవహూతికి సాంఖ్యము నుపదేశించెను. ఆ యుపదేశమువలననే దేవహూతి సమస్త పాపముల నీ లోకమందు విడిచి ముక్తిచెందెను. ఇదియే కపిలావతారం బని చెప్పఁబడును. అత్రిమహాముని మును లలోనెల్ల నుత్తముండు. అతఁడు సంతానముకొఱకు హరిని గుఱించి ఘోరమగు తప మొనరించెను. అందుల కా హరి సంతసించి, నేను నీ కుమారుండనుగా దత్తుండనయితినని పలికెను. పిమ్మట శ్రీహరి యత్రిమహామునికిఁ కుమారుండయి జన్మించెను. అంతట, నత్రి సంతసించి హరిపల్కిన వాక్యమును మనస్సులో నుంచికొని దత్తుండని పేరుపెట్టెను. ఆ

దత్తాత్రేయమహాముని పాదపద్మములను సేవించియే కార్త వీర్యార్జునుఁడు, యదువు మొదలగువా రష్టసిద్ధులను బొంది మహాకీర్తిని సంపాదించికొని, యిహాపరలోకములయం దమిత మయిన సుఖమనుభవించిరి. ఆ దత్తాత్రేయుని మహిమ నేమని చెప్పఁగలను. ఇదియే దత్తాత్రేయావతార మని చెప్పఁబడు చున్నది. ఓ నారదా! నేను బూర్వమందు లోకములను సృజింపఁ దలంచి ఘోరమయిన తపస్సును జేసితిని. అట్లు తపస్సుచేయుచు నేను సన" అని పలికితిని. అంత హరి, సన యను శబ్దములు గల సనక సనందన సనత్కుమార సనత్సుజాతు లను నామముల ధరించి నల్వురయి యుదయించెను. ఆ నలువురు భూమిలో మిగులఁ బ్రసిద్ధికెక్కిరి వారలు గతించిన కల్ప మంతమందినతోడనే, నశించుచున్న యాత్మ తత్త్వమును సంప్రదాయములతోఁగూడ శాశ్వతముగా దెలియఁజేసిరి. వారలు నలుఁవురు విష్ణుకళలచే నొప్పుచున్నారు. దీనినే కుమారాద్యవతారమని చెప్పుదురు. ధర్ముఁడను నొక మునీశ్వరుండు కలఁడు. అతఁడు దక్షప్రజాపతి కూఁతురయిన మూర్తిని భార్యగా వరించెను. ఆ ధర్మునకు మూర్తి యనునట్టి భార్యయందు శ్రీహరి నరనారాయణరూపుఁడై జన్మించెను ఆ నరనారాయణుల తపశ్శక్తిని వర్ణింప నెవ్వరికిఁ దరము కాదు. ఆ నరనారాయణులు బదరీవనమందు ఘోరమయిన తపంబు చేయుచుండిరి. అంతట వారల తపంబు చూచి, దేవేంద్రుండు తనపదవికి భంగము వచ్చునేమో యని భయ పడి, వారల తపంబును జెఱుపుటకుఁ దన మనమునం దెంతయు యోజించి, దేవతాకాంతలలో మిగుల యందకత్తె

లగు రంభ, మేనక మొదలగువారిని బిలిపించి "నరనారాయణుల తపంబునకు విఘ్నము చేయుఁ"డని యాజ్ఞాపించెను. అంత, వారలెంతయు సంతసించి, మన్మథునిఁ దోడుగాఁ గైకొని కడువేడుకతో బదరికావనముం గూర్చి పోయిరి. ఇట్లు వారలు బదరికావనము ప్రవేశించి యా నరనారాయణు లున్న స్థలంబునకు డాయఁజొచ్చిరి. వీ రాస్థలమునకుఁ బోవునప్పటికి, వారు దృఢమనస్కులయి తపస్సు చేయుచుండఁ జూచి, మెల్లమెల్లఁగా వారిని సమీపించి, యొకరినొకరు పరిహాసములను బలికికొనుచుఁ, దమ విలాసములను గనఁబఱుచుచు, నాడుచు, మనోహరముగాఁ బాడుచు జరింప నారంభించిరి. అదిచూచి నారాయణుండు కొంచెమేనియుఁ జలింపక, తాను గోపించి శపించినచోఁ దనకుఁ దపోవ్యయ మగునని తలంచి, యుల్లములో నించేనియు నలుక వహింప లేదు. కేవలము సత్త్వగుణప్రధానుఁడయిన యాతనికిఁ గోప మేరీతిని జనించును? అట్లు నారాయణుఁడు గోపింపక, తన తొడయందుండి యొక సుందరాంగిని బుట్టించెను. ఆమె ముల్లోకములం గల స్త్రీలలోనెల్ల నందంబున నుత్తమురాలని చెప్పుటకు సందియము లేదు. అంత నారాయణుఁడు తన యూరువులందుఁ బుట్టుటచేత నూర్వశి యను నామం బామె కొసంగి, వారల చెంతకుఁ బంపెను. అంత దేవతాస్త్రీలు తమయొద్దకు వచ్చుచున్న యూర్వశిం జూచి యామెరూపంబునకు మిగుల నచ్చెరువంది సిగ్గు చెందఁ దొడఁగిరి. అటుపిమ్మట వారిలో వా రిట్లనుకొనఁ జొచ్చిరి. "ఓసీ! మనము లోకములో నున్న స్త్రీలలోనెల్ల నధిక సౌందర్యవంతులమనిక దా

గర్వించుచున్నారము. అందుచేత నేకదా యింద్రుని సెలవు ననుసరించి మనసౌందర్యముచే నీ మునులను మోహింపఁ జేయఁ దలఁచి వచ్చినారము! ఇట్లుండ, నీ మహాత్ముఁడు మన కందఱకు సిగ్గుపొడమునట్లు లీసుందరాంగిని నిమిషమాత్రము ననే సృజించినాఁడు. ఇట్టి యందకత్తెను సృజింపఁజాలినవానిని మన సౌందర్యముచే మోహింపఁజేయ నెంచుట యొక తెలివి తక్కువ కాదా? ఇట్టి మహాత్ములయెడ మన మేమిచేయుటయు నుచితంబు కాదు" అనిపలికి యా యూర్వశిని దమ కధిపురాలినిగాఁ జేసికొని, తమ వచ్చినజాడనే తమ లోకమునకుఁ బోయిరి ఓ నారదా! ఈశ్వరుండు కామమును జయించెను గాని, కామముకంటె బలవత్తరమగు క్రోధమును జయింపలేక, మన్మథుని దహించెను. అట్లుండ, నీమహాముని క్రోధమునే జయింపఁ గలిగెను. ఈతని మానసమును ప్రవేశించుటకు రోషము భయపడుచుండును. ఇట్లు కామజేతలకయినను దుర్జయమయిన రోషమును జయించిన నారాయణముని మనస్సును గామ మెట్లాశ్రయింపఁ గలుగును? అన్నింటికంటె నధికమగు కోపమునే జయించినప్పుడు, కామమును జయించినారని వేఱె చెప్పనేల? ఇది నరనారాయణావతారంబు.

పూర్వ ముత్తానపాదుఁ డను రాజొకఁడు కలఁడు. అతని కొక పుత్రుండు కలఁడు. అతనిపేరు ధ్రువుం డని చెప్పుదురు. ఆ బాలకుఁ డొకనాఁడు తనతండ్రియొద్దనున్న యవసరమునఁ, దన్నుంగూర్చి తన సవతితల్లి పల్కిన వాక్యములకు సహింపలేక, విష్ణువును గుఱించి ఘోరతప మాచరించెను. అంతట, విష్ణువు ప్రత్యక్షముకాఁగా, నతనిఁ జూచి నుతించి, యాతని

వలన వరములను బొంది నిజరూపముతోఁ జని యత్యున్నత పదవి చెందెను. అదియే ధ్రువమండలమని యిప్పటికిని ప్రసిద్ధి చెందుచున్నది. అతని పదము సప్తర్షి మండలముకంటె నూర్ధ్వముం దున్నది అతని మహిమను సప్తమహామునులు గూడ నుతించుచుందురు ఆ ధ్రువునకు వరమునిచ్చిన విష్ణువు నొక యవతారమని చెప్పుదురు. ఇఁకఁ బృథుని యవతారంబు చెప్పెదను వినుము, ఓ నారదా! వేనుఁ డను నొక రాజు గలఁడు. వాఁడు మిక్కిలి దుష్టుఁ డయి యుండెడివాఁడు వాని ప్రవర్తనము సహింపలేక, యొక బ్రాహ్మణుఁడు శపింపఁగా, దేహంబు విడిచి నరకంబునం బడియె. అతని కుమారుఁడే పృథుచక్రవర్తి. ఆ పృథుచక్రవర్తి యాగాది సత్కార్యముల నొనరించి తనతండ్రిని నరకమునుండి తప్పించి, తన పుత్త్రశబ్దమును సార్థకము చేసికొనెను మఱియు నా పృథువు భూదేవిని గోవునుగాఁ జేసి, హిమవంతుని వత్సగాఁ జేసి, సమస్తవస్తువులను బితికెను. ఇది పృథుచక్రవర్తి యవతారము ఇంక వృషభావతారము చెప్పెదను వినుము. నాభి యను నొక రాజర్షి కలడు అతనికి సుదేవి యను భార్య గలదు. ఎవనిని మునులందఱు పరమహంసలకుఁ బొందఁదగిన స్వరూపము గలవానినిగాఁ జెప్పుదురో, యా శ్రీహరి యా దంపతులయందు వృషభావతారంబు నొందెను. ఆ వృషభుఁడు సమస్తభూతములయందు సమదృష్టి కలవాఁడు. అతని మనస్సు చాంచల్యము లేకుండ వర్తించెను. అతఁడు సమస్తసంగములను విడిచిపెట్టెను. అతఁడు సకలేంద్రియములను జయించె. ఆ మహానుభావుఁడు యోగచర్య

యందు జడమువలెనే చరించెను. ఇది వృషభావతారము. ఇంక హయగ్రీవావతారమును జెప్పెదను వినుము భగవంతుండు నాచేయు సత్రయాగమునందు హయగ్రీవుండయి యుదయించెను అతఁడు బంగారుచాయవంటివాఁడు. అతఁడు వేదస్వరూపుఁడనియు,యాగారాధ్యుండనియుఁ జెప్పవచ్చును. అతఁ డఖిలభూతములయందు నంతర్గతుఁడయి యున్నాఁడు. నిశ్వాసమును విడుచుచున్న యా హయగ్రీవుని నాసికనుండి యే వేదములు జనించినవి ఇంక మత్స్యావతారమును జెప్పెదను వినుము ప్రళయకాలమందు భూమి కానరాక, జలమయముగా నుండెను అప్పుడు భగవంతుఁడు మత్స్యావతారము దరించి భావిసృష్టికుపయుక్తమగు పార్థివద్రవ్యమునకాధారుఁడయి, కావుననే సమస్తప్రాణులకు నివాసభూతుఁడయి, వైవస్వతమనువుచేఁ జూడఁబడెను మఱియు, నా ముఖమునుండి విస్రంసితములైన వేదములను జక్కఁజేసెను. ఇదియె భగవంతుని మత్స్యావతారం మనఁబడును ఇంకఁ గూర్మావతారంబు చెప్పెదను వినుము పూర్వము దేవదానవు లమృతముకొఱకు ప్రయత్నించి, సముద్రములు గలశముగాను, వాసుకిని దట్రాడుగాను, మందరపర్వతమును గవ్వముగాను జేసి, చెఱియొకవైపుననుండి సముద్రమును మధించుసమయమున, నా పర్వతము సముద్రములో మునుంగుచుండెను. అప్పుడు విష్ణుమూర్తి కూర్మావతారమెత్తి, యా పర్వతమును దాల్చి తత్పర్వతభ్రమణముల రాపిడిచేఁ దనశరీరమును సంబంధించి, దురదను దొలఁగించుకొని యున్నాఁడు ఇది కూర్మావతార వృత్తాంతము.

పూర్వము హిరణ్యకశిపుఁ డను రాక్షసుఁడు పరిభ్రమించు చున్న కనుబొమలచేతను, దంష్ట్రిలచేతను, భయంకరమయిన వదనముగలవాఁడయి, గదాధారియై, తన కభిముఖముగా వచ్చుచుండఁ జూచి, మూఁడులోకములకు భయమును గలిగించు నరసింహాకృతిని దాలిచి, శ్రీహరి యా రక్కసునిఁ దన తొడలయందు నిడికొని తన గోళ్లచేఁ జీల్చి పాఱవైచెను. ఇదియె భగవంతుని నరసింహావతార మని చెప్పఁబడును. పూర్వము కరిరాజు తనతోడి గజములతో వనవిహారమున కయి పోయి విహరించి మిగుల డస్సి దప్పికొని యచ్చటికి సమీపముగానున్న యొక కొలనుజేరి నీరు ద్రావుచుండెను. అప్పుడు మహాబలవంతమయి భయంకరమయిన మొసలి యొకటి యా కరిరాజు నొడిసిపట్టెను. అంత కరిరాజు చిరకాల మా మకరితోఁ బోరాడెను. కాని, దాని జయింపలేక, క్రమ క్రమముగా బలము తఱిగినందునఁ జేయునదిలేక, పరమ భక్తితో భగవంతుని ధ్యానించి 'ఓ కారణపురుషా! ఓ విశుద్ధకీర్తి! వినునంతనే కల్యాణములఁ గలిగించు నామ ధేయము కలవాఁడా! ఓ లోకనాథా! నన్ను రక్షింపు'మని శరణుసొరఁగా, నప్పుడు హరి కరుణించి గరుడారూఢుండయి చక్రముచే నా నక్రమును జంపి, కరిరాజును రక్షించి, యత నికి మోక్షము నొసంగెను. ఇదియే భగవంతుని హరినామ కావతారమని చెప్పఁబడును. పూర్వము విష్ణువు, కశ్యపుని భార్యయగు నదితిపుత్త్రులలోఁ గనిష్ఠుఁ డయినను, గుణము లచేఁ జ్యేష్ఠుఁడయి జనించి, వామనుఁ డని పిలువఁబడుచు, బలిచక్రవర్తియొద్దకుఁ బోయి, మూఁడడుగుల భూమిని

యాచించి, తన పదత్రయముచేత మూఁడులోకములను గొలిచి, కపటముచేఁ గొనిపోయి యింద్రునకు నొప్పగించెను. ఓయీ! భగవంతుఁడగు విష్ణువు లోకప్రభువు మఱియు, ననంతబలుఁడుగదా! అట్లుండ, బలిని జయించి బలాత్కారముచేఁ గొనిపోక, యాచించి గొనిపోవుటకుఁ గారణమేమని యందువేని, చెప్పెద వినుము. ధర్మము తప్పక చరించుచున్న వారల నెంత సమర్థు లయినను బలాత్కారముగా జయింప లేరు. అందుచే, ధర్మమార్గము విడువనొల్లని బలిని విష్ణువు బలాత్కారముగా జయింపలేక, యాచించి, వినయముతోడనే జయించెను ఆ బలి విష్ణువు పాదతీలమును ఏలయందుఁ దాల్చి, విబుధాధిపత్యముసైతము నిష్ఫలమని తలంచెను తృతీయచరణ పూర్తికొఱకుఁ దనశరీరమును హరి కిచ్చుట కయిన నంగీకరించెను శుక్రుని శాపమునకయినను నంగీకరించెను గాని, తన ప్రతిన నతిక్రమింప నిష్టపడలేదు. బలి యెంత మంచివాఁడో చూడు! ఓ నారదా! నీ వతిస్నేహముచే భగవంతునిఁజూచి యోగాదులంగూర్చి సంపూర్ణముగాఁ జెప్పుమన, నతఁడు హంసావతారమెత్తి, ఫలాపేక్ష లేని కర్మయోగమును, భగవదుపాసనాత్మకమయిన జ్ఞానమును, దీప మితరవస్తువులఁ బ్రకాశింపఁజేయు విధమున, నాత్మతత్వమును బ్రకాశింపఁజేయు జ్ఞానయోగమును నుపదేశించెను. ఆ హంసుం డుపదేశించిన యోగాదికము నవలంబించియేకదా మహాత్ములు వాసుదేవుని శరణుఁజొచ్చుచున్నారు! ఇదియే భగవంతుని హంసావతారము. భగవంతుఁడు మనురూపధారియై, తన తేజస్సును బది దిక్కులందు

వెలుంగునట్టు లుగ్రమయిన చక్రముధరించి, దుష్టవర్తనులగు క్షత్రియులఁ జెండాడి, సాధుజనుల రక్షించుచుఁ, దనకీర్తిని సత్యలోకమువఱకు వ్యాపింపఁజేసెను. మఱియు, నా భగవంతుఁడు ధన్వంతరి యవతారమును దాల్చి, లోకములయందలి రోగములనెల్ల నిజనామస్మరణంబు మాత్రనే నశింపఁజేయుచు, లోకుల కుపకార మగునట్టు లాయుర్వేదమును బ్రవర్తింపఁ జేయుచున్నాఁడు. మఱియు, నతఁడు దేవతలతో సమానముగా యజ్ఞభాగములనుగూడఁ బొందుచున్నాఁడు. ఇఁకఁ బరశురామావతారంబునుగూర్చి చెప్పెదను వినుము శ్రీహరి దుష్టులగు రాజులను జంపుటకయి జమదగ్ని గర్భవాసంబున జన్మించి, గొడ్డలి చేతఁబూని భూమండలమంతటఁ దిరుగుచు, దైవముచేతనే మరణమున కర్పితులై బ్రాహ్మణులకు ద్రోహ మొనర్చుచు, వేదమార్గమును విడిచి దుఃఖములఁ గోరుకొనుచు, భూమికిఁ గంటకులయి వర్తించిన క్షత్రియులను నిరువదియొక పర్యాయము వధించి, భూమండలము నంతను విప్రులకొసంగి, లోకమునందుఁ దన సత్కీర్తులను నెలకొలుపుచున్నాఁడు. ఇంక, శ్రీ రామావతారముంగూర్చి చెప్పెదను, వినుము. ఓ నారదా! మే మందఱము రావణుని బాధలఁ బడఁజాలక, తదీయబాధలను దొలఁగింపుమని భగవంతునిఁ బ్రార్థింపఁ, బ్రకృతిపురుషుల కధిపతియగు భగవంతుఁడు భరతాదులతోఁగూడ నిక్ష్వాకువంశమందు రాముఁడయి యవతరించెను. అనంతర మతఁడు, కైకేయి కోర్కి ప్రకారము దశరథుఁడు రాముని బిలిచి “నీవు పదునాల్గు

వత్సరంబులు దండకారణ్యమునఁ జరింపు" మని యాజ్ఞాపింప, శ్రీరామచంద్రుఁడా మాటలు విని సంతసించి తమ్మునితోను, భార్యయగు సీతతోను, దండకారణ్యము ప్రవేశించు. రాముఁడట్లు వనంబున వసించుచుండఁగా, దురాత్ముఁడగు రావణుఁడాతనిభార్యయగు సీతను దొంగిలించి లంకాపురమునకుఁ గొనిపోవును అనంతరము రాముఁడు సుగ్రీవునితో సఖ్యముచేసి వాలిని జంపి, వానరబలముఁగూడ లంకకుఁ బయలుదేఱి, మార్గమధ్యంబున సముద్రముండుటచే దానిని లంఘించుట కుపాయము గానక, తన యాత్మయందు విచారించి, తుద కత్యంత కోపముతోఁ బ్రజ్వరిల్లుచుఁ ద్రిపురాసుర సంహారము చేసిన యీశ్వరునివలెఁ బ్రకాశించుచు, భయంకరమయిన చూపుతో నా సముద్రునిఁజూడ నారంభించును అంత, సముద్రుఁడు మిగుల భయపడి రాముని కెదురువచ్చి పూజించి, రామునకు మార్గము నిచ్చును అంత, రాముఁడు సముద్రము దాఁటి, సురగజదంతముల చూర్ణముచే వక్షఃస్థలము ప్రకాశించుచున్న వానిని దన గర్వాట్టహాసము దిక్కులను భేదింప నత్యుత్కర్షతో వర్తించు రావణుని నవలీలగా శరపరంపరలచే సంహరించును ఇది రామావతారవృత్తాంతము ఇఁకఁ గృష్ణావతారముంగూర్చి చెప్పెదను వినుము సితకృష్ణకేశుఁడయిన నారాయణమూర్తి, రాక్షసాంశమునఁ బుట్టిన క్షత్రియులు చేయుచుండిన బాధలను దొలంగించుటకయి యదుకులమందు పరిష్ఠుఁడయిన వసుదేవునకు నతని భార్యయగు రోహిణీదేవియందును, దేవకీదేవియందును,

బలరాముఁడనియుఁ, గృష్ణుఁడనియు జన్మ మొందును. *ఇట్లా నారాయణమూర్తి సితకృష్ణవర్ణములుగల తన కేశద్వయంబె భూభారము శాంతింపఁ జాలునన్న తనభావమును దెలుపుట కయి శ్వేతకృష్ణవర్ణంబులు గలిగిన బలరామకృష్ణులై యవత రించును. వా రిరువురిలో శ్రీకృష్ణుండు సాక్షాద్విష్ణు వనియే చెప్పుదురు. అట్టి కృష్ణుండు సామాన్య మానవునివలెఁ జరిం చుచుఁ, దన మహిమను బ్రకటించు నమానుషకృత్యంబు లొనరించు శ్రీకృష్ణుఁడు మూఁడు మాసముల ప్రాయము గలవాఁ డయియున్న సమయంబునఁ, గంసుని యాజ్ఞ చొప్పున నా బాలునిఁ జంపుటకయి పూతన యనురాక్షసి విమ స్తని యయి పాలిచ్చుటకు వేపల్లెకు వచ్చి, పురిటింటిలోకిఁ జొరఁ బడి, వద్దువద్దని యచ్చటివారందఱు నాటంకము చేయు చున్నను నిలువక, పోయి కృష్ణునిఁ దీసి యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని పాలిచ్చుచుండఁ, బసిబాలుఁడయిన కృష్ణుఁడు

---

* భగవంతుఁడగు నారాయణుఁడు తన కబరీభారమునుండి యొక తెల్లని కేశము, నొక నల్లని కేశమును దీసివైవఁగా, నందుఁ దెల్లని కేశము శ్వేతవర్ణుఁడయిన బలరాముఁ డయ్యెను నల్లని కేశము నల్లనిశరీరముగల కృష్ణుఁ డాయెను. అని యిట్లు భారతమందును విష్ణుపురాణాదులందును జెప్పఁబడియున్నది ఈ చెప్పుట బలరామకృష్ణులు శ్వేతకృష్ణవర్ణములు గలవారని చెప్పుటకుఁగాని, భగవంతుని కేశములే లోకములబాధ తొలఁ గింపఁజాలు నను నభిప్రాయము సూచించుటకుఁగాను బలకరముగాఁ జెప్పఁ బడినది. అంతియకాని, బలరామకృష్ణులు కేశావతారము అను నభిప్రాయ ముతోఁ జెప్పఁబడినది కాదు. అట్లైకానిచో "కృష్ణస్తు భగవాన్స్వయమ్" అను పూర్వగ్రంథముతో విరోధించును.

పాలుద్రావు నెపముచేత దాని ప్రాణవాయువులను హరించును. మఱియొక సమయమునఁ గంసునిపంపున శకటాసురుఁడు శ్రీకృష్ణునిఁ జంపుటకయి వ్రేపల్లెకు రాఁగాఁ, కృష్ణుఁడు వానిని దనకాలితోఁదన్ని చంపి యమపురమున కంపును మఱియొకప్పుడు శ్రీకృష్ణుఁడు దుష్టకార్యములఁ జేసెనని తెలిసికొని, యశోదాదేవి కోపించి శ్రీకృష్ణుని ఱోటికి బంధింపఁ, బరమాత్ముఁడయిన కృష్ణుఁడు ఱోటి నీడ్చుకొనిపోయి. యా వీథిలోఁ జిరకాలమునుండి పెరిఁగి యాకాశ మంటుచున్న రెండు మద్దిచెట్లకుఁ దవిలించి, క్రిందఁ బడఁద్రోయును ఈ చేష్టలన్నియు సమానుషములని చెప్పవచ్చుఁగదా! మఱియొక సమయమున శ్రీకృష్ణుఁడు వ్రేపల్లెయందు వసించుచుఁ, బసులఁ దోలుకొని గోపాలురతోఁగూడ నడివికేఁగెను అప్పుడు గోపాలురు యమునానది కంతర్గతమై విషమిశ్రజలముగలదై యున్న కాళియహ్రదమందుఁబసులచే నీరుద్రావించి తామును ద్రావి మూర్ఛితులయి యుండ, నదిచూచి శ్రీకృష్ణుఁడు కోపించి, యా కాళియుని మర్దించి యతని నచ్చటినుండి తఱిమి, యమృతవర్షమును గురియించి గో గోపాలకులను బ్రదికించును మఱియొకసమయమున గోపకులందఱు నొకనాఁటిరాత్రి నిద్రించుచుండఁగా, భయంకరమయిన కార్చిచ్చు వచ్చి చుట్టుముట్టును. అంత, గోపాలకులు తప్పించుకొన వెరవుకానక, భయముచెంది కృష్ణునిఁ బ్రార్థింప, వారి ప్రార్థన విని, కృష్ణుండు వారలనందఱ నొక్కమాఱు కనుల మూసికొండని యాజ్ఞాపించి, కార్చిచ్చును మ్రింగి, వారల

నా ముప్పునుండి తప్పించి రక్షించును. అట్టి సాహసకర్మమును భగవంతుఁడు దక్క మఱియెవ్వరు చేయఁగలరు? మఱి యొకప్పుడు కొందఱు పిల్లలు యశోదయొద్దకుఁబోయి, కృష్ణుఁడు మన్నుదినుచున్నాఁడని చెప్ప విని, యశోద మహా కోపముతోఁ గృష్ణునిం జూచి, తన్ను బంధింప యత్నించు చుండ, నా యశోదకుఁ దన వదనకుహరమును విప్పి, యందుఁ జరాచరప్రపంచకమంతను జూపఁగా, నది చూచి యామె శంకించుచుఁ గృష్ణునిచేఁ బ్రతిబోధింపఁబడును. మఱియొక సమయమునఁ గృష్ణునితండ్రియగు నందుండు యమునానదికిఁ దానమాడఁబోఁగా, వరుణుని పరిచారకు "లీ కృష్ణుఁ డేమి చేయునో చూత" మని యోచించి, యా నందుని వరుణ పాశముచే బంధించి, వరుణలోకమునకుఁ గొనిపోవుదురు. అంతఁ గృష్ణుఁడు నందునికై వరుణలోకమునకుఁ బోవు. అప్పు డా వరుణుఁ డెంతయు సంతసించి, పూజించి, నందుని నొసంగి వీడ్కొలుపును. మఱియొకప్పుడు మాయావియయిన వ్యోమాసురుఁడు గోపకులనందఱ నొకబిలములోఁ జేర్చి యుండఁగా, నా కృష్ణుఁ డది తెలిసికొని, యా దురాత్ముని సంహరించి, గోపకుల విడిపించును. మఱియొకకాలమందుఁ గొల్లలందఱు పగలు వ్యాపారములఁ జక్కఁబెట్టుకొనుచు, నలసి రాత్రియందు గాఢనిద్ర చెందియున్న సమయమున, వారలనందఱ నిరతిశయానందదాయకమగు వైకుంఠమునకుఁ గొనిపోవును. ఒకప్పుడు గొల్లలందఱు నింద్రయాగము చేయుటకుఁ బ్రయత్నించుచుండఁగా, నది చేయవద్దని కృష్ణుఁడు మాన్పించు. అందువలన నింద్రుండు మహాకోప

ముతోఁ గృష్ణుని బాధింప నూహించి భయంకరమగు కాల వర్షము గురియింప, సహింపలేక, గోవులు గోపాలకులు చావ సిద్ధపడియుందురు అప్పు డీకృష్ణుఁ డొకపర్వతమును నేల నెత్తి పట్టుకొని, దానిక్రింద గోగోపాలుర నుండ నియమించి రక్షించును ఇట్లు కృష్ణుఁ డేడుదినము లహోరాత్రంబు లా కొండ నొకచేతితోఁ బట్టుకొని యుండును. అంత, నింద్రుండు చేయునది లేక, కృష్ణుని సమీపించి, నుతించి, యాతని దయకుఁ బాత్రుం డవును. మఱియొకసమయమున శ్రీకృష్ణుండు వనమందు సంచరించుచు, నొకనాఁటి రాత్రి యందు శరత్కాలచంద్రికలు దట్టముగ వ్యాపించి యుండు సమయమునఁ, దాను వేణువును గొని యవ్యక్తమధుర మగు పదములు గలిగి, దీర్ఘమై యాలాపవిశేషములు గలుగునట్లు గానము చేయఁగా, విని, మోహపరవశలయి యున్న గోపస్త్రీలను దస్కరించు శంఖచూడుఁ డనుకుబేరాను చరునిఁ జంపఁగలఁడు. మఱియుఁ బ్రలంబాసురుఁడును, ధేనుకా సురుఁడును, బకాసురుఁడును, కేశికాసురుఁడును, నరిష్టా సురుఁడును, జాణూర ముష్టికాసురులును, కువలయాపీడ మను గజంబును, గంసుండును, కాలయవనుండును, నరకా సురుఁడును, పౌండ్రకుండు మొదలగువారును, సాల్వుండును, ద్వివిదుండును, బల్వలుండును, దంతవక్త్రుండును, శిశుపాలుం డును, నేడువృషభంబులును, శంబరాసురుండును, విదూ రథుండును, రుక్మి మొదలగువారును, మఱియు భారతయుద్ధ మందు ధనుర్ధరులయిన కాంభోజ, మత్స్య, కురు, కేకయా ధీశ్వరులు మొదలగువారును, గృష్ణునిచేతను, గృష్ణుని

యపరరూపులగు భీమార్జునాదులచేతను హతులయి, ప్రాకృతేంద్రియములకుఁ గానరాని వైకుంఠమును బొందుదురు. ఇట్లు శ్రీకృష్ణుండు చేయు పనులన్నియు ననంతములును, దివ్యములు, ప్రమేయములునై యుండు. నాకుఁ దెలిసినంత వఱకుఁ జెప్పితిని ఇఁక వ్యాసావతారమును జెప్పెద నాలింపుము. భగవంతుడగు నారాయణుండు, వ్యాసమహర్షి యయి జన్మించి, క్రమక్రమముగఁ గలియుగమందు నల్పాయువులును, మందమతులును నగు వారు జనింతురనియు, వారలకు వేదంబులఁ జదువునంతటి శక్తి యుండదనియు యోచించి, యల్పమతులుగూడఁ బఠించునంత సులభముగా వేదముల విభజించును ఇఁక బుద్ధావతారమును దెలిపెద వినుము. వేదమార్గావలంబులయి, మయునిచే రచింపఁబడి, యలక్ష్యవేగము గలిగి వర్తించు పురములచేతను, లోకముల నాశనము చేయుచున్న దైత్యులబుద్ధులకు మోహము కలిగించుటకయి ధర్మాభాసమయిన పాషండధర్మముల బోధించును. కలియుగమందు బ్రాహ్మణాదు లగు మూఁడువర్ణములవారును పాషండు లగుదురు రాజులు శూద్రు లగుదురు. అప్పుడు బ్రాహ్మణాదివర్ణముల గృహములందు స్వాహాస్వధా వషట్కారములుగాని, భగవత్కథాశ్రవణములుగాని యుండవు. అట్లుండఁ, గలియుగాంతమందు భగవంతుఁడు కల్క్యవతారమై యందఱను శాసించును. ఓ నారదా! పూర్వజగత్పర్యాలోచనమును, నేనును, నవబ్రహ్మలును, మరీచ్యాదులును, భగవంతునిచే సృష్టివిషయమయి నియమింపఁబడితిమి. ధర్మంబును, విష్ణువునందుండు పాలనానురూప సామర్థ్యమును,

ఓ కుమారా! నీవు నాలోకమును గనులారఁ గాంచుట కేవలము నీ తపఃప్రభావమువలనఁ గాక, నా సంకల్ప ప్రభావమువలన నని నమ్ముము. నాఁడు రహస్యమందు నా పలికిన వాక్యమును గ్రహించి తపస్సు చేసినాఁడవు కనుక సంతసించితిని. కాని, నీ నియమమునకు మెచ్చి కామసుమీ! కార్యముల సాధించుటలోఁ దపముకన్న నుత్తమమగు సాధనము లేదు. నీ వాలోచించుచున్న సృష్టిరూప కార్యమునకుఁ దగిన సాధనమని యెంచి, తపంబు చేయుమని యాజ్ఞాపించితిని. తపస్సే నా హృదయ మని తెలిసికొమ్ము. నేను దపస్స్వరూపుఁడను. నేను దపస్సువలననే లోకముల సృజించుచు రక్షించుచు సంహరించుచు నున్నాను. నాయందున్న యమిత వీర్యమంతయుఁ దపోమయమే యని తలపోయుము. తపఃప్రభావ మిట్టిది కావున, దానివలన లోకముల సృజింపఁ గలుగుదు' వని పల్కిన విష్ణువునకు బ్రహ్మ యిట్లనియె. 'ఓ భగవంతా! ఓ నారాయణా! నీవు సర్వమునకు నధిపతివి మఱియు, నివు సమస్త భూతముల హృదయములందు వసించి సకలేంద్రియవృత్తులకు నుపద్రష్టవయి, నీ దివ్యజ్ఞానముచే నా యా భూతములు చేయఁదలఁచిన కృత్యములనెల్ల నెఱుంగుదువు గదా! అట్లుండఁ బ్రార్థించుచున్న నా యిష్టము నీకుఁ దెలియక పోదు. అయినను, దెలియఁ జెప్పెద కర్మాధీనమగు ప్రాకృతశరీరము లేని నీ దివ్యాత్మస్వరూపమును, జడచిదాత్మకమగు నీ యపరరూపమును నేఁ జూచునట్టు లనుగ్రహింపుము. మఱియు, నీవు సత్యసంకల్పుఁడవయి పంచవింశాత్మక మగు శక్తులచే నభివ్యక్త మగు ప్రపంచమును ని

యాశ్చర్యశక్తిసంబంధముగల యాత్మ యను సాధనముచే, సూక్ష్మ చిదచిద్విశిష్టుండవైన నిన్నును నుపాదానకారణముగాఁ జేసికొని, సాలెపురుగుచందంబునఁ బూర్వసృష్టిని సంహరించుచు, నస్మదాదిరూపమును బొంది పలువిధములుగా సృజించుచుఁ, బోషించుచుఁ దిరుగ నాశనము నొందించుచు నిట్లు క్రీడించుచుందువు ఓ మాధవా! న న్ననుగ్రహించి, సృష్టిని గావించునంతటి బుద్ధిని నాకుఁ గలిగింపుము భవదీయ శాసనప్రకారము నేను మందుండను గాక, జగన్నిర్మాణంబు గావించెదను. భగవంతుఁడ వయిన నీ యనుగ్రహము వలన నేను సృష్టికార్యము నెఱవేర్చుచున్నను, నేను బద్ధుండను గాకుండునట్లు దయఁజూడుము. ఓ దేవా! నేను నీ దయను సంపాదించి లోకముల సృజింప సమర్థుండనై సృష్టిరూపకార్యములో నీకుఁ దోడుపడుదును. నీవు సకలదేవతలలోను నన్నుఁ బెద్దగా నాలోచించి నాకుఁ గొప్ప యధికార మిచ్చుచున్నావు. మఱియు, నన్ను నీవు స్నేహితునివలె మన్నించితివి ఈ కారణములఁబట్టి, నేను గొప్పవాఁడ ననుగర్వము సంభవించునేమో! అట్టి గర్వము నాకుఁ గలుగకుండునట్లు వరము ప్రసాదింపుము.' అని యిట్లు ప్రార్థించుచున్న బ్రహ్మకు నారాయణుం డిట్లనియె. 'ఓ కమలాసనా! మిగుల గోపనీయమై శాస్త్రజన్యజ్ఞానంబుతో నొప్పుచు, మంత్రసంయుతమై వఱలుచు, మదీయ స్వరూపమును స్పష్టముగాఁ దెలుపుచు నున్న జ్ఞానంబును, దానికి నంగభూత మగు ప్రకృతి పురుష విషయక జ్ఞానమును, నా యనుగ్రహమువలన నీకు సంప్రాప్తమగుఁగాక! ఆ తత్త్వజ్ఞానమువలన నే నెంతపరిమాణము

గలవాఁడనో, నా రూప మెట్టిదియో, నా స్వభావ మెట్టిదో, నా గుణంబు లెట్టివియో, నా యొనరించిన సృష్టిస్థితి సంహార రూపములయిన దివ్యచేష్టితము లెట్టివియో, నే నెప్పు డేయే కర్మముల నాచరించితినో, యవియన్నియు నీకుఁ దెలియును. ప్రకృతిపురుషులు శరీరముగాఁ గలవాఁడ నయ్యుఁ, బ్రకృతి పురుషులకు విలక్షణుండ నైనవాఁడను నేనే మఱియుఁ, జిద చిత్తుల కంతర్గతుండ నగువాఁడను నేనే. సృష్టికిఁ బూర్వ మందు విభక్తములుకాని నామరూపములు గల ప్రకృతి పురుషులే శరీరముగాఁ గలిగి వర్తించువాఁడను నేనే సృష్టి కాలమందుండు విభక్తము లయిన నామరూపములు గల ప్రకృతిపురుషులు శరీరముగాఁ గలవాఁడను నేనే, సంహారానం తరమందుండు వస్తువును నేనే. కారణావస్థయందవిభక్తనామ రూపములు గల ప్రకృతిపురుషులు శరీరముగాఁ గలవాఁడనై, కార్యావస్థయందు విభక్తనామరూపములు గల ప్రకృతి పురుషులు శరీరముగాఁ గలవాఁడనై యున్నను, నాకు శరీర భూతమైన చేతనాచేతనములం దుండు నజ్ఞత్వపరిణా మిత్వాదులగు దోషంబులు నాకుఁ గలుగవు ఓయీ! చిద చిద్విలక్షణమయిన మత్స్వరూపజ్ఞానమును దెలియఁబఱిచితి. దాని కంగభూతమైన చిదచిద్రూపములను దెలిపెదను, విను. తేజ మున్నప్పుడు తమము ప్రతీయమానము కాదు. తమ మున్నప్పుడు తేజము ప్రకాశింపదు. అట్లె, ప్రకృతి సంధానసమయమున నే యాత్మస్వరూపము ప్రకాశింపదో, యాత్మస్వరూపము ప్రతీయమాన మయినప్పు డే యచి ద్వస్తువు ప్రతీయమానము కాదో, యదే నామాయ యని

తెలిసికొనుము. మఱియు, నధిక పరిమాణములుగాని, యల్ప పరిమాణములుగాని, సర్వవస్తువులందు నాకాశాది మహాభూతములు ప్రవేశించినప్పు డాయాప్రాణులు భేదనదశానాది బాధల ననుభవించుచున్నను, నా మహాభూతము లాయా బాధల ననుభవింపక, యాయా ప్రాణులయందుఁ బ్రవేశింపని కాలమున నున్నట్లుగానే యుండును, కాని, మార్పు చెందవు. అట్లే నేనా మాయను బురస్కరించికొని పెక్కురూపము లొంది సమస్తమందు నంతర్యామినై యున్నను, సర్వభూతములయందు నివసించియున్న నే నా యా భూతము లొందుచున్న దుఃఖాదుల ననుభవింపక, ప్రవేశించియుఁ బ్రవేశింపని చందముననే ప్రవర్తించుచుందును. కావున, మదీయస్వరూపమును దెలిసికొనఁ దలంపుగలవాఁడు, ప్రకృతిపురుషశరీర కుఁడ నయిన నేనే కార్యకారణరూపముగా నుండుటవలనను, బ్రకృతిపురుషులే శరీరముగాఁ గల నాకంటె నతిరిక్తమగు వస్తువు లేక పోవుటవలనను, నిట్టి పరమాత్ముఁడ నగు నన్నుఁ దెలియుటచేత సర్వమును దెలిసినవాఁడై, తెలిసికొనవలయు నది వేఱొకటి కలుగనేరదు. కావునఁ, బ్రధానముగా నా స్వరూపమునే తెలిసికొనవలెను. మఱియు, నా స్వరూపము సర్వదా యొక్కరీతిగానే యుండుటవలనఁ, బ్రకృతికంటె భిన్న మగుచున్నది. నేను సమస్తవస్తువులందు నుండుటవలన, నేక దేశమందు మాత్రమే యుండు నణుస్వరూపుఁ డగు జీవునకంటె వేఱగుచున్నది. ఇట్లు, నా దివ్యస్వరూపమును, నా యపర స్వరూపమును దెలిసికొనుము. ఓ కమలాసనా! నిశ్చల చిత్తుండవయి నా యుపదేశించిన తత్త్వజ్ఞానమును బరిగ్ర

హింపుము. నీవు తత్త్వజ్ఞానసంపన్నుండ వయితివేని, సృష్టి సంహారములం దెప్పుడును, సుంతేనియు మోహమునొందవు. మఱియు, నా శాసనంబు ననుసరించి సర్గంబు నొనరింపుము. అట్లు చేయునపుడు నీకు మదాదులు జనింపకుండునట్లు వర మిచ్చుచున్నాను అని యిట్లు నారాయణమూర్తి బ్రహ్మ నాజ్ఞాపించి, యాతండు చూచుచుండఁగనే తన లోకముతోఁ గూడ నంతర్థానము చెందెను. అనంతరము బ్రహ్మ మిగుల భక్తిసంయుతుండయి, నారాయణమూర్తి మహిమను గొని యాడుచు, నాతనికి నమస్కరించి యాతని కృపారసమునకుఁ బాత్రుఁడయిన హేతువుచే, సమస్త ప్రపంచమును తొంటి రీతిగానే సృజించెను ఓ రాజేంద్రా! చతుర్ముఖుం డిట్లు ప్రపంచంబు సృజించియు, నొకనాఁడు లోకములకు శుభ ములు గలుగునిమిత్తము యమనియమరూప మయిన తప స్సును జేయుచుండెను. అట్టి సమయమున నారదుఁ డేఁగు దెంచి, తన తండ్రియగు బ్రహ్మకు నమస్కరించి యాతనికిఁ బరిచర్యలు సలుపుచుఁ, దా నొనరించిన సకలోపచారము లచేఁ దండ్రిని సంతసింపఁజేసి, వినయావనతగాత్రుండై బ్రహ్మనుజూచి, నీవు నన్నడిగినట్లె విష్ణువు మాయాప్రకారం బడిగిన, నతండు సంతసించి నారదునియందు దయాళుండయి, నారాయణమూర్తి తన కుపదేశించిన చొప్పంతయుఁ దెలియఁ బఱిచెను అంత నారదుండు దానిని నెఱింగినవాఁడయి మిగుల సంతసించుచు, లోకంబులందుఁ ద్రిమ్మరుచు నుండెను. ఇట్లు పెద్దకాలంబు చనినతర్వాత, నారదుండు సరస్వతీ తీర మందు నివసించి మిగుల విచారించుచున్న యమితతేజుఁ

డయిన వ్యాసమునీంద్రునొద్ద కేతెంచి, తనకు బ్రహ్మ యుప దేశించినట్టు లతనికి దశలక్షణములతోఁ గూడియున్న భాగ వత పురాణమును దెలియఁజేసెను. అంత నా మునీంద్రుండు నారదోక్తమగు దాని నంతయును గ్రహించి యీ భాగవత రూపముగఁ జేసెను ఓ రాజా! నీవు విరాట్పురుషునివలన నుండి యీ విశ్వమంతయు నెట్లు కలిగినదని యడిగినావు. ఆ యుదంతము చెప్పి, మఱియు నీ వడిగిన ప్రశ్నముల కన్నిం టికి సదుత్తరంబులు చెప్పెద నాలింపు మని చెప్పి వెండియు నిట్లనియె

ఇది తొమ్మిదవ యధ్యాయము

శ్రీశుకుఁడు పరీక్షితుని ప్రశ్నముల కుత్తరం బిచ్చుట

ఓ నరేంద్రా! ఆ వ్యాసరచితమయిన భాగవతంబును నీకు వినిపించిన, నీ సందియము లన్నియుఁ బాయక మానవు. దాని నీ కుపదేశించిన నీ ప్రశ్నముల కన్నిఁటికి నుత్తరంబు లగును ఇంతకుఁ బూర్వము "పురాణం దశలక్షణ" మ్మని చెప్పియున్నాను. ఆ లక్షణము లేవియో చెప్పెదను వినుము సృష్టియుఁ, బ్రతిసృష్టియు, స్థానము, పోషణము, ఊతులు, మన్వంతరములు, భగవంతుని చేష్టలను వివరించుట లేక యీశాను కథనము, నిరోధము, ముక్తియు, నాశ్రయంబు నను నీపదియుఁ బురాణలక్షణములు. ఈ చెప్పిన లక్షణంబు లన్నియు నీ పురాణంబును నున్నయవి కాన, దీనికిఁ బురాణం బను పేరు సమకూడె. ఆ పదింటిలోఁ బదవదియగు నాశ్రయ రూప బ్రహ్మము ముఖ్యమైనది. పరబ్రహ్మ మను మాఱు

పేరుగల యాశ్రయమును బరిశీలించుటకొఱకే తక్కిన తొమ్మిది లక్షణంబులు చెప్పఁబడియె ఆ తొమ్మిది సర్గాది లక్షణంబులను మహాత్ములు శ్రుతుల ననుసరించి చెప్పు చున్నారు. ఆ పదిలక్షణములకుఁ బ్రత్యేకముగా లక్షణం బులు గలవు చెప్పెద వినుము పంచమహాభూతములును, వాని కసాధారణధర్మము లయిన గంధాది తన్మాత్రలు, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మహ దహంకారములు, వీనిసృష్టియే సర్గమని చెప్పఁబడును చతు ర్ముఖబ్రహ్మ భగవంతుఁడగు విరాట్పురుషునివలన జన్మించి, చరాచర ప్రపంచకమును సృజించెను. అట్టి భూతసృష్టికే *విసర్గమని పేరు భగవంతుఁడగు నారాయణమూర్తి దుర్మార్గు లగు మానవులఁ బెక్కండ్రఁ జంపి జయముగాంచి లోకముల నిలిపెను అట్టి భగవంతుని జయమునకే స్థితి లేక స్థానమని పేరు. భగవంతుం డగు నారాయణుండు ప్రతియుగమునందుఁ దనభక్తులను బోషించియున్నాఁడు అట్టి భక్తానుగ్రహము నకే పోషణ మనిపేరు జన్మాంతరములనుండియు జీవుల నను సరించి వచ్చుచున్న కర్మవాసనలకే యూతు లనిపేరు భగ వంతుని యనుగ్రహముచే లోకపాలకత్వమును బొందిన మహాత్ముల ధర్మముల విస్తరించి వర్ణించుటకే మన్వంతరము లనిపేరు భగవంతుం డాయా యవతారములయందుఁ జేసిన యద్భుతకార్యములనుగూర్చి వర్ణించుటకే యీశానుకథన

* విసర్గము—కొందఱు భగవంతుని గుణవైషమ్యము (అనఁగాఁ దమోగుణపరిగ్రహము) వలన జనించి పురుషునిచేఁ జేయఁబడిన ప్రపం చక నియమమునకు విసర్గ మని పలుకుచున్నారు

మని పేరు. జీవాత్మలు కర్మరూపశక్తులతో సూక్ష్మావస్థనొంది ప్రకృతియం దుండుటకే నిరోధమని పేరు. జీవుఁడు భగవదనుగ్రహమువలన దేవాదిరూపమును విడిచి, యపహత పాప్మత్వము మొదలగు నెనిమిదిగుణములతోఁ గూడిన రూపము నొందుటయే ముక్తి యనఁబడును. ఎవనివలనఁ బ్రపంచమునకు సృష్టిప్రళయములు గలుగుచున్నవో యతనికే యాశ్రయమని పేరు. అతఁడే పరబ్రహ్మమనియుఁ జెప్పఁబడును. జ్ఞాతయగు జీవాత్మయందు నియంతృత్వరూపముచే వర్తించు నెవఁ డాధ్యాత్మికుఁ డని చెప్పఁబడుచున్నాఁడో, యతఁడే యాధిదైవికుఁ డనఁబడు. అతఁడే జ్ఞానకారణములగు చక్షురాదీంద్రియములందు నభిమానులైన దేవతలందు వర్తించుచుండు. అతఁడే జ్ఞాతృజ్ఞానకారణములకంటె విలక్షణములయిన యాకాశాదులందు వర్తించు శబ్దాదులం దంతరాత్మయయి యుండి, యాధిభౌతికుం డని చెప్పఁబడును. కావున జ్ఞాతయు, జ్ఞానకారణమును, జ్ఞేయమును, భగవదాత్మకమని యెఱుంగుము. ఈ చెప్పఁబడిన జ్ఞాతృకరణజ్ఞేయములలో నొకటి లేకపోయినను, నొకవిషయమును గ్రహింపలేము. భగవంతుఁడు జీవునివలెఁ గించిజ్ఞుండుగాక, సర్వజ్ఞుం డగుటచే, జ్ఞాతృకరణజ్ఞేయముల మూఁడింటిని సాక్షాత్కారము చేసికొనఁగలఁడు. అతఁడే యచిత్తున కాశ్రయుఁ డయిన జీవున కాశ్రయుఁ డగుచున్నాఁడు. ఓ రాజా! విరాట్పురుషునివలన నీ విశ్వమంతయు నెట్లు గలిగెనని యడిగితివి. అందులకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాను, వినుము. చతుర్ముఖరూప

మొందినపురుషుండు బ్రహ్మాండమును భేదించికొనివచ్చి, పరిశుద్ధిగలిగి, తనకు వసింపఁదగిన పవిత్రమయిన స్థలమును గోరుకొనుచు, నందులకుగాఁ బవిత్రమయిన జలమును సృజించెను. ఆ మహాపురుషుం డిట్లు జలంబుల సృజించి సముద్రంబు వడువుననున్న యా జలంబులయందుఁ బెక్కు సంవత్సరంబులు శయనించెను ఆ జలములయందు శయనించుటచేతనే యతనికి *నారాయణుం డని నామంబు కలిగెను. మహదాది ద్రవ్యములు, పుణ్యపాపరూపములయిన కర్మములు, గుణములకు వైషమ్యము గలిగించుకాలము, ప్రకృతిస్వభావము, ఇవియన్నియు నెవని యనుగ్రహ మున్న నిలిచియుండునో, ఎవని యనుగ్రహము లేనిచో నవియన్నియుఁ బ్రవర్తింపవో, యట్టి మహాపురుషుని ప్రభావము నెవ్వరు వర్ణింపఁగలరు? ఇట్లు భగవంతుఁ డవిభక్తమైన నామరూపములు గలిగి, కావుననే సూక్ష్మమై యున్న చిదచిత్తులు శరీరముగాఁ గలవాఁ డగుటంబట్టి యొక్కండై, దేవమనుష్యాది నానారూపముల నొందఁదలంచి, స్వాత్మానుభవమనెడి తల్పమునుండి లేచి, స్వసంకల్పముచేతనే చతుర్ముఖుండయి స్వశరీరభూతమయిన చిదచిదాత్మక కారణద్రవ్యమును వ్యష్టిరూపమగు కరణజ్ఞాతృజ్ఞేయములగా సృజించెను అందు దిగాది

---

* ఇందులకుఁ బ్రమాణము శ్లో॥ "ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః। తా యదస్యాయనం పూర్వం తేన నారాయణ స్స్మృతః" నరుఁడను నామాంతరముగల భగవంతునివలన సృజింపఁబడిన జలములు నారము లని పిలువఁబడుచున్నవి అట్టి నారములు స్థానముగాఁగలవాఁడు కనుక, నతనికి నారాయణుఁడని పేరుగలిగినది

దేవతలచే నధిష్ఠితమయిన యేకాదశేంద్రియవర్గమే యధిదైవ మనఁబడు జ్ఞాతృవర్గ మధ్యాత్మ మనఁబడు పృథివ్యాకులం దుండు గంధాదిజ్ఞేయవర్గమే యధిభూత మనఁబడు. భగవంతుఁ డిట్లు పురుషాధిష్ఠితమయి సమష్టిరూపముగా నుండుటచే, నొక్కటియై యున్న ద్రవ్యమును గరణము, భోక్తృవిషయము నాఁబడు మూఁడువిధములుగా సృజించెను. పిమ్మటఁ జతుర్ముఖుఁడు ప్రాణవ్యాపారము చేయుచుండ, శరీరము లోపలి భాగమందున్న యాకాశమునకుఁ గార్యరూపమయిన ప్రాణవాయువలనఁ బ్రవృత్తిసామర్థ్యరూపమయిన యోజస్సు, వేగసామర్థ్యము బలము ననెడు ధర్మములు గలిగినవి. ఇవి వాయువునకుఁ గారణభూతములయిన గుణము లని యెఱుంగుము. ఆ ప్రాణరూపవాయువే సమస్తజంతువులకు ముఖ్యమైనదిసుమీ! లోకములో సేవకులందఱు రాజు ముందుకు నడిచిన నడుచుటయు, నడువక నిలువఁబడియున్న నిలువఁబడియుండుటయుఁ బ్రసిద్ధముకదా! అట్లె యీ ప్రాణవాయువును బ్రభువుగా నెంచుకొని, యింద్రియము లన్నియు దానినే యనుసరించి, యది వ్యాపారము చేయుచుండినచో, నింద్రియములన్నియు వ్యాపారములనొనరించుచుండును. అది వ్యాపారమువలన విరమించిన, నింద్రియములన్నియు విరమించును ఇట్లాశరీరము లోపలిభాగమునఁ బ్రాణవాయువులు చరించుచుండినంతమాత్రముననే హృదయమందున్న జఠరాగ్ని ప్రజ్వరిల్లఁ జొచ్చెను అట్లు హృదయాగ్ని మండుచుండిన త్రోడన్యేయాఁకలియు, దప్పియుఁ బొడమెను. అందువలన భోజనేచ్ఛయుఁ బానేచ్ఛయుఁ గలిగినవి. వానిని దీర్చుకొనుటకు

జతుర్ముఖునివలన వ్యష్టిశరీరముఖము లేర్పడెను. ముఖమేర్పడినతోడనే యందుఁ దాలువు కలిగెను. అధిష్ఠానభూతమగు తాలువునందు రసనేంద్రియము జనించెను. అనంతరము రసనేంద్రియమునకు గ్రాహ్యములయిన షడ్విధరసము లుత్పన్నంబు లయ్యె. పిమ్మట మాటలాడఁ దలంపుగల చతుర్ముఖరూపి యగు భగవంతుని ముఖమువలన వాగింద్రియముఁ, దదధిష్ఠాన దేవత యగు వహ్నియు, ని రెండు నుద్భవించెను. ఆ రెండింటివలన భాషణంబులు జనించె. ఆ విరాట్పురుషుని కంఠమందు వాయుసిరోధము కలిగెను. అట్లు ప్రాణవాయువునకు పై కరుగ మార్గము లేకపోవుటం జేసి, వాయువు కంఠమునందు నిలిచిపోయి మిక్కుటముగా వీచుచుండుటచే, నాసిక లుత్పన్నము లయ్యె. అప్పురుషుఁడు గంధము నాఘ్రాణింప నిష్టముగలవాఁ డయియుండుటచే, నానాసికయందు నభిమానదేవతతోఁగూడ ఘ్రాణేంద్రియ ముద్భవించెను. పిమ్మట నా విరాట్పురుషుండు తన దేహమును వస్తువులను జూచికొనఁ దలంపుగొనియుండ, నింద్రియాధిష్ఠాన మగు నేత్రగోళములు సంభవించె. తరువాత రూపగుణమును గ్రహింప సమర్థమయిన స్వాభిమాని యగు సూర్యునితోఁ గూడ చక్షురింద్రియంబు కలిగె. తరువాత నా పరమపురుషుండు వేదంబులచే బోధితుండై శబ్దమును గ్రహింపఁ దలంపుగొనఁ, గర్ణగోళంబు లుద్భవించె. ఆ కర్ణగోళములందు శబ్దము గ్రహింప సమర్థమయిన కర్ణేంద్రియమును, దాని కధిష్ఠాన దేవతలగు దిక్కులు పుట్టెను. అనంతర మా పురుషుండు వస్తువులయందున్న మృదుత్వ కాఠిన్యములను, లఘుత్వగురుత్వములను, శైత్యము, నుష్ణత్వం

బును గ్రహింప నూహగలవాఁ డయినందున, నింద్రియమున కాధారమయిన చర్మము, కాఠిన్యాదుల గ్రహింపఁ దగిన త్వగింద్రియమును, నందు రోమంబులు నుద్భూతంబులయ్యె. ఆ రోమములకు వృక్షము లధిదేవత లయ్యె. ఆ త్వగింద్రియము నందు వాయు వధిష్ఠించి, యా త్వగింద్రియమువలననే యంత ర్భాగమందును, బహిర్భాగంబునందును స్పర్శగుణంబును గ్రహించుచుండును పిమ్మట నతఁడు పెక్కుకర్మముల నాచ రించుటకుఁ దలంపుగొనియుండ, నతనికిఁ గార్యకరణదక్షంబు లగు హస్తంబు లుదయించె. వానికి నధిష్ఠానదేవత బలవంతుఁ డగు నింద్రుం డని తెలియుము మఱియు, నా పురుషుండు యథేష్టముగా నడువవలె నని తలంపు పుట్టుటచేఁ, బాదము లుద్భూతంబు లయ్యె. వానికి యజ్ఞస్వరూపుఁ డయిన విష్ణు వధిదైవంబయ్యె. తరువాతఁ బ్రజల నుత్పాదించుటకును, నానం దము సుఖములను బొందుటకు నాతఁడు కోరుచున్నందున, వాని కుపయోగించు నుపస్థస్థానమునందు శిశ్నము నుద్భవిం చెను. వానికిఁ బ్రజాపతి యధిష్ఠాన దైవమయ్యె. భుక్తపదా ర్థములయందలి యసార మగు మలమును విసర్జింపఁ దలంపు గొనుసంతట, గుదస్థానం బుద్భూత మయ్యె. పిమ్మటఁ బాయు వను నింద్రియంబు గలిగె దానికి మిత్రుం డధిదైవతం బని యెఱుంగుము ఒక దేహమునుండి మఱియొక దేహమును బొందఁ గోరుచుండు బ్రహ్మ, సమష్టిరూపాపానవాయువువలన నపానవ్యష్టిస్థాన మగు నాభిద్వారంబును, నం దపానంబును, దాని కధిదైవం బగు మృత్యువును, ప్రాణాపానము లాధా రంబుగాఁ గలుగుమరణమును గలిగినవి. పిమ్మట, నాపురుషుం

డన్నపానాదుల గ్రహించుటకుఁ దలంపుగొనుటచే, నందుల కుపయోగించునట్టి యుదరము, నంత్రములును, నాడీచయం బులును సంభవించె. ఆ నాడీచయమునకును, నంత్రములని పిలువఁబడు మాంసవిశేషములకును గ్రమముగా నదులును, సముద్రములు నధిదైవతంబు లయ్యె. ఆ నదీ సముద్రములు సన్న్యాదులకు హేతువు లగుటవలనఁ జాలునను బుద్ధికిని, దేహ పోషకత్వమునకు నాశ్రయము లయ్యె. పిమ్మట నాపురుషుండు తన మాయను ధ్యానించు చుండఁగాఁ, గమలాకారమయిన హృదయస్థానంబు జనించె. తరువాత, మనస్సు తదధిష్ఠాన దేవత యగు చంద్రుండును, వ్యాపారంబులును గలిగె. లోపల నుండు చర్మము, దానికిమీఁద నుండు సూక్ష్మచర్మము, మాంసము, రక్తము, మెదడు, మజ్జ, యెముకలు నాఁబడు సప్త ధాతువులును, బృథివ్యప్తేజోమయంబులు. ప్రాణములు గగ నముచేతను, జలముచేతను, వహ్నిచేతను నారబ్ధము లయ్యె. ఇంద్రియములు శబ్దాదిగుణముల గ్రహించుటె స్వభావ ముగాఁగలవి. ఆ గుణము లహంకారమువలనఁ గలిగినవి. మనస్సు కామసంకల్పాదులకు నాధారమయినది. బుద్ధి విజ్ఞా నమే స్వరూపముగాఁ గలది. ఓ రాజా! ఇదియె భగవంతుని స్థూలరూపంబు. చేతనాచేతనాత్మకమయిన వ్యష్టివస్తుజాతము పృథివి, జలము, తేజస్సు, వాయువు, గగనము, అహంకారము, మహత్తత్త్వము, నవ్యక్తము నాఁబడు నెనిమిది యావరణ ములచే వ్యాప్తమయినది. ఓ రాజా! ఈ స్థూలరూపము కంటె సూక్ష్మతమ మయి, ముక్తాత్మస్వరూపమై యున్న రూప మొకటి భగవంతునికిఁ గలదు. అది చక్షురాదీంద్రియము

లకుఁ గానరాదు. అది శబ్దాదులవలె గోచరముకాదు. అది దేవమనుష్యాదుల బుద్ధికిఁగాని, వాక్కులకుఁగాని గోచరము కాదు. దాని కుత్పత్తియు, స్థితియు, నాశనమును లేవు అది కాలపరిచ్ఛిన్నము కాదు. ఓ రాజా! నేఁ జెప్పిన స్థూలసూక్ష్మ శరీరములు భగవన్మాయాసృష్టము లగుటచే, నుపాసకులు వానిని నుపాసింపరు. మఱియు జగచ్ఛరీరకుఁ డగుటవలన వాచ్యత్వము నొందియు, నాకాశగుణశబ్దరూపమున నుండుట వలన వాచకత్వమును బొందియు నున్న భగవంతుఁడు చతుర్ముఖరూపియై, దేవాది నామములను, దేవాదిరూపములను, వారల కృత్యములను, గర్మాధీనుఁడు కాకయే చేయుచున్నాఁడు. అతఁడు మునులను బ్రజాపతులను, మనువులను, దేవతలను, బితృదేవతలను, సిద్ధులను, జారణులను, గంధర్వులను, విద్యాధరులను, నసురులను, గుహ్యకులను, గిన్నరులను, నచ్చరలను, యక్షులను, గింపురుషులను, రక్షస్సులను, బిశాచములను, భూతప్రేతాదులను, యాతుధానులను, గ్రహములను, బక్షులను, మృగములను, బశువులను, వృక్షములను, బర్వతములను, సరీసృపములను–జరాయుజములు, నండజములు, స్వేదజములు, నుద్భిజ్జములు నాఁబడు నాలుగువిధములును, స్థావరజంగమము లను రెండువిధములును నై భూమియందును, జలమందును, గగనమందును జరించు సమస్త వస్తువులను సృజించె. ఓయీ! ఏకవిధముగా సృష్టి చేయక, యిన్నివిధములఁగాఁ జేయనేల? అందు వేని చెప్పెద వినుము. జీవులు తా మొనరించుకొన్న పుణ్యపాపకర్మముల ననుసరించి యా యా జన్మములను బొందుదురు. ఆ యా

కర్మముల కనురూపఫలములుగా నిన్నివిధములు సృజింపఁబడినవి. ఈ జంతుజాలము నుత్తమములనియు, మధ్యమములనియు, నీచములనియు మూఁడువిధములుగా విభజింపవచ్చును జీవులు సాత్త్వికకర్మముల నాచరించినచో, సుఖాతిశయము గలుగుచుండుటచే, నుత్తమమగు దేవత్వమును బొందుదురు వారు రాజసకర్మముల నాచరించినచో, మధ్యమమయిన మానవత్వమును బొందుదురు తామసకర్మముల నాచరించినవారు స్థావరాది జన్మమును బొందుదురు ఇట్లు జన్మములను బొందుచున్న యీ మూఁడు తరగతులవారలట్టియుండక, తమకుఁ బ్రధానమగు రజోగుణంబుగాని తమోగుణంబుగాని యితరగుణములచే నుపహతములయినప్పుడొక్కొక్కతరగతివారే ప్రత్యేకముగా మూఁడు తరగతులవారగుదురు ఇందుల కుదాహరణము చెప్పెద విను మానవులు కేవలము రజోగుణప్రచురులైనను, కారణాంతరముల వలన రజోగుణము సత్త్వతమోగుణములవలనఁ దిరస్కృతమగుటచే, వారొకప్పుడు కేవలము రజోగుణప్రచురులై, యొకప్పుడు సత్త్వప్రచురులై, మఱియొకప్పుడు తమః ప్రచురులై యుందురు. ఓ రాజా! కర్మగతు లెన్నివిధములని యడిగితివి? అవి యెన్నియో చెప్పితిని ఓ రాజా! జగత్కర్తయగు భగవంతుఁడు తిర్యక్కులందు వరాహాద్యవతారములను, మానవులయందు రామకృష్ణాద్యవతారంబులను, సురలందు వామనాద్యవతారంబులను ధరించి, ధర్మశరీరుండయి యీ విశ్వమును బాలించుచు వర్ధించుచున్నాఁడు. ఆ భగవంతుఁడే కల్పాంతమందుఁ గాలాగ్ని రుద్రశరీరుండయి, తనవలన

సృష్టమయిన యీ విశ్వమునంతను, వాయువు మేఘపంక్తుల వశింపఁజేసినట్లు వశింపఁజేయుచు ఓ రాజా! జ్ఞానాదులచేఁ బూర్ణతముఁడయిన భగవంతునిఁగూర్చి వర్ణించియున్నాను. ఆ మహాత్మునిఁ బండితులయిన మునులు కేవలము చిదచిద్రూపునిగాఁ జూడక, తద్విలక్షణునిగాఁ జూతురు. ఓయీ! భగవంతుఁడు తానే సృష్టికర్తయుఁ దానే సృజ్యుండు నెట్లగును? అట్లే తానే కర్తయై, మఱల నకర్త యెట్లగును? విరుద్ధధర్మము లొక్కచోట నుండుట యెట్లనియందువేని, జెప్పెద. ప్రపంచకసృష్టియందుఁ బరమాత్మకు జన్మాదులు విధింపఁబడవు. అతఁడు సృష్టములయిన పదార్థములందంతరాత్మయై యుండుటచే, సృజ్యుండని చెప్పఁబడుచున్నాఁడు కాని, యతఁడు స్వరూపముచే సృజ్యుండు కాఁడు. అట్లె ప్రకృతిచే జీవులం దారోపితమగు కర్తృత్వము పరమాత్మకుఁ జెందదు అతఁ డెప్పుడును గర్త కాఁడు. అయిన, స్వసంకల్పమాత్రముచేఁ గర్తృత్వ మవలంబించును. కావున, నీవు చూపిన విరోధము నిరస్తమగుచున్నది. ఓ రాజా! బ్రహ్మసంబంధియగు నీ కల్పంబు నవాంతరకల్పంబుతోఁగూడ సంగ్రహించి చెప్పియున్నాను. ఈ మహాకల్పమందే మహదాదులు మొదలుకొని భూమివఱకు నున్నవానిసృష్టులును, బృథివ్యాది వికారములయిన సృష్టులును గలిగె. ప్రతిమహాకల్పమందు నిట్లే సృష్టి ప్రవర్తించుచుండును. ఓ రాజా! స్థూలసూక్ష్మములయిన కాలపరిమాణములను, గల్పలక్షణములను మన్వంతరాదులను, దృతీయస్కంధమందు వివరించి చెప్పెదను. అచ్చటనే పద్మకల్పమును గూర్చియు

విస్తరించి చెప్పెదను దాని నన్నింటిని సావధానచిత్తుఁడ వయి వినుదువుగాక! అని శుకుండు రాజునకుఁ జెప్పెనని చెప్పిన సూతమహాముని వాక్యములు విని సంతసించి, శౌనకుం డిట్లనియె. ఓ సూతసుధీంద్రా! నాఁడు విదురుండు తీర్థయాత్రకై పోయి మైత్రేయునిఁ గలిసికొని యతనివలనఁ దత్త్వజ్ఞానము పొందినాఁడని చెప్పితివి ఆ విదురుఁడు మైత్రేయు నెచ్చటఁ గలిసికొనెను? మైత్రేయుఁ డతనికిఁ దత్త్వము నేప్రకారముగా నుపదేశించె? అదియంతయు సవిస్తరముగాఁ దెలుపుము అని యడిగిన సూతుం డిట్లనియె. ఓ మునులారా! మీ రడిగిన ప్రశ్నమే పరీక్షిత్తు శ్రీ శుకులవారి నడుగ నాతఁ డా రాజున కిట్లు చెప్పె, నా వృత్తాంతము చెప్పెద నాలింపుఁ డని చెప్పి, వెండియు సూతుం డిట్లనియె.

ఇది ద్వితీయస్కంధమునఁ బదవ యధ్యాయము.

ద్వితీయస్కంధము సమాప్తము.

